**"యస్య దేవే పరాభక్తి: యథాదేవే తథాగురౌ తస్యైతేకథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః** అని గదా ఆర్యోక్తి

అన్యూనాతిరిక్తమయిన అనువాదమునకు ఉదాహరణముగా గ్రహింపబడిన యీ పద్యము శ్రీకృష్ణ సుదామ సంవాదమున సాందీపని ఆశ్రమ స్మృతులను వర్ణించుచున్న కృష్ణ వాక్యము **"ఒకనాడు గహనమ్ముంనకు ......."** ఈ ఎన్నిక వ్యాసకర్త నిశిత పరిశీలనాశక్తికి సంకేతము.

బ్రహ్మకృష్ణామలకాఖ్యానము :- **'దత్తాత్రేయ మహాశ్రమమ్ముంన ...."**

అను పద్యమున మూలపాఠము "కోలరూపిణం, దాని పాఠాంతరము "కౌజరూపిణం' ఇది ఉపాఖ్యాన సందర్భ సంగతము. అనువాదకర్త ఉభయానుగ్రహము చేసిన అనువాద ఘట్టమును పట్టి చూపిన వ్యాసకర్త సూక్ష్మేక్షణికి! ఔరా! **"రవికానిచో కవికాంచునేకదా'** అన్నట్లు మఱొకసూక్తిని కల్పింపవలసినదే. లేదా కవి అనగా క = కవితా, వి = విమర్శకుడు అని ఊహించిన మంచిదేమో?

12వ అధ్యాయమునందు, **"కదలికదలనిదై.........."** అను పద్యమున భూమి అచల అయినను "కదలడు" ఎట్లో సాంప్రదాయ బద్ధముగా నిరూపించుట వారి పరంపరీణ విషయపారీణతకు పతాక. ఇచ్చట మఱొక్క మాట, ఈ పద్యమునందు గల కురంగము "మనస్సు" కావచ్చును. అది నిరవకాశము అగుట అనగా "వికల్పరహితమగుట, అందువలననే "అనుట, వినుట, కనుటయు" లేవు. మనస్సు వాయు సమకోటికము. వాయువు కదలిన మనస్సు కదలును. మనస్సు కదలిన వాయువు కదలును. వాయువు ఆకాశమున లీనమగుట అనగా శబ్దము చిదాకాశమున లీనమగుట. **"శబ్దగుణకమాకాశం"** అని గదా. **"నాభేరూర్ధ్వం హృదిస్థానో మారుతఃప్రాణసంజ్ఞకః, నదతి బ్రహ్మరంధ్రాంతే తేననాదఃప్రకీర్తితః'** శివసంహితా **"ఏతదభ్యాసయోగేన జిత్వాసమ్యగ్గుణాన్‌బహూన్ సర్వారంభపరిత్యాగీ చిదాకాశే విలీయతే"** హఠయోగ ప్రదీపికా **"నాదోంతరంగసారంగబంధనే వాగురాయతే అంతరంగకురంగస్య వధే వ్యాధాయితోపి చ"** హఠయోగప్రదీపికా

ప్రధాన రస నిర్ణయము హృదయంగమముగా నున్నది. భక్తి భావము ప్రధానమా శాంతరసము ప్రధానమా అన్నది సావకాశమయిన కోటి ద్వయము. శాంత ప్రాధాన్యము అద్వైత సిద్ధాంతవ్యాస పారమ్యమునకు రమ్యతరమయిన నిర్ణయమయినది. భక్తి భావము

ప్రధానము అన్నచో సగుణ ప్రాధాన్యము వచ్చి పడును. "భక్తిః జ్ఞానం" అనుకొన్నచో శాంతరసము అనుట నిర్వివాదము. మూలమునకు భిన్నముగా అధ్యాయములను 'గుచ్ఛములు, అని విభజించు టకు శర్మగారు చెప్పిన కారణము అద్భుతముగా నున్నది. సారస్వత పుష్పగుచ్ఛము లతో దత్తదేవునకు కవికృత పూజయట !
హంసతత్వ శీర్షిక క్రింద "పాకము పట్టి పోసినట్లుగా" అవతరించిన "వేదాంత దర్శన సంగ్రహము అభీక్ష్ణభావనా రస చర్వణ పర్వ సంభృతమయిన ఇక్షుఖండము. గ్రంథ పారాయణఫలితము యుక్తి యుక్తముగా నిరూపింపబడినది. ఈ విధముగా ఈ విమర్శగ్రంధము దత్త భాగవత బాదరాయణులయిన శ్రీ రాఘవనారాయణుల నుంచి మాదృశబాలిశాంతముగా ఆనందరహస్యోన్మీలనము చేయుచు శ్రీ భోగీశ్వరులను కృతార్థులను చేయుగాక.

డా॥మేళ్లచెర్వు సుబ్రహ్మణ్యశాస్త్రి M.A. Phd.,

తిమ్మసముద్రం ఓరియంటల్‌కాలేజి.




**జన్మాన్యతీతాని కియన్తి మేఽహో**
**ఉచ్చావచత్వం యదభూత్ సుఖదుఃఖహేతోః**
**ఆజీవదాసతమతామభిపద్యపుణ్యాత్**
**బాలే తవానుగ్రహవశాన్మమసుప్రభాతమ్.**

సోయం శ్రీ దత్తభాగవతాద్వైతాఖ్యః గ్రన్థః. సకలవేదాన్త సిద్ధాన్త సారసంగ్రహరూపః. ప్రత్యగభిన్న బ్రహ్మాపరోక్ష సాక్షాత్కారేణ పంచభ్రమనివృత్తిం సమ్పాదయన్ ఆత్మ స్వరూపానన్దమనుభావయన్ ముముక్షుజనోపయోగిసారస్వతాభిమానినాం సత్సాహిత్య సమ్పాదకశ్చవిజయతేతరామ్ । నిరన్తరాధ్యాత్మవిద్యాసక్త పరస్య మదనుజన్మనః భోగీశ్వర శర్మణః పరదేవతానుగ్రహేణ చిరాయురారోగ్యవీర్యాదికంవర్ధతామ్ । వర్ణోచ్చారణే నాన్త రీయకనాదబిందుశివశక్తి వైరాగ్యైశ్వర్యశాన్తాత్మికాబాలాంబికానుగ్రహేణబ్రహ్మానన్దా భూతిశ్చ సంజాయతామ్.

ఏవంత్వదగ్రజః

నోరి సత్యనారాయణశర్మా

కె.ఎల్.ఎన్. సంస్కృతకళాశాలా

తెనాలి.

## శ్రీః

# సత్యనివేదనము కృతజ్ఞతలు

శ్రీ దత్తభాగవతాద్వైత కృతికర్త :- డా॥ నోరి భోగీశ్వరశర్మ రీడరు.

వేదములు, శాస్త్రములు, వేదములకంటె భిన్నములు కాని శైవ, శాక్తేయ, వైఖానసాద్యాగమాలు, కొంతతెలిసినను నేనేమీ తెలియనివాడనని ఎంతటి వానికైననూ అంగీకరించక తప్పదు. ఈ శరీరము నానావిధ భూతమయము. అధిష్ఠానం తధాకర్తా కరణం చ పృధక్పృధక్ వివిధా చ పృథక్చేష్టాదైవం చైవాత్ర పంచమమ్॥ అని భగవద్గీత ఇది జాయింటు వ్యాపారస్థుల సమష్టి, మనసు అతి చంచలము. మేల్కొని అంతటా సత్యమునే పలుకుదునని ఏ నరునకైనను చెల్లింప వీలుకాదు. అని ధర్మరాజు సుభాషితమును నన్నయ,భారతమున క్రోడీకరించినాడు. ధర్మరాజంతటి వానికే సత్యము నడుపు క్రమము. అట్లున్న అస్మదాదులకు సత్యము నడుపు క్రమము మిక్కిలి దుర్ఘటమని వేఱుగా చెప్పవలసిన పని లేదు. ఇక ఇది ఇట్లుండగా అసత్యపు వనిత జ్యోతిష్కులకు నమస్కరించి, పౌరాణికోపన్యాసకుల యొక్క భుజములను చఱచి, కవులను కౌగిలించుకొని, సాహితీ విదులతో సరసాలాడి,పండితులతో పరాచకాలాడి పామరులతో పాచికలాడి రాజులందు రాజకీయవాదులందనురక్తిని నిల్పి, ద్వైతవిశిష్టా ద్వైతాలందు విశిష్ట దృష్టుల నిల్పి అనుభూతిలేని అద్వైతానికి అపార్థాలంటగట్టి సర్వత్ర ప్రస్ఫుతమై ప్రచారము కలిగియున్నదని ప్రాస్తావికాలలో కలదు. కాన శ్రీదత్తభాగవత కృతి పరిశోధనమున కొంత తెలిసి వ్రాసినను తెలియని వాడనను సత్యమును అంగీకరింపకతప్పదు.

సమగ్రముగా తెలిసికొని వ్రాయరాదా అన్నచో దత్తభాగవత కృతికర్తలు భౌతికముగా ఇపుడు లేరు. స్వప్నసాక్షాత్కారాలతో శాస్త్రిగార్ని రప్పించుకొని సమాధానము పొందగలిగినంతటి భావుకతాలేదు. పోనీ తెలియనివాడవు కృతి ఏల వ్రాసితివి సత్యదూరమగును కదా అని అనవచ్చును. సౌందర్యలహరి వ్యాఖ్యలో లక్ష్మీధరుడు పంచదశి మంత్రమును ఉల్లేఖించితనను గురువునుగా ఎంచుకొనిన వారలకు నేనీ మంత్రమును సిద్ధింపజేయుదునని ప్రతిజ్ఞజేసిరి. భౌతికముగా లేని ఆపండితుడు ఎట్లు సిద్ధి కూర్పగలడని మాగురువులను అడిగితిని. వారునవ్వి చదివిన చదువులను యోగోపాసనలతో తపసుతోను పండించుకొని అన్తర్యామి త్వేశ్వరత్వాలను సాధించుకొనిన వారికిట్టి వ్రాతలు సంగతములగుననినారు, అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా, విజ్ఞాతే చ పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా అనిగదా ఆర్యోక్తి. ఎవడు విద్యచే ఆ అక్షరము నెఱుగుచున్నాడో వాడే కృతార్థుడు. విద్యచే ఆఅక్షరమునెవడు ఎరుగడో వానికీవేదపు బుక్కులతోనేమి చేయగలడు. దేనియందీ సమస్త దేవతలుందురో

అట్టి ఆ అక్షరము,ఇంతకు తపసుతో పండించుకొన్నవానికే ఆత్మ తత్త్వము తెలియును. పండా జ్ఞానమస్యాస్తీతి పండితః అనెడి వ్యుత్పత్త్యర్థము అట్టివాని పట్టుననే సార్థక మగునని=శ్రుతియు=వాకొనుచున్నది. కానతపసులేని వేదశాస్త్ర పాండిత్యము కేవలమగ్ర తాంబూలసమ్భావనాసమ్పాదకమే! పశ్వాదిభిశ్చా విశేషాత్ అని, సూత్రభాష్యములో శంకరులు విద్య ఉండియు ఆత్మతత్త్వమునకై పాటుపడని పండితులు పశుసమానులుఅనినారు, ఎవడాత్మముక్తికై పాటు పడడోవాడు ఆత్మహత్యా మహాపాతకియని నిర్వర్ణించినారు, కోటి విద్యలు కూటికొఱకన్న సామెత అగునుకాన నేటి వేదశాస్త్ర పాండిత్యము ఏమాత్రము అక్కరకు రానిదని ఎఱుంగుదును సత్ అనగా బ్రహ్మము త్యత్ అనగా తద్భిన్నము ప్రపంచము ఈ రెంటి ఎఱుక తపసు వలననే తెలియును. సదాదేవతల మధ్యమున, గోవులమధ్యమున, విప్రులమధ్యమున నివసించు సుకృతీ భూతచరిత్రులు శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి శ్రీ చరణులు. తన 94 ఏళ్ళ జీవిత కాలములో 80 ఏళ్ళ కాలము నిరన్తర బాలా మంత్రానుష్ఠాన యోగనిష్ఠలతో సదా దేవతలతో సంవ్యవహారము కలవారు. అవ్యాజ కరుణామూర్తులు. శ్రీ శాస్త్రిగారొక పరి కాశీవెళ్ళిరి. పంచగంగాయాత్ర సాగించుచుండిరి. గంగమ్మ గలగలలాడు బంగారపు గాజులతో తన చేయిసాచి ఏరా నాకేమి కానుక తెచ్చితివిరా అని అడిగినది. శ్రీ శాస్త్రిగారు తెల్లమొగము వేసి ఏమీతోచక అప్పటికి తన వ్రేలికి గల దర్భముడి ఉంగరముతోచి అనాలోచితముగా ప్రార్థనము చేసి ఆమె చేతిలో నుంచిరి. గంగాయాత్రముగించి మకామునకు వచ్చి దేవతార్చన సంపుటము తెఱచిరి. అందు, మరలతన ఉంగరము కన్పించినది. ఇదేమి ఇట్లయినది. నేనేమైన భ్రాంతిపడితినా! అకృత్యము చేసితినా! లేక ఆతల్లి నాపైకోపించినదా అని తీవ్రతపము చేయబూనిరి. నిద్రవచ్చినది. అందొకకల గంగమ్మ కన్పించి ఏరా కానుకను అడుగగా దర్భముడి ఉంగరమిచ్చితివేల? ఇది నీ పితృతర్పణమునకు ఉపయోగించునదికదా నాకు ఎట్లు ఆభరణమగును? శ్రీశాస్త్రిగారు తల్లీ నీకై నేను ఏ కానుకా తీసికొనిరాలేదు. అప్పటికదేదో అనాలోచితముగా ఆభరణము మెఱసినది. ఇట్లు చేసితిని క్షమింపుమనిరి. అపుడామె ఓరీ ఇది నాకేల? నీ భార్యవద్ద నాకై కానుకగా తెచ్చినట్టి ఆభరణమొకటి కలదని గుర్తు చెప్పినది వెంటనే మెలకువ కలిగి శ్రీ శాస్త్రిగారు ఆసాధ్వినడుగగా వెంటనే కాసుగొలుసు కానుకగా గొని యాత్రకు వచ్చితినన్నది. శ్రీ శాస్త్రిగారు తిరిగి గంగమ్మ వద్దకు వెళ్ళి ప్రార్థించి కానుకను సమర్పించి దేవతార్చనము ముగించిరి. ఇట్టి దేవతాసాన్నిధ్యాలు యోగానుభూతులు వారి జీవితములో కోకొల్లలు. నమ్మినవారికి విశ్వాసమే పరమావలంబము. లేకున్న ఏదీ లేదు. ఇందువలననే సత్యముగా వారి కృతిని వ్యాకరింపబూనుటకు నాదగు వేదశాస్త్ర పాండిత్యము అప్రయోజకమంటిని

వారు తపసుతో సాధించుకొనిన అన్తర్యామిత్వేశ్వరత్వాలు నన్నీకృతిని వ్రాయుటకు ప్రేరణ మొసంగినవి. సుమారు 10 వత్సరాలకు పూర్వము శ్రీ శాస్త్రిగారు జీవించియున్నపుడే కృతి పరిశోధన వ్యాసము సంకల్పితము, వారి దౌహిత్రులు కీ॥శే॥ చెర్వు సత్యనారాయణ శాస్త్రిగారిచే ప్రేరితము, బ్రహ్మశ్రీ మేళ్ళ చెర్వు చంద్రమౌళి శాస్త్రిగారు కాశీలో జ్ఞాన ప్రవాహ నిజబోధరూప, కాశీపురాధిష్ఠాన దేవత, ప్రతిదేహ గేహమున వెలిగెడి బుద్ధిదీప విశాలాక్షీ ప్రేరణమున తురీయుడు శాన్తాద్వైత రూపుడగు విశ్వేశ్వరుని వలె కన్పించి ఈ దత్తభాగవత మూలగ్రంథము నెఱింగించి, సందేహాలకు సమాధానములిచ్చు గురువర్యులు భౌతికముగా మనకిట కఱవైనారు, నీ గురుభక్తి ఆలోటు తీర్చగలదని నన్ను ఆశీర్వదించినారు. చెర్వు సత్యనారాయణ శాస్త్రిగారు నేనూ సంస్కృతాంధ్ర=గ్రంథాలు ల॥న॥ చెర్వు లక్ష్మిగారి సాక్షిగా కొద్దిరోజులు అపుడప్పుడు తిరగవేసితిమి. పరిశోధనమును నేను వ్రాసి డిగ్రీని పొందితిని.

ముద్రణమగుతఱి దాతృ మూర్ధన్యులు. అనేక కృతులకు కృతిపతులై వేదశాస్త్ర పండిత ప్రకాండులకు గృహారామ క్షేత్రవిత్తాదుల నెన్నింటినో కల్పించి జీవితము ధన్యము చేసికొనిన మహనీయులు, తమ దీక్షాగురువుల ఆదేశానుసారము, తానాచరించుచు ఆచరింప చేసిన సత్కర్మనిష్ఠులు శ్రీ గొల్లపూడి వెంకట్రామ శాస్త్రిగారు, శ్రీలక్ష్మి సమానురాలు సరోజినిగారు. నాపరిశోధన వ్యాసమును కొంతవిని 20 వేల రూపాయలు కృతి ముద్రణమునకు ఇచ్చినారు, వారికి వారి ఉపాస్య దేవత ఆ లలితా పరాభట్టారిక చిరాయురా రోగ్యైశ్వర్యాది సకల భోగభాగ్యములనిచ్చి సర్వదా రక్షించుగాక, అని ఆపరదేవతను ప్రార్థింతును.

ఇక సత్యవస్తువును సత్యముగా నిరూపించుట సందేహగ్రస్తమే కదా, తలవని తలంపుగా కుంటి వానిని గంగమ్మయే సమీపానికి వచ్చి పవిత్రుని గావించినట్లు సాంగోపాంగవేద పుంభావ సరస్వతివలె నాబాల్యమిత్రులు బ్రహ్మ శ్రీ యనమంద్ర వేణుగోపాలశాస్త్రిగారు. సన్నిహితులై నా సందేహాలు దూరదూరాలు కావించినారు. ఇంతకు చెప్పవచ్చినది.అస్మద్దీక్షా గురువుల ఈశ్వరత్వమే, అన్తర్యామిత్వమే వెన్నుతట్టిలేపి సందేహాలనణచి కృతిని నావ్యతో దర్శనీయమగు రీతిలో వ్రాయించినదని తలంచెదను.

కం॥ పలికెడిది భాగవతమట, పలికించెడివాడు రామభద్రుండట నే
పలికిన భవహరమగునట, పలికెదవేఱొండుగాథ పలుకగనేలా

అను పోతన పద్యము నాకృతికిని సంవదించుటచే ఆ పద్యమే నాకృతికిని ఆద్యమయినది. పలుకునది శ్రీదత్తభాగవతాద్వైతము, మోక్ష సామ్రాజ్యలక్ష్మి నొసంగునట్టిది. పలికెంచెడివాడు రాఘవ నారాయణుడు, నే పలికిన భవహరమగును. పలికెద, వేఱొండు గాథ పలుకగనేలాయని

అంటిని. శ్రీదేవీ భాగవత, శ్రీమద్భాగవత ద్వయ సారాంశము కల్గి అద్వైతస్థితి నందించునట్టిది దీనికి మూలము శ్రీవిద్యకావున, శ్రీదత్తభాగవతాద్వైతమని పేరు పెట్టితిని. అద్వైతమిందుని బద్ధమైనదిగదా, అనుభవానికి రాని అద్వైతమును బోధింపకూడదు. బోధించినవాని నాలుక తెగగోయవలెనని ప్రాయశ్చిత్తమును కామకోటి పత్రికలో జగద్గురువుల సప్రమాణమగు శ్లోకమొకటి చదివితిని. ఒక్కరోజయినను శుచియై శాస్త్రీయమగు శాన్తిపాఠపూర్వకముగా వేదాన్తాధ్యయనము కావించిన వానికి 80 కృచ్ఛ్రచాంద్రాయణ వ్రతములు చేసినంతటి పుణ్యమబ్బునని వింటిని. ఈ రెంటికినీ సమన్వయము, సగుణనిర్గుణ రూపముగానున్న ఉపాస్య దేవతా మంత్రోపాసనము కావించవలెను. సాధకుడు సత్యవస్తువు తద్భిన్నము ఈరెంటి యొక్కఅధ్యయనము అనుభవానికి తెచ్చుకొనవలెను అను శాస్త్ర సిద్ధాంతమును విద్యారణ్యపంచదశి బాల్యమిత్రులతో కలిసి చదువునపుడు గ్రహించితిని, సాధకునకు పాపాదులేమీ అంటవు. ప్రత్యుత శీఘ్రసిద్ధికి తోడ్పడునని సమాధానపడితిని సాధకుని ఉపాసనము అద్వైతపరోక్ష జ్ఞానముతో ముడిబడియున్నది. జ్ఞానము లేని ఉపాసనము ప్రమాదము. ఇది సత్యము. పాపప్రాయశ్చిత్తము. శుష్కవేదాన్తోపన్యాసప్రవచనపటువులకని ఎఱిగితిని. అద్వైతము శ్రుతి బోధితము. శ్రుతి తాత్పర్యము అద్వైతమునందు కలదని వ్రాయుట ముఖ్యోద్దేశ్యము, శంకరులు నిర్గుణ శ్రుతులను వ్యాకరింపగా, సగుణ శ్రుతులను తత్తాత్పర్యార్థ నిర్ధారణము రామానుజులు కావించినారు కాన రామానుజుల మీద మధ్వాచార్యుల మీద గాని నాకెట్టి ద్వేషము లేదు ప్రత్యుతరామానుజ జయన్తియు జరుపవలెనని మా గురువులనుచుండెడివారు. సత్యాన్వేషణమునకై సహృదయులు పాటుబడి సత్య సందర్శనముతో తరింతురుగాక అని సత్య స్వరూపుని తలంచెదును.గురుమంత్రదేవతైక్యమును సంభావించెడి ఉపాసన,వర్ణోచ్చారణములందు, నాద, బిందు, కలా, శక్తి, శాంతములు తప్పనిసరి. ఈ ఐదులేని ఉచ్చారణమే కుదరదు. ఇట ద్వైతవిశిష్టాద్వైతులందరికిని అద్వైతమంగీకరింపక తప్పదు. ఈ కృతిలోని విషయ సూచిక లలితామంత్ర బీజాక్షరములు ఆదియందు చేర్చి బాలతో సంపుటి చేసి శ్రీః అనునక్షరముతో 19 అధ్యాయములు పొనరించితిని, దేవతా నామములేకుండా కేవల బీజాక్షరాలతో రూపుకలిగినది పంచదశీ మంత్రము, ఈవిధముగా ఆ లలితా మంత్రము,తన్మహిమ, కొంత తెలియగలదని తలచి ఇట్లు చేసితిని, సహృదయులు మన్నింతురుగాత. తపసు, విద్య నిశ్శ్రేయసకరములు, దానిచే సత్యము తెలియబడును అట్టి సత్యన్నారాయణ స్వరూపమైన వాడు దత్తదేవుడు ఆమూర్తి సగుణ నిర్గుణాత్మకము. అందువలన శ్రీదత్తభాగవతాద్వైతమనుపేరు సార్థకము.

శ్రీః

# కృతజ్ఞతలు

కర్మసోపానమునుండి జ్ఞానసోపానమునకు ఎక్కించిన అస్మద్దీక్షాగురువులు, బ్రహ్మర్షివర్యులు, యోగేశ్వరేశ్వరులు. బ్రహ్మశ్రీ వేదమూర్తులు అపారావ్యాజకరుణామూర్తులు అజ్ఞానధ్వాన్తదీపికలు అయిన బ్రహ్మీభూత శ్రీతాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి చరణములకు, సాష్టాంగదండప్రణామములు శ్రీదత్తభాగవతాద్వైతకృతి ప్రథమ ముద్రణము వెయ్యి ప్రతికృతులు అయిపోయినవి, మరల మరల పాఠకులు కోరుచున్నందున దీని ద్వితీయ ముద్రణము అగుట. అనఘాసమేతానఘస్వామి యగు శ్రీదత్తాత్రేయుని అనుగ్రహ విశేషమేయని తలంచెదను. శ్రీగురువులు చూపించిన శ్రీదత్తాత్రేయునకనేక సాష్టాఙ్గదండ ప్రణామములు.

ఈకృతిముద్రణమునకు తిరుమల తిరుపతి దేవస్థానమువారు 20,000 వేల రూపాయలు ఆర్థికసహకారము ఇచ్చుటవలన శ్రీ వేంకటేశ్వరస్వామివారికి దేవస్థానమువారికి అనేకకృతజ్ఞతలు. హ్రీం - హల్లీసకము అనెడివ్యాసము కోరిన వెంటనే నామిత్రులు సతీర్థ్యులు. బ్రహ్మశ్రీ మేళ్ళచెర్వు వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు వ్రాసి ఇచ్చినందులకు వారికి అనేక కృతజ్ఞతలు.

నా విద్యాభ్యాసకాలమున నానాస్తికత్వమును పోగొట్టి నన్నాదరించి, తత్త్వోపదేశములచే, నన్నులరించిన శ్రీజగద్గురువులు యోగేశ్వరేశ్వరులు. శ్రీకంచికామకోటి పీఠపరమాచార్యులు శ్రీశ్రీశ్రీ చంద్రశేకరేంద్ర సరస్వతీ శ్రీచరణులకు తత్కరకమల సంజాత. శ్రీజయేంద్రసరస్వతి. శంకరవిజయేంద్ర సరస్వతీ శ్రీచరణులకు అనేకానేక నమస్సహస్రములు.

5 వత్సరముల నుండి అడిగిన తోడనే యత్నించి దార్ధిక సహకారముతో శ్రీముఖము. శ్రీశారదాచంద్రమౌళీశ్వర ప్రసాదము అనుగ్రహాక్షతలు. నారాయణ స్మృతితో అనుగ్రహించిన శ్రీశృంగగిరి శారదాపీఠాధిష్ఠితులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థసామివారికి అనేక వందనములు.

నిత్యానుష్ఠానతత్పరులు, కాళిదాస కావ్యత్రయగురువులు కీర్తిశేషులు, అగు అస్మజ్జననీజనకులు, వెంకటసుబ్బాంబా వెంకటప్పయ్య శాస్త్రిగార్లకు, తదుపరి వ్యాకరణ వేదాంతగురువులు అగు కీర్తిశేషులు కప్పగంతుల సుబ్రహ్మణ్యశాస్త్రి చరణులకు తద్విద్యావంశజన్ములగు శ్రీపరిమి విశ్వనాథశాస్త్రిగారికినీ ఈకృతికి అభిప్రాయములు, ప్రత్యక్షముగా పరోక్షముగా సహకరించిన వారికందరికివి శ్రీమాఅన్నగారు వోరి సత్యనారాయణ శాస్త్రిగారికినీ వందన పరశ్శతములు. అభిప్రాయములు ఆశీస్సులు ఇచ్చిన వారికి వానమోవాకములు. ఈకృతి ముద్రణమునకు సహకరించిన వదాన్యుల కందరికినీ వాకృతజ్ఞతలు.

ఇట్లు
శ్రీచరణసరోజరేణువు
శ్రీనారాయణ శంకర భగవత్పాదసరస్వతి

# ప్రార్థన

శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి గారి ప్రాతస్స్మరణీయ దత్తస్తుతి.

శ్లో॥ సహ్యాచలాదిహసమాగత బన్ధురత్న
రత్న ప్రభాచ్ఛ తనుకాన్తి విరాజమాన ।
మాన ప్రమాద మదవర్జిన తాదురాప
దూరాపవర్జితనమజ్జన మోహ తేఽహమ్ ॥

ఈ శ్లోకము ముక్త పదగ్రస్తము, సహ్యాచలమునుండి వచ్చిన బంధురత్నమా, రత్నప్రభవలె స్వచ్ఛమగు శరీరకాన్తితో ప్రకాశించెడివాడా, అభిమానము, పొరబాటు, మదము,మున్నగు దుర్గుణ వంతులకు దురాపుడనైనవాడా, నమస్కరించెడి భక్తుల మోహమును పోగొట్టెడి దత్తదేవా, నేను నీవాడను,

శ్లో॥ అశ్వత్థమూలేవస వాఽత్రబింబే
అన్తర్గృహంచిత్రపటేనిషీద
యద్వాహృషీకేఽత్రిభవ త్రిమూర్తే
నిర్ద్వంద్వ సద్వంద్వతయా ప్రసీద ॥

ఓ అత్రిపుత్రా! రావిచెట్టు మూలమందు ప్రతిష్ఠింపబడిన రాతి బొమ్మ యందుందువా సరే, లేదా దేవతార్చన మందిరములోని చిత్రపటమున నుందువా సరే, లేదా నా హృదయాకాశముననుందువా సరే, శీతోష్ణ సుఖ దుఃఖ క్షుత్పిపాసాది ద్వంద్వ రహితుడనైన ఓ దత్తదేవా అనఘాశక్తి సమేతుడవు సద్వంద్వుడనై నాకు ప్రసన్నుడవగుము.

శ్లో॥ దత్తాత్రేయహరే కృష్ణ, ఉన్మత్తా నందదాయక ।
దిగంబరమునే బాల, పిశాచజ్ఞాన సాగర ॥

శ్రీ శాస్త్రిగారు నిదురలేచి, తలుపు తీయగనే తన ప్రాంగణములో ప్రతిష్ఠింప బడిన దత్తదేవుని స్తుతించు సదాచారముతో ఆశువుగా విరచించిన ప్రాతస్స్మరణీయము 3వ శ్లోకము ఇది ఒక అనుష్టుభ మంత్రము. శ్రీ దత్తదేవుని అనన్త నామములను తెలియజేయునది.

నోరిభోగీశ్వరశర్మ - -శ్రీదత్తభాగవతాద్వైతము - దత్తపంచరత్నాని

1 శ్రీ శోఽనఘాన ఘనతార గురుర్నృసింహః
యోగోపవర్గమ దనత్కశిపుప్రహర్తా
ప్రహ్లాద రక్షణ కృతే క్షణ సుప్రసన్నః
దత్తోఽవధూత తిలకో హృది సన్నిధత్తామ్ ॥

2 రాత్రి న్దివం సతతతే శ్శరణాగతస్య
తే஽హం విభోవర సకృద్వచన ప్రయోగే
దత్తాక్షితాం బహువరప్రదతాంచ వక్తి
త్వన్నామ దత్తనిరతంహ్యాది సన్నిధత్తామ్ ॥

3 దత్తాత్రిపుత్రహర కృష్ణ దిగంబరార్య
జ్ఞానోదధేమునివరేణ్య పిశాచకాఖ్య
ఆనందదాయకహరే గురురూపబాల
ఉన్మత్తశర్వ తవనామసదాస్తు హృద్యమ్ ॥

4 సహ్యాద్రివాసమపహాయనతాన్రిరక్షుః
సర్వత్ర సన్నిహిత సత్యచిదేకరూపః
సంసారరోగపటుభేషజసచ్చరిత్రః
దత్తో஽వధూతతిలకోహ్యాదిసన్నిధత్తామ్ ॥

5. శ్రీరేణుకావదన నిర్గతవేదరాశిం
సంప్రాప్యవిస్మృతవతే పరమేష్టినేత్వం
దత్తో஽సితేన శివశక్తి సమైక్యరూపః
దత్తో஽వధూతతిలకో హ్యాది సన్నిధత్తామ్ ॥

## శ్రీదీక్షాగురువులస్తుతి.

1 బాలోపాస్తివిభావనాతతమహాయోగైకసమ్పాదిత
స్వాత్మానందలవీకృతామరవరబ్రహ్మాధిపత్యోవశీ
యో నిత్యాగ్నిరతః స్వవైదిక పథాన్నాత్యేతి రేఖామపి
తం నారాయణ శాస్త్రిణం బుధవరంనౌమీడ్యమ స్మద్గురుమ్

2 సన్దేహౌఘతమః ప్రపంచదలనే మిత్రంచ రాత్రిన్దివం
శిష్యస్వాన్తసుశుక్తికామనువర స్వాత్యభ్రవర్షాయితం
తాడేపల్లి కులాబ్ధిచంద్రమమలంశ్రీతంత్రనిష్ఠంచతం



3. యోగీయోగముపాశ్రిత: ప్రతిదినం స్నాతస్త్రివేణ్యాంతత:
షట్చక్రోపరిసంస్థితేనియమిత ప్రాణైః సహస్రారకే
నిత్యం శ్రీగురుపాదుకార్చన పరస్తీర్ణ: పరాంస్తారయన్
తం నారాయణ శాస్త్రిణం బుధ వరం నౌమీడ్యమస్మద్గురుమ్

4. నామం నామం గురుపదయుగం సంసృతివ్యాధినాశం
స్మారం స్మారం శ్రుతిమతనుతాం తత్త్వమస్యాదివాచం
జాపం జాపం వరమనుమముం చిత్తశాన్తిప్రదానం
ధ్యాయం ధ్యాయం నిజగురు కథాం కామయే ఽహం విముక్తిమ్

5. శ్రీమద్వేంకట విద్వదగ్ర్యశివదేహార్ధాచ్చశక్తి: పరా
యాభూద్రాఘవపూర్వికావరతనుర్నారాయణః పండిత:
తత్త్వావ్యార్థవిమర్శనాసుధిషణా తాత్పర్య నిర్ణాయక:
తంనౌమీడ్యముపాసనాగురుమహంశ్రీతంత్ర నిష్ఠంముదా

6. వేంకటపండితేంద్రసుత విశ్వజనావనపుణ్యవైభవా
సంకటవార్ధిపోతమ విశాల మతీ బుధవర్య సంస్తుతా
శాంకరి మంత్ర యోగపరశాస్త్ర రహస్యకళావిశారదా
అంకములేనిభక్తి భవదంఘ్రులనౌదలదాల్తునిచ్చలున్

7. శాన్తము దాన్తమున్ విమత సత్యము, శౌచదయార్ద్రభావ
మత్యన్తము చూపులన్ మెఱయతాపనివారక మంత్ర పంక్తితో
చింతలు రోగముల్ దొలగ జేయుచువారికితీర్థమిచ్చి
యే కాన్తతగూర్చిమేల్మి పరమార్థముపంచుగురుంద లంచెదన్

8. కలుగుననేక విఘ్నముల కావ్యనిబంధములందు దీక్షలన్
తొలగగ జేసి తాదురితదూరుడవారిత యోగశక్తిచే
పలువుర శిష్యులన్ పరకృపాభరచిత్తత, కర్మదీక్షల
న్నలరగనుద్ధరించు గురు నాతతభక్తిని గొల్తు నెప్పుడున్
నమశ్శ్రీశాంకరాద్వైతానందతుందిలితాత్మనే
హృదవిద్యా తమోభాను శ్రీనారాయణశాస్త్రిణే
కృతే శ్రీదక్షిణామూర్తి: త్రేతాయాందత్త నాయక:
ద్వాపరేవ్యాస భగవాన్ కలౌ శ్రీశంకరోగురు: :-

కామకోటి పీఠాధీశ శ్రీజగద్గురు చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి శ్రీచరణ స్తుతిః

1. చిత్తావిభేదమఖిలం హృదితాంచ చిత్తే
స్వాహంకృతౌ, మహతి, తాంప్రకృతౌ మహచ్చ
మాయాం పరేచవినివేశ్యసమాధినిష్ఠం
శ్రీచంద్రశేఖర జగద్గురు మానతోఽస్మి

2. భక్తత్రితాపహరదివ్యసుధావచస్కం
సర్వాంతరాత్మమహిమానముపేయివాంసం
సన్తానకం సుమనసాం, కలిధూమకేతుం
శ్రీ చంద్రశేఖర జగద్గురుమానతోఽస్మి

3. బాహ్యాన్తరం కిమపిశక్తిశివైక్యమూర్తిం
సూక్ష్మాతిసూక్ష్మమపరంనతపారిజాతం
జ్యోతిఃపరం కలితదేశికవేషమారాత్
శ్రీచంద్రశేఖర జగద్గురుమానతోఽస్మి

4. భాష్యారవింద మకరంద నిపాన భృంగం
కాషాయ దణ్డకరకాదిలసత్కరాబ్జం
భస్మత్రిపుంద్ర తిలకాంచితఫాలభాగం
శ్రీచంద్రశేఖర జగద్గురు మానతోఽస్మి

5. యోఽజ్ఞానసన్తమసవారణసింహపోతః
శైవం మహః కిమపి సాంద్ర కృపావతంసః
కైలాసవాస మపహాయ నతాన్ రిరక్షుః
శ్రీచంద్రశేఖరయతీంద్రముపాస్మహేతమ్ ॥

జగద్గురు శృంగగిరి శారదాపీఠాధీశశ్రీభారతీతీర్థస్వామి శ్రీచరణస్తుతిః

1. వన్దేశ్రీదేవతాస్తోత్రకదమ్బకుసుమాంచితాన్
భారతాన్ భారతీతీర్థపర్యన్తాన్స్వామిసద్గురూన్

2. అద్వైతహేతిహత పాతుకపాతకాళిం
సాహిత్యధర్మ్యకవితాహ్రదతీర్థభూతం
మాధ్వీకరస్యసుమనోహరవాఙ్నిగుమ్భం
శ్రీభారతీగురువరం ప్రణమామిమూర్ధ్నా

3. శృంగేరీవాగ్వ్యధూటీవదనగలితతాంబూలశేషః కిమేషః
వాణీస్వేహోన్నపీనస్తనఘటజనితః క్షీరదారాప్రవేకః
త్వంమేతేఽహం సుకాళీవచనసువిదితానుగ్రహః కాళిదాసః
విద్యారణ్యం తమన్యం నిగమవివృతికృద్భారతీ తీర్థమీడే ॥

## గణేశస్తుతిః

వన్దేశ్రీగణనాయకం సుమనసామారాధ్యమాదౌసదా
సర్వాభీష్టకరైకవింశతిదళైరభ్యర్చితం యోగిభిః
మృద్వీకాకవితావితానకలనాలంబంకవీనాంకవిం
దూర్వాయుగ్మకలాపభూషితతనుంగౌరీశమోదావహమ్
తవాధీనారంభాః తవచవశగః కార్యనికరః
సదామూలాధారేనుతితతిరధీనా, గణప, తే
ప్రణన్తుం సాష్టాఙ్గం వికలరహితా పుష్టిరపి తే
ప్రపన్నోహం, సర్వం, మమహికృపయాకల్పయవిభో
మందారారుణ పాటలీబహులనచ్చేవన్తికామాలికా
జాతీచమ్పక చిత్రపుష్పనిచయార్చాపాదచూడాంచితం
దూర్వాయుగ్మకసప్తషట్కమిథునాంచన్మమంతం త్రయ
స్త్రింశద్దేవగణాధిదైవతమహంవిఘ్నాపహోంఢ్రింభజే
ఆర్ద్రా కీటమనోజ్ఞసారతిలకం ఫాలేఘనశ్యామలే
కిమ్మీరారుణ పట్టికావిలసితేపీతాంబరే సందధత్
నిశ్చిన్తః కరయుగ్మసంఘటిత సజ్జానుశ్చహారోజ్జ్వలః
పుష్ట్యావల్లభయాయుతో గణపతిర్విఘ్నేశ్వరః పాతునః
గౌర్యాహరిద్రాకలిత స్వరూపం
లంబోదరం సాంద్రకృపేందురేఖం
సిద్ధీద్య బుద్ధి ప్రద మంత్రరాజం
తం నౌమివిష్ణీశ విధీంద్రవంద్యమ్

## సరస్వతీస్తుతిః

శ్లో॥ నారాయణీ నాదరూపాపాశంకరాచార్యసంభృతా
అన్తర్నాడీ విలసితా సా చకాస్తు సరస్వతీ

అద్వైత వేదాన్తమును చదువునపుడు గురుశిష్యులు ఆద్యంతములందు, ఉపద్రవముల నివారణార్థమై సాంప్రదాయకముగా చేసెడి శాన్తి మంత్ర పఠనము.

## వేదాంతపాఠక్రమము

శివనామని భావితేంతరంగేమహతిజ్యోతిషి మానినీ మయార్ధే
దురితాన్యపయాన్తి దూరధూరేముహురాయాన్తిమహాన్తి మంగళాని

జ్యోతిస్స్వరూపుడు అర్ధనారీశ్వరుడయిన శివునిపేరు మనసున భావించినంతనే పాపములన్నియూ దూరదూరముగా తొలగును, మాటికి మాటికి మంగళములు అహమహమికతోవచ్చును.

స్మృతేసకలకళ్యాణ భాజనం యత్ర జాయతే ।
పురుషన్తమజం నిత్యం వ్రజామిశరణం హరిమ్ ॥

స్మరించినంత మాత్రమున సమస్త కళ్యాణాలకు నెలవైన అజుడగు పురుషోత్తముడగు ఆ హరిని శరణు పొందుదును.

శన్నోమిత్రశ్శం వరుణః । శన్నోభవత్వర్యమా । శంన ఇంద్రో బృహస్పతిః శన్నోవిష్ణురురుక్రమః । నమోబ్రహ్మణే। నమస్తేవాయో । త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి । ఋతం వదిష్యామి । సత్యం వదిష్యామి। తన్మామవతు తద్వక్తార మవతు । అవతు మాం । అవతు వక్తారం । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

ప్రాణవృత్తికి పగటికి, అభిమానియైన దేవత మిత్రుడు, అపాన వృత్తికి రాత్రికికానీ అభిమానియగు వరణుడు నేత్రములందు ఆదిత్యునియందును, అభిమానియగు అర్యముడు, బలాదిష్ఠాన దేవతయగు ఇంద్రుడు, వాక్కునందు బుద్దియందును అభిమానియైన, సర్వవ్యాపకుడు విస్తీర్ణక్రముడు, పాదములకు అభిమానియైన విష్ణువూ, ఇట్టీ శరీరమందలి దేవతలు మాకు సుఖమునిచ్చెదరుగాక, విద్యాశ్రవణ ధారణలు, అప్రతిహతములుగా జరుగుటకును, బ్రహ్మను తెలియగోరువానిచే నమస్కార క్రియలు చేయదగినవి, క్రియలు, క్రియాఫలములు, వాయ్వధీనములు గాన ఓవాయూ! నీవే బ్రహ్మవు, నీ కొఱకు నమస్కారము. నీవుసర్వాత్మడవు బాహ్యాభ్యంతరుడవు, ఓ వాయుదేవా నాచే ఋతసత్యస్వరూపునిగా స్తుతింపబడి శిష్యాచార్యుల మైన మమ్ము విద్యాసంయోజన వక్తృత్వములతో సంరక్షింపుము.

**సహనావవతు। సహనౌ భునక్తు। సహవీర్యం కరవావహై। తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై ॥ ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః**

శిష్యాచార్యులను మమ్ములను సహరక్షించుగాక, కూడా భుజించుదుముగాక, కలిసియే విద్యా నిమిత్త సామర్థ్యము కలిగియుందుముగాక, విద్యాఫలము కలిసియే అనుభవించెదముగాక, మేము చదివిన చదువు శిష్యునికి ఆచార్యునికి నీ ప్రమాద కృతమైనవిద్వేషమును పుట్టింపకుండునుగాక, ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపోపశమార్థమై శాన్తిపదము 3 మార్లు ఉచ్చరింపబడినది.

**యశ్ఛన్దసామృషభోవిశ్వరూపః ॥ ఛన్దోభ్యోధ్యమృతాత్ సంబభూవ సమేంద్రోమేధయా స్పృణోతు । అమృతస్య దేవధారణో భూయాసం శరీరంమే విచర్షణం । జిహ్వామేమధుమత్తమా । కర్ణాభ్యాంభూరివి శ్రువం । బ్రహ్మణః కోశోసి మేధయాపిహితః । శ్రుతం మేగోపాయ ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః**

ఇది ఓంకార స్తుతి. మేధాశ్రీకాముకులకు తత్ప్రాప్తి సాధనమునకై జపహోమములు ఇందు చెప్పబడినవి. ఓం కారమా నీవే ఛందస్సులలో ఋషభము వంటిదానవు. లోక, వేద, దేవ వ్యాహృతులలో సారిష్ఠమైనదేది. అని ప్రజాపతి ఆలోచించుచుండగా నీవొక్కదానివే అన్నిటికంటే గొప్పదానవని ఆయనకు తోచినది - కాన నీవు నన్ను జ్ఞాపక శక్తితో ఆనందపెట్టుము. జ్ఞాపకశక్తితో బ్రహ్మజ్ఞానము, దానికి యోగ్యమగు శరీరము ధరించిన వాడనగుదును గాక నా జిహ్వ మధుర భాషిణియగునుగాక! కర్ణములతో బహు శ్రుతుడనగుదునుగాక! ఓ ఓంకారమా కత్తికి ఒరవలె బ్రహ్మప్రాప్తికి సాధనమౌదువుగాక! నీవు సామాన్య ప్రజ్ఞలకు అందనిదానివి. నేను విన్న ఆత్మజ్ఞానము, గుర్తు ఉండునట్లు చేసి సంరక్షింపుము.

**అహం వృక్షస్య రేరివా । కీర్తిః పృష్ఠం గిరేరివ । ఊర్ధ్వ పవిత్రో వాజి నీవ స్వమృతమస్మి । ద్రవిణగ్ం సవర్చసం । సుమేధా అమృతోక్షితః । ఇతి త్రిశంకోర్వేదానువచనమ్ । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ।**

నేను సంసార వృక్షోచ్ఛేదమునకు ప్రేరకుడను ఈ ఆత్మ విద్యచే నాకుగల కీర్తిగిరి, శిఖరమునకు వలె ఉన్నతమైనదగు గాక పరబ్రహ్మ పవిత్రముగా గలవాడను, సూర్యుని యందెట్లు ఆత్మతత్త్వము ప్రసిద్ధమో, అట్లే శోభనమై విశుద్ధమై ఆత్మతత్త్వ ప్రకాశము కల్గినట్టి ధనమును నేనగుచున్నాను. సుమేధసుడను అమరణ ధర్మము అమృతతత్త్వముతో సిక్తుడనగుదును గాక, అని త్రిశంకుడను ఋషి తన కృత కృత్యతను తెల్పువాక్యమిది. తైత్తిరీయము.

**పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణము దచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥**

అదః=అది పరబ్రహ్మము, పూర్ణమ్=అనన్తము, ఇదం=ఈ విశ్వమూ పూర్ణం=అనన్తము, పూర్ణాత్ ఈ అనంతమునుండి, పూర్ణం=అనన్తము, ఉదచ్యతే=వ్యక్తమగుచున్నది. పూర్ణస్య =అనన్తముయొక్క, పూర్ణం=అనంతతను, ఆదాయ=స్వీకరించి అనగా కలిపి తీసి వేసిననూ పూర్ణమేవ=నిండైన సున్నయే అవశిష్యతే=మిగులును.

అనగా అనంతమగు బ్రహ్మమునుండి బ్రహ్మాండములెన్ని తీసినవేసి ఎన్ని కలిపినను, ఆ బ్రహ్మమొక్కటే అనంతముగానే ఉండును అని భావము. అన్ని సంఖ్యలకు సంకేతాలున్నవి. అనంతానికి సంకేతము ఏమిటి? అని భాస్కరాచార్యులు ఒకటిని లవముగానూ, పూజ్యము హారముగాను, గ్రహించి ఒక భిన్నము చూపితే అది అననతమునకు సంకేతము. అని విశదీకరించినారు. బృహదారణ్యకము.

**ఆప్యాయన్తుమమాంగాని। వాక్ప్రాణశ్చక్షుశ్శ్రోత్రమథోబల మింద్రియాణిచ సర్వాణి । సర్వం బ్రహ్మౌపనిషదం । మాహం బ్రహ్మనిరాకుర్యామ్। మా మా బ్రహ్మ నిరాకరోత్ । అనిరాకరణ మస్త్వ నిరాకరణం మే అస్తు । తదాత్మని ర తేఉపనిషత్సుధర్మాః । తేమయిసన్తు తేమయిసన్తు । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ।**

నా ఇంద్రియములు, దేహ బలము, సర్వము పరబ్రహ్మమే ఔపనిషదమగు ఆ పరబ్రహ్మను నేను నిరాకరింపకుందునుగాక, నన్ను ఆ బ్రహ్మము విడువ కుండునుగాక, బ్రహ్మపై ఏ ఉపనిషత్సుధర్మములు కలవో అవన్నియూ నా యందుండుగాక! తలవకారము ॥

**వాఙ్మే మనసి ప్రతిష్ఠితా మనోమే వాచి ప్రతిష్ఠితమ్ । ఆవిరావీన్మ ఏధి । వేదస్య మ ఆణీస్థః । శ్రుతం మే మా ప్రహాసీః । అనేనాధీతేన । అహోరాత్రాన్ సందధామి । ఋతం వదిష్యామి । సత్యం వదిష్యామి । తన్మామవతు । తద్వక్తారమవతు । అవతుమాం । అవతువక్తారం । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః**

తత్త్వవిద్యా ప్రతిపాదక గ్రంథ పాఠమున ప్రవృత్తమైన నా వాక్కు ఎల్లప్పుడు మనస్సున ప్రతిష్ఠితమగునుగాక! మనస్సు ఏ శబ్ద జాతము చెప్పుటకు ఇష్టపడునో దానినే చదువునుగాక! ఇట్లు నా మనస్సు వాక్కు ప్రసన్నములగుగాక! మనస్సు సావధానము కాకున్న అసంగతమైనవాక్కులు వచ్చును. పాటవము లేకున్న గద్గదమైన వాక్కుతో వివక్షితార్థము చెప్పబడదు. కాన ఓ వాఙ్మనస్సులారా బ్రహ్మవిద్యా ప్రకాశనార్థమానుకూల్యము నాయందు మీకుకల్గుగాక! మీరిద్దరు బ్రహ్మవిద్యా ప్రతిపాదకులైనాయందుందురుగాక! నాకు బ్రహ్మవిద్య మరపు రాకుండుగాక! బ్రహ్మవిద్యా గ్రంథము రాత్రింబవళ్లు నా యందను సంధానించుకొందును గాక! పరమార్థమగు పరబ్రహ్మవస్తువును మనోవాక్కులతో చెప్పుదును. ఇట్లు బ్రహ్మము నన్ను వక్తను కాపాడునుగాక ॥కేనోపనిషత్॥

**భద్రం కర్ణేభి శ్శృణుయామదేవాః। భద్రం పశ్యేమాక్ష భిర్యజత్రాః స్థిరైరంగైస్తుష్టు వాగ్ంసస్తనూభిః। వ్యశేమదేవహితం యదాయుః॥ స్వస్తిన ఇంద్రో వృద్ధ శ్రవాః। స్వస్తినః పూషా విశ్వవేదాః। స్వస్తినస్తార్ క్ష్యోఅరిష్టనేమిః। స్వస్తినోబృహస్పతిర్దధాతు**

**ఓంశాంతిశ్శాంతిశ్శాంతిః**

ఓ దేవతలారా కల్యాణరూపమగు శ్రుతి స్మృత్యర్థము కర్ణములతో విందుము శ్రవణ శక్తిచే యాగక్షములమై ఆ పరబ్రహ్మమును అన్తర్ముఖములగు ఇంద్రియాలతో కనుగొందుము. అవికలమైన ఇంద్రియాలతో స్తుత్యాదుల నాదరించి ఆయువును పొందెదము. ఇంద్రుడు పూష, గరుత్మంతుడు, బృహస్పతి మాకు క్షేమము నిచ్చెదరుగాక

**భద్రంనో అపి వాదయమనః** ఋగ్వేదోపనిషత్

ఓ మనస్సా బ్రహ్మ విద్యను పొందుటకు మా కెప్పుడు భద్రమునే పల్కుము.

**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యోవైవేదాగ్ంశ్చ ప్రహిణోతితస్మై తగ్ంహదేవమాత్మ బుద్ధి ప్రకాశం ముముక్షుర్వై శరణ మహంప్రపద్యే**

ఎవడు బ్రహ్మను ముందుగా సృషించెనో ఎవడా వేదములను ఆచతుర్ముఖుని కొఱకు ఇచ్చెనో అట్టి ఆత్మ బుద్ధి ప్రకాశకమగు పరబ్రహ్మను ముముక్షువునై శరణు పొందెదను.

**ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ ప్రవర్తకేభ్యో వంశ ఋషిభ్యో మునిభ్యో గురుభ్యః। సర్వోప ప్లవరహితః ప్రజ్ఞాన ఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాహ మస్మి బ్రహ్మైవాహమస్మి బ్రహ్మైవాహమస్మి అధీహినోభగవః**

బ్రహ్మవిద్యా సంప్రదాయ ప్రవర్తకులగు మునులగు గురువులకు నమస్కారము, నేను సర్వోపద్రవ రహితుడను, అతీంద్రియ శక్తియుతమగు ప్రజ్ఞాన ఘనమగు బ్రహ్మను నేనే అగుచున్నాను. స్వామీ మమ్ము చదివింపుము.

**ఆదౌ స్వరాజంగురుమద్వితీయ మభేదవిజ్ఞాన ఘనం మహేశం। సదాశివం. సర్వగమైకభావం మహేశ్వరం సంతత మాదిరుద్రం నారాయణం పద్మ భువం వశిష్ఠం శక్తించ తత్పుత్రపరాశరంచ వ్యాసంశుకం గౌడపదం మహాన్తం గోవింద యోగీంద్రమథాస్యశిష్యం శ్రీశంకరాచార్య మథాస్య పద్మ పాదంచ హస్తామల కంచశిష్యంతం తోటకం వార్తికకార మన్యానస్మ ద్గురూన్సన్తత మానతోస్మి.**

శ్రుతి స్మృతి పురాణానా మాలయం కరుణాలయం
నమామి భగవత్పాదశంకరంలోక శంకరమ్ ॥
శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం
సూత్రభాష్య కృతౌ వందే భగవంతౌ పునః పునః ॥
సదాశివ సమారంభాం వ్యాస శంకర మధ్యమాం
అస్మదాచార్య పర్యన్తాం వందే గురుమపరమ్పరామ్ ॥

గురుపరంపరకు నమస్కారము

దక్షిణామూర్త్యష్టకమ్ సాష్టాఙ్గదణ్డ ప్రణామ పురస్సరమ్

మౌనవ్యాఖ్యాప్రకటిత పరబ్రహ్మతత్త్వం యువానం
వర్షిష్ఠాన్తేవసదృషి గణైరావృతం బ్రహ్మనిష్ఠైః
ఆచార్యేంద్రంకర కలిత చిన్ముద్ర మానంద మూర్తిం
స్వాత్మారామం ముదిత వదనం దక్షిణామూర్తిమీడే ॥

విశ్వందర్పణేత్యాది చైశ్వర్యమవ్యాహతాన్తం

అంగుష్ఠతర్జనీయోగ ముద్రా వ్యాజేన సేవినాం
శ్రుత్యర్థం బ్రహ్మజీవైక్యందర్శయన్నోవతాచ్ఛివః ॥
సమం సర్వేషు భూతేషుతిష్ఠన్తం పరమేశ్వరం
మన్నాథంపరమాత్మానం ప్రణతోస్మి సదాశివమ్ ॥

తర్జని బొటనవేలుతో కలిపిన చిన్ముద్రతో బ్రహ్మజీవైక్యమును చూపించు సదాశివునికి నేను ప్రణతుడను - అనధ్యయనమునకు ముందు చదువవలసినవి.

ఓంకారశ్చాథ శబశ్చద్వావేతౌ బ్రహ్మణః పురా
కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికావుభౌ
అతిక కల్యాణ రూపత్వాన్నిత్యకల్యాణసంశ్రయాత్
స్మర్తౄణాం వరదత్వాచ్చ బ్రహ్మ తన్మంగళం పరం
అశుభాని నిరాచష్టే తనోతిశుభసన్తతిం
స్మృతి మాత్రేణయః పుంసాం బ్రహ్మ తన్మంగళం పరమ్ ॥

ఓంకారము, అథశబ్దమురెండు బ్రహ్మ కంఠమునుండి మొట్టమొదట వెడలినవి కాన మిక్కిలి మంగళ కరములు అతికళ్యాణ రూపము, నిత్యకళ్యాణ సంశ్రయము, స్మరించువారికి వరదము అగు పరబ్రహ్మము మంగళకరము. స్మరణ మాత్రముననే అశుభములు తొలగించి శుభసన్తతిని విస్తరించు ఆ పరబ్రహ్మము మిగుల మంగళకరము అగుగాక!

# విష్ణుదత్తకృతాష్టోత్తర శతనామావళిః

1. ఓం దత్తాత్రేయాయ నమః
2. ఓం హరయే నమః
3. ఓం కృష్ణాయ నమః
4. ఓం ఉన్మాదాయ నమః
5. ఓం ఆనందదాయకాయ నమః
6. ఓం దేవాయ నమః
7. ఓం మునిబాలాయ నమః
8. ఓందిగంబరాయ నమః
9. ఓం పిశాచరూపిణే నమః
10. ఓం విష్ణవే నమః
11. ఓం జ్ఞానసాగరాయనమః
12. ఓం యోగినే నమః
13. ఓం భోగినే నమః
14. ఓం నగ్నాయ నమః
15. ఓం అనసూయాత్మజాయ నమః
16. ఓం కవయే నమః
17. ఓం భోగమోక్ష ప్రదాయ నమః
18. ఓం వంద్యాయ నమః
19. ఓం సర్వదేవస్వరూపిణే నమః
20. ఓం ఉరుక్రమాయ నమః
21. ఓం విలక్షణాయ నమః
22. ఓం పరమానందవిగ్రహాయ నమః
23. ఓం వరదాయ నమః
24. ఓం దేవదేవేశాయ నమః
25. ఓం కార్తవీర్యవరప్రదాయ నమః
26. ఓం నానారూపధరాయ నమః
27. ఓం హృద్యాయ నమః
28. ఓం గురవేనమః
29. ఓం భక్తచింతామణయే నమః
30. విశ్వవంద్యపదాంభోజాయ నమః
31. ఓం యోగిహృత్పద్మవాసినే నమః
32. ఓం ప్రణతార్తిహరాయ నమః
33. ఓం గూఢాయ నమః
34. ఓం కుత్సితాచారచేష్టాయ నమః
35. ఓం మితాచారాయ నమః
36. ఓం మితాహారాయ నమః
37. ఓం భక్ష్యాభక్ష్యవివర్జితాయ నమః
38. ఓం ప్రమాణాయ నమః
39. ఓం ప్రాణనిలయాయ నమః
40. ఓం సర్వాధారాయ నమః
41. ఓం సిద్ధసాధ్యసంసేవ్యాయ నమః
42. ఓం కపిలాయ నమః
43. ఓం కృష్ణపింగలాయ నమః
44. ఓం విపర్యయాయ నమః
45. ఓం వేదవిదే నమః
46. ఓం వేదవేద్యాయ నమః
47. ఓం వియత్సమాయ నమః
48. ఓం పరాశక్తిసదాశ్లిష్టాయ నమః
49. ఓం రాజ్యరాజ్యపదాయ నమః
50. ఓం శివాయ నమః
51. ఓం శుభదాయ నమః
52. ఓం సుందరగ్రీవాయ నమః

53. ఓం సుశీలాయ నమః
54. ఓం శాంతవిగ్రహాయ నమః
55. ఓం యోగినే నమః
56. ఓం రామయూఅస్పృష్టాయ నమః
57. ఓం రామారామాయ నమః
58. ఓం రమాప్రియాయ నమః
59. ఓం మహాప్రియాయ నమః
60. ఓం శరణ్యాయ నమః
61. ఓం భక్తవత్సలాయ నమః
62. ఓం వీరాయ నమః
63. ఓం వరేణ్యాయ నమః
64. ఓం ఋషభాయ నమః
65. ఓం వృషాచారాయ నమః
66. ఓం వృషప్రియాయ నమః
67. ఓం ఆలిప్తాయ నమః
68. ఓం అనఘాయ నమః
69. ఓం మేధ్యాయ నమః
70. ఓం అనాదయే నమః
71. ఓం అగుణాయ నమః
72. ఓం పరాయ నమః
73. ఓం అనేకాయ నమః
74. ఓం ఏకాయ నమః
75. ఓం ఈశానాయ నమః
76. ఓం అనంతాయ నమః
77. ఓం అనికేతనాయ నమః
78. ఓం అధ్యక్షాయ నమః
79. ఓం అసురారాతయేనమః
80. ఓం శమాయ నమః
81. ఓం శాంతాయ నమః
82. ఓం సనాతనాయ నమః
83. ఓం గుహ్యాయ నమః
84. ఓం గభీరాయ నమః
85. ఓం గహనాయ నమః
86. ఓం గుణజ్ఞాయ నమః
87. ఓం గహ్వరప్రియాయ నమః
88. ఓం శ్రీదాయ నమః
89. ఓం శ్రీశాయ నమః
90. ఓం శ్రీనివాసాయ నమః
91. ఓం శ్రీవత్సాంకాయ నమః
92. ఓం పరాయణాయ నమః
93. ఓం జపతే నమః
94. ఓం జపతాంవంద్యాయ నమః
95. ఓం జయంతాయ నమః
96. ఓం విజయప్రదాయ నమః
97. ఓం జీవనాయ నమః
98. ఓం జగతస్సేతవే నమః
99. ఓం జానానాయ నమః
100. ఓం జాతవేదసే నమః
101. ఓం యజ్ఞాయ నమః
102. ఓం ఈజ్యాయ నమః
103. ఓం యజ్ఞభుజే నమః
104. ఓం యజ్ఞేశాయ నమః
105. ఓం యాజకాయ నమః
106. ఓం యజుషే నమః
107. ఓం యష్ట్రే నమః
108. ఓం ఫలదాయ నమః
109. ఓం శ్రీదత్తాత్రేయాయనమః

## వేదధర్మకృత దత్తాత్రేయాష్టోత్తర నామావళిః

వేదధర్మోవాచ II

1. ఓం శ్రీదత్తాయ నమః.
2. ఓం దేవదత్తాయనమః.
3. ఓం బ్రహ్మదత్తాయనమః.
4. ఓం విష్ణుదత్తాయనమః
5. ఓం శివదత్తాయనమః
6. ఓం అత్రిదత్తాయ నమః.
7. ఓం ఆత్రేయాయ నమః.
8. ఓం అత్రివరదాయ నమః
9. ఓం అనసూయాయనమః
10. ఓం అనసూయాసూనవే నమః
11. ఓం అవధూతాయ నమః
12. ఓం ధర్మాయ నమః
13. ఓం ధర్మపరాయణాయ నమః
14. ఓం ధర్మపతయే నమః
15. ఓం సిద్ధాయ నమః.
16. ఓం సిద్ధిదాయననమః
17. ఓం సిద్ధిసేవితాయనమః.
18. ఓంసిద్ధిసేవితాయనమః
19. ఓం గురవే నమః
20. ఓం గురుగమ్యాయనమః
21. ఓం గురోర్గురుతరాయ నమః
22. ఓం గరిష్ఠాయ నమః
23. ఓం వరిష్ఠాయ నమః
24. ఓం మహిష్ఠాయ నమః.
25. ఓం మహాత్మనే నమః.
26. ఓం యోగాయనమః.
27. ఓం యోగ గమ్యాయనమః
28. ఓం యోగాదేశకరాయనమః
29. ఓం యోగపతయేనమః
30. ఓం యోగీశాయ నమః
31. ఓం యోగాధీశాయనమః
32. ఓంయోగపరాయణాయనమః
33. ఓం యోగిధ్యేయాంఘ్రి పంకజాయనమః.
34. ఓం దిగంబరాయనమః.
35. ఓం దివ్యాంబరాయనమః.
36. ఓం పీతాంబరాయనమః
37. ఓం శ్వేతాంబరాయనమః.
38. ఓం చిత్రాంబరాయనమః
39. ఓంబాలాయ నమః
40. ఓం బాలవీర్యాయనమః
41. ఓం కుమారాయనమః
42. ఓం కిశోరాయనమః
43. ఓం కందర్పమోహనాయ నమః
44. ఓం అర్ధాంగాలింగితాంగాయ నమః.
45. ఓం సురాగాయ నమః
46. ఓం విరాగాయ నమః
47. ఓం వీతరాగాయనమః
48. ఓం అమృతవర్షిణేనమః
49. ఓం ఉగ్రాయ నమః
50. ఓం అనుగ్రరూపాయ నమః
51. ఓం స్థవిరాయ నమః
52. ఓం స్థవీయసే నమః
53. ఓం శాంతాయ నమః

54. ఓం అఘోరాయ నమః
55. ఓం మూఢాయ నమః
56. ఓం ఉర్ధ్వరేతసేనమః
57. ఓం ఏకవక్త్రాయనమః.
58. ఓం అనేకవవక్త్రాయనమః
59. ఓం ద్వినేత్రాయనమః
60. ఓం త్రినేత్రాయనమః
61. ఓం ద్విభుజాయనమః
62. ఓంషడ్భుజాయనమః
63. ఓం అక్షమాలినే నమః
64. ఓం కమండలుధారిణే నమః
65. ఓం శూలినే నమః
66. ఓం డమరుధారిణేనమః
67. ఓం శంఖినే నమః.
68. ఓం గదినే నమః.
69. ఓం మునయే నమః.
70. ఓం మౌలినే నమః.
71. ఓం విరూపాయ నమః
72. ఓం స్వరూపాయనమః
73. ఓం సహస్రశిరసే నమః
74. ఓం సహస్రాక్షాయ నమః
75. ఓం సహస్ర బాహవే నమః.
76. ఓం సహస్రాయుధాయ నమః
77. ఓం సహస్రపాదాయనమః.
78. ఓం సహస్రపద్మార్చితాయ నమః
79. ఓం పద్మహస్తాయ నమః
80. ఓం పద్మపాదాయ నమః
81. ఓం పద్మనాభాయనమః
82. ఓం ఓం పద్మమాలినే నమః
83. ఓం పద్మగర్భారుణాక్షాయ నమః
84. ఓం పద్మకింజల్కవర్చసే నమః
85. ఓం జ్ఞానినే నమః
86. జ్ఞానగమ్యాయ నమః
87. ఓం జ్ఞానవిజ్ఞానమూర్తయేనమః
88. ఓం ధ్యానినేనమః.
89. ఓం ధ్యాననిష్ఠాయనమః
90. ఓం ధ్యానస్తిమితమూర్తయేనమః.
91. ఓం ధూళిధూసరితాంగాయ నమః
92. ఓం చందనలిప్తమూర్తయే నమః
93. ఓం భస్మోద్ధూలిత దేహాయనమః
94. ఓం దివ్యగంధానులేపినే నమః
95. ఓం ప్రసన్నాయ నమః
96. ఓం ప్రమత్తాయనమః
97. ప్రకృష్టార్థప్రదాయనమః
98. ఓం అష్టైశ్వర్యప్రదానాయనమః
99. ఓం వరదాయనమః
100. వరీయసే నమః
101. ఓం బ్రహ్మణేనమః
102. ఓం బ్రహ్మరూపాయనమః
103. ఓం విష్ణవేనమః
104. ఓం విశ్వరూపిణేనమః
105. ఓం శంకరాయనమః
106. ఓం ఆత్మనేనమః
107. ఓం అన్తరాత్మనేనమః
108. పరమాత్మనేనమః
109. ఓం దత్తాత్రేయాయనమోనమః

# శ్రీవిద్య-పంచదశి

సాంగోపాంగవేదపుంభావ సరస్వతీ,
బ్రహ్మశ్రీ యనమండ్ర వేణుగోపాలశాస్త్రీ

సాంగోపాంగవేదపుంభావ సరస్వతీ,
బ్రహ్మశ్రీ యనమండ్ర వేణుగోపాలశాస్త్రీ

శ్లో॥ హ్రీంకార పంజర శుకీం ఉపనిషదుద్యాన కేళి కల కంఠీమ్ ।
ఆగమ విపినమయూరీం ఆర్యాం అన్తర్విభావయేద్గౌరీమ్ ॥

మం॥ విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోహస్త ఉత విశ్వతస్పాత్ ।
సంబాహుభ్యాం ధమతి సంపతత్రై ర్ద్యావాభూమీ జనయన్దేవ ఏకః ॥

అనన్తశక్తిసమ్పన్నుడగు పరమాత్మ ఇచ్ఛాశక్తితో అనేక కోటి అండపిండ బ్రహ్మాండములను సృష్టించి, వాటియందు తాను అతి సూక్ష్మరూపుడై ప్రవేశించి, జ్ఞానశక్తితో మనుగడ సాగించుచు క్రియాశక్తితో జగద్వ్యాపారమును కొనసాగించుచు క్రీడించుచున్నాడు. ఇవ్విధముగా ఎప్పడినుండి? ఎందుకు? చేయుచునున్నాడో తన ఉనికిని తెలుపువేదములకే సమాధానము దొరకకున్నది. ఆ పరమాత్మకు ఇయత్త లేకపోయినను దేశకాలములతో పరిచ్ఛిన్నమైన అండపిండ బ్రహ్మాండముల దృష్ట్యా విశ్వవ్యాప్తమైన ఆత్మశక్తిని ఏకపాద్విభూతియని, బ్రహ్మాణ్డ బిలమునకు ఆవలగా గాఢాంధకారము తరువాత స్వయం ప్రకాశమై సచ్చిదానందమై ప్రణవ స్వరూపమై అలరారుచున్న ఆత్మశక్తిని త్రిపాద్విభూతియని వేదము ప్రతిపాదించినది. "ఆత్మను పురుషుని గను, విభూతిని శక్తి గను" గ్రహించతగును. విశ్వవ్యాప్తమైన "మహిమా" అనబడే ఏకపాద్విభూతి అవాస్తవమైనది. దీనికంటె గొప్పదై సర్వమును ప్రకాశింపజేయుచు నిత్యసత్యమైన త్రిపాద్విభూతి అసలు తెలియదగినది. అదియే సమ్యక్ జ్ఞానము. బ్రహ్మాండమువలె పరిచ్ఛిన్నమైనది కాదు కనుక అది యనన్తము. ఈ విషయములను తెలుపు శ్రుతి యిలాగున్నది. "ఏతావానస్య మహిమాఽతో జ్యాయాంశ్చ పూరుషః। పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" అని. చతుర్దశ భువనాత్మకమై విశ్వాపర పర్యాయమైన యీ జగత్తు చిత్ - జడ రూపమై యున్నది. అనగా భోక్తృ భోగ్య సంబంధము కలిగియున్నది. జడము ఆనందమును కలిగించునది, చిత్ ఆనందించునది. పరమాత్మ యొక్క "మహిమా" అనబడే యేక పాద్విభూతి అనశనమైన జడమునందు, సాశనమైన చిత్తుయందును ఏకాకారముగా వ్యాపించి యున్నది. ఇది చిత్ప్రతిబింబితమైన దృశ్యము. దృక్కుమాత్రము త్రిపాద్వి భూతియై అమృతమై స్వయంప్రకాశమై నిత్యతృప్తమైయున్నది. చిత్తుస్వతః ఆనందము. జడము ఆనందముకలిగించుచున్నదను తృప్తియే ఆభాసిక సుఖము. అప్పుడు తాను చిదాభాసుడు. "చిచ్ఛక్తిః చేతనారూపా జడశక్తిర్జ డాత్మికా" అని గుణనిక. దీనిని బట్టి అవాస్తవమైన జగత్తులో

తానను భవించుచున్నది ఆ భాసికసుఖమే అని తెలియనగును. చేతనా అనగా శక్తి. చిల్ అనగా పురుషుడు. "చంద్ర చంద్రికలవలె, శబ్దార్థములవలె చేతనా చిత్తులు ఒకటే గాని రెండు కాదు. పురుషుడు అన్తర్బహిర్వ్యాప్తుడు. దేనిలోపల దేని వెలుపల అని ఆకాంక్షకలుగగా ఉపాధిపరిచ్ఛిన్నము అగుచున్నది. అదియే భిన్నత్వమును కలిగించుచున్నది. భిన్నత్వము ఉపాధికే గాని ఉపహితమైన చిత్తునకు కాదు. ఉభయాదులు భిన్నము కనుక అభయమైన చిత్ప్రతి బింబమునకు భయభ్రాంతులు కలిగించుచున్నవి. చైతన్యము చేతనాజన్యము. సముద్రము నుండి యేర్పడిన అలలువలె చేతనాశక్తి మహిమచే బుద్ధ్యాది ప్రపంచము విస్తృతమగుచున్నది. చేతనాశక్తి పిపీలికాది బ్రహ్మపర్యన్తము సమస్త జీవరాశియందు లాస్యము చేయుచున్నదై మమతా హంకారములతో జీవజాతమును సంసారచక్రమున పరిభ్రమింప చేయు చున్నది. పరమాత్మయొక్క త్రిపాద్విభూతియే "సాదాఖ్య చిత్కళ" దానినుండి యేర్పడిన బ్రహ్మాండములు మహాకాల ఘటితములు. ఆ బ్రహ్మాండముల యందు బ్రహ్మాది పిపీలికా పర్యన్తము అండాండములు కాలఘటితములు. "అనేక కోటి బ్రహ్మాణ్డజననీ దివ్యవిగ్రహా" అని గుణనిక. "పిండ బ్రహ్మాండయోరైక్యం లింగసూత్రాత్మనోస్తథా । స్వాపావ్యాకృతయోశ్చైవ క్షేత్రజ్ఞపరమాత్మనోః" ॥ అను ఆగమ ప్రమాణముననుసరించి సమ్యక్ జ్ఞాన సిద్ధి నొందవలెను. దానికి యోగమే సాధనము. ఆగమములు అనేక విధములగుటంజేసి దురవగాహంబులైన చర్యాజ్ఞాన క్రియా యోగము చేతనే తత్త్వావబోధసులభమగుటంజేసి వేదత్రయమందు అనేకమంత్రములు ప్రమాణ భూతములున్నను. "బహ్వృచ" మంత్రప్రమాణముతో హయగ్రీవోక్త విధానముగా - సకల వేద సాధారణమైన, సకల వేద మంత్ర బ్రాహ్మణోపని షత్సారభూతమైన సచ్చిదానంద పరబ్రహ్మ పరప్రకాశ సాక్షాత్కారిణియగు బ్రహ్మ శ్రీ విద్యను సకల పురుషార్థ సాధనమగుట వలన ప్రతివర్ణమున తత్త్వరహస్యార్థము అతి సంక్షిప్తముగా ఈ వ్యాసమున విచారింపబడుచున్నది.

"క ఏ ఈ ల హ్రీం । హసకహలహ్రీం । సకల హ్రీం । శ్రీం" ఇది శ్రీ విద్యా మంత్రము. కనదీప్తౌ విత్యాస్మాద్ధాతోః కన్యంతే ప్రకాశ్యంతే శబ్దార్థ జాలానీతి, శబ్దార్థ జాలానికనయతీ=తివా,కనతే=ర్విణ్. తస్యోణాదయోబహుళం ఇతి బహుళగ్రహణాత్ ప్రాప్తస్య ప్రాతిపదికస్య స్వరాదిత్వా దవ్యయత్వం. కాంత్యర్థక వశిధాతోః వర్ణవ్యత్యయేన శివ ఇతి సిద్ధే "ఈ శాన స్సర్వవిద్యానాం" ఇతి శ్రుత్యా క ఇతి వర్ణస్య శివః అధిష్ఠానం. అష్టాకపాలనిర్మితశిరసః అన్తస్తే జోమయస్య విజ్ఞానప్రతిపాదనాత్ సహస్రారం శివస్థానం. ఏ, ఇక్ స్మరణే, ఇజ్ అధ్యయనే ఇతిధాతోర్వాజౌణాదికో, విప్రత్యయః", సార్వధాతు

కార్ధధాతు కయోః'' ఇతిగుణః, “వేరపృక్తస్య” ఇతివకారలోపః. స్మృతిధారణా ప్రజ్ఞాదీనాం శక్తి వాచకత్వాత్ ఏకారస్య శక్తిః అధిష్ఠానం. కఏ “నిపాత ఏకాజనాఙ్” ఇతి నిపాతాత్ ప్రకృతి భావః. ఈయతే స్మర్యతే అధీయతేవా సర్వవిద్యాజాలం సర్వాణి వేదశాస్త్రాణి కలా అనేన అధీయత ఇతివా కచ ఏచకఏ= పునః పునః ప్రకాశమానా బుద్ధి రిత్యర్థః. శిఖాసంకేతిత, సూక్ష్మీకృతాన్తర్విజ్ఞానఘటితా మహాదద్భుతాబుద్ధిః. ఈ వ్యాప్తావిత్యస్మాద్ధాతోః క్విప్, సృష్ట్యర్థం సకల జీవిషు అనంగరూపేణ వ్యాప్యమోహయతి స ఏవకామః మోహం గతే బుద్ధిర్వినశ్యతి. మోహాభావే నిర్మలాబుద్ధిః. తాదృశస్య బుద్ధిమతః మోహిన్యో యువతయః వశ్యా భవన్తి. “నరం వర్షీయాంసం” ఇతి భగవత్పాదవచనం సంగచ్ఛతే. అతఈఃఇఃకామః అధిష్ఠానం నిపాతాత్ప్రకృతి భావః కఏఈ=పునః పునః ప్రకాశమాన బుద్ధివ్యాపనమితి యావత్. అన్తర్దృష్టి రూపత్రికాలజ్ఞానవిహిత. ఏకాగ్రచిత్త సర్వాకార్షణా పరపర్యాయమనసః స్థానం నిటల ముచ్యతే.

ల.లఇతిభూబీజం గంధతన్మాత్రాయాః పృథివ్యాః ఘ్రాణేంద్రియ వర్తిత్వాత్ తస్యనాసాగ్రవర్తి త్వాచ్చ తత్రత్య సుషుమ్నాయాం ఇడాపింగళ యోరన్తర్భావాత్ క్షితిః అధిష్ఠానం. యద్వా లహ్రీం - లహరే త్యత్ర పరోక్షతయా లహ్రీత్యుక్తం “పరోక్షప్రియా ఇవహిదేవాః” ఇతి శ్రుతేః. పునః పునః ప్రకాశమాన బుద్ధివ్యాపనలహరీ క ఏ ఈ లహ్రీ। మీయత ఇతిమా। మాఙ్మానే। తద్యుక్తా వా. జ్ఞాపకానపేక్ష్యం యథాతథా స్వయమేవా వలోకినీత్యర్థః। క ఏఈ లహ్రీమిత్యనేన ధర్మాఖ్య పురుషార్థసాధన బ్రహ్మ వర్చస్సమృద్ధి రుక్తా (పురుషార్థక బుద్ధి సమృద్ధిరుక్తా) తస్మాదేవ వాగ్భవమిత్యుతే. వాక్ప్రవృత్తి జాల నిమిత్తత్వాత్ “ఐం” ఇతి ప్రథమ కూటప్రతీకా. అనేన బ్రాహ్మణై రుపాస్యమానా గాయత్రీ మంత్ర సారఉక్తః “గాయత్రచ్ఛన్దావై బ్రాహ్మణః” ఇతి శ్రుతేః “బ్రాహ్మణోఽస్య ముఖమాసీ” దితిశ్రుత్యా “శ్రీమద్వాగ్భవ కూటైక స్వరూపముఖపంకజా” ఇతి గుణనికా సంగచ్ఛతే. ఆదిమఖండే పంచస్వరాః సప్తవ్యంజనాని. ఆహత్య ద్వాదశాత్మ కత్వం సూర్యస్యవిద్యమానతయా ఉష్ణాత్మకసూర్యఖండమిత్యపి వ్యవహారః - ఇతిప్రథమః ఖండః “శివశ్శక్తిః కామః క్షితిః” ఇతి సౌందర్యలహరీ. “స్వరాదిత్యః” ఇతిశ్రుతేః। హసకహ - హన్యంతే ఆశు ఐహికాముష్మిక తాపత్రయమితిహ। హనహింసాగత్యోః ఇత్యస్మాత్ క్విప్ । అంతలోపఔణాదికః । అనేన ఐహిక శత్రు - రోగాది పంచబాధా నివృత్తిః, దుష్కృత జన్య ఆ ముష్మిక బాధానివృత్తిశ్చోక్తా। “హృద్రోగంమమ సూర్యహరిమాణం చనాశయ” ఇతిశ్రుతేః హకారస్య రవిరధిష్ఠానమ్। దేవ్యాదక్షిణస్తనః సూర్యః. అండాండే పింగళా సూర్యనాడీప్రతీయతే స. సీయన్తే ఉపభుజ్యంతే ధనాద్యష్టభోగా అనేనేతిస ।

ప్రత్యవసానార్థాత్సనోతేర్వా సక్తేర్వావిచ్ ప్రత్యయేకృత్, బాహుళ్యేన లుప్తాంత వర్ణత్వేన గృహీతః అనేన సకల రాజ పరిచ్ఛదజాలముక్తమ్ । స ఇత్యస్య సోమః అధిష్ఠానం స ఏవశీతకిరణః। దేవ్యాః వామస్తనః సోమః, అండాండే ఇడా సోమనాడీ। సోమదేవతాయాః దేవానాంకృతే అమృతత్వేన, మనుష్యాణాం కృతే సర్వకామ ప్రపూరణత్వేనచ ఉపభోగ్యత్వం సోమసూక్తే ప్రతిపాదితమ్. తద్యథా "అర్థినో యన్తి చేదర్థం గచ్ఛానిద్దదుషోరాతిమ్ । వవృజ్యుస్తృష్యతః కామమ్ ॥" (6-5-33)అర్థినోధనాని కామయమానా యన్తిచేత్। యంతిచార్థం ప్రతి। గత్వా చ దదుషోదాతూరాతిం దానం గచ్ఛానీత్ । గచ్ఛంతిచ । గతేషుమధ్యేయంహేసోమ త్వమనుగృహ్ణాసి । స్యతుష్యతో భిక్షమాణస్య కామం వవృజ్యుః। పునః కామానం వర్జయన్తి। తావత్పర్యన్తం పూరయన్తీత్యర్థః। క, కముకాంక్షాయా మితిధాతోః విచ్‌ప్రత్యయః। బాహుళ్యేనలుప్తాంతవర్ణః। కామ్యంతే స్రక్చందనవనితాదిమద విషయభోగాఇతిక । స్మరస్యతద్విషయత్వాత్ జగన్మోహన రూపత్వం బ్రహ్మాండే స్వస్మిన్పిండాండే రోమరాజి ప్రకాశక రూపాసుషుమ్నా-అగ్నినాడీప్రతీయతే । "ఇడాయాంసంచలేచ్చంద్రః పింగళాయాందివాకరః । జ్ఞాతోయోగనిదానజ్ఞః సుషుమ్నాయాం - హుతాశనః" ఇతి శారదాతిలకోక్తిః।

హ్రా- హీయన్తే హాప్యంతే ఇతిహా। ఓహాక్ గతావిత్యస్మాద్ధాతోః " ఆతోనుపసర్గేకః బాహుళకాత్‌లుప్తాంత్యవర్ణః।" జ్ఞానముత్పద్యతేపూర్వం హంసలక్షణమవ్యయం । పుంప్రకృత్యాత్మకౌప్రోక్తౌ బిందుసర్గౌమనీషిభిః । తాభ్యాం క్రమాత్సముద్భూతౌ బిందుసర్గావసానకౌ। హంజీతౌ పుంప్రకృత్యాఖ్యైబిందుసర్గౌమనీషిభిః।అజపాకథితాభ్యాంజీవోయముపతిష్ఠతి" ఇతిశారదా తిలకోక్తదిశా, పూర్వోక్త హకారసకారాధిష్ఠానయోః సూర్యాచంద్రమసోః, బిందుసర్గాత్మనోః, ఇడాపింగళారూపయోః ఉచ్ఛ్వాసనిశ్వాసయోః సమ్మేళనం హృదయే. వృత్యాత్మనోః తయోస్సమ్మేళనే హంసలక్షణంజీవనముత్పద్యత ఇతికృత్వా"హకారస్యహంసః అధిష్ఠానమ్. ఉపద్రవనివృత్తి ధర్మసంచయః కామభోగావాప్తిరితియావత్. ల లా ఆదానే ఇత్యస్మాత్ "ఆతోనుపసర్గేకః" కౌణాదికలన్త్యన్తలోపః ల । ఇంద్రః సర్వదేవేభ్యః కృతేహవిఃదదాతి। అతస్తస్యదేవరాజ ఇతిప్రసిద్ధిః "తదిన్ద్రధనురాత్యజ్యమ్ । అభ్రవర్ణేషు చక్షతే । ఇతిశ్రుతేః. ఃలతత్త్వస్యమణిపూరకాశ్రయత్వాత్, తస్యచనాభిస్థానగతత్వాచ్చ ఇంద్రస్యల ।త్యాగమప్రసిద్ధిః "అధరవిశ్రీతకిరణః; స్మరోహంసశ్చక్రః " ఇతి భగవత్పాదవచనం ంగచ్ఛతే । "నాభ్యాలవాలరోమాళిలతాఫలకుచద్వయీ" ఇతి గుణనికా । యద్వా - ।హ్రీ। తస్య లహతే=అధిక్యం ఈయతే ప్రకాశ్యతే అనేనదిగంతేషు కీర్తిజాలమితి ఈ।

ఈఁదీప్తౌనిత్యస్మాత్ క్విప్, హసకలహ్రీంచ ఈఁచ సవర్ణదీర్ఘ: హసకహలహ్రీయ: తాసాం నిర్మాణం పూర్వవత్ । హసకహలహ్రీం = అనేన అర్థకామ రూప పురుషార్థ నిమిత్తిరుక్తా । తస్మాదేవహికామరాజత్వమ్।" కంఠాధ: కటిపర్యన్త మధ్యకూటస్వరూపిణీ। ఇతి గుణనికా । అనేనక్షత్రియోపాస్యమాన త్రిష్టుప్ఛ్చన్దస్సారఉక్త: । "త్రిష్టుప్ఛ్చన్దావైరాజన్య:" బాహూరాజన్య: కృత:" ఇతి శ్రుతి: అత్రప్రమాణం, స్వకీయాభీష్టసాధ నకర్మజాతవిధాయకత్వాత్ యజుర్వేదస్య అర్థకామయో: క్రియాసాధ్యత్వాత్ యజుర్వేదాత్మకత్వం ద్వితీయఖండస్య । మధ్యమఖండే అష్టవ్యంజనాని, షట్స్వరా: ఆహత్యచతుర్దశభువనాత్మకత్వం ।" వాయుర్వైగౌతమసూత్రం" ఇత్యభియుక్తే: భువోవాయు: । అస్యకూటస్యకామరాజకూటత్వాత్ క్లీం ఇతి బీజాక్షరం ద్వితీయఖండస్య ।ప్రత్యవసానార్థాత్సనోతే ర్వా సర్వేర్వావిచ్ప్రత్యయేకృతే బాహుళ్యేన లుప్తాంత వర్ణత్వేనగృహీత: । సీయన్తే ఉపలభ్యంతే ధనాద్యష్టభోగా అనమేతిస । అనేన పరబ్రహ్మణ: పట్టమహిషీ మహామాయాపరపర్యాయా, మహాసామ్రాజ్ఞీ పరాజ్ఞాయుతే "అయోనిర్యోనినిలయా " ఇతిరహస్యనామప్రమాణకవచసా యోనిస్థానం । యద్వా "గుహాత్రీణినిహితానేఙ్గాయాన్తి" ఇతిశ్రుతిప్రమాణేన పరావాచ కటేరధ: ప్రదేశేచ మూలకందస్థితే: శీక్షావ్యాఖ్యానరూపవాసనేయ పక్షమాశ్రిత్యా పరాప్రతీయతే । " పరాప్రత్యక్చితీరూపా" ఇతి గుణనికోక్తే: సకారస్య పరా అధిష్ఠానమ్ । క కామ్యంతేప్రక్చందనవనితాదిమదనవిషయభోగా ఇతిక । కముకాంక్షాయామితిధాతో: విచ్ప్రత్యయ: బాహుళ్యేనలుప్తాంత్యవర్ణ:। "సమేకామాన్కామకామాయమహ్యమ్ । కామేశ్వరోవైశ్రవణో దదాతు " ఇతిశ్రుతే:"కామసంజీవనౌషధి: ఇతిగుణనికయాచ కకారస్యమార: అధిష్ఠానమ్ । సకారకకారయో: కామకామేశ్వర్యో: అభిన్నత్వాత్ సకయోరభిన్నత్వమ్ తయో: జ్ఞానరూపేణ ఆదానత్వమింద్రస్య అత: లఇతితిమహేన్ద్రశ్చక్ర: అధిష్ఠానం. తస్యచపాదాంగుష్ఠం న్యాసే విహితమ్ । యద్వా-కలాభిరవయవై: శివాదితత్త్వైర్వాసహితాసకలా । కలాభి: చతుష్షష్టికలాభిస్సహితావా। సమ్యక్కలయ తీతిసకలావా । సకల "తదనుచపరామారహరయ: " ఇతిభగవత్పాదవచశ

"హ్రీంబీజవ్యాఖ్యా:-"హృఞ్" హరణే ఇత్యస్మాద్ధాతో: హరతిసర్వమంతకాల ఇతివ్యుత్పత్యా చఇ:" ఇతిఇప్రత్యయ: బాహుళ్యాత్గుణాభావేయణాదేశ: హ్రి: అనేన మహాకాళీప్రతీయతే ఈఁయతేప్రకాశ్యతే సర్వంజగదనయేతి ఈఁ = సృష్టిశక్తి: మహాసరస్వతీ । హ్రీచ ఈఁచ

సవర్ణదీర్ఘః హ్రీ। ఇదిపరమైశ్వర్యే ఇత్యస్మాత్ క్విప్ (నుమాగమః, నస్యమః, వ్యంజనలోపశ్చ.
సర్వేషాం నియంతృత్వేనవర్తత ఇతి ఇమ్ అనేన మహాలక్ష్మీః ప్రతీయతే. హ్రీచ ఇమ్‌చ
హ్రీం. అస్యమహామాయాబీజమితివ్యవహారః
"గిరామాహుర్దేవీం  ద్రుహిణగృహిణీమాగమవిదః
హరేః పత్నీం పద్మాంహరసహచరీమద్రి తనయాం।
తురీయాకాపిత్వం దురధిగమ నిస్సీమమహిమా
మహామాయావిశ్వం భ్రమయసి పరబ్రహ్మమహిషీ ॥ ఇతిశంకరభగవత్పాదవచనం
.అథవా విహరతిసకలప్రపంచరూపేణేతి హ్రీ। విహరణార్థాద్ధరతే ర్ఢ్రిప్రత్యయః ।
హరిరూపేణ విహరణరూపేణ ఇందతే నియంతృత్వేనవర్తత ఇతి హ్రీ। అథవాహ్రా ఇతి
క్విబంతలుప్త తకారః శబ్దప్రపంచ సంస్కృతివాచకః । ఈప్రకాశః । ఇ ఆత్మైక్యగమనమ్ ।
సవర్ణదీర్ఘః । యణాదేశః । హ్రీం సకలప్రపంచ దేహేంద్రియాదికందూరీకృత్య
అనిర్వచనీయప్రకాశరూపాత్మైక్యగమనమిత్యర్థః । హృది పుండరీకమధ్య సుషిరాన్త
ర్దహరాకాశే వర్తమాన మహాప్రకాశాన్తర్గతాతిసూక్ష్మాతిప్రకాశ స్థానోర్ధ్వగత దీపశిఖా ।
"తస్యాన్తేసుషిరం సూక్ష్మ" మిత్యుపక్రమ్య - తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మావ్యవస్థితః "
ఇత్యుపనిషదర్థ ప్రకాశేత్యర్థః। సకలాచసాహ్రీచసకల హ్రీ। ఇషుఇచ్ఛాయామిత్యస్మాత్‌ధాతోః
ఇష్యతే అత్యన్తాభీష్టత్వేనర సర్వైరీశవిష్ణ్వాదిస్తంబపర్యన్తం చేతనవర్గైః కామ్యతఇత ఈః
। ఇష్వాదిభ్యాంక్విప్ వ్యంజనలోపఃశ్రుతిక్విప్। నిరతిశయాన న్ద సత్యానన్దనైరన్తర్యం। ఈః
। హిమవతోహిపాదదేశేషూత్తరేష్వితి శ్రుతేః। తస్యప్రమితిః। లుప్తాకారోమకారోగృహ్యతే
। మితే రపీతేర్వామినోతీహవా " ఇదం సర్వమపీతిశ్చభవతి " ఇతి శ్రుతే : ।
మఇతినాదానుకార శ్శబ్దః । అవ్యయం । ప్రమితిర్నామయథార్థానుభవః । అనేన
పరబ్రహ్మణశ్చిచ్ఛక్తిరుచ్యతే। నాదస్య శుద్ధ చైతన్యస్థూల రూపవత్వాత్ శుద్ధ చైతన్యాత్మక
చిచ్ఛక్తి రున్మనీనాదాదిభ్యోప్యతీతత్వాత్ అవాఙ్మానసగోచరా । మినోతిహి నాద
స్సర్వమాత్మనితాదాత్మ్యేనేతి ఈం । నిరతిశయ సత్యానందానుభవ ప్రకాశక
నాదాత్మక చిచ్ఛక్తి రిత్యర్థః। తత్రఖలుసర్వే ప్రపంచా మీయన్తే సృజ్యన్తే చ। సకల హ్రీం
। రూపం । సకలహ్రీం । అథవా హ్రీచతత్‌ఈంచహ్రీమ్ । సకలంచతత్‌హ్రీమ్ చ
సకలహ్రీమ్ । సకలహృదాకాశ దీపశిఖాన్తర్గతసర్వ తత్వాధిష్ఠాతృనిరతిశయ సత్యానందానుభవ
ప్రకాశక సాదాత్మక చిచ్ఛక్తిః। అనేన మోక్ష సాధన నాదలయ యోగానందానుభవఉక్తః
। తస్మాదేవ శక్తిఖండ ఇత్యుచ్యతే। తత్రప్రతీక శక్తిబీజం "సౌః" ఇతిః" శక్తికూటైకతాపన్న'
కట్యధోభాగధారిణీ" ఇతి గుణనికా। చిత్త వృత్తిసాధనత్వాద్వైశ్యజాత్యుపాస్యమాన

జగతీఛన్దస్సార ఉక్తః।"జగతీచ్ఛన్దావైశ్యః" ఇతి శ్రుతేః। "ఊరూ తదస్యయద్వైశ్య" ఇతివేదప్రమాణం సంగచ్ఛతే । సామవేదస్యగానప్రాధాన్యేన నాదవిలీన చిత్తత్వాదత్రచనాదలయయోగస్య ఉపవర్ణితత్వాచ్చసామవేదాత్మకత్వమ్।తృతీయఖండే షడ్వ్యంజనాని చత్వారః స్వరాః । వహ్నేః దశాంశకలాత్మకత్వప్రతిపాదనాత్. అగ్నేః భూదేవతానాంముఖ్యత్వేన, అగ్నిర్వైదేవానామవమోవిష్ణుఃపరమః" ఇత్యైతరేయశ్రుతేః సర్వదేవానాం ముఖ్యత్వేనచ "భూరిత్యగ్నౌప్రతితిష్ఠతి" ఇతి శ్రుతిప్రమాణవచనాచ్చ తృతీయ ఖండస్య అగ్నిఖండ ఇతివ్యవహారఃఏతాని ఖండత్రయఘటితా నిషట్త్రింశదరాణిషట్త్రింశత్తత్త్వాత్మకాని।"షట్త్రింశత్తత్త్వమయరత్నసోపానపంక్త్యుజ్వల మహాసింహాసనాయనమః" ఇతిదేవీభాగవతోక్త శ్రీమందిరధ్యానోక్తః, "బ్రహ్మవిష్ణుశ్చ ఈశ్వరోరుద్రశ్చసదాశివః" ఇత్యాగమప్రమాణదిశా అనాదిబ్రహ్మణాం బ్రహ్మాదీనాం సూక్ష్మీకృతపంచతన్మాత్రాత్మకానాంమేళనాచ్చ మహత్త్వం సింహాసనస్య।"పంచప్రేతాసనాసీనా పంచ బ్రహ్మ స్వరూపిణీ" ఇతి గుణనికా। ఏతావతా శంకర భగవత్పాదాచార్యైః నిఖిల లోక జనన్యాః నామావయవత్వం ప్రతిపాదితమ్।

"శివశ్శక్తిః కామః క్షితిరథ రవిశ్శీతకిరణ :
స్మరోహంసశ్శక్ర స్తదను చ పరామారహరయ :।
అమీహృల్లేఖాభి స్తిసృభిరవసానేషు ఘటితాః
భజన్తే వర్ణా స్తే తవజనని నామావయవతామ్ ॥" ఇతి

ఖండత్రయస్యవేదత్రయాత్మకత్వాత్, సూర్యసోమానలాత్మకత్వాచ్చ సమష్టిరూపేణ శ్రీత్వం సంపత్స్యతే। తచ్చ "ఋచస్సామానియజూగ్ంషి। సాహిశ్రీరమృతాసతామ్ " ఇతిశ్రుతేః "తత్పదస్య చ శ్రి శ్రయణే - ఇత్యస్మాద్ధాతోః శ్రీపదనిష్పత్తేః, శ్రీవిద్యా ఆత్మవిద్యైవ "ఆత్మవిద్యామహావిద్యాశ్రీవిద్యాకామసేవితా " ఇతి గుణనికా. శ్రీంబీజేన షోడశాక్షరీభవతి. సోడశీవిద్యైవపూర్ణవిద్యా" శ్రీ షోడశాక్షరీవిద్యాత్రికూటాకామకోటికా" ఇతిగుణనికా. అతఃశ్రీమత్త్వం।మహాసింహాసనస్య।తస్యాధిష్ఠాత్రీ శ్రీమత్సింహాసనేశ్వరీ, చిత్కళా, ఆనందకలికాలలితాపరాభట్టారికా సా జ్ఞేయా, ఉపాస్యా, ధ్యేయాచ । హృల్లేఖాత్రయాంతర్గతమ్-ఈకారత్రయం జగత్త్రయం వ్యాహృతిత్రయం శ్రీంకారాష్టగ్సర్తిః ఈకారః జగదతీతంత్రిపాద్విభూత్యాత్మకం సాదాఖ్యచిత్కళాఖ్యంజ్ఞేయం ఏతదర్థ ప్రతిపాదికా ఋగేవం వేదయతి ।"చత్వార ఈం బిభ్రతి క్షేమయంతో దశగర్భం చరసేధాపయన్తే ।త్రిధాతవః పరమా అస్యగావోదివ శ్చరన్తి పరిసద్యోఽన్తాన్ ॥ వినియోగస్య లైంగికత్వాత్వైశ్వదేవసూక్తస్య ఆధ్యాత్మికపరత్వాచ్చ అయంమంత్రః ఆధ్యాత్మికత్వేనాపి

వ్యాఖ్యేయః. తథా ఈంఇత్యవ్యయః, చత్వార ఈం=చత్వారః ఈకారాః, ఏనం జీవాత్మానమాదిత్యం క్షేమయంతః=క్షేమమాత్మన ఇచ్ఛన్తః, బిభ్రతి=ధారయన్తిహవిర్భిః స్తుతిభిశ్చ । కించదశదిశో గర్భం=గర్భవన్మధ్య ఉత్పన్నమేనం । చరసే=చరణాయ, ఉదయాస్తమయవ్యవహారాయవా ధాపయన్తే=గమయన్తి (దశగర్భమిత్యనేనదేశత్వం, చరస ఇత్యనేనకాలత్వంచ, బ్రహ్మాండే ఆదిత్యస్యసూర్యస్య అండాండే, ఆదిత్యస్య జీవస్యసమన్వయః "అసావాదిత్యోబ్రహ్మ" సంధ్యోపాసనామంత్రార్థప్రతీకాత్, త్రిధాతవః=త్రిప్రకారాః సూర్యపక్షే శీతోష్ణవర్షభేదేనత్రివిధా జీవపక్షే మయూఖాః 360, దివః=అన్తరిక్షస్య జీవపక్షేమూలాధారాజ్ఞాన్తర్వర్తినోదేశస్య అన్తరిక్ష ఇతివ్యవహారః, అన్తాక్పరి=పరితః, సద్యః=ఉదయా నంతరమ్=చరన్తి=గచ్ఛన్తి) ఈమంత్రమున మూడు ఈకారములు. సూర్యసోమానలాత్మకముగుత్రిఖండము ఏకపాద్విభూతిగను. చతుర్థఈకారము శ్రీంబీజాన్తర్గతసాదాఖ్య చిచ్ఛక్తియగు త్రిపాద్విభూతిగను తెలియదగును. మొదటిది జగత్సత్యత్వమును రెండవది పారమార్థిక సత్యమును తెలుపునది. "ధాపయన్తే" అనుక్రియగత్యర్థము. "యేయే గత్యర్థాః తేతేజ్ఞానార్థకాః' అను నియమముచే జ్ఞానార్థముగ సమన్వయమగును. జగత్తుమిథ్యకాగా సత్యమని చెప్పుటయుక్తముకాదు గదా? అని విచారించగా జగత్సత్యవిచారణ ఇలాగున్నది. "పచ్చత్యచ్చాభవత్" తత్సత్యమిత్యాచక్షతే । పంచభూతాత్మకమగు జగత్తులో తత్పదార్థములు వాయ్వాకాశములు, త్వం పదార్థములు. పృధివ్యాపస్తేజస్సులు ఆకాశము శబ్దగుణమాత్రముకలది, వాయువు శబ్దస్పర్శలు కలది. తత్పదార్థములు సరూపములు. తేజస్సునుండి రూపము ప్రారంభముకావున. అగ్నియొక్క మూడుగుణములను సత్త్వరజస్తమోగుణములతో గుణించగా తేజమునుండి ఆ4విర్భవించిన నీటికి నాలుగుగుణములు. గుణత్రయము చే గుణించగా. ద్వాదశసూర్యకములు అధిష్ఠానమ్. అద్భ్య పృధివీ॥ పృధివ్యాః పంచగుణత్వాత్ తస్య త్రిత్వే. నాదేన పహషోడశోమాకళాః తస్యాఅధిష్ఠానం బ్రహ్మ "అష్టాత్రింశత్ కళాతను : ఇది,జగత్సత్యస్వరూపం. "సత్యస్యసత్యం" అభీగవతం పారమార్థికసత్యము గుణాతీతము. మొదటి ఈకారము అగ్నిఖండము మూలాధారమణిపూరకము. 108 మయూఖములు

రెండవ ఈకారము సూర్యఖండము. స్వాధిష్ఠాన - అనాహతములు. 116 మయూఖములు మూడవ ఈకారము సోమఖండము విశుదాజ్ఞా చక్రములు. 136 మయూఖములు. వెరసి 3260 మయూఖములు. ప్రకట గాయత్రి 24 అక్షరములు గుప్త గాయత్రి 15 అక్షరములు 24×15=360 ఇవిసంవత్సరప్రతీకలగు అహోరాత్రములు. వీటి ప్రాతిపదికతోనే వేదసమామ్నాయమంతయునడచుచున్నది. "ద్వాదశారం నహితజ్జరాయ" ఇత్యాదిమంత్రములందు స్పష్టముగా ప్రతిపాదింపబడినది. గ్రంధవిస్తరభయముచే పంచదశీమంత్రార్ధము మాత్రము వ్రాసితిని. అదియును "వ్యాసకర్త శ్రీభోగీశ్వరశర్మ తాను వ్రాసిన గ్రంధమునకు అధ్యాయములకు పంచదశియొక్క అక్షరమును ఆదియందుంచినామకరణ చేయుటయు "శ్రీరాఘవనారాయణశాస్త్రిగారు సాక్షాత్తుదేవీస్వరూపులగుటంచూసి. మహోత్కృష్టమైన "శ్రీవిద్యా" ప్రాతిపదికతోనే గ్రంధమారంభింపబడుటచే, హృల్లేఖామంత్రార్ధము తదుపాసనయు, వివరించుట అవసరమనితలంచి, అనఘాదేవిరేణుకాస్వరూపము. పరాశక్తి అవతారమగుటచే, అనేకానేకసంబంధములను పురస్కరించుకొని అనంతమయిన పరాశక్తి అవతారమగుటచే, అనంతమయిన పరాశక్తి తత్త్వమును. సత్యజ్ఞాన, అనంతత్వప్రతిపాదనగా, యావచ్ఛక్తిప్రమాణములను ఉట్టంకించుచు పరాశక్తిప్రేరణతో, వెలువడిన ఈ వ్యాసమును సహృదయులగు విద్వాంసులు పాఠకులు మననము చేయుదురుగాక! ఇందు శ్రుతి స్మృతిప్రమాణములతో వివరణములన్ని పరాశక్తివిగను, ఒక వేళదోషములు ఉన్నచో అని నావిగను. గ్రహించి మన్నించ ప్రార్ధించుచున్నాను.

ఓంతత్సత్

సర్వేజనాః సుఖినోభవన్తు.

# శ్రీదత్తభాగవతాద్వైతము

## Iవ అధ్యాయము

## ఐదంకవీయ పరిచయము

ఇది అద్వైత తత్త్వ ప్రతిపాదనమును ఉద్దేశించిన పరిశోధనవ్యాసము. దీనికి మూలముగా గైకొనిన గ్రంధము శ్రీ దత్త భాగవతము. శాస్త్రానుభవముల సమీకరణములతో మూలాతిశాయిగా ఇందు తత్త్వము ప్రతిపాదింపబడినది. అనగా ఈ గ్రంధరచయిత శాస్త్ర వైదుష్యము అనుభవ సంపత్తి రెండునూ కలవాడని తలచవలెను. శాస్త్రములయందు లోతును ఎఱిగిన పాండిత్యము కలుగవలెనన్న సంప్రదాయ సిద్ధమైన గుర్వనుగ్రహము లభింపవలయును. ఆ అనుభవమన్నది మానసికమే ఆ మనస్సు షోడశతత్త్వ సహకృతమై బహుజన్మ వాసనలతో సంస్కరింపబడి అనుభవయోగ్యతను పొందిననే తప్ప అతీంద్రియమైన ఆధ్యాత్మిక అనుభూతి ప్రతీయమానమగు అవకాశము లభింపదు. కావున ఇంత పరిశీలించిన మీదట ఈ కవి బహుజన్మవాసనలచే సంస్కారము నొందిన మనస్సు కలవాడని ఊహింపవలసి యుండును. ఈ కవి శ్రీ విద్యోపాసకుడై యోగసాధకుడై నిరన్తర కర్మిష్ఠుడై శ్రోత్రియుడై బ్రహ్మనిష్ఠుడై యుండుట తత్సమకాలీనులు ఎరిగిన సత్యము.

**శ్లో॥ ప్రాప్యపుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః**
**శుచీనాం శ్రీమతాంగేహే యోగ భ్రష్టోఽభిజాయతే ॥**
**అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం**
**ఏతద్ధి దుర్లభతరం లోకేజన్మ యదీదృశం ॥**

అను భగవద్గీత వాక్యమును బట్టి శ్రీ శాస్త్రిగారు సమ్పన్న శ్రోత్రియ కుటుంబమున జన్మించినారు. అత్రిమహాముని మూలపురుషుడుగా గల గోత్ర మాత్రేయ గోత్రము. ఈ గోత్ర ప్రవరమందు ఆత్రేయ అర్చనావస శ్రావాస్య అను ముగ్గురి ఋషులపేర్లు కలవు. ప్రకృత గ్రంథమున కథానాయకుడగు దత్తదేవుడు స్వయముగా అత్రికి కుమారుడుగా అనసూయ పాత్తిళ్ళలో పెరిగినాడు.

---

1. భగవద్గీత 6వ అధ్యాయము 41, 42 శ్లోకములు

వైదిక శ్రౌతసంప్రదాయములలో సభలయందు ఆత్రేయ గోత్రసంజాతునకే ప్రధమతాంబూల గౌరవము, ద్వితీయ తాంబూల సత్కారము తృతీయతాంబూల సత్కారము అనంతరమే తదితరులకు అన్నది తద్విదులెరిగిన సత్యము అట్టి మహాగౌరవమునకు పాత్రమైన అత్రిగోత్రమున సుప్రసిద్ధమగు తాడేపల్లి వంశమునందు సరియగు దుర్ముఖి నామ సంవత్సర శ్రావణ బహుళ ద్వితీయామంగళవారం రాత్రి అనగా ఆంగ్ల సంవత్సరము 1896న ఈ కవి జన్మించినాడు. ఈ తాడేపల్లి వారు వెలనాటి వైదికులు. వీరిలో మూలపురుషుడు, రామభట్టారకుడు. ఆ తరువాత సింగభట్లు మొదలైన వంశకర్తలు కలరు. అటు పిమ్మట సుబ్రహ్మణ్యశాస్త్రి అతని కుమారుడు ఋచ్చీశ్వరశాస్త్రి తత్తనయుడు హనుమదవధాని. ఈ హనుమదవధాని ఈ కవికి తాతగారు. ఈ కవి తండ్రిగారి పేరు వేంకటప్పయ్యశాస్త్రిగారు. నిరంతరము శివపంచాక్షరిని శివపూజను శివధ్యానమును, శివారాధనమును ఏమఱకుండిరి. వీరు చదివినది 11 మాసములే. అయినను గురుదేవతా అనుగ్రహమువలన సర్వశాస్త్రములు సమన్వయించినవి. వీరు రామకథామృతమును వాల్మీకి రామాయణమున ఎడనెడ ఆధ్యాత్మిక రామాయణాదులను కూడా అను ప్రసక్తము జేయుచూ గాయత్రీ బీజ సంగతముగా ఇరువది నాలుగువేల గద్యపద్యముతో వెలయించిరి. వీరు నలుబది సంవత్సరములు గుంటూరు మండలమునందలి చందవోలు గ్రామమున పాఠశాలను స్థాపించి వచ్చిన విద్యార్థులకందరకు వసతి భోజన సౌకర్యములు కల్పించి మహాపండితులను చేసిరి. శ్రీ ముళ్ళపూడి నారాయణశాస్త్రిగారు, శ్రీ ప్రతాప హనుమచ్ఛాస్త్రిగారు, శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి మన్నగువారు వారి శిష్యులమని చెప్పికొనుటకు గర్వించు చుండెడివారు. వీరి గురుస్తుతిలోనివి ఈ క్రింది పద్యములు.

**శ్లో॥ అన్న ప్రదానే తనురేవసాక్షీ విద్యా ప్రదానే మన ఏవ సాక్షీ**
**ఋణార్ణవం కేన గురోతరేయం హృదాచత్వత్పాదయుగం వహేయం ॥**

ముళ్ళపూడి నారాయణశాస్త్రి

శాస్త్రిగారి తండ్రి గారొక పర్యాయము గుంటూరు వెడలిరి. గోవింద రాజుల సీతారామయ్య గారి భార్య ఉపాసకురాలు, యోగినియునగు శ్యామలాంబతో తన పుత్రుని గూర్చి ప్రస్తావించి వాని జన్మ రహస్యమును తెలుపగోరిరి. అంత నామెయు ఈ విషయమును ధ్యానించుచుండెను. యోగ నిష్ఠలోనున్న యామె అంతరదృష్టికి సహస్రరవిమండల తేజోవిరాజితుడై దుర్నిరీక్ష్యుడగు నెజ్జని

శ్రీరామ కథామృత కవి కుమార జీవితము.

ేహచ్ఛాయతో ఒప్పెడు నొక మహాపురుషుడు గోచరించెను. అతండేమి ావలయునని యడుగ ఈమెయూ విభ్రాంతయై తేజము సంభావింపలేక ాకేమియూ నక్కరలేదనెను. అంత నా పురుషుడునూ అంతర్హితుడయ్యెను. ాటు తరువాత మరల నిట్లే ధ్యాననిష్ఠలో నుండ నొకదృశ్యము గోచరించెను. ంందు శ్రీ వెంకటప్పయ్య శాస్త్రిగారు కానవచ్చిరి. వారు సూర్యబింబమును ామీపించిరి. ఆయన నోరు తెఱువ నా బింబము తద్వదనమున ప్రవేశించెను. ట్టి దృశ్యమును అంతకుముందు దృశ్యమును ఆ యోగిని శ్రీ వెంకటప్పయ్య ాస్త్రిగారితో చెప్పి ఎవ్వడో ఒక సిద్ధుడు సూర్యమండలాన్తర్వర్తి ప్రారబ్ధవశముననో ారణాంతరముననో నీ కుమారుడై జన్మించియుండ నోపునని యూహించితిననెను.

పిదప నొకపరి తండ్రి గారివలన ఈ వృత్తాంతము విని తానేమో తన న్మమేమో ఇందలి నిగూఢత ఏమో తానెక్కడి వాడో యని పరిపరివిధముల వీరు ాలోచించుచుండిరి. ఒకనాటి రాత్రి స్వప్నమున పినతల్లి వచ్చి నీ వెవరో ాప్పెదనని చేయిపట్టుకొని తీసికొని వెడలినది. అయ్యది శ్రీచక్రము. అది మంతయు ఆసన్నివేశము, అందలి వృత్తములు గలస్వరూపములన్నియు సుపరి ాతముల వలె గోచరించినవి. మూడావరణములు దాటిరి. సూర్యమండల ాతిక్రమించిరి. అయ్యది శ్రీచక్రమున నాల్గవ యావరణము. నీవిక్కడి వాడవని నతల్లి గొంతు వినవచ్చినది చూడగానామె కానరాలేదు. తాను దీర్ఘశ్మశ్రుకేశుడు ర్ఘనఖుడు, కాచిన బంగారము వంటి తనుచ్ఛాయతో విరాజితుడు. ాపుండ్రభస్మరు ద్రాక్షాలంకృతుడు. కుంకుమాంకితుడు. మహోన్నత ప్రమాణుడను ావన కలిగెను. అట్టి భావన కలిగిన వెంటనే తత్తదావరణ గత నవకోటి మహా శక్తి ముదాయము కనులకు కన్పించెను. తన ఎదుట రత్న సింహాసమున ాచక్రేశ్వరియగు కామేశ్వరి కానవచ్చెను. ఈ సిద్ధ పురుషుని గని ఆదేవి అల్లంత ారమున గల ముప్పురి యువతులను చూపి వారిని తన వద్దకు గొని ాండనియాదేశించినది. ఈ పురుషుడును వారిని సమీపించి అందొకతెను తులతో నెత్తికొని మిగిలిన యిర్వురను వెంటనిడికొని చక్రేశ్వరిని సమీపించెను. శక్తియూ తృణీకృత జగత్త్రయమగు కటాక్షాంచలమున సస్మితముగా జూచి నీ ానస్సించుక చలించినది. ఆకారణముచే మీరందరు భూమిలో జన్మింపుడనినది. వు మోసికొని వచ్చిన సుందరియే నీ కర్ధాంగియగు నని పల్కెను. అటు తరువాత స్వప్నము చెదరినది. మరొకమాటు మహోపాసకుడగు గణాచార్యులు లక్ష్మీ ారాయణగారు వీరి ప్రక్క కూర్చుని, నీకు మహైశ్వర్యము కావలసి వచ్చినదా ాకు తెలియును. నీవు ఐశ్వర్యము కోరకుము. క్రిందటి జన్మమున ఈ పర్వత

ప్రాంతమున నీవు యోగివి. నేనెఱుగుదును. నీవు యోగభ్రష్టత వలన జన్మించితివి తప మొనర్చు కొనుము, ఐశ్వర్యము కలిగిన తపోభంగము కాగలదు. నీక్ర క్రిందటి జన్మమున నిచటి సమీప పర్వతమున తప మొనర్చుకొనెడి యోగివి నిన్నా జగన్మాత స్వయముగానను గ్రహించునని ఆ త్రికాలజ్ఞుడు చెప్పిపంపెను ఇట్లీ కవీశ్వరుడు దేవ్యాదేశముచే జన్మించినవాడు కావునకారణ జన్ముడనుటలో విప్రతిపత్తి ఏమున్నది?

1 అనాడు చర్ల బ్రహ్మయ కానంబడె నిట్టి యీవిగలదేశికుడై
యేనాడు జాతి గర్వని దానములీ దృక్ష కోవిద ప్రాగ్రసరుల్

శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌద

శ్లో॥ ఆత్రిగోత్రసముద్భూతో హ్యాత్రిరేవ న సంశయః ।
పుత్రే శిష్యే సమానత్వాత్ అనసూయాపి తత్సతీ ॥

ప్రతాప హనుమచ్ఛాస్త్రి

వీరి భార్య హనుమాంబ, మహాపతివ్రత, నాటికాలమున అందరి విద్యార్థులకు వడ్లు దంపి చెరగి వార్చి వడ్డించినదట, అన్నపూర్ణయని చెప్పుకొనెడివారు.

ఆ పుణ్య దంపతులకు ఈ కవిగణ్యుడు జన్మించెను. కావుననే ఔచిత్యము నెరిగినవారు కారణ జన్ములందురు. కారణ జన్ములనగానేమి? ఏదియో ఒక ఘనకార్యము సాధించుటకు జన్మించిన వారిని లోకమెరిగినవారు కారణజన్ము లందురు. కానిశబ్దవ్యుత్పత్తిని పరిశీలించినచో కారణాత్ జన్మయస్య అని అనవలయును. కారణమనగా అవిద్య అందుండి ఉద్భవించిన వారు ఈశ్వరుడు జీవుడు. ఈ జీవునకు తల్లిదండ్రులు రాఘవనారాయణుడని పేరిడిరి. ఈశ్వరుడు ఎటూ నారాయణుడే కదా. ఆ నారాయణాంశము జీవ చైతన్యముగా స్ఫురించి రాఘవ నారాయణుడయ్యెననగా ఈతనిని కారణ జన్ముడనుటలో దోషమేమున్నది. సాధారణముగా పరిశోధనవ్యాసమున కవిజీవితమును లిఖించు చోట ఇంతటి విషయము ఉపబృంహణము చేయనవసరము లేదు. కానీ ఈ కవియొక్క జీవితమే సాధనవశము చేత సిద్ధావస్థనంది అద్వైత పరమానుభూతిని ప్రకటించు చున్నందున ఈ కవియొక్క ఆత్మీయతా పరమాంశము ఈ గ్రంథమునందు వ్యాపించియున్నందున ఈ కవిని గుఱించి ఇట్టి ఆలోచన అన్ని విధముల

(శ్రీరామ కథామృత కవికుమార జీవితము.) 2. శాపాదేశాది కారణాత్ - శాపము దేవతల ఆదేశము మున్నగు కారణము వలన పుట్టుక ఎవనికి కలదో అట్టి వాడు కారణ జన్ముడగును.

సంగతమైనందున ఇంతగా వ్రాయవలసి వచ్చినది. ఈ కవి చిన్నతనమున అక్షరాభ్యాసము మొదలు అచ్చయ్య, సాంబయ్య దండయ్యలు అను గురువుల వద్ద విద్యాభ్యాసమొనర్చిరి. వ్రాయ చదువనేర్చిన తరువాత లౌకిక విద్యకు విముఖుడై తండ్రిగారి వద్దనే సంస్కృత కావ్యములు చదువుకొనెను. చక్కని సాహిత్యము శాస్త్ర పాండిత్యము వేదాన్త సమన్వయము వీరికి కలిగినది. సంస్కృతాంధ్రములలో కవిత్వరచనము అష్టావధాన, శతావధాన, నేత్రావధానములు వీరికి అలవడినవి. తాడికొండ యందలి ముదిగొండ నాగలింగశాస్త్రి గారివద్ద వీరు వ్యాకరణ మభ్యసించిరి. నాగలింగ శాస్త్రిగారి వద్ద శుశ్రూష చేయుచు వారితో బాటు దేశ సంచార మొనర్చిరి. గురువు గారితో బాటు ఉపన్యాసములు పురాణ ప్రసంగములు కవితా ప్రదర్శనలతో ఆయా గ్రామములందు ప్రశంసలు బడసిరి. వీరికి ఉపనయనము తరువాత శ్రీ కేదారలింగముగారు శ్రీ పాదిలి సీతారామశాస్త్రిగారు వీరికి శ్రీ విద్యా సంప్రదాయమున మంత్రోపదేశ గురువులైరి. ఒకపరి వీరి ఆధ్యాత్మికోపన్యాసముల కచ్చెరువు పడి 20 ఏండ్ల ప్రాయమున అమెరికన్ సొసైటీ వారు తమ సందేహములకు సమాధానములను వీరివలన తెలిసికొని రెండు కోట్ల రూపాయలు ఇచ్చెదమని తమ దేశము విమానముపై రావలసినదని అచ్చటివారు తమదర్శనము కోరుచున్నారని ప్రార్థించిరి. వీరప్పటికే బాలామంత్రో పాసనమున ప్రక్కన పిడుగు పడినను చలించని నిరంతరానుష్ఠాన తత్పరులగుటచే తనయోగమునెంచి చెప్పినదానికి ఎట్టి ప్రతిఫలమును స్వీకరింపని నిస్పృహులు యోగైశ్వర్య విభూతి కలిగిన తపోధనులు. వీరు అద్దేపల్లి పాపయ్య శాస్త్రి మంగమ్మల పుత్రికయగు శ్రీదేవిని వివాహమైరి. నాటినుండియు భార్యాభర్తలు ఇర్వురు శ్రీవిద్యను ఉపాసనజేసి ఆదేవి అనుగ్రహమునకు పాత్రులైరి. ఆదేవియొక్క అనుగ్రహము వీరి జీవితములలో ఎన్నియో సంకట సమయములందు రక్షించినదనుటకు నిదర్శనములు కలవు. ఇక వీరి కుటుంబమును గురించి పరిశీలింపవలసి యున్నది. వీరు విద్యాభ్యాసము ముగించుకొని తిరిగివచ్చి గృహస్థాశ్రమమున ప్రవేశించి తండ్రిగారికి వేదోడువాదోడుగా పాఠశాలను నిర్వహించుచు పాఠ ప్రవచనములతోనూ పురాణ ప్రసంగముతోను, కవితా వ్యాసంగములతోను, శ్రీ విద్యాసమారాధనముతోను, కొంతకాలము గడపిరి. తండ్రిగారు రామకథా మృతమును ముద్రింపదలచి కొందర చందాదార్లను ఏర్పరచుకొని మొదటి రెండుకాండములను అచ్చొత్తించి చందాదారులకు ఒసంగిరి. మిగిలిన ఐదు కాండలలో అప్పటికి ఉత్తరకాండమున వేల పద్యముల రచన మిగిలిపోయినది. కుమారుని పిలిచి ఉత్తరకాండ శేషమును పూరింపవలసినదిగను, ముద్రింపవలసిన కాండములను ముద్రించి చందాదారుల

కందరకు అందింప వలసినది గను ఆదేశించి కైలాసము నలంకరించిరి. ఈ కవి కుమారుడు తండ్రి ఆజ్ఞను శిరసావహించి కొంతకాలము గుంటూరు లో నివసించి సుందరకాండము వఱకు ముద్రణ చేయించిరి. అనంతరము కొంతకాలము తెనాలిలో నుండి ఉత్తర కాండమును పూరించి గ్రంథ శేషమంతయు అచ్చొత్తించి చందాదార్లకు అందించి మాటనిలబెట్టుకొనిరి. ఆ తరువాత మరల చందవోలు చేరి అచ్చటి ఆశ్రమమున అంతర్ముఖులై జీవనమును గడపిరి. కుటుంబము చాలా పెద్దది అగుట చేతను, కర్తవ్యతలనేకములు తానే నిర్వహించుటచేతను అప్పటికి ఉన్న ఆస్తి పాస్తులన్నియు వ్యయమైనవి. పాఠశాల నిర్వహణము కష్టమై కుటుంబ పోషణమునకు గ్రంథముద్రణము కొఱకు గ్రంథపూరణము కొఱకు ఎంతయో శ్రమకోర్చి కృతార్థులైరి. పగలంతయు ముద్రణ జరుగుచున్న భాగమున తప్పులు దిద్దు కొనుచు రాత్రి యంతయు మరునాడు అక్షరములు కూర్చుకొనవలసిన భాగమును రచించుచూ ఉత్తరకాండము పూర్తి చేయుట సాధారణమైనకవికి సాధ్యమైన విషయము కాదు. ఈ కవి పూరించిన ఉత్తరకాండమునందలి భాగము కేవలము అనువాదము మాత్రమే కాక సీతారాముల ప్రకృతి పురుషతత్త్వమును స ప్రమాణముగా నిరూపించుచు భావబంధురమై ఒప్పారినది. వీరి ఉపాస్య దైవమగు లలితా త్రిపురాసుందరి వీరి కటువంటి శక్తి యుక్తులను ప్రసాదించినది. వీరంతకుముందు 1 కల్యాణ కైవర్తకము 2 మధురా విజయము 3 సత్యనారాయణవ్రత మాహాత్మ్యము అనుమూడనువాద గ్రంథములను రచించిరి. కల్యాణకైవర్తకమనునది స్కాందపురాణ గతహాలాస్యఖండమునందు ఒక అధ్యాయమున రమారమి ముప్పది శ్లోకములలో ప్రస్తావించబడిన కథ. మధుర మీనాక్షీ దేవి లీలావశముచే ఒకదాశరాజింట జన్మింపగా సుందరేశ్వరస్వామి జాలరి వాడై వచ్చి ఆమెను వివాహము చేసికొన్న విచిత్ర కథా సంవిధానము కల ఇతివృత్తమిందు కలదు. ఇందు పంచమాశ్వాసమున వృద్ధ దంపతులు తపస్సు శివసాక్షాత్కారము అపరోక్షానుభూతి మొదలగువాని వర్ణనము ఈ కవికి ఆనాటికే గల్గుటచేత ఇటపరిణతిని చూపించును. సంస్కృతమున గంగాదేవి రచించిన మధురా విజయమునకు వీరి ఆంధ్రానువాదము 3ఆశ్వాసముల ప్రబంధమై మూలమునకు మెఱుగుపెట్టినట్లు చక్కని అనువాదముగా ప్రశంసార్హమైనది. అందరకు తెలిసిన సత్యనారాయణవ్రత కథ వీరి అనువాదమున వస్త్వైక్యముతో సూత్ర బద్ధమై కావ్యత్వమును సంతరించుకొనినది. అటుపిమ్మట వీరురచించిన యామావిక అటులుండి చూచిన కవిమాయయై తీర్థయాత్రాను భవములను పాండురంగ మహాత్మ్యము గుదిగ్రుచ్చిమాసి చిత్రకథతో విరాజిల్లుచు శ్రీ శంకరభగవత్పాదుల

యోగతారావళి అనువాదముతో సమగ్రమై పండిత ప్రశంసల నందినది. ఇందు కూడా వేదాంత విషయములు శాస్త్రానుభవ పురస్కారముతో ప్రతిపాదింపబడినవి. తదనంతర రచనము ఈ దత్త భాగవతము. కవి కవియగుటకు కావలసినది 1 ప్రతిభ. 2 వ్యుత్పత్తి 3 అభ్యాసము ఈమూడును వీరికి గురుదేవతానుగ్రహసహకారముతో పురుష ప్రయత్నముచేత సాధించుకొనబడినవి.
సాహితీపటిమకు :- ఒకనాడు తిరుపతివేంకటకవుల శతావధాన సభానంతరము వీరు వేంకటశాస్త్రిగారిపై చెప్పిన శ్లోకములు ఆవిద్వత్కవులనే శిరః కంపము చేయించినవి.

**1శ్లో॥ విషధిస్సశేష ఉదితః పరమైరభివాదితః కపటవాన్ధిషణః**
**కవిరప్యయందనుజ బంధురహోసకణాదపి మతిమాంస్తదపి**
**2శ్లో॥ వ్యాకృతిప్రముఖశాస్త్రవినీతా తావిషాదిరహితౌ కవిహీరౌ**
**శేష పూర్వవిషపూర్వవతాంయ స్యాంశజేన హి మహః పరమేతత్**

వేంకటశాస్త్రిగారు వీరినాప్యాయముగా కౌగలించుకొని నీవేమి చదువుచున్నావు అనగా వీరు భారవి కావ్యము చదువుచుంటినని చెప్పిరి. దానికి వేంకటశాస్త్రిగారు నీశ్లోకములు భారవి శ్లోకముల వలెనున్నవని ప్రశంసించి వెంకటప్పయ్యశాస్త్రి గారితో నీకుమారునకు నైషధ పాఠము చెప్పవలసినది. ఈతడు శ్రీహర్షుడంతటి వాడగునని దీవించిరి. పుష్పగిరిపీఠాధీశ్వరులసమక్షమున వీరు నిర్వహించిన అష్టావధానము శ్రీస్వామివారి నారాయణస్మరణలతో సుసంపన్నమై కీర్తింప్రసూతేభువనాభివంద్యాం అన్నట్లయినది.

శాస్త్రనిష్కర్షకు :- వీరు ఉత్తరకాండమును పూరణము చేయు సమయమున సందర్భవశముచే అప్పటి పద్యములు కొన్ని తాతాసుబ్బరాయశాస్త్రిగారికి వినిపించుట జరిగినది. సుబ్బరాయశాస్త్రిగారు సుప్రసిద్ధ వైయాకరణులు "త్రిభువనీ వీరి ప్రయోగము నాక్షేపించిరి. భువన శబ్దము పాత్రాదులలో చేరినందున జీప్ రాదనిరి. అయ్యది వార్తికకారమతము కాని సూత్రకారుని మతము కాదనియూ పాణిని సిద్ధాంతానుసారముగా త్రిభువనీ పదమును సాధించుకొనవచ్చుననియు వీరు సమాధాన మిచ్చిరి. సుబ్బరాయశాస్త్రిగారు యథోత్తరం మునీనాం ప్రామాణ్యం అను పరి భాషను ప్రస్తావించి వార్తిక కారుని మతమే ఉపాదేయమగుట వలన జీప్ రాదనిరి. అప్పుడీకవిగారు భువనవాచకమైన భూశబ్దముతో సమాహారద్వం ద్వముచేసి త్రిభూశబ్దముతోవనీ శబ్దమునకు రూపక సమాసము చే త్రిభువనీ శబ్దము సాధింపగా వీరి నిరుపమాన వ్యాకరణ పాండిత్యమునకు సుబ్బరాయ

శాస్త్రిగారు అచ్చెరువుపడిరి. ఈ కవిగారు - చందవోలు చేరిన తరువాత కొంతకాలమునకు శృంగేరి పీఠాధిపతులైన శ్రీమదభినవవిద్యాతీర్థస్వామివార దేశసంచారమొనర్చుచు వీరి సౌజన్యమునూ, తత్త్వజ్ఞతను, ధర్మ తత్పరతన అకుంఠిత శాస్త్రవ్యుత్పత్తిని విని స్వయముగా చందవోలు వచ్చి భిక్షగైకొనిరి. ఆ సాయం కాలము శ్రీ స్వామివారి ఆశీరభిభాషణము ముగిసిన వెనుక ఈ కవిగార తన ఉత్తరీయమును పరచి శ్రీస్వామివారి భిక్షాకైంకర్య నిమిత్తము 500/- రూ.ల చెల్లింప వలసియున్నది. ఈ సుకృతము నాతోబాటు మన గ్రామస్థులగు మీకందరక లభింపవలయును కాన మీకు తోచిన ద్రవ్యమును సమర్పింపుడని చెప్ప పదినిముషములలో పోగయిన మొత్తము రెండువేలు దాటినది. అది అంతయ స్వామివారికి సమర్పింపదగినది. అధిక ద్రవ్యము వలదని స్వామివారు, మీ కొఱక సంగ్రహింపబడినది మిగుల్చుకొనదగదని ఈ కవిగారు పలికిన పలుకుల రఘుకౌత్సుల సంవాదమును సంస్మరింపజేసినది. ఆ సమావేశమున శ్రీస్వామివార నీవు ఏ దేవతను ఉపాసించెదవనగా, నిరుపాధిక మగు బ్రహ్మతత్త్వమున సోహంభావముతో ఉపాసింతుననియు అయినచో సగుణదేవతల యెడనీక గౌరవము లేదాయని స్వామివారు ప్రశ్నింపగా, అఖండ చైతన్యమునకు ఘటాదుల ఆకాశమునకు వలె ఆధారభూతములు గనుక సగుణదేవతా రూపముల విషయము నాకు అగౌరవము లేదు. అనియు అప్పుడు శివకేశవాదులలో న్యూనాధికభావమ ఎట్లు? పరిష్కరించెదవని స్వామివారు అడుగగా తత్తదుపాస సంప్రదాయానుసారము పరిగణింపబడును. పరిగణింప బడకపోవచ్చును అనియ ఈ విషయమునెట్లు నిరూపింతువనగా శాస్త్రాను భవములు ఇందులక ప్రమాణములు అనియు శ్రీస్వామివారి సంస్కృతభాషలోని ప్రశ్నములకు వీ (1,2) సంస్కృత శ్లోకరూప సంభాషణ సమాధానములు వీరి పరిణత ప్రజ్ఞక తాత్త్వికతకు దార్శనికతకు స్వానుభూతికి నిదర్శనములు.

ఈ కవిగారికి రాఘవ నారాయణుడని పేరనుకొంటిమి గదా! అనంతరమ శాస్త్రాధ్యయనమున రాఘవనారాయణశాస్త్రి అయ్యెను. ఆ ప్రాంతమంద జనులందరు వారిని చందవోలు శాస్త్రి గారని వ్యవహరించుట సుప్రసిద్ధమ ఇకనుండి ఈ కవిగారిని శాస్త్రిగారుగా వ్యవహరించుట జరుగును. ఇంతకుపై ఉదాహరించిన నాలుగువంశములలో మొదటిది వీరి విద్యాభ్యాసకాలమున భారవి చదువుచు భారవి వలె శ్లోకములు చెప్పగల్గిన మానవతావస్థయందలి వీ కుశాగ్రధిషణకు, రెండవది మహాపండితపరివేష్టితులైన పీఠాధిపతుల సమక్షము

ప్రశంసాపాత్రమైన వీరి సాహిత్య అలంకారనిష్ణాతతకు కవితా సంపత్తికీ అవధాన సంవిధాతృతకూ, మూడవది వీరి వ్యాకరణవైదుష్యమునకు, నాల్గవది వీరి అనుభవము పండిన ఆత్మీయతతో నిండిన అద్వైతా పరోక్షానుభూతికి నిదర్శనముగా పేర్కొనబడినవి. శ్రీ శాస్త్రిగారు దేవీ ఉపాసకులు. సర్వాత్మనా ఆపరదేవత యందలి విశ్వాసముచే ఎన్ని అవాంతరములనైనను అతిక్రమించిన ధైర్యము కలవారు. వీరి 30 ఏండ్ల ప్రాయములో 1. నరసాపురంలో జరుగనున్న సభయందు పాల్గొనుటకు ప్రయాణమై సాయం సమయమునకు భీమవరము చేరిరి. వ్రేళ్ళకు ఉంగరములతో చేతులకు సింహతలాటములతో చెవులకు అంటుజోళ్ళతో మెడయందు రుద్రాక్షమాలలతో బంగారు జరీపనితనము గల ఖరీదైన శాలువతో వీరి ఆకారము ఉజ్వలముగా నుండినది. ప్రొద్దుకుంకినది. ప్రయాణసౌకర్యము లేదు. ఆ రాత్రి కెట్లైనను నరసాపురం చేరవలెను. ఇట్టి వీరి వైఖరిని గమనించిన చోరశిఖామణి ఒకడు వీరితో మాటలు కలిపి విషయమెఱిగి తానుకూడ నరసాపురమున సభానిర్వహణము చేయుచున్న కవి మిత్రునకు కావలసినవాడని చెప్పి మెల్లమెల్లగా తనవెంట తీసికొనిపోయి అరణ్యమార్గమున వీరి సర్వస్వమును అపహరించెను. వీరి ప్రాణములను సైతము తీయుటకు తనవారినాదేశింపగా అఖడ్గధారలకు వీరి తల తెగవేయుటకు చేతులాడలేదు - వదలివేసిరి. వీరా రాత్రియంతయూ దేవిని ధ్యానించుచు తిరిగి తిరిగి తెల్లవారుజామునకు ఒక భవనమును చేరుకొనిరి. అచ్చట నొకసుందరి వీరినాదరింపగా వీరు యధావిధిగా నచ్చట స్నానాను ష్ఠానములు నెరవేర్చుకొని నిమీలితనేత్రులై దేవీప్రార్థనము చేయుచుండిరి. ఆ సుందరి హఠాత్తుగా వచ్చి వీరి తొడపై కూర్చొనెను. వీరువెంటనే ప్రాణయామముతో కుంభక మొనర్చిపర్వతమువలె నిశ్చలత్వమును వహించిరి. శరీరమందెట్టి సాత్త్విక లక్షణములు కానరాగపోగా మీదు మిక్కిలియోగాసన స్థిరబంధము ప్రసన్న గంభీర బ్రహ్మవర్చస్సును గమనించిన ఆమె సాగిల పడి వీరిని పరీక్షించుటకు తనకే ఇంతకష్టమైనదని, పాదములపైబడి చేయించిన తన భర్తయగు ఆ చోర శిఖామణిని గూడ పాదములపై బడవేసెను. వీరి ఉపాసనా బలము నిర్వికార చిత్తత్వము యోగసాధనము ఇట్టివి. వీరు

శ్లో॥ ఉపాధివర్గం సకలం సోऽహం భావేనయేభావయే
తదాధారతయోపాధీన్ బహుమన్యామహేవయం

శ్లో॥ ఉచ్చావచత్వం చైతేషాంగణ్యతే నచ గణ్యతే
శాస్త్రతోऽనుభవాచ్చైవ ప్రసీదతు జగత్పతిః కవికుమార జీవితము

ప్రతిదినము అపర రాత్రమునుండి సూర్యోదయము వఱకు ప్రాణాయామ మొనర్చెడివారు. వీరు యోగసిద్ధులని కొందరు పెద్దలెరుంగుందురు. వీరు తాడికొండలో విద్యాభ్యాసమున దర్శన మిచ్చిన ఒక వృద్ధయోగి పుంగవుడు వీరికి యోగధర్మములనుపదేశించి అటుపిమ్మట ఏబది సంవత్సరములకు వీరి ప్రాణాయామమున కల్గిన ఒక విక్షేపమును నిలువరించి అనుగ్రహించిన విషయము శ్రీశాస్త్రిగారి ముఖమునుండియే ఈ వ్యాసకర్త వినుట జరిగినది. శ్రీశాస్త్రిగారు చందవోలులో తమ ఆశ్రయమునందు దత్తాత్రేయప్రతిష్ఠ సుబ్రహ్మణ్య ప్రతిష్ఠ. సీతారామలక్ష్మణ హనుమత్ప్రతిష్ఠలను, వేకనూరునందు శ్రీలలితా త్రిపురసుందరీ ప్రతిష్ఠను తెనాలి యందు బాలాత్రిపురసుందరీ ప్రతిష్ఠను ఇంకను పెక్కు యంత్రతంత్ర ప్రతిష్ఠలను నిర్వహించిన ఆగమ సంప్రదాయవేత్తలు. తమ జీవితమున సంఘటించిన వివిధ సన్నివేశముల సందర్భముల దివ్యాను భూతులతో దృఢమైన ఆత్మానుసంధానరూపమగు ప్రజ్ఞానమున శ్రద్ధాసక్తులు గల జిజ్ఞాసువులకు పాఠములను అందజేయ దలచి తమ వంశమునకు మూలపురుషుడు యోగాదేశకరుడగు దత్తాత్రేయుని దివ్యచరితమును బ్రహ్మాండ పురాణమున ఉన్నదానిని ఆంధ్రీకరింపదొరకొనిరి. అయ్యదియుతత్త్వ విషయములతో నిండిన దగుటచే తాము చదివిన శాస్త్రవిషయములను తమ అనుభవములను మేళవించి మహోన్నతముగా అద్వైతతత్త్వ ప్రతిపాదకముగా ఈ అనువాద గ్రంథమును తీర్చిదిద్దిరి. ఆ తరువాత ఆగమశాస్త్ర సంప్రదాయములను, శ్రీవిద్యారహస్యములను, యోగ విశేషములను బహిరంతః సమన్వయమును ప్రతిపాదించుచు ఒకానొక స్వప్న వృత్తాంతమాధారముగా రచించి న మత్స్వప్నః అను పేరుగల సంస్కృత కావ్యము. కంచి చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వాముల వారికి పారాయణ గ్రంథమైన దనుటకంటే వీరి ధన్యమూర్ధన్యతను ప్రవచించుటకు మరొక మాట అక్కరలేదు. వీరు రచించిన నాయాత్ర, నాయాగము మొదలైన ఖండకావ్యములు, శతకములెన్నియో కలవు. కావ్యప్రయోజనములతో సద్యః పరనిర్వృతయే, కాంతాసమ్మితతయోపదేశయుజే అను రెండు ప్రయోజనములను సాధింపదలచి వీరి రచనలయందు సర్వోపనిషత్తాత్పర్యరూపమైన అద్వైతత్త్వమును, కాంతా సమ్మితమైన మధురగరీయః కథా సంవిధాన బంధురమైన రచనలో పొదిగి విశ్వశ్రేయము గావించినారు. ఇట్టి యోగి వర్యులు తమ అంత్యకాలమును తెలిసికొని 7 రోజులు ప్రాయోపవేశము చేసి శుకయోగీంద్రుల పిలుపుతో 10-12-1990వ తేది రాత్రి పరమపదమునందినారు. ఈ యోగిపుంగవుల జీవితకాలము

1 అగ్ని పరీక్ష

1896 నుండి 1990 = 94 సంవత్సరములు సంపూర్ణ పురుషాయుషము జీవించిన మహనీయులు.

వీరి ముద్రిత రచనలు :- 1. హేమ దుర్గాంబికాశతకము, 2.తుకారాము దాసు చరిత్రము, 3. నాయోగము, 4. పాడినపాట, 5. పాండురంగేశ్వర ప్రశస్తి, 6. బాలాత్రిపుర సుందరీ సమేత రాజ రాజ నరేంద్రస్తవము, 7. శాంకరీస్తవము, 8. నాయాత్ర, 9. ప్రభుప్రపత్తి, 10. సహస్రలింగేశ్వరస్తుతి, 11. నాకుతోచినమాట, 12. ఇంకొక మాట (వ్యాస సంపుటులు), 13. మత్స్వప్నః, 14. దత్తాత్రేయాష్టక గర్భితాత్మ సుప్రభాతము, 15. ప్రారబ్ధ ప్రాబల్యము తన్నిరాసస్థితి, 16. వాసుదేవసారధ్యము. ఇట్టి ఖండకావ్యములనేకములు.

# 2వ అధ్యాయము

## కావ్యారంభ సముల్లాసము

సంస్కృత కవుల మాట ఏమోకాని, పూర్వాంధ్ర మహా కవుల కొందఱి రచనలు విచిత్రముగా ప్రారంభమైనవి. ఏదియేని ఒక గ్రంథము రచింపవలయునను కొనుటయో నిర్దిష్ట విషయమును అనుసంధానించి గ్రంధము వ్రాయదలచుటయో ఏ ప్రభువులో కవిపోషకులో గ్రంథ రచనమొనర్చుమని కర్పూర తాంబూల మొసంగుటయో, ఇట్టి సందర్భములు పూర్వాంధ్రకావ్యములలో చూచుచుందుము. కవిలోకలోకేశులకు కొందఱి స్వప్నమందు ఇష్టదైవము సాక్షాత్కరించి గ్రంథ రచన మొనర్పుమని ప్రేరేపించుటయు ఎరుగుదుము. ఈ విధముగా స్వప్న సంవాదము ననుసరించి కావ్య నిర్మాణమొనర్చిన వారిలో తిక్కన మొదటి వాడనవచ్చును. తిక్కన ఆరంభించిన ప్రబంధమండలికి కృతిపతిని ఎవనిని చేయుదునా అని ఆలోచించుచు ఇంచుకనిద్రించు సమయంబున స్వప్నమొకటి కల్గినది. అందు తన తండ్రీ కొమ్మనామాత్యుడు ముందుగా కన్పడి నీవింత కుమునుపు "స్వామీ! నీవు అస్థిమాలాకౌస్తుభములలోదేనిని అలంకారమునుగా ఇష్టపడుదువు? కాల కూట యశోదాస్తన్యములలో దేనిని అస్వాద్యముగా స్వీకరింతువు? చెప్పుము అనెడి అర్థముగల నొక శ్లోకము. న స్వామిపై రచించితివి. ఆశ్లోక ప్రతిపాదితుడవు. హరహరనాధుడు

1. శ్లో॥ కిమస్థిమాలాంకిముకౌస్తుభంవా పరిష్క్రియాయాం బహుమన్యసేత్వం
కింకాలకూటః కిమువాయశోదాస్తన్యంతవస్వాదు వదప్రభోమే॥ తిక్కనభారతము విరాటపర్వం

కృతిసమర్పిత్వమునర్థించి నీయెడ ప్రసన్నుడై నాకలోకవాసినగు నన్ను ఏతదర్థమై పిలుచుకొని వచ్చినాడు. స్వామిని కృతిపతినిగా నొనరించి చరితార్థుడవు కమ్ము అని దీవించి తనవెనుక నున్న హరిహరనాథుని చూపెను. అంత హరిహరనాథుని చూచి సాక్షాత్కరించిన దైవమును వర్ణించి సాష్టాంగ పడి ఆత్యంతిక సంసారనివృత్తిని అభ్యర్థింపగా ఆ దైవము తథాస్తు అని పల్కెను. ఇట్టి స్వప్నసాక్షాత్కారమిచ్చినట్టి హరిహరనాథుని ఆదేశమును శిరసావహించి తన భారతమును హరిహరనాథునికే కృతినొసంగినాడు. సాధారణముగా దేవతా సాక్షాత్కారస్వరూపస్వప్నములు కవులు తమ మనమున అహర్నిశలు తత్తద్దేవతా మంత్రోపాసనమున సంధానించుకొను చుండుటవలన కలిగినట్టివి, తమ మార్గము సరియైనదని చూచుకొనుటకు దర్పణము వంటివి ఐనను, ఇతరుల కివి అప్రకాశ్యములను కొనుచుందురు. కాని ఇట్టి వేవైన గ్రంథారంభమున కల్గినపుడు విశిష్ట స్వప్నములగుటవలన గ్రంథరచనమునకు ప్రేరేపించునట్టివి అగుటవలన, భావికవి శిక్షకై గ్రంథమున నిబంధించుట ఆవశ్యకమని ఎంచి, తిక్కయజ్వతన గ్రంథమున స్వప్న విశేషము తెలియ జేయదగినది అనుటకు మొట్టమొదటగా శ్రీకారము చుట్టి ఆంధ్రకవులకు ఉత్తమ సంప్రదాయ సంప్రవర్తకుడైనట్లు కన్పట్టును. ఈ ఒరవడిలో నడిచిన వాడేపోతన, రాయలు, మున్నగువారు. పోతన గారికి రామచంద్రుడు స్వప్నమున సాక్షాత్కరించి భాగవతాంధ్రీ కరణమునకు ప్రేరేపించెను. శ్రీకాకుళాంధ్రదేవుడు గోదాదేవీ చరిత్రము వ్రాయుమని కృష్ణరాయని కోరెను. శ్రీశాస్త్రిగారికి కూడా స్వప్నము వచ్చినది. ఒక స్వప్నము కాదు. రెండు స్వప్నములు మొదటి స్వప్నము గడచిన చాల రోజుల తరువాత రెండవ స్వప్నము వచ్చినది. శ్రీశాస్త్రిగారు దత్తాత్రేయుని యెడ మిక్కిలి భక్తి ప్రపత్తులు కలవారు. దత్తాత్రేయుడు కూడా ఆత్రేయుడగుట శాస్త్రిగారి ఆత్మీయతకు ప్రబల కారణమై ఉండనోపును. శాస్త్రిగారు అంతకు ముందే దత్తాత్రేయుని మహిమను వర్ణించుచు గ్రంథము వ్రాయదలచిఉండిరి. ఎవడో మహానుభావుడు బ్రహ్మాండపురాణాంతర్గత దత్తమాహాత్మ్యమును శాస్త్రిగారికి అందజేయగా దానిని పరిశీలించి ఆంధ్రీకరణము చేయవలయునని అభిప్రాయము కలిగినది. గ్రంథరచనము ప్రారంభము కాలేదు. ఇట్టి సమయమున ఒకనాడు మొదటి స్వప్న వృత్తాంతము జరిగినది. శ్రీ శాస్త్రిగారి దంపతులు తీర్థయాత్ర లొనర్చుచు సంచరించుచుండ బ్రాహ్మణుడొకడు వారిని తన ఇంటికితీసికొని పోయెను. అతిథి సత్కారానంతరము అతని ఇల్లాలు

ఊయలలోనున్న పసివానిని శాస్త్రిగారి చేతులకందించినది. శాస్త్రిగారు ఆ బాలుని చేతులతో పొదివి ఎత్తికొనగా ఆ బాలుడు శాస్త్రిగారిని చూచి బోసినవ్వుల చిందించెను. ఈ పసినిసువు నన్ను చూచి నవ్వుచున్నాడేమని ఆ బ్రాహ్మణిని అడుగగా ఆమె ఈ తని మీద పద్యములు వ్రాయనుద్దేశించియు మీరింతవరకు వ్రాయకుంటిరి గదా అందులకే నవ్వుచున్నాడని బదులు చెప్పినది. ఇంతలో అత్యద్భుతముగా ఆ బాలుడు మూడు శిరస్సులతో దత్తాత్రేయునివలె గోచరించెను. ఆశ్చర్య సంభ్రమములతో శాస్త్రిగారికి మెలకువ వచ్చినది. శాస్త్రిగారు సాక్షాత్తు దత్తాత్రేయుడు అత్రి అనసూయలతో దర్శనమిచ్చి గ్రంధరచనకు తొందరచేయుచుండెనని భావించిరి. ఒకనాడీ గ్రంధరచనమునకు శ్రీకారముచేసి క్రమముగా కొన్ని పద్యములు వ్రాసిరి. అప్పుడు మరల మరియొక స్వప్నము గోచరించినది. ఈ స్వప్న సంవిధానము చాలా విచిత్రము. స్వప్న వృత్తాంతములన్నియు సత్యములు కాకపోవుచ్చును. దేవతలు, గురువులు తల్లిదండ్రులు, సిద్ధపురుషులు మొదలగు వారు స్వప్నమున కానిపించి ధర్మ సంబద్ధమైన ప్రేరణ మొనర్చిన ఎడల అట్టిస్వప్నములు యధార్థసంవాదము కలవని అట్టివి స్వప్నవృత్తాంతములైనను ప్రమాణముగా గైకొనవచ్చు ననియు శాస్త్రములందు కలదు. విచక్షణుల ప్రవర్తనములలో ఇట్టి స్వప్నములు కూడా ప్రవృత్తి నిమిత్తములగుటలో సందేహము లేదు. అసలు స్వప్నమనగా నేమి? దృష్ట, శ్రుత, అనుభూత విషయస్మరణ సందోహము స్వప్నము, సందోహము = స్మరణానుక్రమజ్ఞానము అని ముక్తావళియందు విశ్వనాథ పంచాననుడు నిర్వచించినాడు. తనచేత చూడబడిన, వినబడిన అనుభవింపబడిన విషయముల స్మరణానుక్రమజ్ఞానమే స్వప్నమన బరగుచున్నది. శాస్త్రిగారికి అట్టిస్వప్నమే వచ్చినది. ఆ కలగన్న విధము ఇది కలయని త్రోసి రాజనుటకు వీలుకానిదిగా శాస్త్రిగారికి తోచినది. అందుచేతనే యథాతథముగ గ్రంథస్థము చేసినారు. కలవచ్చినది - కల తరువాత మెలకువ వచ్చినది. స్వప్నవృత్తాంతమును గుఱించి అనువ్యవసాయము చేయుచున్నారు. శ్రీశాస్త్రిగారి ధర్మపత్ని శ్రీదేవిగారు వారి, వాలకము జూచి పలుకరించిరి. నాథా! పాదము లొత్తెదనా! మీరేదైన భావన చేయుచుండిరా! దైవధ్యానమున నుండిరా! నే పలుకరించుటవలన మీకు విక్షేపము కలుగదు గదా అన్నారు. అంత శాస్త్రిగారు నాకొక కలవచ్చినది. ఆ కలలో ఒక సిద్ధపురుషుని చూచితిని. అతనితో జరిగిన సంవాదమును తలంచుచుంటిననగా ఆ యిల్లాలు రహస్యముకాకున్నచో నేనును వినగోరుదునని అన్నది. శాస్త్రి గారిట్లు

చెప్పదొడిగిరి. ఒక ప్రాతఃకాలము శాస్త్రిగారు దంతధావనముచేయుచు
బంగారు మేనిచాయతో దిగంబరుడొకడు వచ్చిదగ్గఱ కూరుచుండెను. శాస్త్రి
దంతధావనము ముగించుకొని వానివైపు తిరిగిరి. అతని ముఖము అ
నీయమగు తేజస్సుతో ప్రకాశించుచుండెను. అతని వెంబడి ఒక పుస్తకః
ధరించిన మరియొకడు కూడ కలడు. వచ్చిన దిగంబరుడు ఎవడో మహానుభా
తోచినది. అతడేదియో మాటలాడుచున్నాడు. మాటలాడుచున్నాడను బ
కాని ఏమి మాటలాడుచుండెనో ఎఱుగజాలిన జ్ఞానవైశద్యము లేదు. అటుపి
సంవాదము స్మృతియందున్నది. నీవు పండితుడవు కదా. నిశ్చప్రచమైః
కలవాడవు. నీ ముఖమున ప్రసన్నత లేదు, ఏదో ఆలోచించుచున్నావు. నేను
పల్కరించుచున్నను మాట్లాడవేమియని అతడు పల్కెను. శాస్త్రిగారు,
చెప్పను, స్వామీ, అనేక విక్షేపాలతో చిత్తవికారము కలిగి ఈ స
ప్రవాహమునందు మునిగి తేలుచున్నాను. ఇట్టినాకు సరసత్వ మెట్లబ్బున
నడవడిక మీ వంటి వారికి హాస్యప్రాయమైనదిగదా, ఇంతకు ముందే
పినతంద్రి వచ్చి ఏమో గృహకల్లోలములను వినిపించెను. తాను పరిష్క
కొనలేడు. నేనెంత చెప్పిన వినిపించుకొనబోడు. ఇంతలో ఒక ము
చిరిగినతాటాకు బుట్టలు రెండు తెచ్చి ఒకదాని నూడదీసి ఆయాకులతో రె
బుట్టను గట్టిగా నల్లి పెట్టుమని కోరినది. కాదన్న వినదు. నన్ను వేధించిన
తప్పదనుకొని చిరిగిన వైపుకు మంచివైపు అమరునట్లుగా, ఒక బుట్టలో మ
దిగబెట్టి ఆమెను వదిలించుకొంటిని. ఇంతలోమా అత్తగారు ఇలాంటి ప
ఆయనచేత చేయించవచ్చునా పోపొమ్మని కసిరికొట్టెను. ఆ ము
వెడలిపోయినది. నాకు వైరాగ్యము కలుగుచున్నది. సన్యసించిన బాగుం
తోచినది. బహిర్దేశమునకు బయలుదేరితిని. బయలుదేరితినో లేదో మా పి
వచ్చి కాలు కదల్చుటకు వీలు లేకుండా ఏవో మాట్లాడుచుండెను.
చెప్పుచున్న మాటలకు నా మనస్సు తేటపడినట్లు తోచినది. వివేక దీ
ప్రకాశించినట్లయినది. కాని నా కాలకృత్యములు తీరలేదు ఆలస్యమగుచు
ఏదో యోగమనియు సాంఖ్యమనియు స సందర్భములైనను అ సందర్భ
చెప్పి కాలయాపనము చేసినది. నాకెన్నియో కుటుంబ బాధ్యతలు కలవు.
వ్యవహారములతో క్షణము తీరిక లేని నాకు ఈ సాంఖ్యయోగములు
కుదురునని మనస్సు వికలమైనది. బారెడు ప్రొద్దెక్కినది. ఇప్పటికి దంతధావ
ఇంక స్నానసంధ్యాదులెప్పుడని నివ్వెఱపడుచుండగా మీరు వచ్చి

దత్తభాగవతము - అనుబంధము - కలమాట - 30వ పద్యము

ఉన్నవిషయము మీకు మనవి చేసితిని. నేను వైరస్యముగ నుండుట కిది కారణము అని శాస్త్రిగారు పల్కిరి. దానికా పురుషుడు ఏది ఎటుపోయినను విచారము మాని కర్తవ్యమును నిర్వహించుచు నీవు మా జనకుని వలెనుండుమని పల్కెను. శాస్త్రిగారు అయ్యా ఒక్కొక్కసారి నేను ఉమాజనకుని వలె స్థైర్యము కలవాడను, మా జనకుని వంటి గాంభీర్యము కలవాడను. జనకుని వంటి ధైర్యము కలవాడను. కాని ప్రకృతి బలీయసి, క్షణములో ఆకర్షించి అటునిటుగావించును. నేనేమి చేయ గల్గుదును. అని చెప్పి అది సరే మీరు మెడలో దాల్చిన ఆభరణమేది అని శాస్త్రిగారడిగిరి., దీనిని మునుపాక పిచ్చికుక్కకు అలంకారముగా పెట్టితినని అతడు పల్కెను. ఆ పిచ్చికుక్క ఇపుడేమైనదనగా ఆ కుక్క పిచ్చికుదిరి తానెవరో తెలిసికొని పోయినదని పల్కెను. అట్లయినచో దానిని నాకు ప్రసాదింపుమని శాస్త్రిగారు అడిగిరి. నీకీయవలసిన సొమ్మును నీ పినతల్లి ఒసగినది. నీకిది అక్కరలేదని అతడనెను. ఆమె చెప్పిన మాటలు అనుభవమునకు వచ్చుటలేదని శాస్త్రిగారు అనగా అభ్యాసవశమున చాంచల్యమును నశింపజేసికొనుము. సంకల్పముల నడగించుకొనుము. నీవు మునుపే సన్యాసివి. శాస్త్రములు చదువుకొంటివి. పినతల్లి మాటలు వింటివి. శ్రవణమైనది. నా మాటలను మననము చేయుము. నీమార్గము సరియైనది - నిధిధ్యాసనముతో ముందుకు పొమ్ము. ఈశ్వరుడు నీకభిముఖుడు. ప్రాణాయామ సాధనతో సిద్ధుడవు కాగలవు. అర్జునుడు వాసుదేవుని కొఱకుపోవలసిన అవసరము నిజముగా లేదు. నిజముగా తాను అర్జునుడే అయినచో వాసుదేవుడే అభిముఖము అవునని కదా నీ భావన అట్లే భావించి చూడుము. సవిల్పక సమాధి నిర్వికల్పమగును. స్వాత్మానుభవము సంపన్నమగునవి ఆ మహాపురుషుడుపదేశించెను. శాస్త్రిగారిమేనంతయూ గరుపాటినది. వెంబడి పుస్తకము గొనివచ్చిన మహానుభావుడు కూడా దత్తబోధచే ఆపదలుగడచిన నీకు శుభమగునని పల్కెను. ఆ మాటలు చెవికి సోకియు సోకక మునుపే ఈతడే దత్తాత్రేయస్వామియని శాస్త్రిగారికి స్వప్నము నందే సముద్బోధము కలిగినది.

అతని పాదములనంటి నమస్కరించిరి. ఇంతలో కోడికూసెను. నిద్రచెడెను. తలచెదిరెను. కనులు తెఱచిరి. ఎవ్వరునూ లేరు. మనస్సు ఉసూరుమన్నది. ఈ స్వప్న వృత్తాంతమునంతయు ఆలించిన ఆయిల్లాలు ఏమండీ పినతల్లి ఎవరని

1. దత్త భాగవతము - అనుబంధము - కలమాట

2. ఉమాజనకుడు = హిమవంతుడు మా జనకుడు = సముద్రుడు మా జనకుడు = అత్రి

అడిగినది. నాపంద్రెండవ ంవత్సరమున గురూపదేశమును గొని నిరంతరఅనుష్ఠాన పురశ్చరణలతో నేనుపాసించు బాలాత్రిపురసుందరియేపిన తల్లి రూపమున దర్శనమిచ్చినదనిశాస్త్రిగారు చెప్పిరి. శాస్త్రిగారు తీవ్రముగా అనుష్ఠానము చేసినను తీవ్రముగా భావించినను సంకట పరిస్థితులు కలిగినప్పుడును బాలాత్రిపుర సుందరివారి పినతల్లి రూపమున, స్వప్నదర్శనమొసగి గట్టెక్కించిన సన్నివేశములు శాస్త్రిగారి జీవితమున కొన్నిగలవు. అంత ఆ ఇల్లాలు ఇద్దరు ముసలమ్మలు కనిపించిరి గదా. బుట్టలు తెచ్చినామె ఒకతె. ఆమెను కసిరికొట్టిన మా అమ్మగారొకతె వీరిద్దరెవరు. అతని మెడయందలి సొమ్మెట్లిది? పిచ్చికుక్క కథ ఏమిటి అని అడిగినది? దానిని శాస్త్రిగారు ఆ ముదుసలులలో మొదటిది ప్రవృత్తియని రెండవది నివృత్తియనియు, చరిత్రలో అలర్కుడని రాజుండెను గదా పిచ్చికుక్క అతడు కావచ్చును. అతనికి తల్లిమదాలస ఉపదేశాక్షరములు గల ఉంగరము ఇచ్చినది. అదియే ఆ సొమ్ము కావచ్చును. ఆ స్వామి మాటాడుచున్నపుడు మాజనకుని వలెనుండుమని పల్కినాడు. ఆ స్వామి దత్తాత్రేయుడు గనుక మా జనకుడన్నమాటకు త్రిగుణాతీతుడగు త్రిపుటుల కతీతుడగు అత్రిమహర్షి అను అర్థము కూడా ఇప్పుడిప్పుడే స్ఫురించుచున్నది. ఇంతటి విషయ గౌరవముగల ఈస్వప్నము కల్ల అనుటకు వీలు లేదు. నా అదృష్టవశమున స్వామి స్వప్నమున సాక్షాత్కరించి కృతిపూరణము నకు తొందర పెట్టుచున్నాడు. అని చెప్పుచు శాస్త్రిగారారంభించిరి. గ్రంథారంభము నకు పూర్వమందు గ్రంథ మధ్యమందు దత్తాత్రేయుడు ఆత్రేయసగోత్రతా సంబంధబాంధవ్యము చేత ఈ గ్రంథ రచనకు ప్రేరేపించి కొనసాగించి సమగ్రత సంతరించి ఈ భాగవత తరువును ద్వాదశ గుచ్ఛ సంపన్నము చేసినాడు. గ్రంథాంతమున శాస్త్రిగారు కృతిపతియగు లింగోద్భవస్వామికి విన్నవించిరి. ఇది వీరి స్వప్నము. వీరి సంస్కారమునకు తగినట్లుగానే స్వప్నవృత్తాంతము కూడా కలసి వచ్చినది. నమ్మకము లేనివారికి ఇది అతిశయోక్తి అనితోచవచ్చును. శాస్త్రపద్ధతి ననుసరంచిన వారికి విశ్వాసమే పరమావలంబము. ఈ వ్యాసరచయిత కట్టి విశ్వాసము కలదు. అందుచేత ఈ స్వప్న వృత్తాంతమును సమగ్రముగ ననుశీలించి యధాతథముగా ప్రస్తావించుట జరిగినది. స్వప్న వృత్తాంత ప్రథమ సంవిధానము తిక్కన గారిదనుకొంటిమి. శాస్త్రిగారికి తిక్కన గారనిన అభిమానము మెండు. ఆత్మీయత అధికము కావున తిక్కన గారి స్వప్నమున హరిహరనాథుని వెంట కొమ్మనామాత్యుడుండి

దీవించినట్లుగనే శ్రీశాస్త్రిగారి స్వప్నమందు వారి తండ్రిగారగు వెంకటప్పయ్యశాస్త్రిగారు పుస్తకము తోడ, తెచ్చిన మహానుభావుడుగా వచ్చి దీవించి యుండవచ్చునని, నిశ్చితాభిప్రాయము ప్రకటించుటలో ఈ వ్యాసకర్త వెనుదీయుటలేదు. సంస్కృతమున దత్తమాహాత్మ్యమను పేరుతోనున్న మూలగ్రంథమునందు కథాంశములతో బాటు సంగతముగనున్న అద్వైతతత్త్వమును శాస్త్రిగారు ప్రత్యేక శ్రద్ధతో పరిశీలించి అనేక ఉపనిషత్తాత్పర్యములను సూత్రగీతాభాష్యరహస్యములు మేలవించి మూలమునకు వెఱుగుపెట్టుచు, ఒక్కొక్కచోట మూలాధికముగా వివరించుచూ వ్యాఖ్యాగతములైన అంశములను కూడ కూర్చుకొని తత్త్వ ప్రతిపాదనము గావించిరి. కథాభాగము లేకున్నచో ఇయ్యది అద్వైత సిద్ధాంత గ్రంథమనవచ్చును. శంకరాచార్యులవారు సూత్రభాష్యప్రారంభమున చూపిన అనుబంధచతుష్టయము ఈ ప్రకృత గ్రంథమున చక్కగా కుదిరినది. ఏ వేదాన్త గ్రంథమునకైననూ ఈ లక్షణములు సరిపడియుండునని వీర వాదము చేయవచ్చుగాని తిక్కనగారి భారతమునందు నాటకీయతవలె వీరి దత్తభాగవతము నందు స్వప్నవృత్తాంతము కేవలము గ్రంథారంభము మాత్రమే కాకుండా భావికథాంశ సూచకము, విషయ వ్యంజకముగా కూడా సమన్వయించుట విశేషము 1 ఇందలి విషయము అద్వైత తత్త్వము, 2 ప్రయోజనము - కైవల్యము, 3 సంబంధము - తదనుసంధాన నిరంతర అభ్యాసము, 4 సాధన చతుష్టయ సంపన్నుడు, ఈ కైవల్య ప్రాప్తికధికారి. శాస్త్రాధ్యయనము చేత వివేకము, విషయముల యెడ విరాగిత, సన్యాసేచ్ఛచే, శమదమాదులు, నిర్దేశపూర్వకమైన ముముక్షుత ఈ స్వప్నవృత్తాంతమందభివర్ణింపబడినది. శ్రవణ, మనన, నిదిధ్యాసనములు, సవికల్ప నిర్వకల్ప సమాధులు అపరోక్షానుభూతి యథాక్రమముగా, ప్రస్తావింపబడి సాధనాభ్యాస మార్గములు సూచించుచున్నవి. స్వప్నబోధముచే గురూపదేశము సంగతమైనది. పినతల్లి రూపమున పరదేవతాను గ్రహముకూడా ఇందు సంభావింపబడినది. వాసుదేవార్జునుల ప్రస్తావము చేత భగవద్గీతాతత్త్వమిందు నిబంధింప బడినదని సూచితమైనది. అలర్కాదుల చరిత్రములు ఇందు రాబోవును అను అంశము కూడా ఈ స్వప్నమున చేరకపోలేదు. ఈ గ్రంథమున ప్రతిపాదింపబోవు అద్వైత సిద్ధాంత స్వరూపమంతయు రేఖా మాత్రముగా ఇందు పరామర్శింప బడినది. పై విధముగా గ్రంథగత విషయమునకు దర్పణమువలె ఈ స్వప్న వృత్తాంతము భాసించినదనుటలో అసంగతి ఏ మాత్రము లేదు.

కృతి పతి :- శ్రీశాస్త్రిగారు నివసించిన చందవోలుగ్రామమున శివాలయము, విష్ణుదేవాలయము కలవు. లింగోద్భవస్వామియనియు చెన్నకేశవస్వామియనియు ఇచ్చటి శివకేశవుల నామధేయములు. శాస్త్రిగారి తండ్రి గారి కాలము నుండియు ఈ దేవాలయములలో నిరంతరము ఉత్సవములు పూజలు చేయించు చుండెడివారు. ఈ రెండు దేవాలయములు ప్రక్క ప్రక్క నుండుట కూడా యాదృచ్ఛికము. శాస్త్రిగారు తమకావ్యములను శివకేశవులకంకితము చేయదలచిరి. దత్తభాగవతమునకు పూర్వమే రచింపబడిన "యామావిక" అనుకావ్యముకూడ ఈ దత్త భాగవతముతో బాటు ప్రకటించి శివకేశవులకు కృతి నొసంగిరి. అందు దత్త భాగవతమును లింగోద్భవ స్వామికి అంకిత మొసంగిరి. యామావికను చెన్నకేశవ స్వామికి సమర్పించిరి. ఈ విధముగా తమకవితా కన్యకలను ప్రతిపాదించి శివకేశవులనిద్దఱిని అల్లుండ్రగా చేసికొనిన భాగ్యశాలి శ్రీ శాస్త్రిగారు. తిక్కన గారి హరిహరాద్వైతమును తమకృతుల ద్వారా ప్రదర్శించి మతసామరస్యభావనకు మార్గదర్శకులైనారు.

## 3వ అధ్యాయము

## ఏతద్గ్రంథమూలపురాణ ప్రాశస్త్యము - దత్త మాహాత్మ్యము - దత్త భాగవతము

జీవుని మనోమయకోశమునందు వేదమావిర్భవించినది. మనోమయ కోశమునొక పక్షిగా పోల్చి మనోమయకోశమునకు, తల, యజుర్వేదము, కుడిరెక్క ఋగ్వేదము, ఎడమరెక్క సామవేదము ఆదేశము ఆత్మ, తోక అథర్వాంగిరసము అని తైత్తిరీయానందవల్లి అభివర్ణించినది. ఇట్లే పురాణములుకూడా అతి ప్రాచీనములైనవి మనోమయ కోశములోనివియే! ఋక్కుల అధ్యయనము వలన దేవతలకు పయఆహుతులు అగునని యజస్సుల అధ్యయనముచేసినచో దేవతలకు ఘృతాహుతులు అగునని సామములు అధ్యయనము చేసినందువలన సోమాహుతుల అగునని, కల్పములు, గాథలు, పురాణములు, బ్రాహ్మణములు, ఇతిహాసములను అధ్యయనము గావించిన అవి మేదాహుతులగునని స్వాధ్యాయాధ్యయనముచేత దేవతలు ప్రసన్నులై ఐహికాముష్మిక ప్రయోజనములను చేకూర్చెదరని తైత్తిరీయ స్వాధ్యాయ బ్రాహ్మణోపనిషత్తు చాటుచున్నది. వేద పురాణాదుల పరమార్థ తాత్పర్యము చతుర్విధ పురుషార్థ నిరూపణము అందును మోక్షపురుషార్థనిత్యతను,

---

తైత్తిరీయారణ్యక స్వాధ్యాయ బ్రాహ్మణోపనిషత్తు.



లలితా దేవి

చివరికి బ్రహ్మాత్మైక్య విజ్ఞానమును క్రమముగా తెలిపి మానవునికి కైవల్యప్రాప్తి ముఖ్యోద్దేశముగా కన్పట్టుచుండుట తద్విదులకు తెలిసిన సత్యము. యుగధర్మములు కాలధర్మములను బట్టి ఉపేయమైన పరబ్రహ్మజ్ఞానము మరగున బడి అజ్ఞానమధికమై వేదపురాణాదులకు ఏకార్థ తాత్పర్య నిర్ణయమున పెక్కువికల్పాలు, పెక్కు మత భేదములునూ పొడసూపినవి. కానీ పూర్వులైన ఋషులు వేద పురాణాదుల తాత్పర్యము తమ తమ తపస్సులు యోగములు ఉపాసనలు మున్నగు సాధనముల ద్వారా చదివిన విద్య లకు మహత్త్వము సంపాదించుకొని బ్రహ్మాత్మైక విజ్ఞానమునుగా తెలిసికొని తరించి కైవల్య ప్రాప్తినందురనుటకువేద పురాణాదులలోని గాథలే ప్రమాణములు.

ఇక అజ్ఞానావస్థలో చిక్కుకున్న జీవులు సంసారార్ణవనిమగ్నులై కామము, క్రోధము అనెడి అతి క్రూరములైన తిమితిమింగిలాదులచే భక్షింపబడిన అవయవములు కలవారై మోహాదులనెడి బృహత్తరంగముల మధ్య కొట్టుమిట్టాడు చున్నవారై దిగజారి అధోగతి పాలగుచున్నారు. ఇట్టి వారిని ఉద్ధరించుటకు మహావిష్ణువే పరాశరునివలన సత్యవతియందు వ్యాసాచార్యునిగా అవతరించినాడు. ఇది మహావిష్ణువు యొక్క జ్ఞానావతారము. ఈ వ్యాసాచార్యుడే అల్పాయుష్కులు మంద బుద్ధులనుద్ధరించుటకు వేదము చతుర్విధములుగా జేసినాడు. పైల వైశంపాయన, జైమిని, సుమంతులను క్రమమున తత్తద్వేద ప్రవర్తకులను జేసి శిష్యప్రశిష్యుల ద్వారా ప్రచారము గావించినాడు. మరియు వేదార్థోపబృంహణమునకై వేద సమ్మితములు వేద మంత్రములవంటి శ్లోకములతో కూడిన పూర్వకల్పములలోనున్న ఇతిహాస పురాణములను ఏకకంఠోక్తిగా సర్వోపకారముగా ప్రణయనము గావించిన ప్రాతఃకీర్తనీయుడైన పుణ్య శ్లోకుడాయున వేదమంత్రములవంటి శ్లోకములను చదివి ధ్యేయమును నిధ్యానించి తరించిన ధర్మ వ్యాధాదులెందరో ఈ పురాణేతిహాసములందు దర్శనమిత్తురు. వేదముల విషయమునందేకాక పురాణేతిహాస సములందు కూడా వివాదమందు దురని తలచి యే కాబోలు మందానుజిఘృక్షతో అష్టాదశ పురాణసంహితను ప్రణయనము గావించినట్లు కన్పట్టును. ఇతిహాస పురాణములు కూడా పంచమ వేదమని ఈ క్రింది శ్లోకముల ప్రామాణ్యముతో నిశ్చప్రచముగా చెప్పనొప్పగును.

**మన్వంతరేషు సర్వేషు ద్వాపరే ద్వాపరేయుగే ।**
**ప్రాదుఃకరోతి ధర్మార్థీపురాణాని యథావిధి ॥**
**ద్వాపరే ద్వాపరేవిష్ణుం వ్యాసరూపేణ సర్వదా ।**
**వేదమేకం స బహుధా కురుతే హితకామ్యయా ॥**

అల్పాయుషోఽల్పబుద్ధీంశ్చవిప్రాన్‌జ్ఞాత్వాకలావథ ।
పురాణ సంహితాం పుణ్యాం కురుతేఽసౌ యుగే యుగే ॥
నిస్తారాయతు లోకానాం స్వయం నారాయణఃప్రభుః ।
వ్యాసరూపేణ కృతవాన్ పురాణాని మహీతలే ॥
పఠనాత్ శ్రవణాత్తేషాం నృణాం పాపక్షయో భవేత్ ।
ధర్మాధర్మ పరిజ్ఞానం సదాచార ప్రవర్తనం ॥
గతిశ్చ పరమాతద్వత్ భక్తి ర్భగవతి ప్రభౌ     పద్మపురాణము
ఇతిహాస పురాణాని పంచమో వేద ఉచ్యతే     స్కాందము
ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్     బ్రహ్మాండ పురాణము

ఈ పై శ్లోకములు పై విషయములను సమర్థించుచున్నవనుట తెల్లము. వేదార్థము నిర్ణయించునపుడు ఇతిహాస పురాణముల పర్యాలోచన పూర్వకముగా చేయవలెననుమాట ఇచ్చట గుర్తుంచుకొనవలెను. వేదములు ప్రభుసమ్మితోపదేశములు కలవి. పురాణేతిహాసములు మిత్ర సమ్మితోపదేశయుజములు. సత్యము పల్కుము అని వేదాదేశమైయుండగా, సత్యము పల్కి హరిశ్చంద్రుడు ముక్తినెనసెననునది సేతిహాసము సయుక్తికమైన వాక్యార్థముగా తీర్చి అపోహలను దురూహలను దూరము చేయుట పురాణేతి హాసముల లక్ష్యమై యున్నది. ఇతి, హ, ఆస ఇట్లుండెనుగదా అని అర్థమై యుండగా, 1 పురా అనక్తీతి - పురాణం పురాతనమైన వృత్తమును పునరుజ్జీవింపజేయునది లేక పురా పూర్వస్మిన్, భూతం, పూర్వమందైనది ప్రాచీనమైనది. అను అర్థము వ్యుత్పత్తులను బట్టి తెలియుచున్నది. పై రెండింటి అర్థము లొకటిగా కన్పించినను ఇతిహాసములోని కథాంశములు ఈ కల్పములోనివిగాను పురాణాలలోని కథాంశములు పూర్వ కల్పములలోనివిగానూ ఆయా సందర్భములను బట్టి వేఱు వేఱు అర్థములు కలవిగా గుర్తింపవలెనని తెలియుచున్నది.

సర్గశ్చప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ ।
వంశానుచరితంచేతి పురాణం పంచలక్షణం ॥

అని ఐదు లక్షణములుకలది ఉప పురాణమని తెలియుచున్నది. కానీ శ్రీమద్భాగవత, బ్రహ్మాండ పురాణాదులనాలోచించినచో మహాపురాణములనుగా గుర్తించుటకు ఈ పది లక్షణములు ఉండవలెనని తెలియుచున్నది. బ్రహ్మాండ పురాణ ప్రస్తావనలో పది లక్షణములు ఉపాత్తములైనవి. 1. ప్రాణుల సృష్టి 2

ప్రతిసృష్టి (వికేంద్రీకరణము) 3. స్థితి వర్ణనము 4 లయవర్ణనము 5 కర్మవర్ణనము 6 మనువర్ణనము 7 ప్రలయవర్ణనము 8 మోక్ష నిరూపణము 9 హరి కీర్తనము 10 దేవాది కీర్తనము. ఈ పది లక్షణములతో నున్న మహాపురాణములు పద్దెనిమిదిగా ప్రసిద్ధికెక్కినవి. దేవీ భాగవతము 1వ స్కం భద్వయం - 1 (దేవీ) భాగవతము) 2 భవిష్యత్పురాణము మద్వయం చైవ - 3 మత్స్యపురాణము 4 మార్కండేయ పురాణము బ్రత్రయం - 5 బ్రహ్మపురాణము 6 బ్రహ్మాండ పురాణము 7 బ్రహ్మ వైవర్త పురాణము వచతుష్టయం - 8 వామనపురాణము 9 విష్ణు పురాణము 10 వరాహ పురాణము 11 వాయు శివపురాణము అనాపకూస్కలింగాని - 12 అగ్నిపురాణము 13 నారదపురాణము 14 పద్మ పురాణము 15 కూర్మపురాణము 16 స్కంద పురాణము 17 లింగపురాణము

పురాణానిపృథక్పృథక్ అని పురాణములు - 18 గరుడ పురాణము

ఇందు కొన్ని పురాణములకు తీసివేత లేక నామాన్తరము కొన్నింటికి కలుపుట కలదు గాని బ్రహ్మాండ పురాణము మహా పురాణముగా అన్నింటిలోనూ వర్ణింపబడి యుండుట విశేషము. ఇది 12వేల శ్లోక సంఖ్య కలదని మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి లౌకిక వాఙ్మయమను పుస్తకములోని 74 పేజీ సూచించుచున్నది. పురాణములన్నియు లక్షత్రయశ్లోక సమన్వితములని స్కాందమొక్కటి 85వేల శ్లోకాలని మొత్తము పురాణశ్లోక సంఖ్య చతుర్లక్షశ్లోక పరిమితమని తత్తత్పురాణ ప్రస్తావనలో కలదు. వీనికంటె అధికముగా ఉపపురాణాలు 34 అని అవి ఏకలక్షశ్లోక సమన్వితములనియు తెలియదగినది. లభ్యములైన ఉపపురాణములిట్లు కలవు. ఇందును బ్రహ్మాండమని యొక ఉపపురాణము కలదు. 1 నారదీయ 2 బృహన్నారదీయ 3 నందీశ్వర 4 బృహన్నందీశ్వర 5 శివ 6 సాంబ గణేశ 8 లైంగ 9 కల్కి 10 కాలికా 11 దేవీ 12 చండిక 13 వాసిష్ఠ 14 మారీచ 15 వారుణ 16 వామన 17 పారాశర్య 18 సనత్కుమారీయ 19 ధర్మ 20 శివధర్మ 21 బృహద్ధర్మ 22 విష్ణుధర్మ 23 విష్ణుధర్మోత్తర 24 నారసింహ 25 భార్గవ 26 బ్రహ్మాండ 27 ఆది 28 ఆదిత్య 29 నారద 30 దౌర్వాస 31 కాపిల మానస 33 ఔశనస 34 భవిష్యోత్తర

ఈ బ్రహ్మాండము, మహాపురాణోపపురాణములలో నుండుట అటుంచి బ్రహ్మాండపురాణానికే వాయుసంహిత లేక శివపురాణమని నామాంతరములున్నట్లు తద్గ్రంథ ప్రస్తావనలోనే గలదు. 18 మహాపురాణములలో, వైష్ణవ, భాగవత, నారద, గారుడములు విష్ణుపారమ్యమును, అగ్నిపురాణము అగ్నిపారమ్యమును, బ్రహ్మ

పద్మములు బ్రహ్మపారమ్యమును, బ్రహ్మవైవర్తము సవితృపారమ్యమును ప్రతిపాదించుచుండగా మిగిలిన పదిపురాణములు శివపారమ్యమునే ప్రతిపాదించుచున్నవి. "ఇతి శ్రీ వాయుపురాణం శివాపరాహ్వాయం సమాప్తమ్" ఇతి శ్రీ వాయూక్త చతుర్వింశతి సాహస్ర్యాం శివసంహితాయాముత్తరఖండే అని అముద్రిత ప్రతులలోనుండుటను బట్టియు బ్రహ్మాండము 24 వేల శ్లోకములు కలదని శివసంహిత వాయుపురాణము అనునామాంతరమును కలదనియు తెలియుచున్నది. ఈ పురాణము 1 ప్రక్రియాపాదము 2 అనుషంగపాదము 3 ఉపోద్ఘాత పాదము 4 ఉపసంహార పాదము అని నాలుగుపాదముల విభక్తమై 12వేల శ్లోక సంఖ్యతో ముద్రిత ప్రతిగా ప్రకాశించుచున్నది. కానిపై ముద్రితప్రతులను బట్టి చూచిన ఉపోద్ఘాతోసంహార పాదములు ద్వాదశ సహస్ర శ్లోకాత్మకమైనవిగా అముద్రితముగనే యున్నట్లు దీనితో కలిపియే పురాణాలు నాలుగు లక్షల శ్లోకాలు అనునది ఉపపన్నమగుచున్నదని తదభిజ్ఞుల వాదము. బ్రహ్మాండ చరితమిందు వర్ణింప బడినదిగాన బ్రహ్మాండమను పేరు ఈ పురాణమునకు సార్థకమయినది. బ్రహ్మాండ మనగా అపంచీకృత పంచమహా భూతాత్మకమైన హిరణ్యా గర్భ తత్త్వము, దీనినే అండమనియూ చెప్పుదురు. ఇదియే విరాడుత్పత్తికి స్థూల జగత్తుకు కారణభూతము. 14 భువనములకిదియే మూలము. బ్రహ్మాండము యొక్క స్థూలసూక్ష్మ కారణ సృష్టులకు మాయ, మూలమని అద్వైత సిద్ధాంత వ్యాసములో తద్వివేక పరిచయము చేయబడును. మాయను తనవశములో నుంచుకొని, నరులకు ఆయనమైనవాడే నారాయణుడు, అతడే అన్తర్యామి ఈశ్వరుడు అని, అతని చరితమిందు సాకల్యముగా నుపవర్ణిత మగుటచే దీనికి బ్రహ్మాండమను పేరుగల్గినదని ఈ పురాణ ప్రస్తావనలో కలదు. ఇక ముద్రితప్రతిలో ప్రక్రియానుషంగోపోద్ఘాతోప సంహార పాదములు లభ్యమయినంతవఱకు సృష్టి వర్ణనముతోనే ముగియుచున్నవి. మిగిలిన పురాణములు దీనియందు కొఱవడియుండుటను బట్టి పురాణ శ్లోక సంఖ్యోపపత్తికి సుమారు 15వేల శ్లోకములు అధికముగా నుండవలసి యుండుటను బట్టి అనుషంగపాదములో రేణుకాజదమగ్నులు తపశ్చర్యచే పార్వతీ పరమేశ్వరత్వము పొందుట, పరశురామోత్పత్తి, తత్కృతేశ్వరతపము, కార్తవీర్యార్జునుని సంహారము మున్నగు కథాంశములు. ఈ దత్త మాహాత్మ్యమునకు పూర్వకథాంశముబుగా వర్ణింపబడియుండుటను బట్టి దత్తదేవునియందు భక్తి గల సామంతోపాహ్వాయకుడైన ఆబాజీరామచంద్రనామకునిచే బెల్‌గాల్ పురి యందలి తనదైన శ్రీ రామతత్త్వప్రకాశముద్రాక్షరశాలయందు 1896 సంవత్సరమున బ్రహ్మాండ పురాణాన్త

ర్గతమైనదత్తమాహాత్మ్య సమాప్తి వాక్యములయందు మాత్రమే కాన వచ్చుటను బట్టి దత్తాత్రేయ మాహాత్మ్యము, బ్రహ్మాండ పురాణాన్తర్గతముగా నిర్ణయింపబడినది. ఇయ్యది ప్రథమాంశములో ఒక్క గద్యము, మిగిలినవి పద్యములుగా గలిగి ద్వితీయ, తృతీయ చతుర్థాంశలను పేరుతో నాలుగు అంశాలుగా మొత్తము 65 అధ్యాయములు కలదిగానూ, 4,744 శ్లోకములు కలిగి విభక్త విషయ వివేచనముతో విరాజిల్లుచున్నది. ఇందలి శ్రీ కృష్ణ శ్రీదామ సంవాదము అనసూయాత్రులకు స్వయం ప్రదత్తుడై శ్రీ మహావిష్ణువు దత్త స్వామిగా నవతరించుట, అవధూతయదు సంవాదము ప్రహ్లాదాజగరసంవాదము శ్రీమద్భాగవత మహాభారత కథాంశములతో పోలియున్నవి.కుంజల కపింజల సంవాదము వేననహుష చరిత్రలు మహాభారత కథాంశములతో సంవదించు చున్నవి. అనఘానఘ వ్రతము భవిష్యోత్తర పురాణాన్త ర్గతము ఏకాదశీవ్రతము భద్రశీల్లుని చరితము హుండవధమున్నగునవి పద్మ పురాణ కథాంశములను పోలియున్నవి. ఇందలి ఉపాఖ్యానములు ఇతరత్రకొన్ని కన్పించినను దత్తదేవుని లీలలు యోగతత్త్వ విద్యా రహస్యోపదేశములు, అలర్క కార్తవీర్యార్జునాది చరిత్రలు సప్తోదాహరణములు మున్నగునవి ఇతర పురాణా సాధారణములైన కథాంశములుసాకల్యముగా నుండుటను బట్టి దత్త మాహాత్మ్యమను పేరెంతయోదీనికి తగియున్నది. శ్రీశాస్త్రిగారు అనువదించిన దత్తభాగవతమునకు దత్త మాహాత్మ్యము మూలము. ఇయ్యది ఆదిమధ్యావసానములందు వైరాగ్యాఖ్యానములతో నిండియున్నది. దత్తలీలా కథావ్రాతమనెడు అమృతముతో ఆనందింపజేయబడిన సురలు సత్పురుషులు కలది అగుటవలన సర్వవేదాన్తసారమైన బ్రహ్మాత్మైక్యలక్షణము, అద్వితీయ వస్తుప్రతిపాదకమగుటవలనను ఏతత్కథామృత తృప్తునికి ఇతరత్ర రతి యుండకపోవుటవలననూ పురాణములలో శ్రేష్ఠతమమై జ్ఞానపూర్వక నైష్కర్మ్య ప్రతిపాదకమగుటవలననూ శ్రీమద్భాగవతమును సర్వదా సర్వథా పోలియుండి భుక్తి ముక్తి ప్రదమగుటను బట్టి శ్రీశాస్త్రిగారు ప్రథమ, ద్వితీయ భాగములుగా 2,784 పద్యములు గల 12 గుచ్ఛములతో ఈ దత్త మాహాత్మ్యమును దత్త భాగవతముగా తెనిగించి తెనుగుకవివరేణ్యులకు తెనుగు భాషాసేవకులకు మార్గదర్శులైన మహర్షులైనారు.

# 4వ అధ్యాయము

# దత్తభాగవత నామౌచిత్యము

ఏదేని ఒక పురాణముగాని, కావ్యముగాని, నాటకముగాని, ప్రబంధముగా వచనరూపములైనవి కాని రచించునపుడు ఆయాగ్రంధములందు ప్రతిపా విషయమును కథాంశమును లేక స్వప్రతిభతో కవికల్పించిన నూతన సన్నివేశము ఉద్దేశించి ఆయా అర్థస్ఫోరకమైన నామమును ఆయాగ్రంథములకు నిర్ణయించు కవిలోకసాధారణమై యున్నది. గ్రంధములోనీ అన్ని విషయముల స్పృశించుటయేగాక అంగియైన రసములేక భావము కవిప్రతిభ వ్యుత్ప భ్యాసములు రచనారంభముల్లాసము, అను బంధచతుష్టయము తత్త్గ్రం నామము శ్రుతిగోచరమయినంత మాత్రము ననే తెలియగలవు. మరియ ఔచిత్యముగా సంతరించిన గ్రంధ నామమును బట్టి యేతద్గ్రంధప పఠనోత్సాహము చదువరులకు కలిగి ఆ గ్రంథమునకు గ్రంథకర్తకు కీర్తి ప్రతిష్ఠ ఇబ్బడిముబ్బడిగా పెరుగుచుండు ననుటయు అనుభవసిద్ధము, కాళిదాసు శకుంత కధ ప్రధానముగా తన నాటకము నిబంధింపబడిననూ, అందు అభిజ్ఞా వృత్తాంతము నూత్నముగా కల్పింబడుటను బట్టి అభిజ్ఞాన శాకుంతలము అనుపే పెట్టి నామౌచిత్యమును వినూత్నముగా సంతరించు కొనినాడు. భవభూతి త నాటకమున ప్రధాన నాయకుని యందు గల ప్రసన్న గంభీరతలను చూ లోకోత్తరునిగా సృజించుట, సర్వశ్రేష్ఠత్వమును ప్రతిపాదించుటను బట్టి ఉత్తరరామచరితమను పేరు పెట్టి నామౌచిత్యమున కృతకృత్యుడైనాడు. ఏవ విధముగనే ఈ కవి వరేణ్యులు దత్తభాగవతము అనుపేరు వినినంతనే ఇయ్య కేవలము దత్తాత్రేయుని మహిమను వర్ణించునదియేకాదు. ఈ గ్రంథము వర్ణింపబడిన దత్తావతార విషయవివేచన ప్రయోజనములు తత్కృతయోగత విద్యా రహస్యములు నిత్యము మనమున అనుసంధానించు కొని అవిస్మరణ భాగవతమువలె నిత్యపారాయణగ్రంథముగానయిఏతద్గ్రంథపఠితలకు ఐహి ముష్మికములైన ప్రయోజనములను సమగ్రముగా సమకూర్చు పాఠకలోకమున పరిచయ మొనర్చుట కొఱకే దీనికి దత్త భాగవతమని పేరిడినట్లు తెలియుచున్న శ్రీ దత్త చరిత్రము సంస్కృతమున బ్రహ్మాండపరాణాంతర్గతమగు ద మాహాత్మ్యము అను పేరుతో ప్రఖ్యాతమైయుండగా అనువాదకర్త తనయాం ప్రబంధమునకు "దత్తభాగవతమని" నామకరణము చేసినారు. పురాణముల భాగవతమనియు, దేవీభాగవతమనియూ విషయభేదము గల రెండు పురాణము



గాయత్రీ దేవి

గలవు. మిగిలిన పురాణములలో దేనికిని నామధేయమునందు భాగవత శబ్దము కానరాదు. ఈ భాగవత శబ్దమునకు భగవతః ఇదం అనువ్యుత్పత్తి చేత భగవంతునికి సంబంధించినది అని అర్థము. సంస్కృతవ్యాకరణమున శివ భాగవతుడు మొదలగు అసమర్థసమాసములను సాధించుపట్టున వైయాకరణులు భగవతి భక్తః భాగవతః భగవద్విషయమున భక్తి భావము కలవాడు భాగవతుడనియు, శివునియందు భగవద్విషయక భక్తి కలవాడు శివభాగవతుడనియు వివరించిరి. కానీ ఈ భాగవత పురాణమునకు సంబంధించి తస్యేదం అను పాణినీయ సూత్రప్రకారము సంబంధార్థకమైన అణ్ ప్రత్యయముతో నిష్పన్నమైన భాగవత శబ్దమే సమర్థమై సముచితమైన అర్థమును బోధించుట నిస్సంశయము. దేవీ భాగవత శబ్దమున దేవ్యాః భాగవతం అని షష్ఠీసమాసమును ఆశ్రయించుటచేత దేవీ సంబంధమైన భగవద్విషయానువర్ణనమని అర్థము చెప్పికొనవచ్చును. వ్యాసమహర్షి మిగిలిన పురాణములను మత్స్య, కూర్మాది నామధేయము లతో వ్యవహరించి ఒక్కదానిని మాత్రమే కేవల భాగవతమని పేరుతో వెలయించుట దీని వైశిష్ట్యమునకు నిదర్శనము. ఉపపురాణములందలి దేవీభాగవతమున అనితరతాత్పర్యముతో దేవీమహిమాను వర్ణనమునిబంధించి తద్వైశిష్ట్యస్ఫో రకముగా భాగవతశబ్దమున వ్యవహరించుట జరిగినదని భావించుట సమంజసము కాగలదు. ఆంధ్రమున భాగవతానువాదములే కాక మరికొన్ని ఇతర ప్రబంధములకు కూడా భాగవత శబ్దాను సంధానముతో నామకరణము చేయుట గమనింపవచ్చును. ఉదాహరణమునకు "గురుభాగవతము" మొదలగునవి. సంస్కృతమున వైదిక ధర్మములకు సంస్కృతి సంప్రదాయములకు సనాతనాచార వ్యవహారములకూ నెలవులై సమస్త ప్రపంచమునకు శిరోధార్యములై వేదసమ్మితములైన మహా గ్రంథములు మూడు కలవు. 1. భారతము, 2, భాగవతము 3 రామాయణము, వీనిలో భారతమందు పర్వములనియూ భాగవతమున స్కంధములనియూ, రామాయణమున కాండములనియూ విభజింపబడుట సుప్రసిద్ధము. ఈ ప్రహతమైన పద్ధతిని అనుసరించి ఆంధ్రమున అనువదించిన వారుకూడా భారత, భాగవత రామాయణములను పర్వ, స్కంధ, కాండాత్మకముగా విభాగము చేసిరి. ఈ ఒరవడికి కూడా సంస్కృతమున మహాపురాణమగు శ్రీదేవీ భాగవతమునను సరించియే శ్రీమద్భాగవతమునందు కూడా స్కంధవిభాగమును పాటించుట జరిగి యుండవచ్చును. ఆ సంప్రదాయము ననుసరించియే ప్రకృత

గురుభాగవతము - మిన్నికంటి గురునాథశర్మ విరచితము

అనువాదకర్తలు శ్రీశాస్త్రిగారు తమ అనువాద నిబంధమును భాగవత నామ ధేయముతో వెలయించి అందును పంద్రెండు గుచ్ఛములుగా విభజించిరి. భాగవతమున విభాగము స్కంధాత్మకమై యుండగా ఇందు గుచ్ఛములుగా విభజించుటకు గల కారణములను పరిశీలింపవలసియున్నది. సంస్కృతమున ప్రథమముగా ఇట్టి విభాగము వొనర్చినవారు వ్యాసవాల్మీకులు. వారు ఆయా గ్రంథముల స్వరూప స్వభావ తాత్పర్యములను బహుధామననమొనర్చి తత్సమన్వయ పూర్వకముగా అట్లు విభజించిరి. ఆంధ్రమున తదనువాదకర్తలు కూడా ఆ విభాగమునే అనుసరించిరి. శ్రీ శాస్త్రిగారు సంస్కృతమున బ్రహ్మాండ పురాణాంతర్గతమైన 'దత్త మాహాత్మ్యమును అనువదింపదలచి ఇది ప్రత్యేక ప్రబంధమగునెడల భాగవతముతో సమానమైన మహాత్మ్యమును మహావిషయము కలదానినిగా భావించి దీనిని దత్త భాగవతమను పేరు వెలయించిరి. ఈ గ్రంథమును వారి గ్రామమున కొలువుదీరిన లింగోద్భవ స్వామికి అంకితమొనర్చిరి. ఈ సందర్భమున సూక్ష్మబుద్ధితో ఔచిత్యమునకు ప్రాధాన్యమొసగి స్కంధపదమునకు బదులుగా గుచ్ఛ శబ్దమును ప్రయోగించిరి. స్కంధమనగా మ్రాను అని అర్థము. గుచ్ఛము అనగా పూలగుత్తి అని అర్థము. స్వామికి అంకితముగా సమర్పించుచున్న ఈ గ్రంథవృక్షమున స్కంధములని పేర్కొనుట కంటె గుచ్ఛములని పేర్కొనుట ఉపపన్నముగా నుండునని భావించిరి. స్వామికి పుష్పగుచ్ఛములను సమర్పించుట సందర్భోచితము. అందువలనన ఈ దత్త భాగవతమున పంద్రెండు ఆశ్వాసములకు గుచ్ఛములని పేరిడిరి. ఇక దత్తభాగవతమన్న నామధేయమును పరిశీలింపవలసి యున్నది. పురాణములందు శివకేశవులయొక్కయు, శక్తులయొక్కయు, అవతార విశేషమహిమలు అనేక స్థలములందు అనేక విధములుగా అభివర్ణింపబడినవి. శక్తికి సంబంధించిన సమగ్రరూప దర్శనము మిగిలిన పురాణములయందు రేఖా మాత్రముగను మార్కండేయ పురాణమున అధికముగను కూర్పబడినను సమగ్రముగు దేవీ మహాత్మ్యము యావచ్ఛ్లోకముగా నిబంధింపబడుటచేత తత్ప్రాశస్త్యమును ఉగ్గడించుటకై దేవీమాహాత్మ్య ప్రతిపాధనపరమగు పురాణమునకు దేవీభాగవతమను పేరు సమంజసముగా యుక్తిసహముగా కనుపట్టుచున్నది. అట్లే ప్రత్యేకావతార మనదగిన దత్తాత్రేయుని మహిమానువర్ణనము. ఇతర పురాణము లందు ఎంతైనను రేఖామాత్రముగా ప్రస్తావించబడెనేమోగాని బ్రహ్మాండ పురాణమనందు అరువది యైదు అధ్యాయములలో సమగ్రముగా శ్రీదత్తమహిమ నిరూపింపబడినది. ఆభాగమును ఆంధ్రీకరించుచూ దత్త ప్రాశస్త్యమును సమగ్రముగ

ఉగ్గడించుగ్రంథమిదియే కావున దీని సారమును నిరూపించుటకొఱకు దీనికి దత్త భాగవతమని పేరిడిరి. దత్తాత్రేయునకు సంబంధించిన భగవద్విషయానువర్ణన పరమైన ప్రబంధమని దీనికర్థము చెప్పికొనవచ్చును. అంతే గాక భాగవతమని పేర్కొనుటకు కొన్ని అర్హతలను మహర్షులు నిర్దేశించిరి.

శ్లో॥ యత్రాధికృత్యగాయత్రీం వర్ణ్యతే ధర్మ విస్తరః ।
వృత్రాసురవధో పేతం తద్భాగవతమిష్యతే ॥ మత్స్యపురాణము

శ్లో॥ గ్రంథో౽ష్టాదశసాహస్రః ద్వాదశస్కంధసంయుతః ।
హయగ్రీవ బ్రహ్మవిద్యా యత్రవృత్రవధస్తథా ॥
గాయత్ర్యా చ సమారంభః తద్వైతభాగవతం విదుః ॥ స్కాంధపురాణము

శ్లో॥ అర్థోయం బ్రహ్మ సూత్రాణాం భారతార్థవినిర్ణయః ।
గాయత్రీభాష్యరూపోసౌ వేదార్థ పరిబృంహితః ॥

శ్లో॥ పురాణానాం సారరూపః సాక్షాద్భగవతోదితః ।
ద్వాదశస్కంధసంయుక్తః శతవిచ్ఛేద సంయుతః ॥

శ్లో॥ గ్రంథో౽ష్టాదశసాహస్రః శ్రీమద్భాగవతోదితః గరుడపురాణము

ప్రధానముగా భాగవతమనబడుటకు బ్రహ్మసూత్రముల తాత్పర్యము భారత తత్త్వము 7గాయత్రీమహిమము ఔపనిషదవిషయము నిరూపింపబడి సర్వపురాణసారమనదగి ద్వాదశ స్కంధములు కలిగి అష్టాదశ సహస్ర శ్లోక సంఖ్యతో నొప్పారి హయగ్రీవాద్యవతారపురుషుల బ్రహ్మవిద్యోపదేశ రహస్యములు వృత్రాసుర వధము మున్నగు కథాంశములతో కూడినట్టివి భాగవతములు అగునని పై ప్రమాణములవలన తెలియుచున్నది. భారతాదులలో పై విషయములన్నియునూ సంగృహీతములైనను భారతమున విశేషముగా భగవద్గీత అనూదితమైననూ సమగ్రముగను ఐకాంతికముగనూ, వేదాన్తతత్త్వప్రతిపాదన పరమైన శ్రీమద్భాగవత మహాపురాణమునకే మహామునులంతటి గౌరవమును ప్రకటించినారు. మరియు వేదాన్త గ్రంథములన్నియూ ఆదిని వేదాన్తముతో ప్రారంభమై తత్సాధన భూతములగు కర్మోపదేశములు ఉపసంహారములుగా నుండుట భాగవతలక్షణము లేక వేదాన్తగ్రంథ లక్షణమై యున్నది. అందునూ అద్వైతతత్త్వ ప్రతిపాదనమే ప్రధానముగా కానవచ్చును. ప్రతి ఇతివృత్తము అద్వైత తత్త్వ తాత్పర్యమునందే సమన్వయించి పర్యవసానము చెందును.

సగుణస్వరూపవైభవమంతయూ నిర్గుణ తత్త్వమునందే అఖండ సత్యముగా సమవేతమగును. ఇదేవిధముగా ఈ దత్త మహాత్మ్యమున అవతార రూపుడగు దత్తాత్రేయుని బోధలందు వేదాన్త తత్త్వము బహుత్ర ప్రతిపాదింపబడుటయూ సర్వపురాణాను సారము భగవద్విభూతిని నిరూపింపబడుటయూ ఇంద్రునకు స్వారాజ్యలక్ష్మిని అనుగ్రహించిన వృత్రాసుర కథ జంభాసురవధోపాఖ్యానము వర్ణింపబడుట గాయత్రీ స్వరూపిణియగు సంధ్యాదేవి యొక్కయు,రేణుక యొక్కయూ మహిమను చెప్పుటవంటికథాంశములన్నియూ అద్వైతవేదాన్త అనుసంధానమున పర్యవసానము చెందుటయూ, స్థూలరూపమున ద్వాదశ చ్ఛాత్మకతయూ, మనసునందుంచుకొని ఈ నిబంధనమునకు దత్త భాగవతమని పేరు పెట్టుట జరిగినది. పురాణ వాఙ్మయమునందు భాగవతమునకు గల ప్రశస్తిని అట్లుంచి ఈ నాటి తత్త్వజ్ఞ విద్వత్పౌరాణిక లోకమున కూడా భాగవతమునందు ప్రత్యేక ప్రతిపత్తి కలదు. భాషయందు విషయమునందు శాస్త్ర రహస్య నిరూపణమునందు బహిరంతస్సార బంధురమైన భాగవతము ఎంతటి మహావిద్వాంసులకైననూ ఆచార్యోపదేశము సంప్రదాయజ్ఞానము లేనిదే సమన్వయ మగుట కష్టమని అభియుక్తోక్తి. కేవలపాండిత్యమునకే కాదు ఔపనిషద రహస్యజ్ఞతకు ఈ భాగవత సమన్వయము నికషోపలమని పెద్దల నిశ్చయము. పండితలోకమున విద్యావతాం భాగవతే పరీక్షా" విద్యావేత్తలకు అనగా ఆధ్యాత్మిక విద్యనెఱిగినవారికి భాగవతమును సమన్వయ మొనర్చి ప్రవచింపగలుగుటయే పాండిత్య పరీక్ష అగునని, ప్రచారములో నున్నది. శ్రీ శాస్త్రిగారు తమ భాగవతమున ఆయా కావులందు వేదాన్తార్థములను తద్రహస్యములను నిరూపించు సందర్భములందు మూలాధికముగా స్వతంత్రించి ప్రస్థానత్రయము, యోగ తారావళి, పాతంజలము ఉపనిషద్వాక్యములు మున్నగువాని సారాంశములను తమ ప్రౌఢ సుందరశైలిలో అనువదించి దీనికి భాగవతమన్న పేరును సార్థకమును సప్రయోజనమును చేసినారు.

## 5వ అధ్యాయము

## లక్ష్మీ నారాయణులు - అనఘానఘులు

సత్యము జ్ఞానము ననంతమునైనది బ్రహ్మము. ఏకము అద్వితీయము బ్రహ్మము. తదభిన్నయుతచ్ఛక్తిగా ప్రతీతమైనది మాయ. ఈ మాయ యొక్క శుద్ధ సత్త్వాంశమున ప్రతిఫలించిన బ్రహ్మమే సమష్టి చైతన్యాత్మకుడగు ఈశ్వరుడు మాయ యొక్క మలిన సత్త్వాంశయందు ప్రతిఫలించిన వ్యష్టిరూపుడు జీవుడు.



బాలాంబిక

న్మాన్యతీతాని కియన్తి మేహో ఉచ్చావచత్వం యదభూత్సుఖదుఃఖహేతోః
ృద్ధాసదాస తమతామవిపద్య పుణ్యాత్ బాలేతవానుగ్రహ వశాన్మమ సుప్రభాతమ్

జీవునియొక్క ఆవరణరూపమగు అవిద్యానాశము వలన జీవేశ్వరులు ఒక్కటిగనే భాసింతురు. మాయా కల్పితమగు ఈశ్వరబ్రహ్మభేదము స్వరూపాను సంధాన పరమావధిగా పరాస్తమగును. "అహం బ్రహ్మాస్మి" మాయా కల్పితమైన ప్రపంచమున ఈశ్వర చైతన్యాంశములు జీవరూపముతో భాసించి మహదాదితత్త్వముల సమాహారముతో అహంకార మమకారములను, కర్తృత్వ, భోక్తృత్వములను సుఖదుఃఖములను తనకు కలిగించుకొని సంసారవాసనాబద్ధులై జన్మజరామరణాది చక్రభ్రమణమున ఆవర్తములందు కృములవలె ప్రారబ్ధ వశమున అవశములై ప్రవర్తించుచున్నవి. ఇట్టి జీవులు మాయావశమున జగన్మిథ్యాత్వమును, బ్రహ్మసత్యమును తెలిసికొనజాలక స్వప్నమువలె వ్యవహార సత్యమగు ప్రపంచమున జన్మాది క్లేశములనను భవించు -చున్నారు. ఇట్టి జీవులు తత్వజ్ఞానమువలన అపరోక్షానుభవమునంది అఖండ బ్రహ్మను భావమును నెనయుదురు. అదియే ముక్తి. ఇదే కైవల్యము, అవిద్యా వరణము నశింపనంతవరకు ఈ జీవునకు సంసార బంధము తప్పనిసరి. గురూపదేశము వలనను శాస్త్రపరిశీలనము వలనను పూర్వసంస్కారబలము వలనను జీవునకు స్వస్వరూపానుభూతి కలుగును. అట్టి స్థితి పొందుటకు శాస్త్రములందు అనేకములైన మార్గములు సాధకునకు బోధింప బడినవి. తత్త్వస్వరూపము ఒక్కటైననూ తత్తదాచార్యుల దర్శన భేదమును బట్టి తత్త్వస్వరూప నిరూపణమున భేదములు కానవచ్చినవి. ఒక్కొక్కటి ఒక్కొక్క సిద్ధాంతమై బహుమతములైనవి.

సాధకులెంచుకొన్న మార్గములకు తగి, సగుణ, నిర్గుణోపాసనములు వారి తారతమ్యమును బట్టి కర్మోపాసనాభక్తి జ్ఞానములు శాస్త్రములందు బోధింపబడినవి. సమష్టి చైతన్యరూపుడగు ఈశ్వరుడు మాయాసహకారముతో ఆయాగుణముల ప్రాధాన్యము ననుసరించి త్రిమూర్తులుగా మూర్తిమంతుడైనాడు. ఆ ముగ్గురు మూర్తులు కూడా దేశకాల అవస్థా అనుగతములైన ఆయా ప్రయోజనముల కొఱకు వివిధములైన అవతారములు దాల్చిరి. అన్నిటికీ మూలమైన ఈశ్వర తత్త్వమును ప్రధ్యానించిన వానికి ఇన్నిమతములు, ఇన్ని మార్గములును ఉండవు. నామరూపములకు అతీతమైన ఈశ్వరతత్వమునందు మనసు నిల్పిన వానికి ముక్తి మార్గము సులభము. అనేకప్రయోజనములనుద్దేశించి గుణమయములైన ఈశ్వర రూపములు అవతరించిన అవతారములు అనేకములు, శివుడేమి విష్ణువేమి ఎన్నెన్నో అవతారములు దాల్చిరి. సాధారణముగా ఇట్టి అవతారములకు దుష్టశిక్షణము శిష్టరక్షణము భూభారహరణము ప్రయోజనములుగా నున్నవి. ఇట్టి ప్రయోజనములకు అతీతముగా మరికొన్ని అవతారములు కేవలము శిష్యులకు

భక్తులకు ఆశ్రితులకు తత్త్వబోధమొనర్చిన ప్రత్యేకావతారములు కొన్ని కః
దక్షిణా మూర్తి హయగ్రీవుడు, కపిలుడు, దత్తాత్రేయుడు, వ్యాసుడు, శం
చార్యులు, సనత్సుజాతులు మున్నగువారు జ్ఞానబోధకొఱకు అవతరించిన
ఇట్టి అవతార పురుషులు అద్వైతసిద్ధాంత ప్రతిపాదన మొనర్చుటతో బాటు ఇ
మత సిద్ధాంతములను ప్రస్తావించుట కూడా గమనింపదగినవిషయ
నిర్గుణోపాసనతో బాటు సగుణోపాసనలను, జ్ఞానయోగములను భక్తిని, ఉపాస
శ్రేయోమార్గములుగా తత్తద్దర్శనములతో నిరూపించి బోధించిరి. ప్రాపం
క్లేశములతో క్రుగ్గుచున్న ప్రజలందు కారుణ్యముతో లీలా స్వీకృత విగ్రహ
సదుపదేశములు గావించిరి. మానవులకు ఆయా భక్తి జ్ఞాన రహస్యము
తెలిసికొనుటతో బాటు ఆయా అవతార పురుషుల మహిమ విశేషము
తత్తదుపదేశములయందలి మర్మములను వారి ఉపదేశములవలన
ప్రవర్తనలను తెలసికొనుట మరింత ప్రయోజన కారి కాగలదు. శాంతిసౌఖ్యము
కోరుకొను ప్రతి మానవుడునూ, ప్రేయస్సుకు, శ్రేయస్సుకు, సాధన
మార్గములను తెలసికొనుట అవసరమై యున్నది. అట్టి వాడు వేదము
శాస్త్రములను, సూత్రములనూ భాష్యములను సమన్వయ పరచుకొనజాలని
ఆయా మహాపురుషుల ప్రసంగములలోని ఉపదేశములను ధర్మము
జ్ఞానమును, కొంత సులువుగా అవగాహన చేసికొనవచ్చును. ఒక్కసారి
గ్రంథము చదివిన దానికన్ననూ నిరంతరము అనేక గ్రంథములందు
విషయమును తఱచు పరిశీలించి యుండుట నిశ్చయ దార్ఢ్యము
ఉపకరించును. అందులకే ఇంతటి పురాణ వాఙ్మయము ఆ పురాణము
అందలి భాగములను ఎందరో విద్వాంసులు వారి వారి మార్గములలో అనువది
నారు. శ్రీ శాస్త్రి గారు కూడా అట్టి ప్రయోజనమునే ఉద్దేశించి ఈ
మాహాత్మ్యమును దత్త భాగవతముగా తెనిగించినారు. కావున ఆంధ్రభాషావేత్త
జిజ్ఞాసువులును సరళములు సరసములైనకధా ప్రసంగములతో బాటు అం
ఉపదేశ సారములను సులభముగ గ్రహించి తరించుటసుకరము. వి
అనసూయా అత్రి దంపతులకు స్వయం ప్రదత్తుడగుటచే విష్ణువే దత్తదేవు
పాపములు పోగొట్టువాడగుట వలన అనఘుడనియూ చెప్పబడు చున్నా
అతని ఒడిలోని లక్ష్మియే అనఘాదేవి. ఆమె అనఘుని వలన అష్టసిద్ధు
పుత్రులనుగా కనెను. అనఘానఘులు కలసియే యోగాభ్యాసరతులై దేవేంద్రాదు
జంభాసురవధోపాయమును చెప్పి అనంతసౌఖ్యమును ప్రసాదించిన అవ
వరిష్ఠులు. కార్తవీర్యుడు ఈ దత్తదేవుని కరుణవలననే అనేక వరము

పొందెను. మొదటివరము, బాహువులులేని తనకు బాహు సహస్రము, సప్తద్వీపాధి పత్యము 3 కామగమనవిమానము 4 స్వనామ స్మరణముచే నష్టద్రవ్య లాభము 5 ప్రసిద్ధునిచే చావు. 6 అష్టసిద్ధులు. 7 సకల జనమనః ప్రత్యక్షత్వము, అనఘానఘ వ్రతము దత్త భాగవతమున నవమగుచ్ఛము 117 నుండి 127 పద్యములు -ఈఅనఘానఘవ్రతముకలదు దత్తమా -4వఅంశ-6వఅధ్యాయము -70వశ్లోకము నుండి 87వశ్లోకమువఱకు అనఘానఘవ్రతము సంస్కృతమున వర్ణింపబడినది. దత్తాత్రేయుడు అధర్మ బుద్ధిగల వానిని సజ్జనులచే నివారింపజేయుట ధర్మముగా భూమినేలుట హరివలన వధకలుగుటలను కోరెను. పిదప అష్టసిద్ధులు సప్తద్వీపాధిపత్యము మున్నగు వివరములుగా పొందెను. దత్తదేవానుగ్రహము కార్తవీర్యునిపై కలుగుటకు అతడు చేసిన అనఘానఘవ్రతము ఏ ఒక్కడు ఆ వ్రతమును మానలేదు. ఒకప్పుడు ధర్మరాజుకు కృష్ణుడిట్లు చెప్పెను. రాజా! ఇది మార్గశిర బహుళ అష్టమినాడు చేయదగిన వ్రతము. ప్రతి సంవత్సరము చేయదగినది. బహుళాష్టమినాడు పుత్రులతో కూడిన అనఘానఘుల ప్రతిమలను ఏర్పాటు చేసికొనవలెను. ఋగ్వేదోక్తములైన ఋక్కులతో విష్ణువును ధ్యానించి పుష్పఫలగంధాదులతో అర్చన చేయవలెను ॥ఓం అతోదేవా అవంతునో యతో విష్ణుర్విచక్రమే పృధివ్యాః సప్తనామభిః ఇదం విష్ణుర్విచక్రమేత్రేధా నిదధే పదం సమూఢ మస్యపాం సురే త్రీణి పదానిచక్రమే విష్ణుర్గోప్తా అదాభ్యః అతోధర్మాణి ధారయతో విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పశ్యసే ఇంద్రస్యయుజ్య స్సఖా. తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః దివీవ చక్షురాతతం తద్విప్రాసివన్యవో జాగృవాంస స్సమింధతే విష్ణోర్యత్పరమం పదం॥ అను మంత్రాలతో, శూద్రులు నమస్కారముతో ధూపదీప నైవేద్యములతో ప్రద్యుమ్నాదులను కూడ ఆవాహనము చేసి పూజింపదగినది. అనఘావ్రత పారణమును మరునాడు నవమి రోజున బ్రాహ్మణభోజనానంతరము చేయవలెను. అష్టమినాడు ఉపవాసము జాగరణము చేయవలెను. దర్భతో కట్టిన ప్రతిమలను మరునాడు జల మధ్యము న కలుపవలెను. వ్రతాంతమున మరొకరికి ఈ వ్రతదీక్ష ఒసంగవలెను ఇట్లెవరు చేయుదురో వారు ఇహమున పరమున భోగములను పొందుదురు. మనోవాక్కాయములచే వచ్చిన అఘమును పాపము పోగొట్టువారు కాన, అనఘానఘులను పేరుకలిగినది. అనఘాదేవి అష్టసిద్ధులు గర్భ మందుగలదై ఆవిర్భవించినది కాన అష్టసిద్ధులు,నవనిధులు,అనశ్వరమైన సంతతి అనఘానఘులవ్రతముచేకలుగునని చెప్పెను. సర్వపాప వినిర్ముక్తి కూడా ఈవ్రతమునకు ఫలముగా చెప్పబడినది. ఇది

దత్తభాగవతమున నవమగు చ్ఛాంతమున కూర్చబడినది. దత్తమాహత్మ్యమున నాల్గవ అంశలో 6వ అధ్యాయమున నిరూపింపబడినది అనఘానఘుల స్వరూపము - వ్రతము యథోక్తమగా చెప్పబడినది.

# 6వ అధ్యాయము
# హ్రీం మంత్రము

హరశబ్దములోని అకారములను తొలగించి ఈకారము కలిపినచో హ్రీం అనియగును. దీనికి మాయా బీజము అనియు వ్యవహారము. ఇందు సమస్త పాపహరుడు శివుడు, హ్రా బీజాక్షరముతో మొట్టమొదటగా కీర్తింపబడినాడు. పాపప్రతిబంధములు తొలగిన తరువాత సమస్త ఫల ప్రదాయిని, విద్యాప్రద పుష్టిప్రదయూ, ఐన పరాశక్తి ఈం బీజముతో కీర్తింపబడుచున్నది. ఇట్లు ఇది శివశక్తుల బీజాక్షరములు కల మంత్రరాజము. దీనికి ఇరువైపుల ఓంకారము సంపుటిచేసిన, చింతామణి మంత్రమగునని శ్రీహర్షుడు తననైషధమున పేర్కొనినాడు. మంత్ర యంత్ర, తంత్రాదులలో ఎచ్చట చూచినను ప్రతిమంత్రము ఓంకారములేక ఐం, హ్రీం, శ్రీం, క్లీంలలో ఏదో ఒకదానితో గాని రెండు, మూడింట్లతోగాని సంపుటి చేసి మంత్రములు చెప్పబడుచుండుట సంప్రదాయము. ఇట్లు ఓంకారము వలె హ్రీంకారము కూడ అమృతీకరణమైనట్టిది. సకలార్థసాధకమైన దగుటచేత ఒక్కచో ఓంకారము లేకపోయినను అంతటి మహిమోపేతముగాన హ్రీంకారము ఆదిగా కల్గినట్టి పలుమంత్రరాజములు కన్పట్టుచున్నవి. ఇందు ఆదియందున్న హరుడు సర్వ మంత్రములకు గురువుకూడఅయిఉండుట విశేషము గురువు అనగా ఎవడు? శివుడు. ఎవడు గురువో వాడే శివుడు. ఎవడు శివుడో వాడే గురువు. గురుశివులకు భేదమును ఎంచువాడు మహాపాతకి, ఎవని అనుగ్రహముచే హృదయమున బ్రహ్మానందకరమగు జ్ఞానము ఉదయించునో అవ్వాడే సద్గురువు. సర్వ మంత్ర యంత్ర తంత్ర స్వరూపుడు సర్వగుడు సర్వజ్ఞుడు. స్వయముగా సాక్షాత్ ఆ పరమశివుడే మనుష్యచర్మముతో కప్పబడి గురువు అనెడి నామముధరించి ఈలోకమున రహస్యముగా తిరుగుచున్నాడు.

తెల్లని వస్త్రము ధరించినవాడు. తెల్లని విభూతిమైపూత, శ్వేతపుష్పములు, ముత్యాలహారాలు త్రినేత్రములు కలిగి, వామాంకమున, దివ్యశక్తితో, విభ్రాజితుడై, మందస్మితవదనారవిందుడై, సాంద్రకృపావతంసుడై శివుడే గురువుగా ప్రకాశించుచున్నాడని ఈ స్కాందపురాణాంతర్గతమగు గురు గీతలో వేదవ్యాసుని వచనములు. వేదమే శివుడు, శివుడే వేదము, వేదాధ్యాయి, సదాశివుడని



హయగ్రీవ స్వామి

మనుస్మృతిలో కలదు. ఏ ఉపదేశమున్నను లేకున్నను ఏదోఒక అర్థసాఫల్యము పేర్కొని తనగురువు ఈ విశాల ప్రపంచమున కీర్తింపబడవలెను. తదితరులకు అట్టిశక్తిలేదు. ఏదో ఒకసిద్ధి లేకసంభావనము లేక ధనమో ఉంగరమో ఇచ్చుటవంటి తాత్కాలిక సిద్ధులు తమ గురువుల వలననే సాధ్యములయినవని, అట్టడుగువర్ణాల వారిని కూడా తమ గురువులే ఉద్ధరించుచున్నారని బడుగువర్గాల వారిపై ఆచార్యస్వాములు ఏమి కృపచూపించియున్నారని కొందఱు శాస్త్రమార్గమునుండి తొలగిన వారిపై గురుత్వముననుసధానించుకొనుచుండుట దానిని బలవంతముగా అజ్ఞులపై ఉపయోగించు పండితమ్మన్యులు నేటికాలమున కన్పించుచున్నారు. కాని శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడు అయిన వాడే గురువు. అట్టి గురువునే తద్విజ్ఞానార్థమై సేవించవలెనని తైత్తిరీయము వాకొనుచున్నది. మరియు గుర్వూప సర్పణమునకు ముందే గురువును గూర్చి తెలిసికొనవలెను. గాని గురువును చేరిన తరువాత ఆతనిపై పరుల వాక్యములతో మరొక చోట గురుత్వమును తలపెట్టు బుద్ధికల్గి ప్రవర్తించుట అశాస్త్రీయము. ఒకరియందొకరికి గురుభక్తియున్న తాను బలవంతముగామరొకరిపై ఆతనికి బుద్ధిభేదము కలిగింప గూడదని గీతాశాస్త్రమందుకన్పట్టును. వేదశ్శివశ్శివోవేదః వేదాధ్యాయీ సదాశివః (మనుస్మృతిః)

ఈ పరిశోధనమున హ్రీం మంత్రార్థము. అధ్యాయములను పంచదశి మహా మంత్రాక్షరములు ఆదియందు కల్గునట్లు వచించుట, శ్రీ విద్యనెఱుక, పఱచుట, వంటివి కొన్ని ఇందు కల్పించినట్లు కన్పట్టును. అద్వైతసిద్ధాంత వ్యాసమున కివి అప్రస్తుతములనిపింపవచ్చును. కాని అటువంటివి కొన్ని చెప్పకవదలినచో ఈదత్తభాగవతమునకు గ్రంథకర్తయగు శ్రీ శాస్త్రిగారికిని అపరాధము చేసినవాడనగుదును. కారణమేమనగా గ్రంథముననిబంధించిన ఆయామంత్రములను, రహస్యార్థములను, తత్ప్రామాణ్యమును, విప్పిచెప్పకున్న ఈగ్రంథమునకు, గల ప్రత్యేకత ప్రశ్నార్థకమగును? కాన నిగూఢార్థములను, మంత్రములను తత్తదర్థములను వెలికి తీసినందు వలననే ఈ నిబంధనము చదువరుల పట్ల ఎక్కువ ప్రయోజన కారికాగలదు. ఈ దత్తభాగవతగ్రంథకర్త

---

శ్లో॥ అవామావామార్ధే సకలముభయాకారఘటనాత్
ద్విధాభూతం రూపం భగవదభిధేయం భవతియత్
తదన్తర్మంత్రం మే స్మభరహరమయంసేందుమమలం
నిరాకారం శశ్వజ్జపనరపతేసిద్ధ్యతు సతే ॥ శ్రీహర్ష నైషధ మహాకావ్యము

అనేక మంత్రములను అక్షర లక్షలు జపించి తత్తద్దేవతా ప్రసాదసిద్ధి పొందితదనుభవములను జోడించి లిఖించిన గ్రంధరాజమది. మరియూ ఇయ్యి నామూలకముగా నానపేక్షితముగాను లిఖించుట లేదని సవినయముగా మన చేసికొనుచున్నాను. శ్రీ శాస్త్రిగారు ఈ దత్తభాగవతములో చివర దత్తాత్రేయః మంత్రమునకు ఇరువైపులా కలిపి అమూలకమైన ఒక పద్యమున నిక్షేపించినాడ

**శ్లో॥ యోగురుస్సశివః ప్రోక్తః యశ్శివస్సశివస్సృతః**
**వికల్పంయస్తుకుర్వీతసభవేత్పాతకీగురౌ**

**శ్లో॥ యస్యానుగ్రహమాత్రేణహృద్యుత్పద్యేతతత్క్షణాత్**
**జ్ఞానంచ పరమానందః సద్గురుశ్శివఏవ సః**

**శ్లో॥ సర్వమంత్రస్వరూపాయ సర్వతంత్రస్వరూపిణే**
**సర్వగాయ సమస్తాయశివాయగురవేనమః**

**శ్లో॥ మనుష్యచర్మణా బద్ధః సాక్షాత్పరశివస్స్వయం**
**గురురిత్యభిధాం గృహ్ణన్గూఢః పర్యటతి క్షితౌ**

**శ్లో॥ శ్వేతాంబరం శ్వేతవిలేపపుష్పం ముక్తావిభూషం ముదితం త్రినేత్ర**
**వామాంకపీఠస్థిత దివ్యశక్తిం మందస్మితం సాంద్రకృపావతంస**

స్కాంద - గురుగీత - 7,40,76,77,91 శ్లోకము

**శ్లో॥ న బుద్ధి భేదం జనయేత్ అజ్ఞానాం కర్మసంగినాం**
**జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్త స్సమాచరన్.** భగవద్గీత

ఓం హ్రీం, దత్తాత్రేయాయ నమః ద్రాం హ్రీం ఓం ॥ మొదటి చివర హ్రీం పదప సంపుటియైయున్నది. మంత్ర శాస్త్రములోని శ్రీదత్తాత్రేయ మంత్రజపమ చేయుచుండ శ్రీ శాస్త్రిగారికొక కలవచ్చినది. దత్తాత్రేయుడు దర్శనమీయగా వీ ముక్తిని అడిగిరి. ఆ స్వామిఆమూలనున్న బుట్టలోనున్నది తీసి కొనుమని చె అంతర్ధానమయ్యెను. మెలకువకలిగినది. చూడగా ఏమియు కనపడలేద దీనియర్థమేమి అని ఈ వ్యాసకర్త ఒకపరి అడుగగా, ముక్తి బుట్టలో నుండు అద్వైతానుభూతి మనసునకు తెచ్చుకొనవలెనేగాని, అదొక వస్తువుకాదుగదా సమాధానమిచ్చిరి. ఒకపరి శ్రీశాస్త్రిగారు మంత్రములలో తనవ్యాకరణవైదుష్యమ

ఈమంత్రములిటులుండనోపవని ఓం నమో వీరహనుమంతాయ అను దానికి బదులు వీరహనుమతే అని జపింపబూనిరి. స్వామిపలుకలేదు. యథా పూర్వముగా జపింపగా మంత్రసిద్ధి కలిగినది. హనుమంతః అకారాంతముండదుగదా.

**హకారమైశ్వరం బీజం బుషి ర్బ్రహ్మాసనాతనః॥**
**సావిత్రీచ్ఛంద ఇత్యుక్తం హృదయాంభోజ సంస్థితం॥**

ఇక హ్రీం బీజములో మొదటివాడు హరుడని మున్నే చెప్పితిని. అతడే గురువు. కోబ్రాహ్మణైరు పాస్యః ॥ గాయత్ర్యర్కాగ్నిగోచరశ్శంభుః ॥ బ్రాహ్మణులచే ఉపాసింపదగినదైవతమెవడు? గాయత్రి, సూర్యుడు, అగ్ని ఈ మూడింటిచే అభివ్యక్తమగు శివుడే అని అతడే ఉపాస్యమైన దేవత అని, శిష్యుల ప్రశ్నమునకు శ్రీ శంకరభగవత్పాదుల ప్రతివచనము. వేద శాస్త్రపురాణేతిహాసాదులను బట్టి ఈ ప్రపంచమున, అనేక దేవతలు, అనేక గురువులు కన్పట్టుదురు. మూలమునకు విచారించిన కొలది ॥ఏకోదేవః కేశవోవాశివోవా ॥ అనెడి నిశ్చతభావము స్ఫురింపగలదు. గురుపారమ్యము, మంత్ర రహస్యములలో చూడదగినది. ఈ గురువు, మన భక్తి శ్రద్ధలను బట్టి జన్మాంతరీయ సంస్కారము, తోడుకాగా పరిపరి విధముల నుండ వచ్చును. సత్యవ్రతుడను వాడొకడు. కిరాతుని చే కొట్టబడి రక్తసిక్తమైన ఏదుబందొకటి తన ఆశ్రమమున తలదూర్చుకొనుటకు వచ్చినది. దానిని చూచిన సత్యవ్రతునికి ఐ అనెడి సారస్వత బీజము అప్రయత్నముగా నోటివెంట వెడలినది. అంత, ఆ సత్యవ్రతుడు జన్మాంతరీయ సంస్కారవిశేషముచే దానినే గురువుగా ఎంచుకొని సిద్ధుడై వెంట తరుముకొని వచ్చిన కిరాతుడు పంది ఎటుపోయినదో చెప్పుమనగా, సారస్వత మంత్రబీజాక్షరజపమహిమచే సత్యవ్రతుడు కాన అబద్ధమాడకుండా ఇట్లనెనట. చూచిన కళ్లు చెప్పలేవు. చెప్పేనోరు చూడలేదనెను. ఆతనికా వరాహమే గురువు ఉన్నదున్నట్లు చెప్పిన గురుహత్య జరుగును, చెప్పకున్న అనృతదోషము కల్గును. కదా, ఇట్టి సంకట స్థితినుండి ఐసారస్వతబీజ జపమాతనిని సంరక్షించినదని దేవీభాగవతము. నిజానికి వరాహమునకు తత్త్వజ్ఞానముండునా, మంత్రములుగాని తద్బీజాక్షరములుగాని తెలియునా?

**కం॥ దత్తాత్రేయాయపదం బెత్తినమోంతముగ వెంటనేద్రామనిమా ।**
**యోత్తరపూర్వమ్మగ్రణ వాత్తంబిటునటునొనర్పనా విభుమనువౌ ॥**

హ్రా అనుదానికి అద్వయము చేర్చిన హర అని అగును. అకార ఇకారములతో హరియగును. లేక ఈం చేర్చిన హ్రీం అని అగును. దీనిని హృల్లేఖయని శ్రీ

శంకరులు సౌందర్యలహరిలో పేర్కొనినారు. హృదయమునందు వెల్గెడిదే హృల్లేఖ - హృద్రేఖ ఈ కథాంశమునుబట్టి శివుడు గురురూపమున మనభక్తి విశ్వాసాల కనుగుణముగా వచ్చి చెప్పుననియు కావుననే కవులు కవిత్వము చెప్పగలుగు చున్నారనుట తెల్లము సాధకునకు మంచి సమయము వచ్చినపుడు ఏ గురువు ఉపదేశము చేయుచున్నాడో ఆ గురువు హృదయమునందు శివుడే ఉండి ఉపదేశము చేయుచున్నాడని గుర్తింపవలెను. శివుడా యుపాధిలోనుండుటవలన ఆ ఉపాధికి గురుత్వము సిద్ధించినదనవలెను. హ్రీం బీజమిట్లు సమస్త గుర్వైశ్వర్య ప్రదానాది సామర్ధ్యారోపణమునకు అధిష్ఠాన మై యుండగా అపవాద శాస్త్రముచే మిగిలిన పరమానంద రూపమైన ముక్తియే హ్రీంకారమునకు అర్థము. హృ అనుదానికి ఈకారము చేర్చిన సంప్రసారణము కల్గి హ్రీం అయినది. అసలిది హృఞ్ హరణే అను ధాతువునుండి వచ్చినదని పాణిన్యాచార్యులవారు అనువదించిరి. కాని స్పష్టింపలేదు. హృఞ్ ధాతువునకు క్విప్ ప్రత్యయముచేయగా హ్రస్వస్యపితికృతితుక్ అను సూత్రముచే, తుగాగమముచే హృత్అన రూపమేర్పడినది. హృత్ అనగా హృదయము లేఖ అనగా కాంతి హృల్లేఖ ॥హ్రీం॥ అని సౌందర్యలహరి హ్రీంకారేశ్వరి లలితా త్రిపురసుందరి. కార్యకారణ భేదముల ననుసరించి బాల, లలిత, దుర్గ చండిక మున్నగు ననేక శక్తిరూపములు ఇట్లు హృదయమున ఏర్పడిన హ్రీం శివశక్త్యైకస్వరూపము. ధరించినను అది చిద్రూపమును విడిచి యుండదు. హ్రీంబీజమునుండి హ్రీ యనెడి శక్తి ఉద్భవించినది. వేదములన్నియు హార్దాకాశమున నున్నవనియు, హార్దాకాశమే సర్వదేవతా నిలయమనియ హృదయా కాశము నెఱుగని వాడు వేదాధ్యయన మొనర్చియు ఏమి చేయగలడు. యస్తన్నవేదకిమృచాకరిష్యతి ॥ అని వేద మాతయే ఉద్ఘోషించుచున్నది. అదియే విశ్వరూపము, ఋషులెల్లరు తన్మయీభావ నముతో నిరన్తరము ఆ హృల్లేఖనే ఆవేదమాతనే ధ్యానించుచున్నారు. కాని అది అన్యులకు జూప శక్యము కానిది. హ్రీశ్చ తే లక్ష్మీశ్చపత్న్యౌ అని పురుషసూక్తము వాకొనుచున్నది. ఆశక్తి పరబ్రహ్మకు నిత్యానపాయిని అని సౌందర్యలహరి. ఇట్టి హ్రీలోనున్న పురుషబీజముతో హరుడైనవాడనియు స్త్రీ బీజముతో హరియైన దనియూ శక్తిబీజమైన ఈంకారముతో హ్రీం అయినదనియూ తత్సం ప్రదాయవేత్తల అనుభవము.

ఇక వేదాన్త శాస్త్రమున మాయ మిథ్యా భూతయని పేర్కొనబడుచుండుగా మయాస్వరూపిణీ యైన పరమేశ్వరికి జగత్కారణత్వము, చెప్పుట పొసగదని కొందఱనవచ్చును. కాని కాసిత్వం మహాదేవి సా అబ్రవీదహం బ్రహ్మరూపిణీ

ంత్తః ప్రకృతి పురుషాత్మకం జగత్ భువనాధీశ్వరీ భువనాతీతా స్వాత్మైవ లలితా ంతా ఇత్యాది శ్రుతి స్మృతి వచనముల వలన. పరమేశ్వరి తుర్యాతీత బహ్మస్వరూపిణి యని తెలియుచున్నది. పరాభట్టారిక యొక్క పరతత్త్వము ఃత్మోపలబ్ధికి విషయమనియూ, చితిస్తత్పదలక్ష్యార్థా చిదేకరసరూపిణీ అను ‌లితా సహస్ర నామములవలన చిదేకసరూపిణియగు చిచ్ఛక్తియు తత్త్వమసి యందలి తత్ పదలక్ష్యార్థమనియు తెలియుచున్నది. నిర్గుణ బ్రహ్మవాచక ంతి వాక్యములు మాయా బోధక శ్రుతి వచనములు పరస్పర విరుద్ధములు ఃవా? అనినచో విరుద్ధములు కావు. ఎట్లనగా వేదాంత దర్శనములలో మాయ ుథ్యాభూత మిథ్యాభూతురాలైన మాయ అధిష్ఠాన సత్తయైన బ్రహ్మయందు ల్పితము. కల్పిత సత్త, అధిష్ఠాన సత్తాతిరిక్తముగా ఎన్నడూ ఉండనేరదు. ధిష్ఠాన బ్రహ్మసత్త మాయాప్రవిష్టమై యుండును. కావుననే బ్రహ్మలక్షణములైన ్వరూప తటస్థ లక్షణములు మాయారూపిణి యైన పరమేశ్వరి యందనుగతములై యుండును. మాయాస్వరూపిణియైన శ్రీ లలితా త్రిపురసుందరి ఉపాసనములో ంహ్మ ఉపాస్యము అగును. ఆ రీతిగనే నిర్గుణము రూపరహితమునగుటవలన వల బ్రహ్మోపాసనము పొసగదు. శక్తి విశిష్ట బ్రహ్మము ఉపాస్యమగును. ాస్తవమున మాయకు బ్రహ్మాతిరిక్తమైన సత్తయే అసంభవము. అటులనే మాయా బలితము కాని బ్రహ్మకు ఉపాస్యత్వము. చెప్పుటయు సంగతము కాదు. ుదాకారా సదానందా సంసారోచ్ఛేద కారిణీ సశివాపరమాదేవీ శివాభిన్నా శివంకరీ ,శివా శివశక్త్యైక్యరూపిణీ లలితాంబికా అని సూత సంహిత, లలితా సహస్రము ప్పుచున్నది. నాహం సుముఖి మాయాయా ఉపాస్యత్వం బ్రువేక్వచిత్ ాయాధిష్ఠాన చైతన్యము పాస్యత్వేన కీర్తితం॥ మున్నగు వచనములను బట్టి రమేశ్వరి అనగా మాయాశబలిత బ్రహ్మయే అని భావింపవలెను. సగుణోపాసన

---

ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్ శ్రియమిచ్ఛేద్హుతాశనాత్

జ్ఞానం మహేశ్వరాదిచ్ఛేత్ మోక్షమిచ్ఛేజ్జనార్దనాత్

ఒ శ్లోకార్థ మిచట అనుసంధేయము శివగురువు వలన జ్ఞానము సిద్ధించిన ముక్తి కరతలామలకమగును.

పాణిన్యనూదితహృశోహృదభూత్క్విబేదం

హ్రీంశక్తి రత్రపురుషోహరిరావిరాసీత్

తత్రాద్వయేన హరఠఃమి నిరాకృతిస్సా

వైచిత్ర్యసంధితమిహైక మహోదుకూలమ్

తాత్రిశతీభాష్యము తెనుగు అనువాదము శ్రీతాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రిగారు

మంతయూశక్తి విశిష్టమైన బ్రహ్మోపాసనమే. 'గుణత్రయ సామ్యావస్థా రూపిణియేమాయ, ఆమెయే కేవల శుద్ధ బ్రహ్మాశ్రితయై యుండును. కావున శ్రీమహాత్రిపురసుందరి ఉపాసనలో మాయా విశిష్ట తురీయ బ్రహ్మయే ఉపాసింప బడుచున్నాడని తెలియదగును. ఇట్టి మాయా శబలిత బ్రహ్మమే హ్రీం మంత్రార్థము హరి హరులను విడిచిన ఈంకారము నిరాకారమైనట్టివి వైచిత్ర్యముగా కూర్చబడిన ఒక మహోదుకూలమని శ్రీశాస్త్రిగారు త్రిశతీభాష్యానువాదమున ఒకశ్లోకమున విరచించినారు. ఇందు హరిహరులకు అద్వైతము. కేవల ఈం బీజముచే సచ్చిదానందము నిర్గుణబ్రహ్మము వైచిత్ర్యముగా ఇమిడియున్నది. ఇయ్యది ఏకైక సగుణనిర్గుణ నానాత్వములతో భాసించుచున్నది. హ్రీం పదము, వాచకమైన శబ్దమునందు తద్వాచ్యార్థస్వరూపమునందు నానారూపత్వమున్నట్లు కన్పట్టు చున్నది. శ్రవణమననముల ద్వారా విచారణచేయువారికి శబ్దార్థముల రెండింటి యందు ఏకత్వభావమేగాని భేదము గోచరించదు. ఒక సద్వస్తువు నానాత్వముతో ఏకత్వముతోను భాసించి అద్వైతమున పర్యవసించియుండుట ఆశ్చర్యము. ఇక హ్రీంకారము పంచదశి మంత్రములోని కూట త్రయాంతబీజము. హకార - రేఫ - ఈకార - అను స్వార వర్ణముల సమష్టి కాన పదముగా కూడా చెప్పదగును: జ్ఞాపకం సర్వదేవానాం యత్ బీజాక్షరముచ్యతే॥ అనుటచే పరాశక్తి బీజసూచకము, హకారము అనగా శివుడు. హవర్ణము ఆకాశమును చెప్పును ఆకాశమువలె నాతడు నిస్సంగుడు, రేఫ - అగ్నిబీజము, ఈకారము - శక్తి బీజము, హకారము శ్వేతవర్ణము, రేఫ - రక్త వర్ణము, ఈ కారము నీలవర్ణము ఇట్లు శ్వేతారుణ నీలవర్ణములచే బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు కూడా ఈ హ్రీం పదము వాచకము.

ప్రకృత గ్రంథమున ప్రతిపాద్యుడు దత్తాత్రేయుడు త్రిమూర్తి స్వరూపుడు, యోగాదేశావతారము, అలర్క, కార్తవీర్యార్జునాకృత వ్రణ, శాంత తపాదులకు ఎన్నో ధర్మములను ఉపదేశించి ధర్మ సంస్థాపనమొనర్చిన పుణ్యశ్లోకుడు. రేణుక - వేదమాత ఏకవీర - శక్తిత్రయాతీతగా దత్తభాగవత మున వర్ణింపబడినది. ఒకపుడు బ్రహ్మమోహమును సృజించెను. దానిచే తానును సమ్మోహితుడై వేదములు స్ఫురింపక మరల వాటిని గుర్తు చేసికొనుటకు దత్తాత్రేయుని శరణు పొందెను. రేణుకావపుర్దేశమునుండి వేదరాశి దత్తదేవాంకస్థితమగు లక్ష్మినోట ప్రవేశించినది. అట్లు శివశక్తులు ఒకటిగా అయి బ్రహ్మకు తిరిగి వేదముల ననుగ్రహించెను. పిదప బ్రహ్మతో కలిసి రేణుకను మొదటగా అభిషేకించినవాడు, వేదధర్మోపదేష్ట కావున శివుడు శక్త్యనుగ్రహము కలిగిన వాడగుటచే హ్రీంపదార్థము శివశక్త్యైక్యమే అతడు దత్తాత్రేయుడనుటలో ఎట్టివిప్రతిపత్తి లేదు. అవధూతగా

యదువునకు సమాధానమిచ్చుచు, తనకు 24 గురు గురువులని వాక్రుచ్చి వీరాగురువులు? నిజానికి నిగమవాది యైన వాడొక్కడే గురువు. వానిని చూపించుటకై పై గురువులందరు తద్వ్యాఖ్యాన భూతులేయని నుడివినారు. ఎన్నెన్నో సంస్కృతగ్రంథాలకు అనువాదాలు కలవు. మూలగ్రంథ నిత్యపారాయణముల వలన కలిగెడు ఫలములు తదనువాదమున కొఱవడినవనవచ్చును. కాని శ్రీ శాస్త్రి గారి గ్రంథము అట్లు కాదు. ఏ తద్గ్రంథ నిత్యపారాయణమువలన అనేక కార్యములుసిద్ధించినట్లు గ్రంథమింటనున్న మాత్రముననే సకల కార్యసిద్ధి జరుగునని నాటికి నేటికి చెప్పువారు కలరు. ఇంతటి గౌరవము. అనతి కాలంలో ఈ గ్రంథము చతుర్థముద్రణము నోచుకొనుటయే.

## 7వ అధ్యాయము

## క్లీం - దత్తభాగవత వైశిష్ట్యము - కావ్యానువాదవిధానము

శ్రీదేవిదయితగా శ్రీ విద్య సేవింతు, బహిరన్తరర్చానుభవమఘముల, త్వత్ప్రసాదిత వాచాప్రవాహచితము దత్తభాగవతాఖ్య పాదపమునందు, అను ఆశ్వాసాంతపద్యములందు శ్రీశాస్త్రిగారు, తన పత్నియగు శ్రీదేవితో కూడి శ్రీవిద్యను బహిరన్తర్యాగములతో సేవించినట్లు, ఆపరాత్పరానుగ్రహముతో తనకు కవితా ప్రవాహము కలిగినట్లు వర్ణించినారు. కవికి నిరుపమానమగుసుకవిత ఉపాస్య దేవతవలననే సంభవించును. అందువలననే ఈకవి ఈ గ్రంథము మొదటి పద్యమున శ్రీవిద్యా మహనీయ యోగమున అని ఆరంభించి ఆశ్వాసాంతములందునూ కీర్తించుట జరిగినది. క్లీం అనునది కూటత్రయ

---

శ్లో॥ సత్స్వరూపస్సదాకారో హకారో ధర్మ తత్పరః
చిదాకార స్తదాకారో రేఫస్సర్వార్థసిద్ధిదః

శ్లో॥ ఆనందరూపయోరైక్యాదీకారస్సర్వకామదః
బిందునాదౌ తదంతస్థౌ భవేతాం మోక్షదాయకౌ

శ్లో॥ సచ్చిదానందరూపంతం ప్రోక్తం బీజం మనీషిభిః
సచ్చిదానందరూపం యత్పరం బ్రహ్మతదేవహి

హ్ లాస్యేశ్వరమాహాత్మ్యము మాయా బీజ ప్రస్తావము.

హ్రీం కారేణైవ సంసిద్ధోభుక్తిం ముక్తిం చవిందతి భువనశ్వరీకల్పవచనము

కళేబరయగు ఆసౌభాగ్యదేవత విద్యామంత్రములోని మధ్యకూటస్థమగు
బీజాక్షరము. ఇయ్యది సకలజన వశీకరణ మంత్రము. కకార లకార ఈంకా
కలిసి క్లీం అని అయినది. బ్రహ్మ - జల - ఉత్తమాంగ సుఖాదులను క
బోధించును. హిరణ్యగర్భనిష్ఠమగు సృష్టి స్థితిలయములు కలది,హ
మొదటది జనులకు అన్నాదుల ద్వారా లోకపోషకహేతువైజల రూపగా
లేదా సర్వప్రాణులకు శిరోభాగమున అమృతము కలదని ప్రసిద్ధి. యోగవ
ద్వారా కుండలినీ శక్తిసంచారము అనెడి, అమృతప్రవాహమున మునిగినయె
ఈశ్వర మంత్రపురశ్చర్యా పరాయణులకు శివస్వభావమునేప్రసాదించున:
పరమేశ్వరి కకార, ఝాప లేకకం బ్రహ్మ, ఖం బ్రహ్మ, అను శ్రుతిని బట్టి
లుబ్రహ్మ వాచకములు సుఖ స్వరూపములు ఇట్లు కకారము గౌర వ
క్షితి,తత్త్వమగులకారము ప్రధమ కూటస్థ చతుర్థ వర్ణము, ద్వితీయ :
పంచమవర్ణము, తృతీయ కూటస్థ తృతీయ వర్ణముగా సకలాధారదేవతావా
ఇక,ఇందలి ప్రధమ కూటములో 3వ బీజము ఈంకారము, ఇయ్యదిబ
మంత్రము మహాత్రిపుర సుందరీ ప్రతిపాదకము. ఇట్లాక్లీం కవులకు కవితనిచ
దిక్లీంకారము. జగత్త్రయముతన వశమున కలది కాన ఇచ్చట కీర్తింపబడిన
క ఏ ఈ ల క్రీం, క్లీం,హస కహల హ్రీం, సౌః, సకల హ్రీం, శివశక్తుల సమా
హ్రీం పదార్థము. దత్తదేవుడు త్రిమూర్తి స్వరూపుడు రేణుకా శరీరము
వేదరాశి దత్తదేవాంక స్థిత యగు లక్ష్మి నోట ప్రవేశించినది కాన శివభక్తుల జ
దత్తదేవుడు. వేదధర్ముడనువాడొక గురువు. దీపకుడను వాడొక శిష్యుడు వీ
సామాన్యముగా తోచదు. వరముల నొసంగుటకు పిలువని పేరంటముగా వ
శివకేశవులను కూడా సవినయముగా ఎట్టి కోరికలు కోరక నమస్కరి
ధర్మనిష్ఠ ఈ గురుశిష్యులది. సూతుడు శౌనకాదులకు దత్తవైభవము బోధిం
శ్రీకృష్ణ శ్రీదామసంవాదమున గురుశబ్దార్థము, గురువుయొక్క గొప్పద
విస్తరముగా నభివర్ణింపబడినది. గురుశిష్య సంవాదమున గురువు కృష్ణ సుదా
సంవాదమును ప్రస్తావించును. ప్రారబ్ధానుభవమునకు కాశీకానగరమునకు విచ్చే
వేదధర్ముడు దీపకునకు కాశీప్రాశస్త్యమును బోధించుట సందర్భోచిత
దత్తాత్రేయచరిత్రమును వినదలచిన శిష్యునకు గురువు చెప్పిన కథ యంత
గ్రంధాంతము వఱకు అభివ్యాప్తమైయున్నది. వేద ధర్ముడు దత్తచరిత్రవ
ప్రారంభించుచు సుమతి కథ చెప్పును. ఈమె ఒక మహాపతివ్రత. కుష్ఠిం
భర్తయొక్క కామితమును దీర్చుటకు, కామించిన కాంతవద్దకు తీసికొనిపో
పతివ్రత. ఆ రాత్రియందు తన భర్త కాలు తాకి కోపించి ఒక మహాముని శపిం



లక్ష్మి దేవి

అతని శాపము సఫలముకాకుండుటకు సూర్యోదయ మును నిలువరింపగల్గినంతటి పతివ్రతామ తల్లిక. అల్లకల్లోలమైన ప్రపంచస్థితి గతులను సరిదిద్దుటకు వేఱు మార్గముగానక బ్రహ్మాదులు సైతము చేతులు కట్టుకొని ఆశ్రయింపవలసి వచ్చినంతటి పతివ్రత. బ్రహ్మాదుల అభ్యర్థన మేరకు అత్రిముని ఇల్లాలైన అనసూయాదేవిని స్వయముగా ఇంటికి వచ్చి సమాధాన పరుపగా ఆమె యందు గౌరవముంచి తన భర్తను పునరుజ్జీవితునిగా పొందగలిగిన పరమ పతివ్రత. ఈకథానంతరము హరిహరహిరణ్య గర్భాదులందరు అనసూయను ప్రశంసించి వరముకోరుకొను మనగా ఆమె త్రిమూర్తులు ముప్వురు తనకు పుత్రులు కావలెనని కోరినది. బ్రహ్మదేవుని యంశమున చంద్రుడుదయించినాడు. రుద్రుని అంశమున దుర్వాసుడు పుట్టినాడు. విష్ణ్వంశమున గుణత్రయ సమాహారరూపముతో దత్తదేవుడావిర్భవించెను. పుత్రత్వమున భాసించిన త్రిమూర్తులను అనసూయాత్రులు ప్రస్తుతింతురు. తల్లిదండ్రులకు నమస్కరింతురు. అచ్చటి అప్పటి విచిత్ర సన్నివేశమిట్టిది. ఆమె మీరు నా తనయులు కావలెనని కోరినది వీరట్లు అగుదుమనినారు కడుపా? కానుపా? పుత్రుల వలె భాసించారు. ఆమె ఎట్లుపెంచినదో ఎట్లు పెద్ద చేసినదో తెలియదు కాని వారందరు పెద్దలైనారు. దత్తాత్రేయుడు సహ్యపర్వత కృతావాసుడై తన కనపాయిని యగు ఆత్మ శక్తిని అనఘారూపమున వెలయించి అష్టసిద్ధులను తన ఆత్మభవులను చేసికొన్నాడు. భక్తులయొక్క మనోదార్ఢ్యమును పరీక్షించుటకు దిగంబరుడై దిగంబరియగు ఒక కాంతను అంకముననుంచుకొని మద్యపానరక్తిని ప్రదర్శించును. అది చూసి ఇట్టివాడు మనకెందుకని పోయిన వారికర్మము వారిదే, నిజమెరింగి నిశ్చలభక్తితో నాశ్రయించిన మరునిముసమున జ్ఞానముద్రతో మందస్మిత వదనముతో స్వామి సాక్షాత్కరించును. జంభాసురుని, బాధకునోడి దేవేంద్రుడు స్వామినాశ్రయించును. ఆ స్వామి ఆదేశము మేరకు రాక్షసునిపై యుద్ధమును ప్రకటింప జంభాసురుడు సపరివారుడై దత్తదేవుని ఆశ్రమమునకు చేరును. దత్త దేవుడు ఆయుధము పట్టినది లేదు. చక్రము విసరను లేదు. నిరామయముగా కూర్చుండెను. ఆ రాక్షసుడే తన అంకసీమ గల సుందరిని అపహరించి దాని నెత్తికెత్తుకొని పోవును. అప్పుడు దత్తదేవుడు ఇంద్రుని చూచి ఈమె లక్ష్మి. ఈమె ఫాలభాగము దాటి నెత్తికెక్కినదా సర్వనాశనమే నీవు రాక్షసులను సులభముగా నిర్జింతువు అని చెప్పి పంపెను. ఇంద్రుడు జయించెను. జంభాసురుడు చచ్చెను. ఇదియొక అత్యాశ్చర్యకరము. ఇది రాక్షస సంహార విధానము.

ఇందలర్కచరిత్రము ఒక పెద్దకథ అలర్కుడు, మదాలస కొమరులలో చివరివాడు, మదాలస తత్త్వజ్ఞురాలు, ముగ్గురు కుమారులకు వేదాన్తమును ఉగ్గుపాలతో నేర్పినది. నాల్గవ వానికి అలర్కుడని పేరుపెట్టి లోకజ్ఞుని చేసినది. వాడే రాజ్యమును పాలించినాడు. ఒకానొక కష్టకాలమున నిర్వేదమునంది తల్లియొసగిన ఉంగరమునందలి సూచననుసరించి సజ్జన సంగము సేయగోరి దత్తాత్రేయునాశ్రయించును. దత్తదేవుడు అలర్కునకు ఒక్కప్రశ్నముతో దుఃఖ పరిహారము కావించును. నీకు దుఃఖమును బోగొట్టెదను. నీవెవడవు? నీకు దుఃఖమెట్లు కలిగినది? నీకు కల్గిన దుఃఖమెట్టిది? ఎచటనున్నది? వివరింపుమనగా అలర్కునకు తత్త్వజ్ఞానము ఉదయించినది. అజ్ఞానము చెదరిపోకుండా దృఢముగా నుండుటకు దత్తాత్రేయుడు బహువిధముల తత్త్వబోధములను, యోగరహస్యము లను, బోధించును. ఈ గ్రంథము దత్తదేవుని బోధలలోకెల్ల విస్తృతమై సర్వోపనిషత్తాత్పర్యసంగ్రహమై ఒప్పారుచున్నది.

పరశురామకార్తవీర్యులకథ ఇందొకపతాక, మొండిచేతులతో జన్మించి కార్తవీర్యుడు దత్తాత్రేయానుగ్రహముచేత సహస్రభుజుడై అణిమాద్యష్టసిద్ధులతో అమేయుడై అజేయుడై రాజ్య మొనర్చును. అంతటి ఈశ్వరత్వము కలవానికి జమదగ్ని గోవుతో పనియేమి? ప్రారబ్ధమట్టిది ఆ గోవును ఆశించెను. అపహరించెను. పరశురాముని చేతిలో మరణించెను. ఇందొక వైచిత్రి కలదు. దత్తాత్రేయ పరశురాములిద్దఱునూ మహావిష్ణువునవతారములే. ఒక అవతారరూపమున శక్తి మంతుని జేసి మరొక అవతారరూపమున శక్తిహీనుని గావించెను. అసలు కార్తవీర్యుడనగా గర్వమున దురాలోచన మొనర్చిన మహావిష్ణువు చేతి యందలి సుదర్శనమే. కార్తవీర్యుని జన్మమందుకూడా దత్తాత్రేయాను గ్రహముచే సాధించుకొన్న శక్తుల విషయమున ఆత్మావలేపము కలిగి వ్యవహరింపగా వాయుదేవుడు అతనికి యథార్థమును బోధించి ప్రకృతిస్థుని చేయును. దత్తాత్రేయునకు శిష్యుడై అతని వలన ఎన్నియో ఉపదేశములు పొందిన షట్చక్రవర్తులలో నొకడగుకార్తవీర్యుని పరిస్థితియే ఇట్లున్నదనగా ఇంక సామాన్యుల మాట ఏమి చెప్పవలెను. అందులకే అరిషడ్వర్గమును జయించిన సాధకునికే ఉత్తమమార్గము సిద్ధించునని ఎఱుగనగును.

ధర్మరాజు కూడా పరశురాముని సందర్శించిన సన్నివేశము అచ్చెరువు గొల్పును. వీరిరువురు పరస్పరము నీవు గొప్పయనిన నీవు గొప్పయని ప్రశంసించుకొందురు ఒక్కరోజొనరించిన కృత్యమునకు క్రోధమాపుకొనలేక ఇరువది ఒక్కమార్లు క్షత్రియసంహార మొనర్చిన వీరుడను నిండు సభలో

రాజ్యమున పహరించుటయేగాక భార్యను వివస్త్రనొనర్చు చుండగా శక్తిసామర్థ్యములు కలిగియు ఓరిమి వహించిన నీశాంతము ముందు ప్రపంచమంతయు చాలదని ధర్మజుని అతడే ప్రస్తుతించును. ఇందు విష్ణుదత్తుని చరిత్రము విశిష్టఘట్టము. దత్తాత్రేయుని దర్శించి మొండి పట్టుదలతో అతని అనుగ్రహమును సంపాదించి తన తండ్రి శ్రాద్ధమున భోక్తగా నాతనిని నిమంత్రించి ఇంటికి రప్పించుకొనినవాడు విష్ణుదత్తుడు అతని యిల్లాలు అతనికంటె రెండాకు లెక్కువ చదివినది. దత్తదేవునితో పాటు రెండవభోక్తగా సూర్యుని మూడవ భోక్తగా గార్హపత్యాగ్నిని ఆహ్వానించి పీటలపై కూర్చుండ బెట్టినపతివ్రత దత్తాత్రేయుని అనుగ్రహముతో విష్ణుదత్తుడు ఉపకారములొనర్చి బాధలను పొగొట్టుట కూడ ఇందు చదువగలము. పితా పుత్ర సంవాదమను మరొక ఘట్టమున కుమారుడు తండ్రికి తత్త్వోపదేశము ఒనర్చి సప్తోదాహరణములతోధర్మమర్మ ముల నెఱింగించుట క్రొత్తవిషయము. కాంచనమాలిని చరిత్రమున సాలగ్రామశిలా మహత్త్వము భద్రశీలుని చరిత్రమున ఏకాదశీమాహాత్మ్యము నిరూపింపబడినవి. దత్తదేవుడు పరశురామునకు రేణుకా మహిమమును బోధించు సందర్భమున ఆమలకాశ్రమ వృత్తాంతము అమలకప్రాదుర్భావము, మహిమ అనితరసాధ్యములు గావర్ణింపబడినవి.సప్తమీస్నపనవ్రతము,అనంతవ్రతము అనఘావ్రతము మొదలైన వ్రతవిధానములు కూడా ఇందు విశదముగా బోధింపబడినవి. కుంజల కపింజల సంవాదమున వేద,నహుషచరిత్రములు పరమ రమణీయములైన కథలు చివరకు శ్రాద్ధవిషయములు అనేక సంశయములకు సమాధానములు,కర్మయొక్క అవశ్యాచరణీయత నిరూపింపబడినవి. ప్రతికథ ప్రతి సందర్భమునందు దత్తాత్రేయుని మహిమములు అతని ఉపదేశములు అతని తత్త్వబోధలు అనుస్యూతములై ఉపదేశసార సర్వస్వసంగ్రహముగా ఈ గ్రంథమును తీర్చిదిద్దినవి.

ఇన్ని విశేషములతో ఇంతటి మహావిషయములతో దత్తాత్రేయ దివ్యాను భవవర్ణనపరమైన దత్తమాహాత్మ్యము ఆంధ్రమున దత్త భాగవతమై ఆంధ్ర సరస్వతికి అమూల్య శిరోభూషణమైనది.విషయమంతయు సంస్కృతగ్రంథము నుండి సంగృహీతమైనను, ఆంధ్రీకర్త అద్వైత వేదాన్త సిద్ధాన్తతత్త్వాను సంధానతాన హృదయుడగుటచే ఆయా తత్త్వరహస్యములను అనువదించునెడు మూలాధికముగా సాధారములైన బహువిషయములను ఇందు చేర్చెను. ఆ విషయములు ఆయా సందర్భములందు ప్రతిపాదింప బడును. ఆంధ్రభాష

ప్రతాపరుద్రీయము

యంటు ఇంతటి మహావిషయము నిసర్గబంధురముగా ప్రౌఢరమణీయము సరసమనోజ్ఞముగా అనువదింపబడుటచే ఈయది అనువాదమైనను అనువాదవ వలె కాక రచన సౌందర్యముచే స్వతంత్రగ్రంథమువలె భాసించుచున్న దను చదువరులకు తోచినవినిర్దుష్టమైన అభిప్రాయము." నాయకో, యది, వర్ణ్యే లోకోత్తరగుణోత్తర' అని అలంకారికులు వక్కాణించి నట్లుగా లోకోత్త గుణోత్తరుడైన దత్తదేవుని వైభవము ఇందభివర్ణితమగుటచే ఇది అనువా మైనను వైశిష్ట్యమున ఇనుమడించినదేకాని కొఱతపడలేదు. ఈదత్త భాగవతమ లింగోద్భవస్వామికి అంకితమీయబడుటచేత కృతి పతియొక్క గొప్పతనమ చేతకూడా గ్రంథమునకు బంగారమునకు తావి అబ్బినట్లు అయినది.మొట్టమొదట ప్రస్తావింపబడినట్లు గ్రంథకర్త నిరంతర శ్రీవిద్యా ఉపాసనపరులై పంచాక్ష మంత్రానుశీలన పరులై అద్వైతతత్త్వ తాత్పర్య యుక్తులై వశ్యవాక్కులై మహర్షికల్పులగుటచేత తద్రచనమునందును వారివ్యక్తిత్వ సర్వస్వము భాసించినది పైన పేర్కొనిన సర్వవిషయములను క్రోడీకరించి చూడగా ఈ దత్త భాగవతముయొక్క నిరుపమానమైన వైశిష్ట్యము గోచరించును.ఇంతటి వేదాం తత్త్వప్రతిపాదన పరమైన ఈభాగవతమున దత్తాత్రేయుని సంధ్యోపాసనమ ఇతరమైన వ్రతధర్మములు శ్రాద్ధావశ్యకత మాఘమాసమున ప్రయాగ స్నానమ మున్నగునవి ప్రస్తావింపబడుటలో తత్త్వజ్ఞానికి కర్మలతో పనియేమియన సంశయముకలుగును.దానికి సమాధానము కూడా గ్రంథకర్త సూచించినారు ఎంతటి పండితునకైనను ఒక్కసారిగా తత్త్వజ్ఞానమున అపరోక్షానుభవము కల్గుట దుష్కరముకావున కర్మత్యాగము నొనర్చి ఉభయభ్రష్టుడు కాకుండా స్వధర్మానుసారముగా శాస్త్రవిహితములైన కర్మములనాచరించుచు,జ్ఞానోపార్జనకు సాధనమొనర్చుట ఉత్తమమనియు,జ్ఞానము కల్గెనాముక్తుడగుననియు,కల్గకున్న స్వర్గాదులను భవించి మరల ఇతోధికమగు జ్ఞానవాసనగల జన్మమున అయ్యది సాధించు కొనవీలగుననియు,అట్లు కాకున్న నరకమునకు హీనజన్మములకు పాలయివినాశము చెందవలసివచ్చుననియు చేసిన ప్రతిపాదనము సమంజసము, యథార్థమును,సముపాదేయమునై ఒప్పుచున్నది. ఈ గ్రంథము యొక్క పారాయణము చేతకూడా విశిష్టములైన ఐహికాముష్మిక ఫలములు కలుగును,ఇందు దత్తాత్రేయుని చరిత్రము అభివర్ణితమగుట రెండు స్థలములందు రెండువిధములైన దత్తదేవుని అష్టోత్తర శతనామములు కూర్చబడుట,గ్రంథాంతమున దత్తాత్రేయ మంత్రోద్ధారము చేర్చబడుటలచే ఈ పారాయణమువలన సర్వాభీష్టములు సిద్ధింపగలవని ఆస్తికులవిశ్వాసము. అంతేగాక దత్తదేవుని కారుణ్యముచే సర్వసిద్ధులు

కలిగి మంత్రాధిష్ఠాన దేవతగా దేవీతంత్రమున అంగదేవతగాను ప్రవేశము పొందిన కార్తవీర్యుని చరిత్రము వర్ణింపబడినందున ఏతత్పారాయణమున చోరబాధలు తొలగును, పారాయణము నందు అర్థజ్ఞాన పూర్వకమైన పారాయణమునకు విశేషఫలము చెప్పబడుటవలన సంస్కృత జ్ఞానములేక సంస్కృత గ్రంథతాత్పర్యము ఎఱుగజాలనివారికి ఆంధ్రమున తదర్థజ్ఞాన పూర్వకముగా పారాయణ మొనర్చుకొనుటకు ఈగ్రంథముపయోగించును. గ్రంథాంతమునందలి ఫలశ్రుతిలో ఈవిషయము గలదు.

**గీ ॥ ఇప్పురాణంబునందంశమేకమైన బద్యమైన దదర్ధ తత్పాదమైన**
**నింబుగాభక్తి, పారాయణంబొనర్చి నరుడభీప్సితమెనయు నానందమెనయు**

దత్తభాగవతము - ద్వాదశగుచ్ఛము - 112వ పద్యము

సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య ముక్తులలో సాయుజ్యముక్తి గొప్పది. అట్టి విష్ణుసాయుజ్యముక్తి ఈ పురాణపఠనమువలన సిద్ధించునని ఫలశ్రుతి గలదు.

**శ్లో॥ అంశమేకం ద్విజోగచ్ఛేద్విష్ణోః సాయుజ్యమాప్నుయాత్ ।**
**దత్తప్రసాదతః కామాన్ప్రాప్నోత్యేవనసంశయః ॥**

**శ్లో॥ పురాణం శ్లోకమేకం వాప్యర్థం వా పాదమేవవా ।**
**భక్త్యానిత్యం జపేద్ధీమాన్ సోఽపితత్పదమశ్నుతే. ॥**

దత్తమాహాత్మ్యమ్ - 4వ అంశ -18వ అధ్యాయము -26,25 శ్లోకములు.

అనువాదమనగా భాషాంతరీకరణముగా ప్రాచుర్యము పొందినది; నుసరించి పలుకుటను అనువాదమనవచ్చును.ఇందు అనుసరించుట అననేమి? దములననుసరించినను, అర్థముననుసరించినను, భావముననుసరించినను, నువాదమే అగును. సాధారణముగా ఒక భాషలో నున్న గ్రంథము యొక్క స్థూలరూపము శబ్దాత్మకముగను సూక్ష్మరూపము అర్థాత్మకముగను,కారణరూపము భావాత్మకముగను, గోచరించును. కవియొక్క జ్ఞానము సూక్ష్మాంశతో, భావగతమై ప్రతిపాదకమైన అర్థము నాక్షేపించుచూ తద్వాచక శబ్దస్వరూపముతో క్షాత్కరించును.పాఠకుని యొక్క జ్ఞానము శబ్ద స్వరూపమును అవగతము సికొనుట ద్వారా వాక్యరూపమై ఆ అఖండ వాక్యార్థమును పరామర్శించి స్గతమైన భావాంశము నందులీనమగును. అపుడే, కవి పాఠకులకు అన్వయము దురును. కావున ఆలంకారికులు ప్రస్తావించెడి శబ్దగతము అర్థగతమును అగు

ప్రసాదగుణము రచనయందు పుష్కలముగా నున్నచో పాఠకునకు ఎక్కువ శ్రమలేకుండా గ్రంథము సుపఠమగును.

అనువాద గ్రంథ విషయమున రచయితకు సౌలభ్యమొకటి కలదు. ఇందలి భావము అర్థము మూలగ్రంథకారుడే అమర్చినందున కేవలము మూలభాషలోనున్న పదములకు అనువాద భాషయందు పర్యాయపదములు సంతరించుకొనిన చాలును. కానీ మాటవరుసకు ఈ రకమైన ప్రతిపాదనము సులువుగా కన్పట్టుచున్నను భాషకు సంబంధించిన కొన్ని నియమములు రచనకు సంబంధించిన మరికొన్ని నిబంధనలు అనువాదకుని స్వేచ్ఛను, నియంత్రించి మూలగ్రంథము యొక్క భావమును స్పష్టముగ వ్యక్తీకరించుటలో అనువాదకునకు ఇబ్బంది కలుగును. అనువాదకుడు అనువదింపదలచిన మూలగ్రంథము యొక్క భాషాగతమైన రచనాగతమైన కర్తృగతమైన ఓజః ప్రమాణములను అవగాహన చేసికొనగల సామర్ధ్యముతో నుండవలెను. అట్లుకాకున్నచో ఒక్కొక్కచోట కవియొక్క భావమును,వ్యంగ్యవైచిత్రిని,వక్రోక్తి సౌందర్యమును దర్శించుటకు కేవలము శబ్దార్థజ్ఞానము పర్యాప్తము కాదు. అందునను కథాప్రధానముగనో చరిత్రాత్మకము గనో, కల్పాత్మకముగనో నడచు గ్రంథముల సంగతి పేర్కొన వలసిన అవసరము లేదుగానీ, వైజ్ఞానికాంశములు, శాస్త్రీయ విషయములు, వేదోపనిషత్తాత్పర్యములు ఉపబృంహితములై ఉన్న గ్రంథములను అనువదించు టకు ఆయా విద్యలలో ఆయా రంగములలో అధీతిబోధలు కల్గిన పరిపూర్ణప్రజ్ఞా వంతునకే శక్తియుండును. అంతటి పాండిత్యము కల్గినను ఎంతటి విషయ సాంతత్యముగల గ్రంథమును పరిశీలింప గల్గినను అందలి విషయమును తనమాటలలో అసంశయముగా అందింపగల భాషాసంపదగలుగవలయును. ఇప్పుడు ఇన్ని లక్షణములు గల అనువాదకుడు ఒక ప్రామాణికునిచే రచింపబడిన ఉత్తమ గ్రంథమును అట్టి ప్రమాణము మేరకు తనకు అనువైన భాషలోనికి తీసికొనిరాగలడు. ఇంతకు ముందు పేర్కొనినట్లుగా ఈ అనువాదగ్రంథమునందు ప్రసాదగుణములేకున్నచో పాఠకునకు భావగ్రహణము సులభముగా నుండదు. అనువాదకుడు ఓజోభూయిష్ఠముగురచనతో చిత్రమగు శైలితో రచించిన ఎడల సాధారణ పాఠకునకు కావ్యానందము కలుగదు.అయితే పాఠకుడు కూడా ఇంచుమించుగా అనువాదకుని అంతటి ప్రతిభాపాటవములు విషయజ్ఞానము కలిగి యున్నచో అదివేరుమాట. ఒక అనువాదకుడు మూలగ్రంథమును అనువాదము చేయుటలో ఎట్టి ప్రయోజనమును ఉద్దేశించి ప్రవర్తించునో ఇంచుకయోచించుట ఈ సందర్భములో యుక్తము.మూలగ్రంథము నందలి

)షయ సౌందర్యమును చూచి ముచ్చటపడి అందలి సౌందర్యమును మరొక
ాషయందు కూడా ప్రతిఫలింపజేయ వలయునను ఉత్కంఠ మొట్టమొదటిది. ఈ
ుత్కంఠలో తాను నిర్మించిన అనువాదము పదిమంది పాఠకులకు అవగతమైనప్పుడే
ు ఉత్కంఠ ఆనందమునిచ్చును. సంస్కృతభాషలో నున్న గ్రంథములు రానురాను
ిటికాలమున లేశమాత్రముగ విద్యాలయములలో తప్ప ఇతరత్రపఠన
ాఠనములలో చూడబడుట లేదు. మన ఆంధ్రమున ఎంత సంస్కృత
ండితుడైనను ఆభాషతో ఎటువంటి అవసరములేకుండానే జీవనమును సుఖముగా
డపవచ్చును. అందుచేత సంస్కృత భాషలో నున్న గ్రంథమునకు ఏదేని
నువాదగ్రంథము వెలువడినదన్న మూలగ్రంథార్థమునందు శ్రద్ధకలవారు ఈ
నువాదగ్రంథమును పఠించి కృతకృత్యులగుదురు. జనబాహుళ్యమును
రిశీలించినచో భగవద్గీత యందో, సుందరకాండయందో, ఒకశ్లోకమును పఠించి
నన్వయము గావించు కొనువారికంటే ప్రక్కనగల తెలుగుతాత్పర్యమును
దివి సంతృప్తిపడువారి సంఖ్యయే అత్యధికశాతముగా మనము కనుగొందుము.
టువంటి చోట ఇటువంటి గ్రంథమును అనువాదము చేయబూనుట
హసమే. పదిమంది పాఠకులకు ఉపయోగింపనిచో ఈ అనువాదమువలన
మగ్రమైన ప్రయోజనము సాధింపబడ లేదనియే చెప్పవచ్చును. మీదుమిక్కిలి
మనువాదము కూడా పద్యరూపముగా నున్నప్పుడు సాధారణ పాఠకుడు
ందాదరుడగు పరిస్థితి కల్గును. ఆ అనువాదపద్యములు అందలి వాక్యార్థము
క్కసారి చదివినంతనే హృదయమునందు భావసమాహారము జరుగును
ల్పలముగా నిండియున్నచో పాఠకునకు ఆగ్రంథము నందు ఆసక్తి
ిశయించును. కనుక అనువాద కర్త తాను ఉద్దేశించిన భాషకు సంబంధించి
నావిధానము నందు సిద్ధహస్తుడై కృతకృత్యుడు కావలసియున్నది. కొందఱు
తటి మహావిషయమునైననూ కరతలామలకముగా అలతి
టలతోఅభివ్యక్తము చేయుదురు. మరికొందఱు ఎంతటి సులభమైన
యమునైనను వారి భాషాఘోషతో క్లిష్టమొనర్చివిడతురు.

శాస్త్రవిషయమునుకానీ,తత్త్వసిద్ధాంతములుగానీ,అనువాదము చేయు
ుడు విషయగ్రహణమున పాఠకునకు సారళ్యము సంపాదించుటకు ప్రధానముగ
ళతను పరిరక్షించుచు అనుషంగికముగా తత్తత్సౌందర్యసాధనకు పాటుపడ
మును, అందును గద్యరూపానువాదముకంటే పద్యరూపానువాదమున
ువాదకుడు ఎక్కువ శ్రమపడి మిక్కిలి జాగరూకుడై ఉండవలసి వచ్చును.
ము అర్థము మూలగ్రంథకర్తయే అమర్చిపెట్టినను, దానిని పాఠకులా

స్వాదించురీతిని రచనాపాకము తయారుచేయుట చెప్పినంత సులభసాధ్యః కాదు. భాషా విధానమందు కూడా కొన్ని ప్రత్యేకలక్షణములు అభియుక్తుల తెలియనివికావు, వాక్యనిర్మాణము, ఉపోద్ఘాతము, అవతారిక క్రియ ప్రయోగములు, భావార్థక కర్మార్థకములు, భావద్యోతకములు; జాతీయములు సామెతలు, పదబంధములు ఏభాషకాభాషకు కొన్ని కొన్ని సంప్రదాయముల లోబడి ఆయా గ్రంథములలో గోచరించును. అట్టివాటినిమరొక భాష లోన అనువాదము చేసినపుడు మూల గ్రంథమునందలి సొగసు వికటించును. అ సౌందర్యమును సంధానించుట ప్రతి సందర్భమందు కుదరనిపని. అందు అనువాదకుడు మూలగ్రంథమునందలి సౌందర్యములను యథాతథము కాకపోయిననూ యధావకాశముగా అనువాదమున చిగురింపజేయుటకై ప్రయత్నించుచు అనువాదరచనాగతములైన సౌందర్యములను సందర్భాను సారముగా ప్రదర్శించుటకు సముద్యుక్తుడగును. కధాసంవిధానమందు సంభాషణ నైపుణ్యమునందు ఉపదేశప్రసంగమునందువర్ణనా సన్నివేశములందు అనువాదకు ని ప్రతిభతో మూలగ్రంథమునందు గల విషయక్లిష్టతను, అన్వయక్లిష్టతను సందేహములను, కథాచ్ఛిద్రములను, మండూకప్లుతులను అనౌచిత్యములన అసందర్భములను పరిహరించుటకూడా ఉత్తమానువాదకుని యొక్కలక్షణము ఒకభాషలో కొన్నికొన్ని శబ్దములు విరుద్ధములు కావు.అశ్లీలార్థకముల కాకపోవచ్చును. గ్రామ్యాభిప్రాయమును వెల్లడింపకుండవచ్చును అనిష్టమగు భావమును ప్రకటింపకపోవచ్చును. కానీ ఆశబ్దములు అట్టిశబ్దసందర్భముల అనువదించిన భాషలో ఉదాత్తతను చెఱచి గ్రంథమునంతను నీరసప్రాయము నొనర్చును. కావున అనువాదకుడు ఇట్టి విషయమున కూడా ఔచిత్యమును మఱువక ప్రవర్తించును, కేవలము కథను చెప్పుట మాత్రమే కాక అందలి ఉపదేశములను సిద్ధాంతములను పాత్రగతముగనో, కవిగతముగనో ప్రకటింపవలసి వచ్చినపుడు అనువాదకుడు ప్రసన్న కథాకలితార్థయుక్తి చెడకుండా అనౌచిత్య స్పర్శలేకుండా రచనా సౌందర్యమును పరిపోషించుకొనవలసి యున్నది. ఇట్లు పోషించుటకొఱకే అనువాదకుడు స్వతంత్రతను ప్రదర్శించును.

పైన పేర్కొనబడిన ప్రత్యేకప్రయోజనములు సిద్ధించుటకొఱకు అవసరముగా మార్పు చేయవలసినప్పుడు అనువాదకుడు మూలగ్రంథమును అన్యూనాతిరిక్తముగా అనువదించును.అనువాదమనగా అనుసరించిపలుకుట అనుకొంటిమిగదా! ఈ అనుసరించుటలో బింబప్రతిబింబరూపము, చిత్రలేఖనరీతి, సదృశరూపత్వముమున్నగుభేదములు కలవు. ఒకరు చెప్పిన దానిని యథాతథముగా

ఆపదబంధమునో, పాదమునో పద్యభాగమునో స్వీకరించుట అలంకారికులకు ఇష్టమైన విషయముకాదు తత్పర్యాయపదములతో ఆయర్థమును కూర్చుకొని నపుడు ఆయర్థము ప్రతిబింబము వలె భాసించును, ఆవాక్యార్థమును భంగ్యంతరముచే ప్రతిపాదించినచో ఆలేఖ్యమువలె వర్ణవైచిత్రితో గోచరించును! ఆపదములనే తన ప్రతిభావశముచేత భంగ్యంతరాపాదకములుగా కొన్ని అలంకార వ్యంగ్యాదు లను సాధించి మెఱుగుదిద్దుట కొఱకురచనమొనర్చినచో ఏకరూపమున నుండియు భిన్నత్వముగల సదృశవ్యక్తులవలె అయ్యనుసరణములు మహోజ్జ్వలత్వ మును సంతరించుకొనును. కావున అనువాదకుడు మూలమందలి భావమును పరిశీలించి తద్గతముగా అనౌచిత్యమున్నచోపరిహరించి తద్భావ వ్యక్తీకరణమునకు లేదా అందలివ్యంగ్య వైచిత్రిసాధనకు సాధకతమములగు పదవర్ణాదులను గుర్తించి వానిని ఆత్మీయరచనలో అప్రయత్నముగ అన్తర్భూతములగునట్లు రచనను నడిపింపజాలుదురు. మూలగతమగుభావమే సరళ సుందరతరముగనున్నపుడు అనువాదకుడు యథాతథముగ అనువదించుట బింబప్రతిబింబ భావమునుగా కనుపట్టినను ఇందలి ఉద్దేశము అనువదించుటయే గనుక దోషముకాదు." 1 నా మూలం లిఖ్యతేకించిన్నానపేక్షిత ముచ్యతే " అను మల్లినాథుని మాట వలె ఒక్కొక్కచోట ఇట్టి అనువాదమే ప్రకాశించును. కొన్ని కొన్ని సందర్భములలో మూల గ్రంథకర్త ఒక్క పదముతోనో ఒక్క వాక్యముతోనో, చెప్పిన అంశమును అనువాదకర్త సందర్భానుగుణముగా విస్తరించి కథాగతమైన సమన్వయముకొఱకో విషయగతమైన వివరణము కొఱకో, పాటుపడును. ఇట్టి ఎడలమూలమునందీ విషయమును సమర్థించు వివిధ దృక్కోణములతో-ఈ అనువాదరచనలు స్వప్రయోజనములై భాసించును. ఒక్క అంశమునందో ఒకనిర్వచనమునందో ఒకవర్ణమునమునందో,అనువాదకునకు ఆత్మీయత కలుగును. అట్టి ఆత్మీయతతో మూలగతమగు సందర్భముల పురస్కరించుకొని మూలము నందలి వాక్యార్థములు లేకున్ననూ,అనువాదకుడు స్వతంత్రించి రచించును. ఇట్టిరచన అందలి భావము గుణాలంకారములతో రసపుష్టితో సౌందర్యముతో సంతరించుకొని అనువాదమున కందముచేకూర్చును. కొన్ని గ్రంథములకు మహాపండితులు తత్త్వవేత్తలు ద్రష్టలునగు మహానుభావులు యథావసరముగా వ్యాఖ్యానములు రచించియున్నారు.-ఈ వ్యాఖ్యానములవలన గ్రంథ నిక్షిప్తములగు అనేక విషయములు బహురహస్యముల తెలిసికొను అవకాశము కలుగును. మూల గ్రంథమునకిట్టి వ్యాఖ్యానములు ఉన్నచో అనువాదకుడు పరిశీలించి అందుగల

1. మల్లినాథుని సంజీవనీ టీక - రఘువంశము

విశేషార్థములను కూడా తన అనువాదమున ప్రవేశపెట్టినచో బంగారమునకు పరిమళమిచ్చినట్లగును. పూర్వమున ఎందరో అనువాదకర్తలు వ్యాఖ్యాన విషయములను కూడా అనువాదమున స్పృశించి కీర్తనీయులైనారు. తత్త్వప్రతిపాదకములగు శాస్త్రసిద్ధాంతగ్రంధములు సంస్కృతము నందున అనుపలభ్యమానములగుచున్న సమయమున వానికిగల ప్రాచీనవ్యాఖ్యలు చూచుభాగ్యముకూడా నేటివారికి లభించనందున అనువాదకర్తకే అదృష్టవశమున అట్టివ్యాఖ్యలభించినచో అందలి విశేషములను సాంకేతిక పదములను సంగ్రహించి అనువాదమున చేర్చుట పాఠకలోకమునకు ఉపకారము కాగలదు. మూల గ్రంధములయందు కొన్నికొన్ని వర్ణనలు పునరుక్తములు గను కొన్ని కొన్ని అంశములు మరింత దీర్ఘములుగను కానిపించును. పురాణగతములైనచో ఆ మహర్షుల వాక్ప్రవాహము, నదీప్రవాహము నిమ్నములను పూరించినట్లు కొన్ని కొన్ని అంశముల ఎడ విస్తరించి ప్రవహించును. పురాణములు కాకపోయినను కవి,తాను చెప్పదలచిన విషయమునందు గల ఆత్మీయతచేత ఒకటికి నాలుగుశ్లోకములు పలుకును. అనువాదమున అట్టి విస్తారమున ప్రయోజనము లేకపోయిననూ విసుగు తోచినను పునరుక్తము లనిపించినను, మూలమున సంగ్రహించుటయో మూలమును వదలి వేయుటయో చేయును. కథాగత విశేషములను సాధించుటకొఱకు పాత్రగతమగు ఔచిత్యమును పోషించుట కొఱకు అలంకారములను అనుసంధానించుటకొఱకు కొండొకచో ననువాదకుడు మూలమునందలి భావమును అన్యధాకరించి రచించును. మూలమునందులేని సందర్భములను కూడా అనువాదమున కల్పించును.

ఈ విధమైన మార్పులుచేర్పులు మూలగ్రంథమునకు మెఱుగులు దిద్దుచు అనువాదసౌందర్యమును అధికముజేయుచు పాఠకులకు సులభముగా ఆస్వాదార్హములగుచు ఉన్నప్పుడే ఆ అనువాదము అనువాదకర్తయొక్క ప్రతిభా పాటవములకు గీటురాయిగా సాహిత్యమున చిరస్థాయిగా వెలుగొందును. ప్రస్తుతాంశమున శ్రీ శాస్త్రిగారు బ్రహ్మాండపురాణమునందు ఉపోద్ఘాత పాదము నందలి దత్తాత్రేయ మాహాత్మ్యమను పేరబరగు నాలుగు అంశములతో 65 అధ్యాయములతో ఒప్పారుచున్న ఈ పురాణసంహితను దత్తభాగవతమను పేర పద్య ప్రబంధముగ ఆంధ్రమున అనువదించిరి. పూర్వోక్త గుణవిశేషసంపన్నులైన శ్రీ శాస్త్రిగారు తమ అనువాదమును ఎట్లు తీర్చిదిద్దిరో ఈ అధ్యాయమున పరిశీలింపబడును. 7-1 యధామూలానువాదము : - మూలమునందలి శ్లోకము అక్లిష్టముగను, సరళముగా ప్రసాదగుణము కలదిగను ప్రకాశించుచుండగా అందలి వాక్యార్థమును యధాతధముగా సరళసుందరముగా అన్యూనానతిరిక్తముగా

అనువదించుట యధా మూలానువాదము. ఈ దత్తమాహాత్మ్యము ప్రధానముగా కధారూపమునగానీ ఉపదేశమున గానీ అద్వైత వేదాన్త తత్త్వమును ప్రతి పాదించుటకు, బోధించుటకు, ఉద్దేశించ బడినది. అగుటచేత గ్రంధస్రష్టయగు వ్యాసభగవానుడు విషయప్రయోజనములను ప్రస్తావించిన తరువాత ఉత్తమాధికారిని నిర్ధారించుచు ఇట్లు చెప్పుచున్నాడు. బహుజన్మల నుండి వేదశాస్త్రచోదితములైన సత్కర్మ లనేకములాచరించి నిర్మల మనస్కుడై చిన్ననాటనుండియు ఈశ్వరధ్యాన తత్పరుడై ఈ ప్రపంచము నంతను ఆకసమున నల్లదనమునవలె వితధముగా కనగలవానికి శ్రేయోదాయకమగు తత్త్వవిషయము ఉపదేశించెదనని వ్యాసుడు ఈ క్రింది శ్లోకము రచించెను.

**శ్లో॥ సత్కృత్యైర్వి విధైశ్శ్రుతిస్మృతి ముఖైర్జన్మాంతరానుష్ఠితైః**
**శుద్ధస్వాంతరభావనస్యజగతామీశే రతస్యాదితః**
**యస్యేదం వితతం విభాతివితథం వ్యోమ్నీవ నీలాకృతిః**
**తస్యేదంపరమీశతత్త్వ విషయం శ్రేయస్కరంభణ్యతే.**

దత్తమాహాత్మ్యం 1వ అంశ - 1వ అధ్యాయము -శ్లోక సంఖ్య 2

దీనిని అనువదించుచు శ్రీ శాస్త్రిగారు

**చ॥ శ్రుతులుస్మృతుల్వచించు సువిశుద్ధకృతుల్మును పాచరించిశో**
**ధితమలమానసాబ్జమున దేవుని బుట్టిననాటగోలెసం**
**తతము భజించుచున్ననపథంబున నీలిమ వోలెదృశ్యమున్**
**వితథముగా గనంగను మనీషికి చెప్పెదనున్నతత్త్వమున్.**

దత్తభాగవతము - 1వగుచ్ఛము -8వ పద్యము.

అను పద్యము రచించిరి. ఇందు శుద్ధస్వాంతరభావనస్య అనునది అధికరణముగా జేసి మానసాబ్జము, అను రూపకముతో భజన క్రియా స్వారస్యముచేత రత శబ్దార్ధమును సాధించుటయు మూలమున మూడవపాదమునగల అవాంతర వాక్యమును విశేషణముగ తీర్చి ఏక వాక్యతను సంఘటించుటయు మనీషి శబ్దముచేత శ్రేయస్కామియగుముముక్షువును సూచించుటయు, ఇచ్చటి యధామూలానువాదమును మరింతసముజ్వలముగా రూపొందించినది. సకలమునకు అధిష్ఠానమై భగవంతుడైన వాసుదేవుని తత్త్వము ఈగ్రంథము నందు ప్రతిపాదింపబడునని ఎఱిగినవాడే విద్వాంసుడు అతడే గురువని వ్యాస మహర్షి రచించిన శ్లోకము,దీని అనువాదము ఇట్లున్నది.

శ్లో॥ ప్రతిపాద్యోऽత్రభగవాన్ వాసుదేవోऽఖిలాశ్రయః ।
యఏవం వేత్త్యసావిద్వా న్యోవిద్వాన్సోచ్యుతో గురుః ॥

దత్తమాహాత్మ్యం - 1వ అంశ - 1వ అధ్యాయము - శ్లోక

తే॥గీ॥ వాసుదేవుండజుడు భగవంతుడొకడె వస్తువదె కబ్బముల ప్రతిపాద్యమః
దాననుభవించువాడే విద్వాంసుడనగా నట్టి విద్వాంసుడే గురుడచ్యుతు

దత్తభాగవతము - ప్రథమగుచ్ఛము - 9వ పఁ

సకలమునకు తానే అధిష్ఠానమైనప్పుడు తనకు మరియొక అధి ముండదు గనుక మూలమునందలి అఖిలాశ్రయ శబ్దము అనువాదమున అజశ్శ చే గతార్థమైనది.మూలమున అత్రయనుపదము ఏతద్గ్రంథవిషయ మై సర్వశాస్త్రపురాణములకు పరబ్రహ్మతత్త్వ ప్రతిపాదనమున సమన్వయ సమానార్థకత్వము.మునులచే నుడువబడినందున జాతివాచకముగా గ్రహి కబ్బముల అను బహువచనముతో సూచించుట మిక్కిలి ఉదాత్తవ నున్నది.మూలమునందు జ్ఞానార్థముగల వేత్తి ధాతువు ప్రయోగింపబ బ్రహ్మజ్ఞానము స్వస్వరూపానుభవమేసుమా అని సూచించుచు త అనుభవించువాడు అని అనువదించి అహం బ్రహ్మాస్మి అను మహావాక్యార్థమ కూడా ప్రతిపాద్య ప్రయోజనరూపముగా నిబంధించుట చూడవచ్చును.

శౌనకాదులకు దత్తాత్రేయుడు సాక్షాత్కరించును.అతనివిశ్వరూప తేజస్సు చూడలేక ప్రార్థించిన మునులకు ఆ భగవంతుడు అనుగ్రహించి కనులు తెఁ చూడుడని వరమీయగా ఆస్వామిని మునులందఱూ సందర్శించిరి. సందర్భమున ఈ క్రింది శ్లోకములు కలవు.

శ్లో॥ 1 రక్తచందన లిప్తాంగం హంసవాహన మచ్యుతం ।
స్వరాలింగితవామాంగం ద్విభుజం ద్విజదైవతం ॥
శ్లో॥ 2 కమండలుంచబిభ్రాణంపూర్ణం దివ్యాంబునాసదా ।
దివ్యపద్మాక్షమాలాంచయజ్ఞసూత్రం తథైవచ ॥
శ్లో॥ 3 చతుర్భుజం చతుర్వేదం చాతుర్హోత్ర ప్రవర్తకం ।
ప్రజాపతిపతిందేవం జపంతం బ్రహ్మవాగ్యతం ॥

శ్రీ దత్తమాహాత్మ్యం - 1వఅంశ - 1వ అధ్యాయం - శ్లోకసంఖ్య 20,21

ఈ శ్లోకములలో దత్తాత్రేయస్వామియొక్క రూపము వర్ణింపబడినది.ఈ శ్లోకములనను వదించు శ్రీ శాస్త్రిగారి పద్యమిట్లున్నది.

చ॥ మునిఘనుదివ్యవారిపరిపూర్ణకమండలుధారి రక్తచం
దనపనితాంగుహంసగతినచ్యుతుసంభృత యజ్ఞసూత్ర బ్రా
హ్మణ విభునింజతుర్భుజుస్వరాంచితవాము, నవాము, వేదవా
దినఘహరుంప్రజాపతిపతింగనిరందుగ్రతుప్రవర్తకున్ -

దత్తభాగవతము - ప్రథమ గుచ్ఛము - శ్లో సంఖ్య 23

ముని అనగా వాఙ్నియమము కలవాడు.ముని ధర్మమునే మౌనమందురు. మూలమునందు 'వాగ్యతం' అన్న పదమును అనువాదమున మునిపదముచే గ్రహించుట సముచితముగనున్నది. మూలమున ॥ద్విభుజంచతుర్భుజం॥అను రెండు విశేషణములు కలవు.భగవంతుడు సహస్రభుజుడు.లీలా స్వీకృతవిగ్రహుడై తోచిన రీతి ఎన్ని భుజములతో నైన దర్శనమీగలడు.కాని అనువాదమునందున ఈ వర్ణనామధ్యమున సంశయమును అనన్వితత్వమును పరిహరించుటకు ద్విభుజశబ్దము పరిహరింపబడినది.జపంతం బ్రహ్మ అను రెండు పదములు వేదవాది శబ్దముచేత గ్రహింపబడుట చే మరల పునరుక్తము కాకుండా చతుర్వేదశబ్దము పరిహరింపబడినది.ఉన్నంతలో మూడు శ్లోకములలోని వర్ణనా పరవిశేషణములను సంఘటనా నైపుణ్యమంత ఒక్కపద్యమునందు గుదిగ్రుచ్చుట అనువాదకుని ప్రతిభకు నిదర్శనముకాగలదు.

దత్తాత్రేయస్వామిని సందర్శించిన మునులాతనిస్తోత్రము చేయుచుండిరి.

శ్లో॥ నమోనమః కారణకారణాయనిష్కారణాయామిత విక్రమాయ
శ్రీశార్ఙ్గచక్రాసిగదాధరాయ నమోఽస్తుతస్మై పురుషోత్తమాయ -

దత్తమాహాత్మ్యం - 1వ అంశ -2వ అధ్యాయము - శ్లోక సంఖ్య 2

దీని అనువాదపద్యము

కం॥ కారణకారణునకునని। ష్కారణునకు విక్రమప్రకర్షునకున్ శా
ర్ఙ్గారిగదా స్యాద్యాయుధ ధారికి। బురుషోత్తమునకు దండనతులజా

దత్తభాగవతము - 1వ గుచ్ఛము - పద్యసంఖ్య 44

జగత్తునకు కారణములు మహదాదులు,ఆమహదాదులకు కారణము భగవంతుడు.కారణకారణుడు.సర్వాశ్రయుడుగనుక నిష్కారణుడు.వ్యాసుడిక్కడ నిష్కారణశబ్దము ప్రయోగించెను.క్రాంతాద్యర్థములలో నిరాదులతో సమసించినపుడు అతిక్రమించి అను అర్థమువచ్చును.అనగా కారణాతీతుడు అని అర్థము కారణములేనివాడని చెప్పుటకంటె కారణాతీతుడని చెప్పుటలో విశేషము కలదు.కారణములకు కారణధర్మములకు అతీతుడై యుండి తన సన్నిధాన-మాత్రముచేత మాయాకల్పితమగు సర్వవ్యవహారమును ప్రవర్తింప జేయుచున్నాడని అర్థము.ఇందువలన మొదటి విశేషణమందుగల కారణధర్మము కూడా పరాస్తమగును.ఇంతటివిశేషార్థములు ఈవిశేషణములలో ఇమిడి ఉండుటచేతను ఆ అర్థమును వివరింప బూనిన ఇచ్చటి అనువాదమున సందర్భాంచితమగు విస్తరము కలుగును.కావున శాస్త్రిగారీ రెండు పదములును యథాతథముగ పద్యమున ప్రవేశపెట్టిరి.మూలమందు శ్రీ పదము కలదు లక్ష్మీ ధరుడనియు అర్థము చెప్పికొనవచ్చును.శుభకరమైన అనుతాత్పర్యమునుగైకొన్నచో మరింత మంచిది.ప్రపంచ కారణమగు తత్త్వమును కారణాతీతమగు తత్త్వమును ప్రస్తావించుచు గుణమయరూపమునకు ప్రాధాన్యము కల్గునట్లు చెప్పుట పొసగదు కావున లక్ష్మీ పరమైన అర్థమే కాక శ్రీ శబ్దము కూడా పరిహరింపబడినది.

పురుషోత్తమ శబ్దముహరివాచకత్వమున మాత్రమే నియంత్రితము కాకుండుటకు అనువాదమున అజ శబ్ద ప్రయోగముగమనింపతగును.

శ్లో॥1 అపినఃస్మర్యతే బ్రహ్మన్ వృత్తం నివసతాంగురౌ ।
గురుదారైః శ్చోదితానాం ఇంధనా నయనే క్వచిత్ ॥

శ్లో॥ ప్రవిష్టానాం మహారణ్యమపర్తౌ సుమహద్ద్విజ ।
వాతవర్షమభూత్తీవ్రం నిష్ఠురాః స్తనయిత్నవః ॥

శ్లో॥ సూర్యశ్చాస్తం గతస్తావత్తమసాచావృతాదిశః ।
నిమ్నం కూలం జలమయం,న ప్రాజ్ఞాయత కించన ॥

శ్లో॥ వయం భృశం తత్ర మహానిలాంబుభి
ర్నిహన్యమానాముహురంబు సంప్లవే
దిశో విదంతోఽథ పరస్పరం వనే
గృహీతహస్తాః ఖలుచేరిమాతురాః

దత్తమాహాత్మ్యం - 1వ అంశ -6వ అధ్యాయము -శ్లోకసంఖ్య43,44,45,46

అనునాలుగు శ్లోకములకు అనువాదముగా అర్థమును సమగ్రముగా వచ్చునట్లు ఒకే ఒక సీసపద్యములో చెప్పుట జరిగినది.

**సీ॥ ఒకనాడు గహనమ్ము నకు సమిత్తులు దేర,గురుదారబుత్తేర నరగినార**
**ములుముల మెఱుముల వెఱపు ఘటించుచు గాలివానయువచ్చె గానివేళ**
**నస్తంగతుండయ్యెనాలోకబాంధవుండింతలోదెసలెల్లనెనసె దమము**
**పల్లంబుమెఱకయు బాథోమయంబయ్యెనేమియుదెలియదెందెసిదుగన్న**
**గీ॥ గాలియూగింపజలధారగాయమగ౯లగాష్ఠలెఱుగక జానుదఘ్నమగునీట**
**గరముభయమునన్యోన్యకరములూచిమనము కలిగితిమదిమిత్రమాస్మరింతే.**

దత్తభాగవతము - ప్రథమ గుచ్ఛము -పద్యసంఖ్య 174.

శ్రీ కృష్ణసుదామ సంవాదమున శ్రీ కృష్ణుడు సుదామునితో ముచ్చటించుచు తమగురుకుల వాససన్నివేశమును జ్ఞాపకముచేసికొనును.ఒకనాడు వారిద్దరు సమిధల కొఱకు అరణ్యమునకుబోగా అకాలమున గాలివానవచ్చి కుంభవృష్టి కురిసి ఆరాత్రి అంతయువారిరువురు అరణ్యమున చిక్కుపడి పోయిరి.ఈ సందర్భమును వర్ణించుచు వ్యాసమహర్షి వ్రాసిన పై శ్లోకములను శ్రీ శాస్త్రిగారు సీసపద్యమున అనువదించిరి.ఇందుమూలమున అపర్త్వాతవర్షం అన్న పదములకు గాలివానయువచ్చె కానివేళ అని అనువాదము సముచితముగ నున్నది."నిష్ఠురాః స్తనయిత్నవః" అన్నదానికి ఉరుములమెఱుపులనుటల ఆ అర్థము సంపన్నమైనది. సూర్యుడస్తమించెననిమూలమున నుండగా లోకబాంధవపదము మరింత సాభిప్రాయముగను సుందరముగను కుదిరినది. మహానీలాంబుభిః నిహన్యమానఃఅను చోటనిహన్యమాన శబ్దమున గల స్వారస్యమును విశ్లేషించి గాలి ఊగింప జలధారకాయమగల" అని అనువదించుట సముచితముగానున్నది.

దత్తభాగవతము 3వ గుచ్ఛమున 13వ పద్యము ఈ క్రిందివిధముగానున్నది.

**ఉ॥ ఇచ్చితిపుచ్చుకొంటితతినేడ్చితి నవ్వితినూరివారికై**
**వ్రుచ్చిలి జూదమాడిధనముంగొనియోడితి గెల్చితిం ప్రభు**
**త్వోచ్చయముచ్చముంగొనను నొక్కకసారి ఘటించె దైవమా**
**యుచ్చమునుచ్చముంగనుచునూరక తిర్గితి సంసృతి భ్రమిన్**

మూలమునదీనికి సంబంధించిన శ్లోకములు -

శ్లో॥ స్వామిత్వమీశ్వరత్వంచ దరిద్రత్వంతథాగతః
హృతం మయాహృతశ్చాన్యైః హృతంచ పణితం తథా

శ్లో॥ దత్తం మయాన్యైరన్యేభ్యః మయాదత్తమనే కశః
పితృమాతృసుహృద్భ్రాతృకలత్రాదికృతే న చ

శ్లో॥ హృష్టోఽ హమసకృద్దైన్యం దుఃఖిత్వంచ తథాగతః
ఏవం సంసార చక్రేఽస్మిన్ భ్రమతా తాత సంకటే

దత్తమాహాత్మ్యము - 2వ అంశము - 1వ అధ్యాయము - శ్లోకసంఖ్య 26,27,28

పితాపుత్రసంవాదమున పూర్వజన్మజ్ఞానము కల్గివైరాగ్యము కుదిరిన కుమారుడు తండ్రితో తన వృత్తాంతమును చెప్పుచున్నాడు.మూలమునందు గల క్తప్రత్యయాంతములను క్రియాపదములనుగా జేసి ప్రయోగించుటలో నిరుపమకవితా సౌందర్యము కానవచ్చినది.

॥ హృతంమయాహృతశ్చాన్యైః ॥ మొదలగు భిన్నాశ్రయక్రియార్థములు కర్తృసామానాధికరణ్యముతోఏకాశ్రయత్వమును పొందివెలుగైనవి. భావార్థకత్వప్రత్యయాంతములు.అట్లే ప్రయోగింపబడినవి.మూలమున పితృ మాతృకళత్రాది కారణములవలన సుఖదుఃఖములు కల్గినట్లుండగా ఇంతటి వైరాగ్యశాలి బంధువర్గమునంతను వరుసలు పెట్టిచెప్పుటను తప్పించి ఊరివారికై అనిఅనువదించుట వైరాగ్యమునకు పరాకాష్ఠగా సూచింపబడుటయే అనువాదమునకు సామంజస్యము సంతరించుచున్నది.కర్త్రర్థక క్రియా పదముల వలన వృత్తాంతపరముగనయినను తనకు కర్తృత్వము సంభావితముకాదని వెల్లడించుటకై ఘటించెదైవమనుట కూడా మూలాధికముగ కనుపట్టుచున్నను ప్రకృతసందర్భమున సంగతమైనది.

శ్లో॥ తతో పశ్యత్సువిస్తీర్ణే పర్యంకే సర్వకాంచనే ।
నిషణ్ణాం కన్యకామేకాం కామముక్తాం రతింయథా ॥

శ్లో॥ తాందృష్ట్వా చారుసర్వాంగీం తాం రసాతలదేవతాం ।
మన్యమానో భవత్తూష్ణీం సాచవీక్ష్యనృపాత్మజం ॥

దత్తమాహాత్మ్యం - ద్వితీయాంశ - 6వ అధ్యాయము - శ్లోకసంఖ్య 24,25లు

ఋతుధ్వజుడను రాజకుమారుడు తన పరాక్రమమునకు ఓడి వరాహ రూపమున పాటిపోవుచున్న పాతాలకేతుడను రాక్షసుని వెంబడించి పాతాళమునకే గును.అచ్చట నొకభవనమును ప్రవేశించి రాక్షసుడు అదృశ్యుడు కాగా రాజకుమారుడు అచట తిరుగాడుచుఆ రాక్షసుని చే నిర్బంధముననుంచబడిన మదాలస అను గంధర్వరాజకన్యకను చూచెను.ఈ సందర్భమున మూలమునందు "కామముక్తాం రతింయథా" అని కలదు.కామునిచే పరిత్యక్తయగు రతివలె నున్నదను అర్థము. పరిత్యజింపబడినది "కాముడు వద్దలేని రతికామిని నాదగు' అని అనువాదముపై అనౌచిత్యము పరిహరింబడుటయేగాక మూలోద్దిష్టమగు ఏకాంత స్థితి కూడా సంసూచితమగుచున్నది.ఇట్టి కన్యను చూచి రాజకుమారుడు రసాతలదేవతను గా తలంచెను.దేవతా పదప్రయోగముచేత గౌరవప్రతిపత్తులు ఆక్షిప్తములగుచున్నవి.మూలమున తూష్ణీం అభవత్ అనుటలో కేవలమౌదాసీన్యమే పాఠకునకు తోచును.దానిని అనువాదమున వివరించుచూ "నిస్తామసరాజసుండయి" అని ప్రయోగించుటచే రాజకుమారుని మనమునందు రజస్తమోవికారములు అడగి కేవలము గౌరవభావాస్పదమైన సత్త్వప్రవృత్తి మాత్రమే నిలిచెనని చెప్పుట నాయకుని ఉదాత్తతకు నాయిక ఆభిజాత్యమునకు సంసూచకమై ఈయను వాదమును నిత్యనూతనమొనర్చినది.

ఇది అనువాద పద్యము -

ఉ॥ **కాముడు వద్దలేని రతికామిని నా దగుకన్నెనొక్కతన్**
**భూమివిభుండు కాంచన విభూషిత తల్పనిషణ్ణజూచి ని**
**స్తామసరాజసుండయి రసాతలదేవతగా దలంచెనా**
**స్వామిని గాంచి మైమఱపు సంగతి జెందెను బాలలోలతన్.**

దత్తభాగవతము - తృతీయగచ్ఛము - పద్యసంఖ్య 196

దత్తాత్రేయానుగ్రహమునకు పాత్రుడగు విష్ణుదత్తుడను విప్రునివిద్దకు ఒక తండ్రికుమారుని తీసికొనివచ్చెను.ఆ కుమారుడు ఏమి చెప్పినను వినడు.ఎచటికిని పోడు. చదువడు.తినడు త్రావడు జడునివలెనున్మత్తుని వలెనుండును.అట్టివానిని విష్ణుదత్తుడు ఆ కుఱ్ఱవాని తలిదండ్రులను బంధువర్గమును దూరముగా పంపి అతనిని పలుకరించును.అతడు జ్ఞాని అని ఎఱింగి విష్ణుదత్తుడు నీవు జ్ఞానివైనంతమాత్రమున వ్యవహారమును నిరసింపవలసిన అవసరము లేదు. తామరాకు పై జలబిందువు వలె అంటియు నంటకుండ సంచరింపవచ్చును

గదా!దృఢమైన జ్ఞానముగల నీవంటి వాడు ఈ మాత్రమునకే తల్లిదండ్రులను కష్టపెట్టనేల అని బోధించుచు మోక్షమనగా ఎచటనోలేదు స్వస్వరూపాను భవమేమోక్షము.అహంకారవిమోహములు నశించుటవలన స్వరూపము గోచరించును. అహంకారము వదలుటకడుంగడు. సులభమని బోధించు సందర్భమున,ఈ క్రింది శ్లోకములు కలవు.

శ్లో॥ నమోక్షో నభసః పృష్ఠే నపాతాలే నభూతలే ।
అహంకృతేర్విమోహస్యక్షయోమోక్ష ఇతీర్యతే ॥
శ్లో॥ అపి పుష్పావదలనాదపిలోచనమీలనాత్ ।
సుకరో హంకృతేస్త్యాగః నక్లేశోఽత్రమనాగపి ॥

దత్తమాహాత్మ్యం - తృతీయాంశ - 7వ అధ్యాయము - శ్లోకసంఖ్య 75,76.

ఈ శ్లోకములకనువాదము లిట్లున్నవి.

తే॥ మోక్షమాకాశమునగానిభూతలమునగానిపాతాలమున గాని కలుగబోవ
దదియహంకారరూపమోహావసాదమగుట నిజరూప సంస్థానమయుగుగాదె.
గీ॥ అయ్యహంకృతి సంత్యాగమన్ననించుకేనిశ్రమమెనయంగ నౌకృతియకాదు
కౌసుమావదలనమునకన్నలోచ నాంచల నిమీలనముకన్ననది సుకరము.

దత్తభాగవతము -5వ గుచ్ఛము -పద్యసంఖ్య 311,312.

మూలమున అహంకార రూపమగు మోహము నశించుటయే మోక్ష స్వరూపముగాచెప్పబడినది.'అజ్ఞానే నావృతం జ్ఞానం' అను వాక్యమునను సరించి అవరణరూపమగు అజ్ఞానము నశించుటచేత స్వరూపస్థితి అనుభవింపబడును.ఈ తాత్పర్యము అనువాదమున స్పష్టము చేయబడినది.ఈ అహంకారమును పరిత్యజించుట చాలా సులభముగా శ్రమసాధ్యముగా మూలమున చెప్పబడగా అనువాదమున కృతి శబ్దము ప్రవృత్తమై ఆసుకవిత్వము మరింత సులభము చేయుచున్నదిఅహంకార త్యాగమనునది ఇతరక్రియల వలె కరచరణాదులచే నిర్వర్తించునది కాదు.వలదనుకొనటకు నిర్లిప్తతయందే అనుప్రవేశము. కావున ఏ పనియైననూ చేయుటలో గల శ్రమవలదనుకొనుటలో లేదు గనక అహంకారత్యాగము అనునది నివృత్తియేకాని ప్రవర్తనము కాదను భాగమును సూచించుచు "అహం కృతిసంత్యాగమన్న ఇంచుకేనిశ్రమ మెనయంగనౌ కృతియకాదు " అను అనువాదము సుసంగతముగ నొప్పారుచున్నది.

7-2 మూల కుంచనము : -

కుంచనమనగా సంగ్రహించుట మూల గ్రంథమునందు గ్రంథకర్త ఏదేని విషయమును సేకరించి రచనము చేయును,తద్విషయగత విశేషములను వర్ణించునెడ స్వోపజ్ఞములవుఆలోచనములకు పరిధి యుండదు.గ్రంథవిస్తర భీతియులేని పురాణవాఙ్మయములలో ఇంక చెప్పవలసిన పనిలేదు. వ్యాస భగవానుడు ఒక విషయమును గైకొని సర్గములకు సర్గములే చెప్పగలడు.కానీ అనువాదకర్తకు విషయమునకు సంబంధించి పరిధి కలదు.మూలమే దానికి పరిధి అందలి విషయమును పరిశీలించి అల్పాక్షరములతో అనువాదము వ్రాయుటకంటె కొన్ని శ్లోకములకు ఒక్క పద్యముతో అనువదించుట కష్టమగును.అట్టి చో క్లిష్టత కాని పింపకుండా,సంగ్రహించుటవలన భావవైరళ్యము తగ్గి భావసాంద్రత సద్యస్స్ఫూర్తమగును. ఒక్కొక్కచోట పురాణములలో వర్ణనా భాగమున పునరుక్తులు గనవచ్చును.అట్టివానిని పరిహరించుట కూడా అనువాదమున సంగ్రహించుట ఆవశ్యకమగును.మూలమునందు కొన్ని పదములతోనో ఒక్క వాక్యముతోనో వ్యక్తమైన భావము,అనువాదమున ఒక్క పదముచే సంసూచితమైనప్పుడు ఆ పదము అనర్ఘ్యరత్నమువలె కాంతులీనును. ఇట్టి మూలసంగ్రహణము ఈ అనువాదమునందెట్లు పొసగెనో పరిశీలింప బడుచున్నది.

శౌనకాది మునులు భగవంతుని విశ్వరూపముగాంచి మురియుచున్న సందర్భమున మూలమున నిట్లు కలదు.

శ్లో॥ మునయో విస్మయావిష్టాఃప్రేమనిర్భరమానసాః
ధన్యాస్స్మః కృతకృత్యాస్మః సులభాః స్మోమహీతలే.

శ్లో॥ అద్యనః సఫలం జన్మ సఫలంచ తపోధనం ।
జీవితం సఫలంలోకేయజ్ఞాశ్చసఫలాస్తథా ॥

శ్లో॥ ఇత్యన్యోన్యం వదంతస్తే ఋషయశ్శంసిత వ్రతాః ।
జయదేవ మహాదేవ జయసర్వోత్తమోత్తమ ॥

దత్తమాహాత్మ్యం - ప్రథమాంశ -1వ అధ్యాయే శ్లోక సంఖ్య 53 నుండి 56

వీని అనువాద పద్యమిట్లున్నది.

ఉ॥ ధన్యులమైతి మాత్మకృతధర్మములెల్ల ఫలించె,జన్మమా
నాన్యమనంగనయ్యె ప్రభునాదృతికిం గుఱియైతి మన్యసా
మాన్యము కాని రూపుగని మంటి మటంచు ప్రహర్షమొప్పన
న్యోన్యము జూచుచున్ జయజయాభిజయంచని మౌను లానెరిన్.

దత్తభాగవతము - ప్రథమ గుచ్ఛము - పద్యసంఖ్య 42

మూలమునందు "కృతకృత్యాస్మః" సఫలంచ తపోధనం యజ్ఞాశ్చ సఫలాస్తథా॥ అను మూడు వాక్యములను ఆత్మకృతధర్మములెల్ల ఫలించె అన్న వాక్యము సంగ్రహించినది.॥ అద్యనస్సఫలం జన్మ జీవితం సఫలంలోకే॥ అను రెండు వాక్యములు ॥జన్మము నాన్యమనంగ నయ్యె॥ అనువాక్యముచే సంగృహీతములు.

"సుభగాస్స్మమహీతలే " అనువాక్యము కలిగి అవాన్తర క్రియలన్నియు ప్రధాన క్రియాపర్యవసానము జెంది అనువాదమును రమ్యమును గా నొనర్చినవి - మూలమునందలి॥విస్మయావిష్టాః - అను పదములు అన్య సామాన్యముగాని రూపుగని అని కారణముచెప్పుటచేత గతార్థములైనవి.ప్రేమ నిర్భర మానసాః అను సమాసము ప్రభునాదృతికింగుఱియైతిని అన్న వాక్యముచేపరిష్కృతమైనది .స్వామికితమయందు అనుగ్రహాదరములు కలిగి విశ్వరూపమున కానిపించినందు వలన వీరిమనస్సులు భగవద్గీత ప్రేమతో నిర్భరములైనవి. ఈరెండు అంశముల యందు కార్యకారణభావము అనువాదమున వ్యత్యస్తమై అనువాదమును మనోహరమొనర్చినవి.ఈ సందర్భమునందలి నాలుగు శ్లోకములు అనువాదమున ఒక చిన్న పద్యముతో సంగ్రహింపబడుట పరిశీలింపదగును.

శ్లో॥ పాద్యార్ఘ్యాచమనీయం చ ధూపం దీపం సమర్ప్య చ
మదుపర్కవిధానేన సంపూజ్య తదనంతరం.

శ్లో॥ నైవేద్యం వివిధం చాపి,తాంబూలం వినివేద్యచ,
నీరాజయిత్వాదేవేశం రత్న దీపై స్సమంతతః

శ్లో॥ చతుర్వేదోద్భవైర్మంత్రైః భక్త్యాపుష్పాంజలిం విభోః
సమర్ప్య చ పునస్సర్వే సాష్టాంగం ప్రణిపత్యచ

శ్లో॥ స్తోతు మారేభిరేదేవం శ్రద్ధాభక్త్యోర్జితాశ్రయాః
సంసార తాపనిష్టప్తా విశ్వరూపధరంపరం

దత్తమాహాత్మ్యం - ప్రథమాంశ - శ్లోక సంఖ్య 58,59,60,61.

ఇందు మొదటి మూడు శ్లోకములు షోడశోపచార శబ్దముచేత గ్రహింపబడుట మూలకుంచనమునకు ఉదాహరణము.షోడశోపచారములను సమర్పించుటయే పూజయనబడును.అట్టి పూజ శ్రద్ధాభక్తులతో ఏకాగ్రతతో కూడినప్పుడు భగవంతుని మనస్సునకు ప్రీతిని కలుగజేయును.అప్పుడే పూజకు రుచిరత్వము సిద్ధించును.కావున మూలమునందలి ॥శ్రద్ధా భక్త్యోర్జితాశ్రయా॥ అనువాక్యములు అనువాదమున రుచిరశబ్దముచే సంగ్రహింపబడినవి అనువాదపద్య మిట్లున్నది

**ఆ॥వె॥ షోడశోపచారసురుచిరపూజలవేదభేదమంత్రవిధులతోడ**
**సరవిగూరిచి తమసంసారతాపంబడంగ సంస్తుతించిరింగితజ్ఞు**

దత్తభాగవతము - ప్రథమ గుచ్ఛము - పద్యసంఖ్య 43

చిట్టచివరనున్న ఇంగితజ్ఞు శబ్దము విశ్వరూపధరం అన్న దాని సంగ్రహము విశ్వాత్మకుడై సర్వప్రాణులయందు బహిరంతస్ఫురన్మాత్రుడై ఉన్నవాడుగనుక భగవంతుడు ఇంగితము అనగా హృద్గతాభిప్రాయమును ఎఱిగినవాడునుట యుక్తముగ నున్నది.

దత్తభాగవతమున జంభాసుర విజయ వృత్తాంతమున దేవతలను తరుముకొనుచు వచ్చిన రాక్షసవీరులు దత్తాత్రేయునాశ్రమము ను ప్రవేశించిరి.అచట దత్తాత్రేయుని తొడపై నున్న దివ్యమంగళ విగ్రహయగు అనఘాదేవి సౌందర్యమును గాంచి రాక్షసవీరులందరు ఆమె నపహరించుటకు సమాలోచనము గావించి మేనాను తీసికొనివచ్చి ఆమెనందు ఉంచుకొని శిబికను నెత్తిమీద పెట్టుకొని సాగిరి. ఈ సందర్భమున మూలమున గల 3 శ్లోకములు అనువాదమున నొక్క కందపద్యముచే సంగ్రహింపబడినవి.

**శ్లో॥ తస్మాత్సర్వేసముక్షిప్య శిబికాయాం సురార్దనాః**
**ఆరోప్యస్వమధిష్ఠానం నయామ ఇతినిశ్చితాః**
**శ్లో॥ సానురాగాస్తతస్తేతుప్రోచ్యేత్థం వై పరస్పరం**
**తస్యతాం యోషితం సాధ్వీం సముక్షిప్యస్మరాతురాః**
**శ్లో॥ శిబికాయాం సమారోప్య సహితాదైత్యదానవాః**
**శిరస్సు శిబికాం కృత్వాస్వస్థానాభిముఖాయయుః**

దత్తమాహాత్మ్యం - ద్వితీయాంశ - శ్లోక సంఖ్య 52, 53, 54

కం॥ సురవైరులొకశిబికదె చ్చిరి దత్తాత్రేయునం క సీమగలతలో
దరినందిడిరి బలంబునబొరినెత్తికినెత్తుకొనిరి పోసాగిరికన్

దత్తభాగవతము - 3వ గుచ్ఛము - పదసంఖ్య 138

అశ్వతరుడు తన పుత్రులకుమిత్రుడైన ఋతుధ్వజుని భార్యావియోగవార్తను విని శివానుగ్రహముతో అతని భార్యను పునరుజ్జీవితురాలినిగా చేయదలచి శివుని గుఱించి చాలాకాలము తీవ్రముగా తపమొనర్చెను. చాలాకాలమునకు శివుడు ప్రత్యక్షమాయెను. ఈ సందర్భమున మూలమున గల రెండుశ్లోకములు ఒక్కగీత పద్యముతో అనువదింపబడినవి.

శ్లో॥ తతః కాలేన మహతాసేవ్యమానో వృషధ్వజః
తుతోషగీతకైర్దేవః వరదోఽస్మీత్యువాచతౌ

శ్లో॥ తతః ప్రణమ్యదేవేశం ప్రసాదాభిముఖంహరం
ఊచతుర్యదినౌదేవ సంతుష్టోసి సదాశివ

దత్తమాహాత్మ్యం - ద్వితీయాంశ - 7వ అధ్యాయము - శ్లోకసంఖ్య 35, 36

గీ॥ అట్లుబహుతిథమగు కాలమపసరింపహరుడనంగాంగహరుడరుదార దార
యుతముగా మెచ్చియిచ్చెదనుల్లమునకు నిష్టమేకోరుడన్న దారిట్టులనిరి

దత్తభాగవతము - 3వ గుచ్ఛము - పద్యసంఖ్య 260

విష్ణుదత్తుడను బ్రాహ్మణుడు దత్తాత్రేయుని అనుగ్రహముచే గొప్పమహిమ సంపాదించి ఎందరో రోగగ్రస్తులకు ఆరోగ్యమును ప్రసాదించెను. అతని గొప్పతనమును విని ఒక మహాపతివ్రత బహురోగపీడతు డగు తన భర్తను ఆరోగ్యము కల్పింపవలసినదిగా విష్ణుదత్తుని ప్రార్థించును. అంతనావిష్ణుదత్తుడు దత్తాత్రేయుని వరముచేత ఆరోగములనన్నింటిని పోగొట్టజాలిన శక్తికలిగియు, లోకధర్మమునునుసరించి కర్మవిపాకము పరిశీలించి వాతగుల్మ జలోదర దీర్ఘ జ్వరాదిరోగములను శాంతివిధానములతో పోకార్చెను. ఈ సందర్భమున మూలమునందు 2,3 శ్లోకములలోనున్న విషయమునంతను సంగ్రహించి ఒక్క పద్యము నందు క్లుప్తముగా అనువదించిరి.

శ్లో॥ షడబ్దం వాతగుల్మస్యతతశ్చ క్రుః ప్రహర్షితాః
సవిలీనోఽథసంప్రాప్తః జీవితాశా పరాహ్యభూత్

శ్లో॥ జలోదరో హరిద్రోహాత్ కఠిన శ్చాఫలశ్రమః
ద్వాదశాబ్దం చతస్యాపి వ్రతమాచరితం త్వయా
శ్లో॥ భగందరేఽబ్దత్రితయం వ్రతం చక్రుశ్చభేషజం
క్షీణేఽస్మింస్త్రసమాత్రాభిర్జ్వరం జీర్ణం పరాణుదః
శ్లో॥ అతిసారేతదుక్తం తే భేషజందుదురుత్సుకాః
త్రిదోషః క్షణమాత్రేణ తన్మాత్రాభిః క్షయంగతః

దత్తమాహాత్మ్యం - 3వ అంశ - 6వ అధ్యాయం -27, 28, 30, 31

కథాగమనమున విసువులేకుండుటకు పునరుక్తములు పరిహరించుటకు పై శ్లోక తాత్పర్యము ఈ క్రింది పద్యములో క్లుప్తీకరింపబడినది.

మ॥ హరివిద్రోహముచేత వచ్చినది పామ్మంచున్ వచించెన్ జలో
దరముందాక వ్రతమ్ము బూన్చెవిహితాబ్దంబుల్ తదారూఢిద
ద్విరతిం గూరిచి వాతగుల్మమునకు న్విధ్యుక్తి గీలించి సం
జ్వరముఖ్యంబుల మూలపాతకములార్పంజేసె తత్తత్కృతిన్

దత్తభాగవతము - 5వ గుచ్ఛము పదసంఖ్య 247

7-3 మూలప్రపంచము :-

మూలమును అనువాదము చేయునప్పుడు అనువాదకుడు సాధారణముగా అన్యూనాతి రిక్తముగను, క్లప్త సుందరముగను అనువదించును. ఒక్కొక్కచోట పునరుక్తాది దోషములను నిరాకరింపగోరిజేయుగోరి, ధ్వని సౌందర్యమును ప్రకాశింపంజేయగోరి సంగ్రహించినట్లే మరొక్కచోట ఆ సందర్భమున వివరింప వలసిన విశేషము కల్గినప్పుడు మూలార్థమును విస్తరించియనువదించును. కథా సందర్భమునందు మూలమున సరియైన వివరణములేక పోయినచో అనువాదకుడు అట్టివివరణము కూడా తన అనువాదమున జూపును. వర్ణనాదులయందు మూలమున లేకున్నను, వర్ణనాపేక్షకు అవసరమైన సామగ్రిని సమకూర్చుకొని అనువాదమున ప్రదర్శించును. ప్రస్తుతాంశమున మూలాధికముగా నున్న సందర్భములు కొన్ని పరిశీలింపబడు చున్నవి. ప్రథమాధ్యాయమున శౌనకాది మహర్షులకు దర్శనమిచ్చిన దత్తాత్రేయ స్వామిని వర్ణించునెడగల శ్లోక భాగమును అనువదించిన తీరిట్లున్నది.

**బ్రహ్మోపేంద్రేశ రూపం చ క్వచిదేకం పృథక్క్వచ -**

దత్తమాహాత్మ్యం 1-1-19

త్రిమూర్తులు రూపములు కలిగి ఒకచో నొకటిగను, మరియొకచో, భిన్నముగను ఉండెనన్న అర్థము ఈ క్రింది పద్యమున వివరింపబడినది.

**మూడు తలలతోడ ముగురుసాములమేల మెలపులొప్పనొకట మెలగుచుండ**
**వేఱువేఱ నెవరి వేసముల్వారంది యందునందు దోప నరుడు వెలసె**

దత్తభాగవతము - ప్రథమ గుచ్ఛము - పద్యసంఖ్య 22

ఇందు బ్రహ్మోపేంద్రేశ రూపంచక్వచిదేకం అనుభాగమును బ్రహ్మాది నామధేయములను పేర్కొన కుండా అట్టి అర్థము వచ్చునట్లుగా మూలమున లేని మూడు తలలతోడ అను విశేషమును స్పష్టము చేయుచు మొదటి రెండు పాదములతో వివరింపబడినది. పృధక్క్వచిత్ అన్న భాగములోని పృధక్ఛబ్దార్థమును వివరించుచూ చివరి రెండు పాదములు నడిచినవి. ఈవిధముగా విస్తరించుట చేత భావమునకు వైశద్యము సన్నివేశ వర్ణనయందు సమగ్రతయూ సిద్ధించినవి. ఈ పురాణములను రచించినది వ్యాసభగవానుడు వ్యాసుడనగ వేదములను వాడు విభజించువాడను నర్థముతో విపూర్వకమగు అసుధాతువునుండి వ్యాస శబ్దము పుట్టినది. వ్యాసుడన్నది ఆతని నిజనామధేయము కాదు. వేదమంత్రములు సాంకర్యముందినపుడు శాఖాపరముగను, ప్రయోగ పరముగను, వినియోగపరము గను, ఆయామంత్రములను విభాగమొనర్చి, సంప్రదాయమును, రక్షించుట కొఱకు మహావిష్ణువే అనేక అవతారములను దాల్చి తద్విభాగమొనర్చి వేద వ్యాసుడుగా కీర్తింపబడెను. ఆ విష్ణువు యొక్క అవతారములలో అపాంతరతముడు అను పేరుగల అవతార మొకటి అతనికి వేద వ్యాసుడన్న బిరుదము కలదు. భారతకాలమున సాత్యవతేయుడగు వ్యాసుని పేరు కృష్ణ ద్వైపాయనుడు కావున ఆయానామ ధేయములతో అవతరించిన మహావిష్ణువే వేదములను విభజించు మహాకార్యము నిర్వహించు వేదవ్యాసుడుగా చెప్ప బడుచున్నాడు విషయము ఈ సందర్భానుగుణమగా వివరింపదలచియు మూలగ్రంథకర్త యొక్క విశేషమును పాఠకులకు అందింపదలచియు శ్రీశాస్త్రిగారు "వ్యాస ఉవాచ" అన్న వాక్యమును ఈ క్రింది పద్యములో విస్తరించి అనువదించుట గమనింపదగును.

**అని ప్రసంగించె యిట్లనె వ్యాసమౌని వేద విద్యావబోధార్ధ మాదిదేవు**
**నంశమున నపాంతరతముడనగా బొడమి యుగయుగంబుల కొకడైన యుజ్వాలుండు**

దత్త భాగవతము - 1వ గుచ్ఛము - పద్యసంఖ్య 10

మునులు విశ్వరూపుని తేజస్సును చూడజాలక కనులకు మిఱుమిట్లు గొలపగా చూడజాలక కనులు మూసికొని మనమున విష్ణువును చింతించిరి. అనుభావము గల ఈ క్రింద శ్లోకమును రెండు పద్యములతో అనువదించిరి.

శ్లో॥ **ప్రతాడితాక్షా మహసా బభూవుః సహసానఘాః**
**నిమీల్యాక్షీణి తేపశ్చాచ్చింతయంతో హరింహృది,**

దత్తమాహాత్మ్యము - 1వ అంశ - 1వ అధ్యాయము - శ్లోకసంఖ్య 10

ఈ శ్లోకభావము ఈ క్రింది రెండు పద్యములలో విస్తరింపబడినది.

గీ॥ **చూచిరేగాని వెంటనే చూడలేక కనులు వెనుదీయనెది సేయగలరు వారు**
**కాని యటునిటుగాంచి నిక్కమని తలచి రాతడంతర్బహిర్వ్యాప్తుడన్న చదువు**

ఉ॥ **కన్నులు మూసి లోమొలచుకాంక్షననంగు సహాంగుజేయ నా**
**సన్నుతులంతరింద్రియము సన్నిధి మాకనిలాగులాడు నా**
**యున్నతదింద్రియంబులటులుంచి హరిన్వినుతించివేడిరో**
**యున్నకృతంబులున్న గనులార నినుంగన నిమ్మటం చిటుల్**

గురుశిష్యుల కథయందు కాశికా నగరమందు ప్రారబ్ధవశమున కుష్ఠిరోగముననుభవించు వేదధర్ముడను గురువునకు దీపకుడను శిష్యుడు శ్రద్ధతో సేవలు చేయుచుండగా విశ్వేశ్వరుడు అతని గురుసేవకు సంతసించి ప్రత్యక్షమై వరము కోరుకొనుమనగా ఆ శిష్యుడు నాకేమి వరము కావలయునో తెలియుట లేదు మా గురువు గారిని అడిగి చెప్పెదనని శిష్యుడు గురువును సమీపించి విశ్వేశ్వరుని యొక్క రాకనెఱింగించును. ఈ సందర్భమున ఈ క్రింది శ్లోకములు కలవు.

**అవిముక్తేశ్వరోదేవో దదాతివరముత్తమం**
**శ్రీగురోరాజ్ఞయాదేవం ప్రార్థయేరోగనాశనం**
**యద్భావాన్మన్యతే కార్యంభగవాంస్తన్నియోజయేత్**

దత్తమాహాత్మ్యం - 1వ అంశ - 8వ అధ్యాయము - 4,5

సీ॥ సువిముక్త సర్వస్వ అవిముక్తనాధుండు వరమొసంగెదననివచ్చినాడు
ఏదికోరగనౌనొ యెదివరింపగరాదొ నాకేమి తెలియుమనః ప్రియుండ
యర్థింతునా తమయాన నేత్రరోగహీనంబు భవదర్థమర్థవిదుడ
నేను శుశ్రూషింపనేరక కాదిది ముమ్మాటికి నెదనమ్ముమను మదీశ
తే॥ దివ్యచిత్తమ్మున దలంచిదేవతుల్యయస్వతంత్రుడ నైననాకానతిమ్మ
ఊర్జితుడభగవంతుడా కర్జమనినఛాత్రుతో వేదధర్మ్ముడీ చాయ ననియె

దత్తభాగవతము - ప్రథమగుచ్ఛము - పద్యసంఖ్య 220

సువిముక్త సర్వస్వ అను విశేషణము వేదధర్మ్ముడు సర్వసంగి పరిత్యాగి కావున నిస్పృహుడు కావునను తానేమి వరముకోరిన ఎట్టి తప్పగునో అని దీపకుడు సంశయించుటను సూచించుచున్నది. తమరు ఆనతిచ్చినచో ఈ కుష్ఠరోగము తొలగిపోవునట్లుగా వరము కోరుదునా అని నిస్వార్థ సేవాపరాయణు డైన దీపకుడడిగినట్లుగా మూలమున ఉండగా శిష్యుడు ఒకవేళ శుశ్రూష చేయుటకు విసుగు చెంది ఇట్లు వరమును కోరదలచెనేమోయని సందేహము కలుగకుండుటకు విస్తరించి అనువదించిరి. నేను శుశ్రూష చేయలేక ఇట్టి వరమును కోరదలచితినని మీరు భావింపవలదు ముమ్మాటికి ఇది నిజము నేను మీకు శిష్యుడను కావున నాకు స్వాతంత్ర్యము లేదు. దివ్యచిత్తముతో ఆలోచనచేసి నాకు సరియైన ఆదేశమును ఈయదగునని శిష్యుడు ప్రార్థించినట్లుగా మూల భాగమును పెంచి అత్యంతరమణీయముగా అనువదింపబడినది.

**వికృత్యాచరణం భక్త్యాసంతోషయితుమర్హథ**

దత్తమాహాత్మ్యం - ద్వితీయాంశ - 4వ అధ్యాయము - శ్లోకసంఖ్య 27

జంభాసురునిచేత వేధింపబడిన ఇంద్రుడు దేవత లతో కలసి బృహస్పతి యొద్దకు బోయి ఉపాయము చెప్పుమని అడుగగా అతడు నింద్యములగు వేషభాషలతోనున్నను ఆయనయొక్క అనుగ్రహము కలుగనంతవఱకు విడవకుండ సేవింప వలయునని బృహస్పతి చెప్పును. ఈ సందర్భమున గల వికృత్యాచరణం అను పదము దురాచారశబ్దము చేత నిస్సందేహముగా వివరింపబడినది. అడుగులంబడి ఎట్టులన్నను విడువక ఆ ప్రసాదము సేవించుకొనుడని మూలమును ప్రపంచించి అనువదించిరి. అలర్క చరిత్రయందు అలర్కుడను రాజునకు తల్లియగు మదాలస ఒక ఉంగరము నొసంగి కష్టకాలమున ఇందలి అక్షరములను చదువకొనుమని ఉపదేశించును. తరువాత కొంతకాలమునకు తన రాజ్యమును

కాశిరాజు ముట్టడించు సందర్భమున అలర్కుడు ఆయుంగరమునందలి అక్షరములను చదివించు కొనగా అందు సత్సంగము చేయువలెనని ఉపదేశవాక్యమును జూచి మనస్సు నందు అనేకవిధములుగా చింతించి దత్తాత్రేయుని చేరబోయెనని మూలమున కలదు.

**శ్లో॥ తతస్సాధుసంసర్గం చింతయన్ పృథివీపతిః**
**దత్తాత్రేయం మహాత్మానం అగచ్ఛత్పరమర్ధిమాన్**

దత్తమాహాత్మ్యం - ద్వితీయాంశ - 4వ అధ్యాయము - శ్లోకసంఖ్య 22

ఈ శ్లోకమునందుగల చింతయన్ అను పదము నకు సందర్భానుసారముగా వివరణ మొనర్చిరి సంసారమ: ను అరణ్యమున చిక్కుపడినవారికి దారిడొంకయూ తెలియదు. శ్రేయస్కాములగు వారు. మోక్షమునందు కోరికను కలిగించుకొన వలయును. మోక్షము సిద్ధించుటకు సజ్జన సాంగత్యము ఆవశ్యకము. పుణ్యము చేతగాని సత్సంగము లభింపదు. అని అలర్కుడు చింతించినట్లుగా అనువాదమున చూపబడినది. అంతియేగాక మోక్షపురుషార్థవిషయమున మానవులకు స్వేచ్ఛగలదు.. అనగా గృహస్థుడగువాడు ధర్మార్థ కామముల విషయమున భార్యమాటను అతిక్రమింపరాదు. మోక్షవిషయమున తానొక్కడు ప్రవర్తింపవచ్చును. అట్టి సందర్భమున తనకు ఈ సంసారమునందు నిర్వేదము కలిగినదనియూ మోక్షమునకు ప్రయత్నింపదలచితిననియు తన భార్యకు విశదీకరించి తదనుమతితో మోక్షమున ప్రయత్నింపవలయును అట్లు కాకున్నచో ఆశ్రమ ధర్మవ్యతిక్రమణమువలన పాపము సంభవించును. ఈ విషయమును మనస్సున నుంచుకొని శాస్త్రిగారు అలర్కుడు తనభార్యతో సంప్రదించి ఆమె చూపిన విధముననే సజ్జన సంగతి కొఱకు దత్తాత్రేయసమీపమునకు బయలుదేరెనని సవివరము సాభిప్రాయముగా ఈ క్రింది పద్యమున అనువదించిరి.

**సీ॥ దారిడొంకయుగలదామానవుల కెందు సంసారకానన సంపతితుల**
**కట్టివారలు శ్రేయమర్థించిరా మనమ్మున ద్రిప్పవలయు ముముక్షమీద**
**నన్యసాధనముల నది సులభమ్మైనె సుజన సంగముసేయుచౌరవగాక**
**యున్నపుడెల్ల నయ్యది సమకూరునా పూర్వపుణ్యము పొంగిపొరలకున్న**

గీ॥ ననుచు చింతించి చింతించియవనివిభుడు జాయపల్కుల చాయనిశ్చయమొనర్చి
తనకు గూర్చు దత్తాత్రేయుడను మునీంద్రు డన సకుశుడై బయలుదేరె నర్థినపుడ

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - పద్యసంఖ్య 84

అలర్కచరితమున సుబాహుడు కాశిరాజువద్దకు బోయి తనతమ్ముడలర్కుడు రాజ్యము అపహరించెననియు ఆ రాజ్యమును తనకిప్పింపుమనియూ కాశిరాజును శరణుపొందినట్లుగా మూలమున ఈ క్రింది శ్లోకభాగము కలదు.

స్వరాజ్య ప్రాప్తయే గచ్ఛద్సుబాహుః శరణం కృతీ

దత్తమాహాత్మ్యం - తృతీయాంశ -9వ అధ్యాయము 5వ శ్లోకము

ఈ శ్లోకార్థమునకు అతివిస్తరముగా అనువాదముకలదు.కాశిరాజు అన్నదమ్ముల మధ్య తాను కలుగజేసికొనుటకు ఇష్టపడకపోవచ్చునని సుబాహుడు సహాయముకొఱకు కాశిరాజును శరణు పొందెనని మూలమునందర్థముండగా అనువాదమున నిది మూడు పద్యములైనది.

ఉ॥ కాశీదేశమహేశ్వరా వినుముమాకన్నయ్య రాజ్యంబుని
ర్వేశింపం దపమెంచిమేమటవులం బ్రీతింజరింపంగ న
భ్యాశావస్థితుండాహరించుకొనె రాజ్యం బేలుచున్నాడులే
డాశ ల్గెల్చెనొ లేదొ నీవెఱుగవాయస్మత్కనిష్ఠుంబతిన్

గీ॥ రామరామ యలర్క సనాముడతడు, నన్నుగొనకున్నవాడు నీ నయమునెఱపి
నాకు నారాజ్యమిప్పింపునతులు నీకు రాజులకు రాజెగతిగాక వాజియగునె

కం॥ నీకతడరియొ మిత్రుడొ నాకెఱుగగరాదు కానినయమని నిన్నుం
జేకొని పూనికి దీర్పన్ శ్రీ కరశరణంటినేమిసేసెదోయింకన్

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - పద్యసంఖ్య 6,62,63

కాశిరాజు తనకోరికను నిరాకరింపకుండుటకు తగిన రీతిలో నిపుణముగా నాతనికి నచ్చజెప్పిన అంశము మూలాధికముగా పై పద్యములలో అనువదింపబడినది.

7-4 వ్యాఖ్యానుసరణము : - మూలగ్రంథమునందలి కొన్ని క్లిష్టపదములకు కొన్ని,వాక్యములకు గల క్లేశమును తొలగించుటకో,మూలములోని వాక్యోపవాక్యములకు అన్యథా జ్ఞానమును నివారించుటకో,శాస్త్ర పారిభాషికపదములను విశ్లేషించిసమగ్రమగు స్పష్టార్థము సమకూర్చుటకో, సంస్కృతగ్రంథములకు అనేక వ్యాఖ్యలు విలసిల్లినవి. గ్రంథప్రతిపాద్యమైన విషయమును సులభమైన శైలితో విశదమొనర్చి చదువరులకందించుటయేగాక విశేషార్థజ్ఞానములను కల్పించుచుండుటను బట్టి ఆయా తమ వ్యాఖ్యలకు వ్యాఖ్యానకర్తలు అన్వర్థనామధేయములను పెట్టుచుండుటయు అనువాదగ్రంథములందు సాధారణముగా కన్పడును. ఇట్లు మూలగ్రంథస్పష్టార్థ ప్రతిపత్తికై ఏర్పడిన ఈ వ్యాఖ్యలు మూలగ్రంథకర్తయొక్క అభిప్రాయములకు ఆశయములకు దర్పణములుగా గోచరించును.

దీనికి మూలగ్రంథమైన దత్తమాహాత్మ్యమునకు పదమంజరి అనునొక వ్యాఖ్యకలదు.దత్తమాహత్మ్యము,ఆగమ,యోగ,తత్త్వ శాస్త్ర రహస్య గర్భితము, వేదవ్యాసవిరచితము,అగుటవలన ఇది వ్యాఖ్య లేనిదే, సులభగ్రాహ్యముకానిదైనది, గచ్ఛద్వ్యాఖ్యానము,టీక,ధావద్వ్యాఖ్యానము, టుప్టీక, సమగ్రవ్యాఖ్యానము, పంజిక లేక సంచిక, అను అవాంతరభేదములుగా వ్యాఖ్యలు కన్పట్టినను, పదమంజరి పదములకు విపులమైన వివరణము కలదియగుటవలన టుప్టీక లేక సంచిక అను ఆలంకారికులలక్షణలక్షితమై యొప్పారుచున్నది. శ్రీ శాస్త్రిగారు స్వీకరించిన మూలగ్రంథము పదమంజరీ వ్యాఖ్యోపేతమగుట వలన వ్యాఖ్యలోని విశేషములనన్నింటిని ఏమఱక తమ అనువాద గ్రంథములో పొందుపరచినారు. ఇట్టివి ఈ గ్రంథమున ననేకములున్నను స్థాలీపులాక న్యాయమున కొన్ని పరిశీలింపబడుచున్నవి.

శ్లో॥ దత్తాత్రేయాశ్రమాభ్యాసే సర్వేదేవామహర్షయః
సర్వతీర్థోదకైర్విష్ణుం సిషిచుఃకోలరూపిణం

దత్తమాహాత్మ్యమ్ - 4వ అంశ -4వ అధ్యాయము - 59వ శ్లోకము.

దేవతలు,మహర్షులు దత్తాత్రేయుని ఆశ్రమసమీపమున సర్వతీర్థ ఉదకములచే కోలరూపుడైన విష్ణువును అభిషేకించిరి,అని మూలమున గలదు. దత్తదేవుడు మునులకు సంధ్యాస్వరూపము వివరించిన తరువాత, దేవతలు, మహర్షులు దత్తదేవుని పూజించి అభిషేకించినసందర్భములోనిదీ శ్లోకము.

ఒకప్పుడు బ్రహ్మ సృష్టిచేసెను.అందఱూ జ్ఞానులు, విరాగులు, నిస్సంగులయి సంచరింపదొడగిరి.తన సృష్టి అభివృద్ధి చెందలేదు సృష్టి వృద్ధి చెందుటకై 1 తమము 2మోహము 3 అతివిమోహము 4తామిస్రము 5 అంధతామిస్రము అను పంచపర్వములు గల అవిద్యను సృజించెను.అవిద్యాసంయోగముచే తానుకూడా వేదములను విస్మరించెను.తిరిగి వేదములను సంపాదించుకొనుటకై సహ్యాద్రిచేరి,దత్తస్వామిని,రేణుకను,శరణు పొందెను.వారు అప్పుడు ముందుగా పాలకడలిలోని విష్ణువును సేవించి రమ్మనిరి.బ్రహ్మవిష్ణువును అచ్చటగానక తత్ స్థానమున నున్న కృష్ణామలక వృక్షమును గైకొని సహ్యపర్వతమునకు తిరిగి వచ్చెను.దత్తాత్రేయుడు ఆ వృక్షము త్రిమూర్తిస్వరూపమని తన ఆశ్రమమున పరశురామునిచేనాటించెను.ఆ వృక్షము క్రింద రేణుకాదేవికి మ్రొక్కితాను నిలచెను విధాతకు విస్మరించిన వేదస్వరూపమును కొంత రేణుక చెప్పి విధాతా! మిగిలిన వేద స్వరూపమునంతటిని ఈ దత్తాత్రేయుడు నీకు వివరింపగలడని బోధించెను. ఇట్లు చెప్పుచుండగనే రేణుకావపుర్దేశమునుండి వేదరాశి దత్తదేవుని అంకస్థమైన లక్ష్మి ముఖాబ్జమున ప్రవేశించినది.అప్పుడు బ్రహ్మ ఆ స్వామిని ప్రస్తుతింపగా దత్తదేవుడిట్లని చెప్పదొడగెను.ఓయీ అఖిలవర్ణంబులందును నాదమొక్కటియేగదా ! అనాదమే ఓంకారము.దానినుండియే సకల వర్ణజాలము అందుండి వేదము ఆవిర్భూతమైనది.బాహ్యాభ్యంతరములందు వెల్గెడి సకల వేదమాత ఆ రేణుకయే.గాయత్రీ సావిత్రీ,సరస్వతీ రూపిణి, సంధ్య ,హ్లాదిని, ఏకవీర,ఏకమాత్ర,అనేకాకార సంవిత్స్వరూప,ఆమెకంటె అన్యమేమియులేదని సర్వశక్తి స్వరూపమని సాంగోపాంగముగా వివరించెను. బ్రహ్మ కృష్ణా మలకాభ్యాశమున వెల్గుచున్న దత్తదేవుడు విష్ణువు యొక్కఅవతారమని రేణుక జగన్మాత,త్రిమూర్తులకుఅంతర్గతయైన శక్తిని ఇచ్చెడి దేవతయని రేణుకకు దత్తదేవునకూ మ్రొక్కి స్వస్థానమునకు వెళ్ళెను.పైవిషయమును దత్తదేవుని వలనవిన్న మహర్షులు దేవతలు ఆ స్వామిని అభిషేకించిరన్న విషయము ప్రస్తుత ప్రకరణాంశము ఇచ్చట "కోలరూపిణం" -వరాహరూపిణం విష్ణుం, కౌజరూపిణం ఇతి పాఠే కుజః - వృక్షః కృష్ణామలకః తదుద్భవః సఏవకౌజః, తరురూపిణం విష్ణుం అని వ్యాఖ్యాన కర్త వివరించియున్నాడు. ఆదివరాహరూపుడైన విష్ణువును అని ఒక అర్థము కౌజరూపిణం అను పాఠమున కృష్ణామలక వృక్షరూపుడైన విష్ణువును అభిషేకించిరి అని మరొక అర్థము నిరూపింపబడినది. ఇందుకౌజరూపిణం అను పాఠము మిక్కిలి సందర్భోచితము.వ్యాఖ్యానములో చూపించిన ఈ రెండర్థములను తమ అనువాదమున శ్రీ శాస్త్రిగారు ఈ క్రింది పద్యమున సంగ్రహించినారు.

ౌ॥ దత్తాత్రేయుమహోశ్రమమ్మునమునుల్ దైవంబులు న్సర్వతీ
ర్థాత్తానుత్తమ తీర్థసార్థములు గోలాకారునిందోచుచున్
దత్తస్వామిని దివ్యమామలకముందద్రేణుకాదేవి సం
పత్తిం మెచ్చుచు మ్రొక్కుచుంజనిరి స్వస్వస్థానముల్ సేరగన్

దత్తభాగవతము - 9వ గుచ్ఛము -పద్యసంఖ్య - 62

ఈ పద్యమున మూలములోని కోలరూపిణం" అను దానికి కోలాకారుడని ంనువాదము చేయబడినది."దత్తస్వామిని దివ్యమామలకము" అనుట వలన ్రష్ణామలకస్వరూపుడై రేణుకాదేవి సంపత్తితోనున్న దత్తవిభుడు అను ంకరణాంతరములోని అర్థము కూడా సంగ్రహింపబడినది. రేణుక వేదమాత ంని,వేదమును దత్తదేవుడు బ్రహ్మకుబోధించును.ఈ ప్రకరణమున ఈ క్రింది ్లోకము గలదు.

శ్లో॥ ఏకమాత్రైకవీరాసా అష్టపర్యాయవాచకా
ఓంకారైకస్వరాజ్ఞేయాప్రోక్తాసాబ్రహ్మరూపిణీ

దత్తమాహాత్మ్యమ్ - 4వ అంశ - 3వ అధ్యాయము - 25వశ్లోకము

నాదాత్మకమైనట్టిదై, ఒక్కటియే అనేకరూపములుగా నుండువలన ఏకవీర నియు, అష్టపర్యాయవాచకమై ఓంకారైకస్వరూపిణిగాను ఆరేణుక తెలియదగిన ని దీని అర్థము.ఈ శ్లోకమునందలి "అష్టపర్యాయవాచకా " అను పదమునకు ్యాఖ్య ఈ విధముగా నున్నది.1 ఏకమాత్రా 2విమలా 3ఉత్కర్షిణీ 4జ్ఞానయోగా ఇత్యా 6ఈశానా 7ప్రహ్వీ 8అనుగ్రహాః ఇత్యష్టౌపర్యాయవాచకా శ్శబ్దాఃయస్యాస్సా దప్రవృత్తి నిమిత్తైః భిన్నే సత్యప్యేకవస్తు పరత్వాత్ తేషాం పర్యాయత్వం జ్ఞేయమ్ యద్వాఅష్టౌ పర్యాయాఃస్థానభేదాఃవాచకాఃశిక్షాయాం అష్టౌ స్థానాని వర్ణానాం 1 రః 2 కంఠః 3 శిరః 4.(తథా) జిహ్వా మూలం చ 5 దంతాశ్చ 6 నాసికా 7 ఓష్ఠౌ 8 తాలు చేత్యష్టౌ " ఈ వ్యాఖ్యలోని విశేషములు ఈ క్రింది సీసపద్యములో సుగ్రముగా ననువదింపబడినవి.

। ఏకమాత్రయనంగ నేక వీరయనంగ నష్టపర్యాయ వాచ్యయన జెల్లు
నోంకారరూపనాదాంకురకలితయై బ్రహ్మాత్మయేక మాత్రయనబడెడు
నేకయేయయ్యునేకా కృతులనుండి ఏక వీరాభిఖ్యనెనసివెలసి
నష్టసంస్థానములందు వర్ణాత్మతనావిర్భవించి తదాఖ్యకయ్యె

గీ॥ విమల ఉత్కర్షిణియు జ్ఞానవిహితయోగ ఇత్య ఈశాని ప్రహ్వినా నేడు పేళ్ళు
మఱియనుగ్రహయుక్తి నమ్మాటపుట్టెవేదమాత గాయత్రి సంవిత్స్వరూప

దత్తభాగవతము - 8వ గచ్ఛము - పద్యసంఖ్య 157

ఏకవీర,ఏకమాత్ర,అష్టపర్యాయవాచక,అనుపదములకు పదమంజరీ కారుడువలసినంత వివరణము చూపించగా పైపద్యమున వ్యాఖ్యాగతాంశములను అనువదించిన ప్రకారము రమణీయము.రెండవ సీసపద్యపాదము ఏకమాత్ర అను పదమునకు వివరణరూపముకాగా 3వ పాద "ఏకవీర" పదార్థ నిరూపకమైనది.ఇక 4వపాదము వర్ణాభివ్యంజకస్థానములందు వర్ణాత్మకముగా నావిర్భవించి అష్టపర్యాయవాచకమైనదని తెల్పబడినది.ఇక సీసపద్యపుతేటగీతిలో 2 పాదములలో ఏడు పేర్లు సీసపద్యంలోని ఏకమాత్ర అను పేరుతో కలిపి అష్టపర్యాయవాచక అను పదమునకు అర్థము విశదము చేయబడినది.

దత్తదేవుడు కార్తవీర్యార్జుననికి యోగమును,తత్త్వమును ఉపదేశించుచు మొట్టమొదట ప్రాణాయామ మభ్యసింపవలయును. సాధకుడు ప్రాణాయామా సిద్ధిచే మనోజయము సమకూరుననియుపదేశించును.అట్టి యెడ ప్రాణాయామమును గూర్చి మూలమున ఈ క్రింది శ్లోకముగలదు.

శ్లో॥ వామేన పూరయేద్వాయుం కుంభయిత్వాపునర్భహిః
విపరీతేన వా యుంజ్యాత్ బహిర్వాకుంభకోభవేత్.

దత్తమాహాత్మ్యమ్ - 3వ అంశ - 9వ అధ్యాయము - శ్లోకము 53

ఎడమముక్కుతో 16మాత్రలకాలము గాలిపీల్చి కుంభించి విడువవలెను. లేదాకుడిముక్కుతోలోపల నున్నగాలిని విడిచి బహిః కుంభకమాచరించి పూరించ వలెనని మూలమనందుండగా పదమంజరీకారుడిట్లు వ్యాఖ్యవ్రాసినాడు "షోడశభిః పూరకంచతుష్షష్ట్యాకుంభకం, ద్వాత్రింశతారేచకం, విపరీతేన దక్షిణేన పూరకం వామేన రేచ, కమితి.బహిర్వేత్యయమర్థఃఅదౌరేచకం కృత్వానాసాపుటాద్బహిః ద్వాదశాం గుళిపరిమితాకాశేకుంభయిత్వా పునఃపూర యేదితి "16మాత్రలకాలము పూరకము 64మాత్రలకాలము కుంభకము, 32 మాత్రలకాలము రేచకము ఆచరించవలెను.లేదా మొదటనే రేచకము చేసి గాలిని ద్వాదశాంగుళ పరిమితా కాశమున కుంభించి,తిరిగి పూరించుట మరొకపద్ధతి ఇది రెండవ పక్షము. ఈ వ్యాఖ్యకు శ్రీ శాస్త్రిగారి అనువాదమిట్లున్నది.

కం॥ పదియారిట పూరకమరు పదినాల్గిట కుంభకంబుపయిరేచకము ము
ప్పది రెండుమాత్రలను జే యుదురిది విపరీతము కళులొనరుతురధిపా

దత్తభాగవతము - 6వ గుచ్ఛము -పద్యసంఖ్య 82

పైవ్యాఖ్యలోని విశేషములన్నియు అనువాదమున నమరుటతోబాటు విపరీతము రెండవపక్షమనాదరణీయమని కేచిత్పక్షముగా,వివరింపకవదలి యోగ సాధకులకు వృద్ధాచారమనుసరణీయమని తెల్పబడినది. శ్రీ కృష్ణుడు సుదామునితో గురువు లననెట్టివారలో నెఱుక పరచుచు చెప్పిన శ్లోకమిది.

శ్లో॥ సవైసత్కర్మణాం సాక్షాద్ద్విజాతేరిహసంభవః
ఆద్యోంగయత్రాశ్రమిణాంయథాహంజ్ఞానదోగురుః

దత్తమాహాత్మ్యమ్ - 1వ అంశ - 6వ అధ్యాయము - శ్లోకము 40

ఈ శ్లోకమించుక అన్వయక్లేశము కలది. దీని వ్యాఖ్య ఇది. "సవైఇతి" ఇహయత్ర సంభవః - జన్మ సపితా అద్యఃగురుః, 1 ద్విజాతేస్సతఃసత్కర్మణాం యత్ర సంభవః ఉపనీయవేదాధ్యాపకఃసద్వితీయః । యథాః హంతథాపూజ్యః ఆశ్రమిణాం యోజ్ఞానదఃసతృతీయఃసాక్షాదహమేవేతి జానీహి। ఎవడు జనకుడో వాడు మొదటి గరువు, ద్విజుడైనవానికి ఉపనేత రెండవ గురువు, జ్ఞానియగువాడు మూడవ గురువు, సాక్షాత్తుగా నేనే అని తెలిసికొనుము. దీనికి శాస్త్రిగారి రచనమిది.

చం॥ మనగురువాసవాసమును మాన్యచరిత్ర తలంచుచుంటివా
జనులు తమః పరంబెనయుజాడకుజ్ఞేయ మెఱుంగసంశ్రయిం
పనవలె సద్గురుం,గనినవాడొకడిం,కొకరుండు,వేద శా
స్త్రనిగమ దుండు,నన్ను వలె జ్ఞానదు మూడవవానినెన్ననౌ

దత్తభాగవతము - 1వ గుచ్ఛము - పద్యసంఖ్య 171

జనులు అజ్ఞాన నివృత్తి కై సద్గురువునాశ్రయింపవలెనను శ్రుత్యర్థము కూడా ఈ అనువాదమున చూపబడినది.

7-5 మూలత్యాగము : - ఇంద్రుడు అహల్యతో సంగమించి,పాపరూపుడై పదవీభ్రష్టుడయ్యెను. ప్రయాగ స్నానమాచరించి పాపవినిర్ముక్తుడై స్వస్థానము

సందెను. ఈ కథ దత్తమాహాత్మ్యమున 3వ అంశలో 15వ అధ్యాయమున 96 నుండి 118వశ్లోకము వఱకు వర్ణింపబడినది. ఈ కథరామాయణాదులందు పలుతావుల అందరికి పరిచితమైనదేకాన ప్రయాగ స్నానమహిమ ను తెలియ జేయుటకే ఉపాత్తమైనందు వలన ఈ కథను శ్రీ శాస్త్రిగారు తమ అనువాదమున త్యజించినారు. దీనికి సీసపద్యపాదములను 4టితో అనువాదముచేసి ప్రయాగ స్నానమహిమను ప్రస్తుతించినారు.

**సీ॥ కామమొక్రోధమొ గౌతమతత్పత్నులెడనెడదివ్య మహేంద్రుడెలయు**
**పడరాని పాట్లెల్లబడిమొడిగట్టినీవృజినంబువేల్పుల బెతరులగొని**
**గురునానటజని యరుదారమజ్జనంబాచరించిన మాత్రనారవిడిచి**
**దేదీప్యమానుడై దివికేగియేలుచునున్నాడు మునుపటికన్నమేల్మి**

దత్తభాగవతము – 7వ గుచ్ఛము - పద్యసంఖ్య 244

7-6 పునరుక్తి పరిహారము : - దత్తమాహాత్మ్యము చతుర్థాంశ 7వ అధ్యాయములో 22నుండి 89వ శ్లోకమువఱకు కార్తవీర్యార్జునుని వృత్తాంతము కలదు. ఇయ్యది 2,3 అంశలలో కూడా చెప్పబడినది.ఇక దత్తభాగవతములో 2,5వ గుచ్ఛములలో వర్ణింపబడినది.చతుర్థాంశలో మరల పునరుక్తికాగా కార్తవీర్యార్జునుని వృత్తాంతమును శ్రీ శాస్త్రిగారు తమ అనువాదమున పరిహరించినారు.

**తే॥గీ॥ అతడతని నెంతవానిగా నాదరించె నట్టిదిట్టిదటంచునేనన వలతినె**
**ఇంతొ అంతో వచించితినింతకుమును పదియె మొదలెత్తతఱుగునాయని వదలితి**

దత్తభాగవతము - 10వ గుచ్ఛము - పద్యసంఖ్య 12

పూర్వోక్త కార్తవీర్యార్జున వృత్తాంతమును తద్విశిష్టతను ఎంత చెప్పినను తరగనిదనియు,ఇంకను వినవలెననెడి కుతూహలము పెంచెడి విధముగా ఉదాత్తముగా ఆదరాతిశయమును పెంచుచు పై పద్యము బంధురముగా విరచింపబడినది.

7-7 ఆమూలకములు

మూలమున లేకున్నను కొన్ని వర్ణనలుచేయునప్పుడు నేర్పరియైన అనువాదకర్త క్లుప్తము గానున్న దానిని స్వమేధతో తమ అనుభవములను

అనుగుణముగా జోడించి పాఠకులకు సిద్ధాంతములతోబాటు ప్రాయోగిక విషయములను అందించుటకై స్వతంత్రములైన పద్యములను కూడా అనుసంధా ించుచుండుట జరుగుచుండును. ఇట్లు చేయుటవలన మూలార్థము సుస్పష్టమై ంశయములు అస్తమించి గ్రంథకర్తయొక్క వివక్షితార్థము బాగుగా తెలియ గలదు. ఇట్టి అమూలకములైన స్వతంత్రరచనలు ఈ దత్తభాగవతమున అనేక ములు చోటుచేసికొనినవి.దత్తభాగవత ప్రథమగుచ్ఛమున మునులు దత్తదేవుని ిశ్వరూపసందర్శనయోగమునను భవించిరి.అట్టియెడ దత్తదేవుడు త్రిమూర్తి ్వరూపుడై యుండ విష్ణురూపము, బ్రహ్మరూపము, శివరూపము, మూలలమున .కేదేవుని వర్ణించుట జరిగినది.ఇప్పట్టున శ్రీ శాస్త్రిగారు ఈశ్వర రూపము నులకుకట్టినట్లు స్వతంత్రించి ఈ క్రింది పద్యములను మూలాధికములుగా చనము కావించినారు.

II పులితోలు గట్టినాడలి కాంబకము సాముడెటిచినాడాశల మెరుగులీన
గజకృత్తిమెత్తగా గడియించినాడహివలె వాటుగాబైన వైచినాడు.
పంచాననస్ఫూర్తి ప్రబలినాడిటునటు దశభుజంబుల మేల్మిదాల్చినాడు
బ్రహ్మకపాలంబుబట్టినాడొకచేతనెన్నియేనాయుధా లెత్తినాడు
పాపజందెంబులందియుపాములదొరతరలకేయూర కంకణాద్యములత్రాచు
లమరనొవ్వనివారినేత్రములకమరహుమ్మనుచును గ్రమూర్తివెల్గొందినాడు

దత్తభాగవతము - 1వ గుచ్ఛము - పద్యసంఖ్య 32.

III సత్త్వమూర్తి తామసవ్యవహారియై యెన్నరానికల్మినెనసినాడు
దేహమందుసగముదేవేరికిడినాడు ఉన్న సగముమీద సున్న మమత

దత్తభాగవతము - 1వ గుచ్ఛము - పద్యసంఖ్య 33

మొదటి సీస పద్యమున భక్తులయొక్క ఆశలనుఫలింపచేసెడి ఈశ్వరుని ా పరిగ్రహీత దేహత్వము సుందరతరముగా తీర్చబడినది.ఇట్టి భగవద్రూపము ాపడనివారికి నుగ్రమూర్తిగా వెలుగొందుచుకన్పించినట్లు వర్ణింపబడినది. ఇక ంవెలదిలో అసలు ఈశ్వరుడు సత్త్వమూర్తి తామసవ్యవహారి గణింపశక్యముకాని ్వర్యసంపన్నుడు భక్తుడేది కోరిన,దానిని కాదనక ఇచ్చువాడనుటకు లక్ష్యముగా శరీరార్ధమును గౌరికిఇచ్చినమూర్తి మిగిలిన శరీరార్ధముపై మమత సున్న అని

ఈశ్వరుడు మమకారవిరహితుడుగా వర్ణింపబడినాడు. దశమగుచ్ఛమున కల,హంసగీత,ప్రకృత గ్రంథప్రతిపాద్యుడైన దత్తస్వామి మహిమను ఇనుమడింప జేసెడి సన్నివేశము.దీపకుని ప్రశ్నకు సమాధానముగా వేద ధర్ముడిట్లు చెప్పెను. దత్తాత్రేయుని ఉపదేశమువలన సాధ్యులు శమాది సంపత్తినొందిరి. ఆగ్రహము కూడనిపని. తన కోపమే తనకు శత్రువు, తనశాంతమే తనకు రక్ష దయచుట్టమని శాంతిని పొందినవానికి స్వస్వరూపము నెఱుగదగును. స్వరూప స్థితిని దెలిసిన మహనీయునకే శాంతి ఉదయించును. ఇంద్రి యాశ్వములను మనస్సనెడి పగ్గముతో పట్టుకొన్నవానికే సమస్తసిద్ధులు కలుగును. పెండ్లికుదిరిన పిచ్చి కుదురును. పిచ్చి కుదిరిన తరువాతనే పెండ్లి కుదురునన్న జాతీయముతో స్వతంత్రించి రచించిన రెండు పద్యములు హంసగీతలో చక్కగా కూర్చబడినవి.

గీ॥ **ఇన్నిటికి నాస్పదంబగునెఱిగెనేని స్వస్వరూపంబు నెఱుగునీ సాధనమ్ము**
**లిన్ని కలిగిన పెండ్లియౌనేని వదలు బిచ్చియదిపోయినం గాని పెండ్లికాద**

దత్తభాగవతము - 10వ గుచ్ఛము - పద్యంఖ్య 102

ఉ॥ **గట్టిగనింద్రియాశ్వములగళ్ళెములంగొని పట్టుపట్టియు**
**న్నట్టి నిజస్వరూపమున హాయినెఱింగియనంతరంబు తా**
**నెట్టులు సంచరించినను నిట్టటువోక వశంబుల వ్వియౌ**
**నిట్టిగొనంబులా గుణవిహీనుని సొమ్ములు వీడవెన్నడున్.**

దత్తభాగవతము - 10వ గుచ్ఛము- పద్యసంఖ్య 103

ఈ రెండు పద్యములు హంసుడైన దత్తాత్రేయుడు సాధ్యులకు ఉపదేశించిన సందర్భములలో నివి మిగుల నర్థపుష్టిని కలుగజేసి చక్కని హితోపదేశముతో నలరారినవి. ఇంక దత్తదేవుడు పరశురామునకు రేణుకామహిమమును చెప్పను. అట్టియెడ ఈచరాచర ప్రపంచమంతయూ జగన్మాత రేణుక యొక్క స్థూలరూపమేసుమా! దేని యందీయఖిల జగము ప్రోతమై యుండెనో అయ్యది, ఈ రేణుక సూక్ష్మరూపము నిస్సీమప్రమోదాత్మకము, బ్రహ్మము, భూమ పదార్థము అని వర్ణించుపట్టున విరచింపబడిన ఈ క్రింది రెండు పద్యములు స్వతంత్రములై రేణుకా నిస్సీమమహిమోన్నతిని చాటుచున్నవై హృదయంగమము లగుచున్నవి.

మ॥ భృగుభాగ్యోదయనీకు నాకు నఖిలోర్వీపాళికింగారణం
బగునీతల్లి, అరూపశక్తి భిదలేదా శక్తిమచ్ఛక్తులం
దు గుణాతీతయనంగనయ్యు సగుణోద్యోగప్రసక్తి స్ఫురిం
చుగుణభ్రాంతులదృష్టికిష్టయగు, లోజూపించునవ్వానికిన్

దత్తభాగవతము - 9వ గుచ్ఛము - 18వ పద్యము.

కం॥ పూసలలోదారమువలె నీసకలమునందు నిండియదిశక్తియనం
గా సర్వోపాధులెడల నైసత్యమనంగ వెలుగునది యొకడన్నా

దత్తభాగవతము - 9వ గుచ్ఛము - 19వ పద్యము

పై పద్యమున ఈ సకల బ్రహ్మాండావళికి కారణమై నది యే ఆ తల్లి అది విద్యుత్తు వలె అరూపశక్తి అనగా బాహ్యాకారము లేనిది. అందరియందు వెలుగొందునది అదియే. శక్తిమచ్ఛక్తులకు ఇసుమంతయేని భేదము లేదు. అయ్యది గుణాతీతము గుణభ్రాంతులకు సగుణాకారముగ స్ఫురించునని తెలియ జేయబడినది. రెండవ పద్యమున పూసలలో దారమువలె ఈ నిఖిల విశ్వమందుఅను స్యూతమై సత్యమై సర్వోపాధులలో వెలిగెడిచిచ్ఛక్తియని నిరూపింపబడినది.దశమ గుచ్ఛమున నహుషచరిత్రము వర్ణింపబడినది.ఆయువు పుత్రేషణతో దత్తాత్రేయుని జేరి అనుగ్రహమును పొంది పుత్రప్రాప్తి కరమైన ఫలమును ఆస్వామి కృపతో సంపాదించి తన భార్య కిచ్చును. ఆమెయు దత్త విభుప్రసాదమునగర్భవతియై ఒకచిన్ని బిడ్డను గనెను. పురుటింట్లో హుండుడను రాక్షసుడు జొరబడి తనవధకై పుట్టిన ఆ బిడ్డను తన యింటికి చేర్చి వంటవానికి ఇచ్చి వండిపెట్టుమని ఆజ్ఞాపించెను. ఆ రాత్రి అంతయునాతడు ఆ బిడ్డను చంపలేక సైరంధ్రితో చెప్పి ఇద్దరునూ ఆ బిడ్డను (నహుషుని) వశిష్ఠునాశ్రమమునదింపి లేడిమాంసమునుబిడ్డ మాంసమనియే యని నమ్మించి హుండునిచే తినిపించిరి. ఇట్టి యెడ కథాంతర్గతముగా నొనరించిన సూర్యోదయ వర్ణనము అమూలకముగ సంపాదితమై ప్రకృత ప్రబంధమున కెంతయో పుష్టినొసగిన విషయము చూడదగినది.

హుండురాక్షసు చింతితమొండుసేయు
వారికటుతోడువడియామసతితోసుడిపడి
ఎరుకపడెనేని తనదెసనేమి వచ్చి
పడునొయని తెల్లమొగమయిపారిపోయె.

దత్తభాగవతము - 10వ గుచ్ఛము - పద్యసంఖ్య 162

హుండాసురుడు తనవధకై జన్మించిన బాలుని చంపెడి ఆలోచనను వమ్ముచేయుటకై సూద సైరంధ్రులకు అయామినీ సతి సహకరించినదట. తనచేష్ట తెలిసి హుండుడు తనపై మండిపడి ఏ విపరీతమైన కష్టములు పాలు చేయునోయని యామినీ సతివెలవెల్లనై పారిపోయినది. అని తెల్లవారుటను కథాగతముగా జేసి ప్రబంధ శైలికౌచితీ ప్రకర్షను పాధించినారు. 7-8 అన్యపురాణగాధలననుసంధానించుట ఇదియు నొక విధముగా న మూలకమే అయినను పాఠకలోకమునకు కల్గెడి ధర్మసందేహాలకు సమాధాన రూపమగుట వలన సప్రయోజనకమయి తన రారెడి రచనా సముల్లాసమే గాన అనువాదకర్త తన గ్రంధమున గ్రధనము తప్పక చేయవలెనని తెలియుచున్నది. మూలగ్రంధకర్త చెప్పవలసిన కథాంశమును చెప్పకున్నచో మూలమునకు వన్నె తఱిగి పోవును. కాన నిదియు అనువాదకునకు సముపాదేయమనియే తోచుచున్నది.దత్త భాగవతము 8వ గుచ్ఛమున కార్తవీర్యుని పూర్వజన్మవృత్తాంతము గ్రథింపబడినది. ఇది మూలమున లేదు. అన్యపురాణగాథ ఇది వాయుపురాణము లోనిది.

**"జన్మములందు దానముల శాస్త్ర తపమ్ములప్రశ్రయంబునం**
**దెన్నగ కార్తవీర్యగతి నెవ్వరుగైకొనలేరు పార్థివుల్**

అన్న విధముగా వాయ్వాదిదేవతల మెప్పుల బడసిన కార్తవీర్యునికి దత్తదేవుని అనుగ్రహామువలన యుద్ధములందు వేయిచేతులు, సప్తద్వీపాధిపత్యము కామగమవిమానము మున్నగు అనితరసాధారణములైన వరములు సంప్రాప్తము లైనవి. ప్రతిప్రాణికి ఒక్కొక్క శిక్షకునిగా నుండి 85వేల సంవత్సరాలు ఏకఛత్రాధి పత్యముగా పరిపాలించిన పార్థివ చక్రవర్తి మరియుదత్తదేవుని వలన యోగ వేదాన్త శాస్త్రములను సాంగోపాంగముగా నుపదేశమునొంది కొంతకాలము సమాధినిష్ఠాగరిష్ఠుడైన ఆత్మజ్ఞాని, ఇట్టి భక్తునికి అనితర సామాన్య వరముల నిచ్చిన దత్తవిభుడు. పరశురామరూపమున కార్తవీర్యార్జునుని ఎట్లు ఖండించెనన్న సందేహము చదువరులకందరికీ కలిగెడిదియే ఈ సంశయమును నివారించుటకై కథాంశము మూలమున పేర్కొనబడలేదు. దీనిని శ్రీ శాస్త్రిగారు ఈ క్రింది వృత్తాంతము చెప్పి సంశయమున పనయించినారు.

"కలదొకగాథ పెద్దల సకాశమునన్ వినవైనదని" ప్రారంభించి ఎనిమిది పద్దెములతో సంగ్రహింపబడినది. కార్తవీర్యార్జునుడు విష్ణుని చేతియందలి

ుదర్శనచక్రము సుదర్శన చక్రమొకప్పు నావలన కదా విష్ణుడు సర్వరాక్షసులను ంహరించుట జరుగుచున్నది. నేను లేకున్న రాక్షస సంహారము విష్ణువునకు ులవికానిపనియని గర్వించినది. అఖిలజ్ఞుడద్దాని గర్వమును తెలిసి వత్సా!సుదర్శనా! వలన దుష్టశిక్షణము శిష్ట సంరక్షణము జరుగుచున్నదని మాటవరుసకనెను. ంతటితో సుదర్శనుని గర్వము హెచ్చుగాజొచ్చినది. స్వామి ఆ సుదర్శనుని వ్యోక్తులను విని వైకుంఠము విష్ణు-కడసంవాసము జేసిన నీకీ విపరీత ుద్ధియేల? నీకీ దర్పము తగునా? నీనా భేదమెఱుంగ లేకుంటివి కాన భువిపై న్మింపుమని శపించెను. సుదర్శనుడు తన గర్వమును తెలిసికొని విష్ణుని రణాబ్జములపై సాష్టాంగపడి శాపవిముక్తిని కోరెను. విష్ణుడు దయాపరుడై వత్సా శాపము తప్పదు. నీవొక చక్రవర్తివై సహస్రబాహువై సప్తద్వీపాధి పత్యాదివరములను ుంది భూమిని పరిపాలించెదవు. నీకై దేవతల కార్యార్థము పరశురామునిగా వతరించెద.నా గొడ్డలి చేతనే ఖండింపబడి తిరిగి నా చేతికి అలంకారమగుదునవని ాపసానము ననుగ్రహించెను. ఇట్టి గాథ ప్రకృత కథాంశము, సందేహమును ొట్టి మిగుల దత్తదేవుని మహిమోన్నతికి పుష్టినిచ్చునదై యుండుట వలన ఈ ్య పురాణగాథ, ఇచ్చట వచింపబడినది.

## 8వ అధ్యాయము హంస తత్త్వము

హం=అనునది, పురుషబీజము, స అనునది స్త్రీ బీజము పురుషులు, ువులు ఎత్తుకొనునపుడు, దించునపుడు అతి కష్టములగు కార్యములను ుునపుడు కార్యములు సఫలత నొందునపుడును, హం అనుదానిని ్రయత్నముగా నోటివెంట ఉచ్చరించుచుందురు. రజకులు కూడా వస్త్రములు ుకుచూ, హం అనుదానినే అనుసంధానించుచుందురు. స్త్రీలు దంపునపుడు, ి విసురునపుడు, కష్టకాలములందు, సుఖ కాలములందును, వస్త్రములు ుచునపుడు, తదితరములగు ఏ సమయములందైనను స్ స్ అనుదానిని ోవెంట, వచ్చుచుండుట కాననగును. అందువలన హం అనునది పురుష ము స అనునది స్త్రీ బీజము అని చెప్పుట జరిగినది. ప్రకృతేః పూర్వ నిపాతః ప్రకృతి బీజమునకు పూర్వనిపాతమురాగా, సోఽహం అని అయినది.

సోహంనుండి సకారహకారములతొలగించి చూచిన ఓం అను ప్రణవాక్షరము సముత్పన్నమగుచున్నది. ఇట్లు స్త్రీ పురుషులకు ప్రాణవాయువు యొక్క ఉచ్ఛ్వాసనిశ్వాసములవలె స్వాభావికములై ప్రయత్నములేకయే ఉచ్చరింప బడుచుండుటవలన, దీనిని బాగా తెలిసికొని హంసోపాసనము సోహం అజపాగాయత్ర్యు పాసనము సద్గురు కటాక్షముతో తెలిసికొని తమ తమ ఇష్టదేవతా స్వరూపమును ధ్యానించుచుండుట కర్తవ్యము. అందువలననే శ్రీ శాస్త్రిగారు దత్త భాగవత ప్రారంభ పద్యమున సోహం హంస భావంబును అని కీర్తించినారు. ఇక నిట్టి స్థితికి కావలసిన సాధన సామగ్రి, దానిచే వారికి కలిగిన అనుభూతిని వర్ణించుట ఈ వ్యాసముఖ్యోద్దేశము.

శ్రీ శాస్త్రిగారియొక్క వ్యక్తిత్వమును గురించి మొదటి ప్రకరణమునందు ప్రస్తావింపబడినది. ఉద్బుద్ధమైన పూర్వసంస్కారముచేత ఈ జన్మమునందు భక్తి, జ్ఞాన, వైరాగ్యములు, సంపన్నములైనవి. కర్మయోగము జ్ఞానయోగము సిద్ధించినవి. నిత్యకర్మానుష్ఠానము మంత్రోపాసనము తపోహోమార్చనములు చిత్తశుద్ధికి కారణములై యోగాభ్యాసముచేత చిత్తజయము కలిగి నిదిధ్యాస స్థితియందుండుట వారితో పరిచయము కల్గిన వారికి తెలిసిన విషయము వారి దిన చర్యయందు హంసోపాసనము ప్రత్యేకముగా పేర్కొనబడినది. ఈ హంస శబ్దము శాస్త్రములందు అనేక విధములుగా వివరింపబడియోగ జ్ఞానమార్గములందు సమన్వయము చేయబడినది. హంసమనగా ఒకానొక పక్షివిశేషము ఇది తెల్లగ నుండును. సత్త్వగుణమునకు సంకేతము. ఇది ఆకాశమున సంచరించును. వాయువునకు సంకేతము ప్రాణవాయువును హంసయనుట ఆధ్యాత్మికులకు అందిన విషయము హంసలేచి నది అనగా ప్రాణము పోయినది అను తాత్పర్యము సాధారణవ్యవహారము కూడా కలదు. హంసశబ్దమునకు సూర్యుడను ఒక అర్థము కలదు. హంసుడనగా సదాశివుడని మహన్యాసమువలన విశదము. మహాన్యాసము బోధాయనోక్తము జీవునకు కూడా హంస మను వ్యవహారము కలదు. హంసము నీర క్షీరములను వేరుచేసినట్లుగా నిత్యానిత్య వస్తు వివేకా భ్యాసము చేయువారు గావున ఔపచారికముగా కూడా ఈ పదము జీవునకు సమన్వయించుచున్నది. ఇక హంస పదమును గురించి సూక్ష్మముగా పర్యాలోచించి నచో హంసః అను రెండు వర్ణములను వ్యత్యస్తము చేసినచో సః + హం ఈ రెండు వర్ణములు సంధివశమున సోఽహం అగును. ఇందునుండి సః అహం అని విడదీయనగును.



కుమార స్వామి

ఇందలి తచ్ఛబ్దమునకు అహం బ్రహ్మాస్మి అను మహా వాక్యమునందలి బ్రహ్మ పదము పరామర్శింపబడును. ఆ మహావాక్యము నందలి అహంపదమునకు ఏది అర్థమో ఇందలి అహంపదముకూడా ఆ అర్థమునే చెప్పును. అస్మి అను అభిన్న భావనయే ఈ పదముల సామర్థ్యము. ఇట్లు సోఽ హం భావన అద్వైతమతమున ప్రసిద్ధము. ఈ సోహం హంస పదములు అనులోమ విలోమాత్మకములుగా ఉచ్చరింపబడుట, జపించబడుట, ఉపాసనా కాండమునందు ప్రసిద్ధము. ఈ అక్షరముల ఉచ్చారణ విధానము కానీ భావనా విధానముకానీ, ఉచ్ఛ్వాస నిశ్వాసములకు సంకేతముగా కూడా చెప్పబడుచున్నది. ప్రాణవాయు రూపమగు హంసము పూరకమున సకార రూపముగనూ, రేచకమున హకార రూపకముగనూ, భావింపబడుటచేత సోహం పదము ఉచ్ఛ్వాసనిశ్వాసములకుసంకేతమైనది. ఇట్టి భావన క్రమక్రమముగా పరిపక్వమై ప్రాణము హంసము జీవుడు హంసుడు, ఈశ్వరుడు, హంసుడు, సదాశివుడు హంసుడు, పరమాత్మయు హంస శబ్దవాచ్యముగా ఆగమపురాణ దర్శనములయందు ప్రయోగింపబడుచున్నది. పై విషయమును పర్యాలోచించినచో హంసోపాసనమనగా ప్రాణాయామ సాధనము జీవ బ్రహ్మైక్యభావనాభ్యాసము అను రెండు తాత్పర్యములయందు సమానముగా ప్రవర్తించుట కానవచ్చుచున్నది.యోగోపాసన సహకృతమైన జ్ఞానసిద్ధికి హంసోపాసన పరిణతమైన సోహం భావానుభూతికి సమానమైనదిగా చెప్పవచ్చును. ఇట్టి సోహం హంస భావనయందు నిరంతరతానమైన చిత్తవృత్తిగల శ్రీ శాస్త్రిగారు తాము రచించిన గ్రంథముల యొక్క ప్రారంభమునందు స్వానుభవ ప్రతిపాదనపరముగా ఈ క్రింది పద్యమునే నిబంధించుచుండిరి. ఈ పద్యము ఈ దత్త భాగవత ప్రారంభమున కూడా కలదు.

**శా॥ శ్రీవిద్యామహనీయయోగమున నిర్ణిక్తాంతరంబైన చే**
**తోఽవ స్థానమునన్ నిరంతరము సో ఽహం హంసభావంబుతో**
**భావింపబడు నమ్మహేశ్వర పరబ్రహ్మమ్ముమమ్మోము స**
**త్త్వావష్టంభసుఖానుభూతి భవభావాభావభానమ్ములన్**

దత్తభాగవతము - ప్రథమ గుచ్ఛము - పద్యసంఖ్య 1

ఇందు రచయితయొక్క యోగా వధారణము తత్త్వాను సంధానము ప్రదర్శింపబడినవి. శ్రీవిద్యయనగా అపరోక్ష బ్రహ్మ విద్యగా తంత్రములందు

ప్రదర్శింపబడియున్నది. శ్రీ విద్యోపాసనము వలన యోగాభ్యాసమునకు అనుగుణమైన చిత్తనైర్మల్యము కలుగును. ప్రాణాయామము చేత నిర్ణిక్తాంతరమైన మన: స్థితి కలుగును. ఇచ్చట రెండర్థములు చెప్పికొనవచ్చును. మనస్సు నందున్న వాసనలన్నియు ప్రక్షాళితములైనవి అనునది ఒక అర్థము. మనస్సునందలి విజాతీయ చిత్తవృత్తులన్నియు ఉపశమించినవని రెండవ అర్థము మొదటి అర్థము చెప్పికొన్నప్పుడు ధారణవలన మనోజయము వ్యక్తమగును. రెండవ అర్థమున సంప్రజ్ఞాతసమాధి స్థితి లక్షితమగుచున్నది. ఇట్టి స్థితిలో సోహం హంస భావము అను సంధేయ ప్రవణమై భాసించుచున్నది. మాయాబింబితుడగు ఈశ్వరుడే ఆవరణ నాశముచేత అఖండ బ్రహ్మరూపమున భావింపబడుటచే ధ్యేయ మాత్రముగా మిగిలినది. ఇట్టి సంభావనము వలన కేవల సత్త్వాత్మిక యగు చిత్తవృత్తి వృత్తి నాశమున కేవల చిద్రూపమై ఆనందమయమగుట నిర్వికల్పానుభూతి. ఈ ఆనందమునే యోగి అనుభవించును. జ్ఞాని అనుభవించును యోగికి సంప్రజ్ఞాత సమాధియందు మొదటి రెండు దశలలో ప్రపంచము భాసించును. తరువాత దశలలో క్రమముగా నశించును. జ్ఞానికి అమనస్క స్థితియందు ప్రపంచ భావములేదు. నిదిధ్యాసమున వ్యావహారికముగా భాసించుట కలదు. ప్రపంచభానమున ఈ ఆనందము కార్యరూపము తదభానమున ఇది కేవల రూపము.

మొదటి ఆనందమున అనుభవింపబడు ఆనందము ఆనందమునను భవించుట ఆనందము ననుభవించువాడు, అన్న త్రిపుటి కలదు. రెండవ ఆనందమున త్రిపుటినాశమై కేవల అనుభూతి మిగులును. కావున ఇట్లు అభ్యసింపబడుతున్నబ్రహ్మానుసంధానము ప్రారబ్ధవశము జగద్వ్యాహారముతో నున్నను చిత్తమును జారనీయక క్రమ క్రమముగ అపరోక్షానుభూతికి మార్గదర్శకము కావలయునని ఈ పద్యమునందు ఒనర్చిన అంశము రచయిత యొక్క తత్త్వనిశ్చయపరిణతికి తార్కాణము.

---

భానుర్హంస స్వహస్రాంశు: - అమరకోశము

శ్లో॥ హంసహంసేతియోబ్రూయాద్ధంసో నామ సదాశివ:

ఏవం న్యాసవిధింకృత్వాతతస్సంపుట మారభేత్, మహాన్యా సఖండము,

శ్లో॥ దేహో దేవాలయ: ప్రోక్త: జీవో దేవస్స నాతన:

త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోహం భావేన పూజయేత్.

ప్రాణవాయువు హంసముగా భావింపబడుచున్నది. హంసగాయత్రీ ఉపాసనమునందు హంసము పరమాత్మగా చెప్పబడినది.

శ్లో॥ **గమాగమస్థంగమనాది శూన్యం చిద్రూప దీపం తిమిరాపహారం**
**పశ్యామి తం సర్వజనాంతరస్థం నమామి హంసం పరమాత్మ రూపం**

స్థావరం జంగమాత్మక ప్రపంచమున బహిరంతర్వ్యాప్తమై యుండి గమనాది క్రియా శూన్యమై అజ్ఞానాంధకారావరణములేక స్వప్రకాశజ్ఞానరూపమైన హంసము ఉపాధిభేదమున చూచినపుడు హృదయాకాశమునందు ప్రాణరూపమున గోచరించుచు ఉపాధి నిరాసమున పరమాత్మ స్వరూపముతో భాసించునని పైశ్లోకమున వివరింపబడినది. ప్రాణమునందలి చైతన్యాంశము బ్రహ్మయే కావున ప్రాణరూపమగు హంసమును బ్రహ్మరూపముగా భావించుట ఉపపన్నమైనది. బ్రహ్మ మందు హంసత్వమును ఆరోపించుటచేత హంసరూపకల్పనము లక్షణా సిద్ధమైనది. ఇట్టి పరమాత్మ రూపమగు హంసత్వమును ఆరోపించుటచేత హంసరూపకల్పనము లక్షణాసిద్ధమైనది. ఈ హంసము యొక్క విశేషమును హంసోపాసనా తత్పరులగు శ్రీశాస్త్రిగారు ఈ క్రింది పద్యమున వర్ణించిరి.

ఉ॥ **భోగము, యోగమై ప్రకృతి పూరుష పక్షములన్ విదిర్చిస**
**ర్వాగమమూలమౌదలతిరంబుగబిందుతృతీయ లోచనం**
**బైగమనాగమోర్జ్ఝితమునై గమనాగమ కారణ స్థితిన్**
**ద్యోగ తి మించు హంసము సముజ్వల శక్తికి భక్తిసేసెదన్**

దత్తభాగవతము - ప్రథమగుచ్ఛము - పద్యసంఖ్య 5

భోగమనగా ప్రారబ్ధానుభవము సాక్షీభూతుడగు యోగికి ప్రారబ్ధాను భవమంతయు యోగ సాధనమే అగుచున్నది. యోగమనగా చిత్తవృత్తి నిరోధము. యోగమనగా సమాధి. అట్టి యోగము నందు స్వస్వరూపావస్థితియే ఈ హంసము యొక్క భోగము అనగా శరీరము ప్రపంచదశయందు తత్కారణములైన ప్రకృతి పురుషులు హంసవృత్తికి అనురూపములగు రెక్కలుగా చిత్రింపబడినారు. సర్వాగమములకు మూలము ఓంకారము ఈ హంసమునకు శిరస్సుగా చెప్పబడినది బిందు స్థానము హంసకు మూడవ నేత్రము. కుంభకాభ్యాసముచేత సుషుమ్నలో ప్రవేశించిన ఈ ప్రాణహంసము రేచకపూరకములు లేక గమనాగమ శూన్యమగును. అధ్యాసరూపమగు ప్రపంచమంతయు భ్రాంతి వశమున ఏర్పడుచున్నది.

భ్రాంతిరూపమున లయ మగుచున్నది. ఈ సృష్టిలయములు ప్రపంచముయొక్క గమనాగమములు. సత్తామాత్రముచేత సృష్టిలయములకు కారణమైన హంసము ఆకాశమువలె సర్వగతమై ఒప్పుచున్నది. దహరాకాశమున విహరించుచున్నది. ఏతత్సన్నిధానమున సర్వప్రపంచము భాసించుచున్నది. స్వయం ప్రకాశము ఈ హంసముయొక్క శక్తి ప్రాణాయామముచేత సాధింపబడిన ప్రాణహంసము వృత్తిలయమున పరికల్పిత రూప శూన్యమై చిద్రూపావశిష్ట మగుచున్నది. అట్టి హంసమునకు భక్తియనగా నిరంతరానుసంధానరూపమగు సంసేవనమును కూర్చెదనని పై పద్యమున హంస స్వరూపనిరూపణము హంసో పాసనము, హంసతత్త్వానుసంధానము వివరింపబడినది. ఇది శాస్త్రిగారి సంభావనమునకు ఒక మచ్చుతునకవంటిది. సాధకునకు మనస్సు నిశ్చలమైవశముకావలయును. ఎంతటి సాధకుడై నను లోక వ్యవహారమున నున్నంతవరకు శాస్త్రబోధితములైన నిత్యనైమిత్తిక కర్మలను ఆచరింపవలెను. స్వధర్మ నిర్వర్తనముతో నిరంతరము నిత్యానిత్యవస్తు విచారము చేయవలెను చిత్తమును ఏకాగ్రభూమియందు చేర్చివిజాతీయవృత్తుల నణచ వలయును. సత్య యైన చిత్తవృత్తిని మాత్రముధ్యేయై కాలంబనముగా పునః పునరను సంధానమొనర్పవలయును. అట్టి నిరంతరాభ్యాసము వలన చిత్ప్రతిబింబమగు చిత్తము లయమై చిద్రూప మగును. నివాతదీపమువలె ప్రకాశానుభవము నిశ్చలమగును. ఇట్టి సిద్ధావస్థను హృదయమున నుంచుకొని వీరుచేసిన మునివర్ణనము ఒప్పుచున్నది.

## 9వ అధ్యాయము

# సమాజము - అద్వైతము

కుల, మత, వర్గవైషమ్యములతో పెచ్చుపెరిగిన కామక్రోధ హింసో న్మాదములతో సుఖశాంతులకు దూరమైన ఈనాటి సమాజమునకు మతోన్మాదముతో మారణకాండములు సాగించుచున్న ఈ నాటి సమాజమునకు అద్వైతసిద్ధాంతము ఒక్కటియే సరియైన పరిష్కారము సూచింపగలదు. ఎన్ని పేర్లతో పిలచినను పలుకునట్టి భగవంతుడు ఒక్కడే అని గుర్తించిననాడు ఇన్ని మతకల్లోలములు పెట్రేగవు. ఈశ్వరశ్శర్వ ఈశానశ్శంకరశ్చంద్రశేఖరః అని

అమర నిఘంటువుచే ఈశ్వరుడనగా శివుడే, ఆ శివునకు, తనకు అభేదమును, ప్రతిపాదించుచు ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి. అని గీతాచార్యుడు బోధించెను. దీనివలన హరిహరాదులందు సర్వమానవుల యందు చైతన్య రూపముతో నున్న ఈశ్వర తత్త్వమొక్కటియే అని భావించిననాడు ఈ మత భేదములన్నియు కుల కోలాహలములన్నియు సమసిపోవును. భగవదారాధనము వలన చిత్తము ప్రసన్నమై సత్త్వగుణము అలవడికామ క్రోధములడుగంటి సమత,మమత అహింస,త్యాగము పరోపకారము,సర్వభూత సమభావము మానవుల యందలవడిననాడు ఈ లోకమే స్వర్గము కాగలదు.ఈ జీవుడే జీవన్ముక్తుడు కాగలడు.కావున మతాతీతమైన అద్వైత తత్త్వము కులాతీతమైన భగవద్భక్తి వర్ణాతీతమైన సర్వమానవ సౌభ్రాత్రము అలవరచుకొనుట నేటి సమాజమునకత్యావశ్యకము. శ్రీ దత్తాత్రేయ చరిత్రములందు ఉపదేశములందు నేటి సమాజమునకు అవశ్యాచరణీయ సులభమార్గములు, వ్రతవిధానములు, భక్తిజ్ఞానములు సుగమములుగా నున్నవి. సత్వాంశప్రధానుడైన మహావిష్ణువు స్వేచ్ఛాపరికల్పితమైన గుణత్రయ సమావేశముతో బ్రహ్మ విష్ణుమహేశ్వర అంశలను సమన్వయించుకొని ముప్పురు మూర్తుల మేలి పోలికలు మూడు మోముల సాక్షాత్కరింపగా అనసూయాత్రులకు స్వయందత్తుడై దత్తాత్రేయనామముతో భవావతార రూపుడై అవతరించెను.

మహావిష్ణువు రాక్షస సంహారాది అనేక ప్రయోజనములను ఉద్దేశించి భృగు పములు నిమిత్తములుగా మత్స్యకూర్మాద్యవతారములందాల్చుట పురాణ సిద్ధము అట్టినిమిత్తములకతీతముగా తన వైభవమును ప్రకటించుచూ దుపదేశములతో భక్తులననుగ్రహించుటకొఱకు స్వేచ్ఛతోధరించిన అవతారమే త్తాత్రేయుడు. ఈ దత్తాత్రేయుడు సహ్యపర్వతమున కృష్ణామలకము క్రింద నోపదేష్టగా భక్తులగు వారికి దర్శనమొసంగినట్లు ఈ మాహాత్మ్యమున కలదు. క్తులయొక్క చిత్తవృత్తిని పరీక్షించుటకు వివిధ రూపములతో భిన్నభిన్న వేషములతో సమేతుడై మద్యమాంసముల సేవించుచు సంప్రదాయ బాహిరమైన పద్ధతిలో ర్శనమిచ్చినట్లును కానవచ్చును. నిజమెఱిగి పట్టువిడువక కొలిచిన వారిని నుగ్రహించును.ఈ దత్తాత్రేయునకు "మహామాయా విశ్వంభ్రమయసి పరబ్రహ్మ హిషి"అని శంకరాచార్యులవారు సౌందర్యలహరిలో పేర్కొన్నట్లు హామాయారూపిణియై ఏక వీరాపరపర్యాయమైన రేణుకా శక్తియన్న రవప్రతిపత్తులు అధికతరములు.

సేతిహాసముగా తత్తత్తాత్పర్యార్థ నిర్ణాయకములై స్మృతి పురాణేతిహాసములుగా ప్రవర్తిల్లినవి. ధర్మార్థ కామమోక్ష పురుషార్థములలో మోక్ష పురుషార్థమే నిత్యమైనది. అందరిచే కోరదగినదిగా కన్పట్టును."ముక్తుడు జనన మరణ రూప సంసారమునకు తిరిగిరాడు తిరిగిరాడు"ఆత్మవిదుడు దు:ఖమును తరించును,ఎవడు ఈవిశ్వమునకు మూలమైన అఖండ సత్యవస్తువుకంటె భిన్నములైనవి ఏవియులేవు అని చూచుచున్నాడో వాడు అభయప్రతిష్ఠలనందుచున్నాడు. ద్వితీయవస్తువు నెవడు ఎంచుచున్నాడో భయాదులు అతనికి కలుగుచున్నవి. సర్వత్ర ఏకత్వము చూచువానికి శోకమోహములెక్కడివి. సర్వముతాన ఐనచో ఏ ఇంద్రియముతో ఏపదార్థమును తెలిసికొనును, దేనిని చూచుట జరుగును. బ్రహ్మవిదుడు బ్రహ్మ అగుచున్నాడు అను అర్థములు కల శ్రుతులను బట్టి ఆత్యన్తిక సంసార నివృత్తిబ్రహ్మానందావాప్తి ముఖ్య ప్రయోజనములుగా ముక్తికి ఉపనిబద్ధములై యుండుటవలన మోక్షమే పరమ పురుషార్థముగా సర్వసేవ్యమని వేదాన్త తాత్పర్యము గా గోచరించుచున్నది.జ్ఞానము వలననే కైవల్యము సిద్ధించును అను ఆర్యోక్తి.

ఇట్టి మోక్షప్రాప్తికి శ్రవణ, మనన, నిదిధ్యాసనములు కర్తవ్యములుగా బృహదారణ్యకోపనిషత్తు విధించి యున్నది.ఉపనిషత్తులు లేక వేదాన్తముల ద్వారా అద్వైకవస్తువును గూర్చివినవలెనని,దానిని గూర్చి యుక్తులతో అనుచింతన రూపమైన మననము కావింపవలెనని అద్దానినే మాటిమాటికి నిధ్యానించి ముక్తికి చేరవలెనన్న కారణముగా భగవత్ప్రస్థానములయినందువలనను ఈ మూటికి ఉపనిషద్బ్రహ్మసూత్రభగవద్గీతలకు ప్రస్థానత్రయమని పేరు గల్గినది. ఉపనిషత్తులు, వేదాంతములైయుండగా, బ్రహ్మసూత్రములకు వ్యాసాచార్యులు, భగవద్గీతకు జగద్గురువులు శ్రీకృష్ణులున్ను ప్రవర్తకులైయున్నారు.చతుర్దశవిద్యలయందు ప్రకృష్టమైన స్థానముదేనికి కలదో అది ప్రస్థానము. ప్రస్థాన త్రయమునాధారముగా గొని మధ్వాచార్యులు జీవేశ్వర జగత్తులను గూర్చి ద్వైతవాదము ప్రవర్తింపజేసినారు. ఇందు జీవేశ్వరులు అత్యంత భిన్నులు, జీవేశ్వరులకు గల భేదము ఎన్నటికిని బ్రహ్మవస్తువును పాసించుటచే ముక్తి అని అన్నిటియందును భేదమంగీకరించి నవారుగాన, ద్వైతవాదులైనారు.వీరిమతమున జీవేశ్వర జగత్తులు, సత్తులు=సత్యములే యగుచున్నవి.

ఇక రామానుజాచార్యులు జీవుడు ఈశ్వరునికంటె భిన్నుడని కాని అభిన్నుడని కానిచెప్పరు. భేదములోనే అభేదము అభేదములోనే భేదము కలదని వీరి వాదము"మమైవాంశో జీవలోకః"అను భగవద్గీతను బట్టి ఈశ్వరుడు అంగి,జీవుడు

అంగము అని చెప్పుదురు, చిత్తు అనగా జీవుడు, అచిత్తు అనగా జగత్తు, ఈశ్వరుడు, అని తత్వములు మూడు. చిత్తు శరీరేంద్రియాదులకంటె విలక్షణము. అచిత్తు, ప్రకృతి, ఈశ్వరుని క్రీడా పరికరము.ఇక ఈశ్వరుడు నిఖిలహేయ ప్రత్యనీకుడు సకల కల్యాణగుణాకరుడు. చిదచిత్తులు రెండును ఈశ్వరునికభిన్నములైన విశేషములు. సృష్టికి పూర్వము సూక్ష్మావస్థనొందిన చిదచిద్విశిష్టచైతన్యమునకును తరువాత స్థూలావస్థ చెందిన చిదచిద్విశిష్టచైతన్యమునకును అభేదము లేక ఐక్యము చెప్పుదురు. కావుననే దీనికి భేదాభేదవాదము,విశిష్టాద్వైతము అనియు పేర్లు కలిగినవి.

ఇక వీరిర్వురకంటె ప్రాచీనులై ప్రస్థాన త్రయమునందున్న వేదాన్తవాక్యములకు గల వైరుధ్యములను పోగొట్టి శ్రుతిమతమైన తర్కమును మాత్రమే స్వీకరించి సమన్వయపూర్వకముగా వ్యాకరించిన మనీషులుజగద్గురువులు శంకరాచార్యులు. వీరు తమ భాష్యములలో ఏకత్వశ్రుతులకు సమన్వయముచేసి, బ్రహ్మవస్తువు ఒక్కటే సత్యము, జగత్తు అంతయు మిథ్య అని విశ్వము నంతటిని బ్రహ్మమయముగా ఏకముగా నిర్గుణముగా సాక్షాత్కరించుకొనవలెనని అసమర్థులైనవారికి శ్రుతులయందు పేర్కొనబడిన ద్వైతశ్రుతులననుసరించి సగుణబ్రహ్మమునందు తాత్పర్యమును చాటి చెప్పిన వారగుటచే అద్వైతవాదులు. ఏకత్వ ప్రతిపాదక శ్రుతుల నన్నింటిని అద్వైతపరముగా నన్వయించుటచే వీరివాదమునకు అద్వైతము అను పేరు వచ్చినది.అద్వైతమనగా ద్వితీయవస్తు భావములేకుండుట. భగవదాకారాకారితమైన, లేక బ్రహ్మాకారాకారితమైన చిత్తము నిర్వృత్తికము అగుటయే అద్వైతమని చెప్పనొప్పును. భగవత్ప్రాప్తి సాధనములైన ఉపాసనలలో కూడా ఈ అద్వైతానభూతి యున్నట్లు తత్తదుపనిషద్వాక్య పర్యాలోచనము వలన అనుభవము వలనను తెలియగలదు. ఇక రెండవ వస్తువు లేకపోయిన ఈ కనపడు ప్రపంచమేమి? ఇవన్నియు భిన్నముగా కన్పడుచున్నను ఇవేమియు లేవు అని అనుకొనుటలో గల్గెడు లాభమేమి? లోకములో మనము దేనిని గూర్చి అర్థించి పాటుపడుదుమో దానినే సాధించుచుందుము.ఒకపనిపై ఆసక్తిగాని, ఒకరిపై ద్వేషముగాని సహజముగా ఇతరవిషయములపైన ఆధారపడియే జరుగుచుండును. ఇతరవస్తువులపైననే ఆశయు చెలరేగుచుండును. అట్టివి ఇతరములైనవేమియు లేనపుడు బ్రహ్మ ఒక్కటే సత్యము అయినపుడు మనకు సుఖమెట్లుకలుగును. ఇతర వస్తువులే లేనపుడు,ఆశ మాత్రమెచ్చట ఉండును.

ఆశాదులు కలుగకున్న సుఖమెట్లు కలుగును?అను ప్రశ్నలుపొడమును. బాగా ఆలోచించినచో ఆ ఇతర వస్తువులనే భగవన్మయములుగా, లేక బ్రహ్మమయములు లేక తానుగా కావించినచో ఆశపుట్టదు. తన్మూలకముగా వచ్చేడి రాగద్వేషాదులు పుట్టవు. మనకంటె ఇతరవస్తువే లేకపోయిన అనగా అంతా మనమే అయిన ఏ వస్తువునందు ఆశకలుగదు. దానినిమిత్తముగా యత్నము ఉండదు. యత్నము లేకున్న రాగములేదు. రాగములేకున్న అది తీరకపోయిన వచ్చెడి కోపము ఉండదు. రాగద్వేషాదులే లేకున్న పాపపుణ్యాలు కలుగవు. పాపపుణ్యాలు లేనందువలన పాపపుణ్యఫలాలననుభవించుటకైన దేహమును ఉండదు.దుఃఖము ఉండదు. దుఃఖము లేకుండా ఉండవలెననియేకదా అందరు కోరుచుందురు. బ్రహ్మకంటె రెండవ వస్తువు ఒకటి ఉన్నదని ఎంచితే అది మనకంటె శక్తిమంతమైనచో దానికి అధీనమై భయపడి ఉండవలసివచ్చును. ఆరెండవ వస్తువు అందమైనదైనచో దానికై మనముఅఱ్ఱులు చాచుదుము. దానిపై కోరిక అది తీరకపోయినచో క్రోధము, ఇట్లుఅనర్థపరంపర. రెండవ వస్తువువలననే భీత్యాదులు. రెండవ వస్తువులేకుండుటవలననే ఉపనిషత్తులు ఉద్ఘోషించుచున్నవి. ఈ పాంచభౌతికమైనవిశ్వమనెడి ఏనుగుబొమ్మ పరమాత్మ అనెడి కఱ్ఱతో చేయబడినది. అందమైన ఏనుగుబొమ్మను ఏనుగుగా చూచినపుడు కఱ్ఱ మరుగున పడును. కఱ్ఱగా దర్శించిన ఏనుగుమరుగునబడును. అట్లే పాంచ భౌతికమైన ఈ విశ్వమును సత్యముగా చూచినచో పరమాత్మ కనపడడు. విశ్వమందంటతను నిండియున్న పరమాత్మనే చూచినచో ప్రపంచము కన్పడదు. విశ్వమంతయు మరగిపోయి ఒక పరమాత్మయే భాసించుట అద్వైతమని చెప్పనొప్పును. ఇట్లు పరమాత్మ ఒక్కడే ఇట్లు పారమార్థిక సత్యముగా చెప్పియు, లౌకికముగా వ్యావహారిక సత్యమును ప్రాతిభాసిక సత్యమును కూడా శంకరులు అంగీకరించియున్నారు. కనపడే ఈ ప్రపంచమును పూర్తిగా నిషేధించలేదు. అంతా బ్రహ్మమయము అన్నపుడు అందరిలోను బ్రహ్మ ఉన్నపుడు,తానుకూడా ఆ అందరిలోనొకడుకదా, అతనియందు ఈబ్రహ్మ ఎట్లు ప్రకాశించుచున్నాడు. అను ప్రశ్నపొడమును.

---

శ్లో॥ దంతిని దారువికారే దారుతిరోభవతి సోపితత్రైవ

జగతి తథాపరమాత్మా పరమాత్మన్యపిజగత్తిరోధత్తే జ.గద్గురుబోధలు

ప్రేమ 4విధములు.1) సాధువులను యోగిపుంగవులను చూచినపుడు వారి స'త్యాహింసాది గుణములను బట్టిగాని వారు చూపే మహిమలను బట్టిగాని వారిపై మనకు ప్రేమకల్గును.ఈ ప్రేమ నిజమైనదికాదు. ఆయోగిపుంగవులు మనగ్రామము దాటివెళ్ళినపుడుగాని, లేక వారి గుణగణాదులలో వ్యత్యాసము కలిగినపుడుగాని, మహిమలు తగ్గినపుడు గాని ఆ ప్రేమతగ్గిపోవును.ఇది గుణములను బట్టివచ్చిన ప్రేమ, గౌణము సాత్వికము అనవచ్చును.2) భార్యాపుత్ర మిత్రాదుల సంయోగము వలన ఒక ప్రేమ లేక ప్రీతి కలుగుచుండును. ఈ ప్రీతి కొంతకాలము వఱకే పరిమితమై యుండును. వియోగము కలిగిన కొలదికాలములోనే స'న్నగిల్లును.కాననిది పై దానికంటే తక్కువస్థాయి కలది.అందువలన నిది రాజసమైనప్రేమ అనవచ్చును.

3వ ప్రేమ ఒకకార్యము కొరకై, లేక ధనాదులకైగాని మనము ఆయా అధికారులపై ప్రేమ చూపుచుందుము. ఇది వారితో కార్యము పూర్తి అయిన తరువాత,లేక వారివద్దగలఉద్యోగవిరమణవలన వారిపై గల ప్రేమ తొలగిపోవును. ఇది పూర్తినైమిత్తికమైన ప్రేమ అగుటవలన జఘన్యముతామసికము. ఇట్లు సాత్విక, రాజసిక,తామసికమైన ప్రేమలు మూడును పరిహరింపతగినవే అగుచున్నవి.

ఇక నాల్గవది నిర్వ్యాజమైన,పరప్రేమ.ఇది అందరిచే అనుభూయమానము, తనయందు తనకు కల్గెడి ప్రేమకు నిర్వ్యాజమైన ప్రేమ.అదెట్లు? అన్నచో, తననాశమును తానెప్పుడూకోరడు.ఏది ఎట్లుపోయిననూ తాను మాత్రము చక్కగా నుండిన చాలుననుకొనును. తానెన్ని అకార్యములు చేసినను తనను తాను బహిష్కరించుకొనడు.తనమంచి గుణముల నిమిత్తముగా గానీ,తన చెడుగుణముల నిమిత్తముగా గానీ, తన పుత్ర మిత్రకళత్రాదుల సంయోగముల వలనగానీ, ఒక కార్యనిమిత్తమై ప్రేమించి తరువాత మానివేయుటచే గాని తనమీద తనకు గల ప్రీతి వచ్చినదిగాదు కాననిర్వ్యాజమైన ప్రేమ అయినది. దీనికే పరప్రేమ అనియు నామాంతరము. తనయందు తనకుకల్గెడి ఈ ప్రీతి లేక ఆనందము జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలయందు క్రమక్రమముగా న్యూనాధిక్యములు కల్గియున్న దనుట సకల జన ప్రత్యక్షానుభవము.3 బ్రహ్మానందము మహాసముద్రాయమానమై

---

శ్లో॥ ఇయమాత్మా పరానందః పరప్రేమాస్పదం యతః

మానభూవం హి భూయాసమితిప్రేమాత్మనీక్ష్యతే

యుండగా అందలి తరంగములలో ఒక తుప్పర ఒకలేశముగానే మనుష్యానందము నుండి చతుర్ముఖబ్రహ్మానందము వఱకు గణించబడియున్నది. అట్టి లేశమే అనుభవించుచున్నట్లు తైత్తిరీయ ఆనందవల్లి అభివర్ణించినది. ఈశ్వరుడిట్టి నిర్వ్యాజప్రేమ స్వరూపుడు, తిట్టువారిని భజించువారిని ఒకేవిధంగా చూచునుగదా.

అట్టి నిర్వ్యాజానందమే జీవుడు అనబడుచున్నాడు. ఇది భావభావనములు కలిగియున్నది. ఈ విశాలమైన ప్రపంచములో కోట్లకొలది ప్రాణులున్నవి. ప్రతిప్రాణి హృదయమందున నేనునేను అనెడి ఆరని దీపజ్యోతి ఒకటి స్ఫురించుచున్నది. ఇది అందరిలోనూ నేను గానే ప్రకాశించును. గాని భిన్నపదములచే ప్రకారాన్తరములచే నిరూపింపశక్యముగానిదిగా ప్రకాశించుట సర్వానుభవసిద్ధము దీనిని కనుగొనుటకు ప్రత్యక్ష, అనుమానాదిప్రమాణముల ప్రమేయమే లేకుండా ఇది సర్వానుభవ గోచరమగు చున్నది. ఐతరేయోపనిషత్తు ఈనేను అనగా ఏమిటో తెలుసుకొనవలెనని చెప్పినది. నేనుకు తైత్తిరీయోపనిషత్తు ఆనందో్బ్రహ్మేయని స్వరూపలక్షణము చెప్పినది. ఈఅనవసర కార్యప్రపంచమెందులకు? ఈ చేసేపనులన్నీ ఎందులకు? ఇవిన్నీ తన ఆనందమునకే, తనకొఱకే ఈ సర్వప్రపంచములోని వస్తువులను ప్రేమించుట జరుగుచున్నది. పతి పత్నిని ప్రేమించుట పత్నిపతిని ప్రేమించుట పుత్రమిత్రాదుల ప్రేమించుట తనకొఱకే తన ఆనందము కొఱకే ఇట్లు నేను కొఱకే కాన ఈ నేనును ఇట్లాలోచించగా నేను అనెడి వాడెవడు?బుద్ధి వాస్తవ పక్ష పాతినికాన నిజము తెలిసిన గాని బుద్ధి శాంతించదు కనుక ఎవరికి వారే దీనిని గూర్చి తెలుసుకొనుమని తనను తనచేతనే ఉద్ధరించుకొనవలెను అనెడి భగవద్గీతను బట్టి ఇతర ప్రమేయము (ఒత్తిడి) ఉపదేశములేకుండానే, నేను, నేను అనే స్ఫురణకు కారణము తెలిసికొనవలసియున్నది.

క్రైస్తవ మతము :- జీవుడనే నిత్యవస్తువు ఒకటి ఉన్నది.దీనినే నేను అనవచ్చును.ఇది మానవులలోనే కాని పశు పక్ష్యాదులలో లేదు.మానవుని దేహము నశించినను ఖననము చేసిన చోట జీవుడట్లేయుండునని అతనికి నాశములేదని పుణ్యపాపఫలాలనిచ్చువాడు భగవంతుడేయని క్రైస్తవ సిద్ధాంతము. రామానుజులు అవయవి పరమాత్మ తదవయము జీవుడునేను శబ్దవాచ్యుడని,జీవులందరూ జడులే అయినను ప్రతిజీవిలోనూ అంతర్యామిగా అచైతన్య ముండుననిచెప్పినారు.

పైన చెప్పిన ఉపనిషణ్మతమైన అద్వైతవాదమును చూచిఆలోచించినచో-ఈ కార్యప్రపంచములోని ప్రతిప్రాణిలోను అంతట స్ఫురించే మూలతత్వము ఒక్కటే.ఆ మూలవస్తువే ప్రతిదేహంలోను నేను అనేస్ఫురణకు మూలకారణము. ఆ వస్తువునకే జ్ఞానమని నామాంతరము. అదియే ఆనందముగా జీవుడుగా జ్ఞానముగా పేర్కొనబడినాడు. జీవాత్మ పరమాత్మలలో వెలిగే ఈనేను అనేది ఒక్కటే, జ్ఞానముచేతనే అన్నియు తెలియబడును. దానిని తెలుసుకొనే వేరే మరొక వస్తువేలేదు. అదిఏ కమ్మని ఆనందస్వరూపమని ఉపనిషద్వాదము. ఇట్లు ఈ జీవ శబ్దవాచ్యుడు తాను శుద్ధపరిపూర్ణచైతన్య స్వరూపుడేకాని, తనలోనుండెడి పరప్రేమరూపమైన ఆనందము భానాభానములు లేక ప్రకాశాప్రకాశములచే కొట్టుమిట్టాడుచుండుట సహజసిద్ధముగా కానవచ్చు చున్నది. జీవుని ఆనందము నిరవధికమైన పరిపూర్ణసచ్చిదానందమయినచో కల్పితజీవత్వము,ప్రపంచము అన్నియు మరుగునబడి ఒక్కడేస్ఫురించును.

బంధము : - సుఖదుఃఖాలు : - జీవుడు తాను శుద్ధబుద్ధముక్త స్వభావమైన పరిపూర్ణసచ్చిదానందమైనను తనను పరతంత్రునివలె భావించి భ్రాంతిచే సుఖదుఃఖాదులకు లోనగుచున్నాడు.తాడును చూచి సర్పమనుభ్రాంతిచే భయాదులను పొందుట చూచుచుంటిమిగదా నిష్ప్రపంచమైన ఆత్మవస్తువునందు ప్రపంచధర్మములను ఆరోపించుకొని బద్ధుడగుచున్నాడు.జనన మరణాది సంసార దుఃఖప్రవాహమునబడుచున్నాడు.దేహేంద్రియాదులందు అహంమమేత్యభిమానములతో కూడియుండుటచే పరిపూర్ణానందము ప్రతిబద్ధము అగుచున్నది.ఈ ప్రతి బంధముచేతనే జీవుడు పరిపూర్ణానందప్రకాశమునందుటలేదు. పరిపూర్ణానందము సామాన్యముగా ప్రకాశించుచున్నను,విశేషముగా దాని యాథార్థ్యస్థితిపొందలేక పోవుటకు ప్రతిబంధమే కారణమగునుగదా ఆ ప్రతిబంధము దేనివలన కలిగినది అనగా ఉన్నది ఉన్నట్లుగా తెలిసికొనకపోవుటచే కలిగినది. దీనికి అవిద్యమూలము

అనాదులు - 6. 1- జీవుడు,2- ఈశ్వరుడు,3- పరిశుద్ధచిత్తు,4- జీవ పరమాత్మల భేదము 5- అవిద్య 6- తద్వితయ సంయోగము.

---

పంచదశి:- శ్లో॥ ఇత్థం సచ్చిత్పరానందన ఆత్మాయుక్త్యా తథా విధం ॥

పరంబ్రహ్మ తయశ్చైక్యం శత్యం తేషూనదిశ్యతే ॥ అధ్యాయము 10వ శ్లోకము

వీటిలో 5వదైన అనాదియైన అవిద్యయే ప్రతిబంధకము అని వేదాంత చెప్పుచున్నది. బ్రహ్మము :- సత్యము, జ్ఞానము,అనన్తమును ఐనది బ్రహ్మ ఏకము అద్వితీయము బ్రహ్మము అయిననూ,పూర్వోక్త,భ్రాంతిచే స ఉన్నదున్నట్లు గ్రహింపకపోవుటయే మూలముగా కలిగి వెలుగొంద నదియే,మాయ. మాయ - అవిద్య అని రెండువిధములు,మాయయందు చైతన్యము సమష్టి చైతన్యాత్మకుడై,మాయను తనవశములోనుంచుకొనువా అగుటచే ఈశ్వరుడగుచున్నాడు. తెలుపు, ఎఱుపు, నలుపుదారములతో కలిపివే తాడువలె సత్త్వరజస్తమోగుణముల యొక్క కలయికయే అవిద్య అని ము ప్రకృతి అని చెప్పబడుచున్నది. ఈఅవిద్యసత్త్వరజస్తమగుణ న్యూనత్వాధికత్వా భయాత్మ కతల ననుసరించి, అవిద్యయందున్న చైతన్యమే. సత్వాధిక్యమ దేవరూపముతోను రజోగుణాధిక్యమును బట్టి మనుష్యరూపము తో తమోగుణాధిక్యమును బట్టి పశుపక్ష్యాదిరూపములతోను నేను లే జీవశబ్దవాచ్యముగా కన్పట్టుచున్నదని ఉపనిషన్మతము.

అధ్యారోపాప వాదముల చేతనే బ్రహ్మతత్త్వము తెలియదగునని, అధ్యారో పవాదాభ్యాం జ్ఞాతవ్యస్తత్త్వనిర్ణయః, అనెడి ఆర్యోక్తివలన తెలియుచున్న నిష్ప్రపంచమైన ఆత్మవస్తువునందు ప్రపంచారోపమే అధ్యారోపము, కారణవ కంటె, వ్యతిరేకముగా కార్యములేదు అని నిషేధించుట.

అధ్యారోపమువలననే ఈ సృష్టి అంతయూ జరిగినది. రజ్జువునంద సర్పారోపణమువలననే భయాదులు కలిగినట్లు నిష్ప్రంచమైన ఆత్మవస్తువునంద ప్రపంచారోపము కల్గినది అందువలననే సంసారభయమేర్పడినది. మాయాప్ర

శ్లో॥ భ్రమమాత్రావలంబనం నామరూపవికల్పనం
శాస్త్రేణ తాదృశేనోక్తం తాదృశస్యాత్మలబ్ధయే

శ్లో॥ భ్రమస్తు మోహమాత్రఃస్యాత్ తస్యరూపం న విద్యతే
తమనాదింబుధాః ప్రాహుః బాలబుద్ధివిశుద్ధయే

శ్లో॥ జీవో, బ్రహ్మ, విశుద్ధా చిత్తథా జీవేశ యోర్భిదా
అవిద్యాతచ్చితేర్యోగః షడస్మాకమనాదయః

శ్లో॥ స్వాజ్ఞానికల్పితైవాయంజగజ్జీవేశకల్పనా

బింబితుడు ఈశ్వరుడు. అతడే జగత్స్రష్ట. అతనికే అన్తర్యామి అవ్యాకృతుడని పేర్లు. అతడే తనచే సృష్టములైన దారములకు ఊర్ణనాభి. సాలీడువలె ఈ జగత్తునకు ఉపాదాన కారణము. నిమిత్త కారణము గాను అగుచున్నాడు. పూర్వోక్తమైన అవిద్య బహుప్రకారములు కలది. అవిద్య అనెడిది ఒక అద్దము వంటిది. కోల, గుండ్రము, పొడవు, పొట్టి స్థూలము. సూక్ష్మము మున్నగు ప్రభేదములను బట్టి అవిద్యయందు ప్రతిబింబించిన వ్యష్టి చైతన్యము బహు ప్రకారముల అయినది. ఇవి అన్నియు ప్రతిబింబగత దోషములే కాని, ఈ ప్రతిబింబములను బట్టి బింబమునందు మార్పేమియు ఉండదు. సూర్యుడు ఒక్కడే అయినను జలతరంగ ఫేన, బుద్బుద, స్థూల, సూక్ష్మాద్యనంతములైన వాటియందు ప్రతిబింబించినచో ఆ సూర్యుడు బహుప్రకారములుగా తోచుట చూచుచునేయున్నాము కదా. ఇట్లే అవిద్య వలన ఈ వివిధములైన సృష్టులేర్పడినవి.

కారణసృష్టి :- ఈ అవిద్య సమష్టి, వ్యష్టి భేదములచే రెండు విధములు వనము, గ్రామము, సమష్టి. చెట్టు, పుట్ట, వ్యష్టి అని వ్యవహారము ఈశ్వరునికి సమష్టి అవిద్యలేక మాయ మూలకారణము. ప్రతిప్రాణికిని వేరువేరుగా ఉండెడి వ్యష్టి అవిద్య మూలకారణము.

జీవేశ్వరులు మాయా అవిద్యలయందు ఉండుటవలన అవి వారికి కారణ శరీరములుగ వ్యవహరింపబడుచున్నవి. ఆ కారణ శరీరములందు ఉండుటయే సుషుప్త్యవస్థగా చెప్పబడినది. దీనినే ఆనందమయకోశమని చెప్పుదురు. ఇట్లు కారణ ప్రపంచము సృష్టి భ్రాంతిచే కల్గినది.

సూక్ష్మసృష్టి :- ఈశ్వరుని యొక్క ఈక్షణవశముచే తమోగుణరూపమైన ప్రకృతి 1- ఆవరణశక్తి, 2- విక్షేపశక్తిగాను ద్వివిధములైనది. ఈవిక్షేపశక్తి లేక భ్రాంతి ఆకాశముగాను, ఆకాశమునుండి, వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి ఉదకములు, ఉదకమునుండి భూమి గాను పరిణమించినవి. ఈ ఐదుభూతము లను అపంచీకృతములైన తన్మాత్రలను పేరుతో వ్యవహరించెదరు. ఈ పంచమహాభూత సూక్ష్మముల సమష్టివ్యష్టిఅంశలచే త్వక్చక్షుఃశ్రోత్ర జిహ్వాఘ్రాణము లేర్పడినవి. సమిష్టి సత్వాంశచే అంతఃకరణము ఏర్పడినది. దీని భేదములే మనోబుద్ధి చిత్తాహం కారములు. మనస్సు బుద్ధియందు, చిత్తము అహంకారమందు అంతర్గతమగును. అపంచీకృత పంచమహాభూతముల రజోగుణవ్యష్టి అంశలచే వాక్పాణిపాదా పాయూపస్థలు రజోగుణ సమష్టి అంశచేత ప్రాణము ఏర్పడినవి.

ప్రాణమే ప్రాణాపానవ్యానో దానసమానములనుపేర్లతో తత్తత్స్థానములందు ఉండుటనుబట్టి అనేక నామములను పొందినది. ఇట్లు కర్మేంద్రియ పంచకము జ్ఞానేంద్రియ పంచకము, ప్రాణపంచకము, మనో బుద్ధులు మొత్తము 17ని కలిపి లింగశరీమందురు. సూక్ష్మ శరీరమని కూడా దీనికి పేరు. ఇందు ప్రాణమయకోశము, మనోమయకోశము, విజ్ఞానమయ కోశములు కలవు. జీవేశ్వరులు సూక్ష్మ శరీరమందుండుటను స్వప్నావస్థ అని అందురు. ఇది భోగసాధనమైనది. ఇట్లిది సూక్ష్మ సృష్టిప్రకారము. 3 స్థూల సృష్టి :- తమో గుణ ప్రధానములైన పంచమహాభూతములను ఐదింటిని ప్రత్యేకముగా రెండుగా విభజించవలెను. ప్రతిభూతముయొక్క అర్ధభాగమునకు మిగిలిన నాలుగు భూతముల యొక్క ఎనిమిదవ అంశలను నాల్గింటిని కలపవలెను.

ఇట్లు ఒక భూతములోని అర్ధ భాగమునకు మిగిలిన భూతములలోని 1/8వ వంతు నాలుగు అంశలను కలిపిన వాటిని పంచీకృత పంచమహాభూతము లందురు. విడదీయగారానంత మిశ్రీకరణము జరుగును కావున దీనిని పంచీకరణము అందురు. పంచీకృత పంచమహాభూతముల నుండియే బ్రహ్మాండము, దానిలో 14భువనములును ఏర్పడినవి. ఈ స్థూల శరీరమునందు జీవేశ్వరులు ఉండుటను జాగ్రదవస్థ అని అందురు. ఇది స్థూలమైన అన్నమయ కోశముగా చెప్పబడుచున్నది.

## త్రిపురములు - త్రిపుర ప్రవేశము

"తత్సృష్ట్వా తదేవానుప్రావిశవిత్" అన్న వేదాంతమును బట్టి మాయా ప్రతిబింబిత చైతన్యమైన ఈశ్వరుడే కారణ,సూక్ష్మ, స్థూల శరీరములందు అనగా త్రిపురములందు ప్రవేశించినాడు. సమష్టి వ్యష్టి భేదములచే ఈశ్వరుడు, జీవులు ఈ క్రింది నామములతో వ్యవహరింప బడుచున్నారు. **కారణ సమష్టిచే ఈశ్వరుడు కారణవ్యష్టిచే జీవుడు ప్రాజ్ఞుడు సూక్ష్మ సమష్టిచే హిరణ్య గర్భుడు సూక్ష్మ వ్యష్టిచే తైజసుడు, స్వాప్నికుడు స్థూల సమష్టిచే వైశ్వానరుడు స్థూల వ్యష్టిచే విశ్వుడనియు** చెప్పబడుచున్నారు. ఈశ్వరుడే సత్త్వర జస్తమోగుణోపాదులచే బ్రహ్మవిష్ణు మహేశ్వరులుగా నుండి సృష్టిస్థితిలయములను చేయుచున్నాడు. బ్రహ్మ విరాట్టు నందును, విష్ణువు హిరణ్యగర్భుని యందును

రుద్రుడు ఈశ్వరుని యందున అన్తర్భావమును తెలియవలెను. ఇట్లు ప్రపంచమైన ఆత్మ వస్తువు నందు ప్రపంచోత్పత్తి రూపమైన ఆరోపము చేయబడినది. దీనినే అధ్యారోపమందురు. ఇది వస్తువు యధాతథముగా తెలియకుండుట వలన అనగా అజ్ఞానము వలన వచ్చినది. ఇది అంతయు విక్షేప శక్తి కార్యము.

ఇక ఆవరణ శక్తి కార్యమే సంసారవృక్షమునకు మూలము. ఈ ఆవరణము రెండు విధములు 1) అసత్త్వావరణము 2) అభానావరణము. గురుముఖముగా విన్న వేదాన్తవాక్య జన్యబోధచే వస్తువులేదనెడి అసత్త్వావరణము తొలగును.

యుక్తులతో అనుచింతనము చేయగా అసంభావనము తొలగిపోవును. పునఃపున్యముగా ఆ వస్తువు యొక్క నిదిధ్యాస వలన విపరీత భావనలు పోయి ఆవరణ ద్వయనాశమచే దీపప్రకాశమువలె బ్రహ్మజ్యోతిస్సు అవిచ్ఛిన్నముగా ప్రకాశించును. అనర్థనివృత్తి ఆనందావాప్తి కలుగును. ఇక అపవాదము అనగా కారణము కంటె వ్యతిరేకముగా కార్యము లేదను బోధచేత శుక్తికయందు రజతమువలె, రజ్జువునందు సర్పమువలె బ్రహ్మయందు ప్రపంచము నిషేధింపబడుటయే అపవాదము. ఏదిలేదో అది మాయ; ఏది నిజముగా లేదో అది అవిద్యకావున మాయా విద్యలు కల్పితములని తెలియును. ఇట్లు బ్రహ్మకన్న వ్యతిరేకముగా ఏమీలేదు. ఆ బ్రహ్మమునేనే అగుచున్నాను. అని అనుభవ పూర్వకముగా తెలియుట ముక్తి అగుచున్నది. ఇది ఉపనిషన్మత సిద్ధాంత సంసంగ్రహము. నిఖిల జీవకోటికి కన్పించెడి ఈ జగత్తునకు మూలకారణము మాయా ప్రతిబింబిత సమష్టిచైతన్యమే లేక ఈశ్వరుడని పూర్వ ప్రకరణమున తెలిసికొంటిమి. ఇక అకారణము, సమవాయి కారణమా లేక అసమవాయి కారణమా ఉపాదాన కారణమా లేక నిమిత్తకారణమా అను పెక్కు సందేహములు కలుగును అనేన జీవేనాత్మనా అను ప్రవిశ్యనామరూపే వ్యాకరవాణి కల్పిత నామరూపములే ఈ జగత్తు, ఆరంభ వాదము కణభుక్పక్షము. సంఘాతవాదము బౌద్ధపక్షము సాంఖ్యాదుల పక్షము పరిణామవాదము. వేదాన్త పక్షమైతే వివర్తవాదము అభియుక్తోక్తి. అనగా ఈ జగత్తును గూర్చి పరబ్రహ్మము వివర్తోపాదాన కారణము అని వేదాన్త సిద్ధాన్తము.

---

తైత్తిరీయము - ఆనందవల్లి

లఘువాసదవ మననము - వాసుదేయతీంద్రవిరచితము

ఏది కార్యముగా అగుచున్నదో అది ఉపాదానమనబడును. కుండరూః కార్యమును గూర్చి మట్టి ఉపాదానకారణమగును. మట్టియే కుండగ మారుచున్నదిగదా, కేవలమైన మట్టికి కుండమూకుడు అను పేర్లు లేవు. ఒ మట్టియే కుండగా వికారమును చెందునపుడు కుండ అనెడి నామరూపముల వచ్చినవి. కుమ్మరి కుండను గూర్చి నిమిత్తకారణముగా నున్నాడు. ఇః జగద్రూపకార్యమునకు కుండకు మట్టివలె ఈశ్వరుడే ఉపాదానకారణము, కుండక కర్త కుమ్మరి విడిగా కన్పట్టుచున్నాడు. ఇచ్చట ఆ ఈశ్వరుడే నిమిత్తముగాను అగుచున్నాడు. దృష్టాంతమును బట్టి ఈశ్వరుని యొక్క నామరూపములే ఈ జగత్తు వివర్తము అనగా విశేషముగా భాసించునది. ఇది అవస్థాంతర భానమాత్రమ తాడు తాను వికారము పొందకయే పాము వలె కన్పట్టును. అటులే జగత్కారణమగ బ్రహ్మ తాను వికారము పొందకయే జగత్తుగా కన్పడును. నిరవయవ పదార్థమ లందన్నింటను వివర్తము వర్తించును. ఆకాశము నిరవయవము ఆకాశమ నల్లగను బోరగిలబడిన ఇంద్రనీల మణిమయ కటాహమువలెను కనపడును కటాహముగా కన్పట్టు కార్యమునకు ఆకాశము వివర్తోపాదానమయినట్ల నిరంశమగు లేక నిరవయవ పదార్థమైన బ్రహ్మ తాను ఎట్టి వికారములు లేః మార్పులు లేకుండగనే విచిత్రమగు జగదాకారముగా కనపడును. ఆకాశము ఎట్ట మార్పులు లేకుండగనే కటాహ కార్యమునకు కారణమయినది గదా కల్పించువాడొకడు లేనిదే వివర్తము బాసింపదు అన్నచో ఇచ్చట మాయా శక్తియే కల్పక మగుచున్నది. క్రియేచ్ఛా జ్ఞానరూపమగు మాయా శక్తి ఆత్మలో ఇమిడియున్నది.

ఈ జగత్తు నామరూపాత్మకము ఇది పరమాత్మ అనెడి అదిష్ఠానమంద అభాసమాత్రముగా కన్పట్టుచున్నది. తనకంటే వేఱుగా లేని ఫేనబుద్బుదకార్యమ నకు సలిలము కారణమయినట్లు జగత్తుకు పరమాత్మయే ఉపాదానము. నిజమునక నుఱగ బుడగలు, తరంగములు సలిలము కంటే భిన్నములు కావు గదా కాన అవస్థానంతర భాన మాత్రమే. అట్లే ఈ నామరూపాత్మక జగత్తునకు అవిద్యా ప్రతిబింబిత సమష్టి చైతన్యమే మూలము. ఈ జగత్తు ఆ పరమాత్మకొక లీల మాత్రమే. లోకములోనున్న రాజాదులకు ఏచిన్న ప్రయోజనము నపేక్షింపకయే ఆయా క్రీడలందు ఎట్లు ప్రవృత్తి ఉండునో లేక బాహ్యప్రయోజనమును ఆపేక్షింపకయే మనుష్యాదులకు ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఎట్లు కల్గుచుండునో అట్లే

జగద్రూప కార్యమంతయూ కించిత్ప్రయోజనాపేక్ష లేకయే స్వాభావికముగా పరమాత్మవలన జరుగుచున్నదనుట యుక్తము. ప్రయోజనము కల్పించిన ఆప్త కామత్వ శ్రుతికి విరోధము కల్గును. ఉన్మత్త ప్రవృత్తి అన్నచో సృష్టి శ్రుతి సర్వజ్ఞత్వాది శ్రుతులకు విరోధము కలుగును కాన ఇది ఆ పరమాత్మకు లీలా కైవల్యమే అగుచున్నది. విద్య అంకురించిన వెంటనే సర్వము బ్రహ్మమునందే పర్యవసితమగునుగాన నెట్టి దోషములును కలుగవని సిద్ధాంతము. బౌద్ధుల శూన్యవాదమునకు అద్వైతవాదము నకు పొంతమేలేదు. శూన్య ధర్మాలనుండి శూన్యధర్మాలు పుట్టి శూన్యములో అంతర్హితములగునని బౌద్ధవాదము. అట్టి బౌద్ధ వాదము నుండియే శంకరులు మాయావాదము కనిపెట్టి నారనుట అవిమృశ్యకారిత్వము అసమంజసముగాను అగుచున్నది. నిత్యసత్యమైనది పరబ్రహ్మము అని ఇందు అంగీకరింపఎడినది. అద్వైత వాదమునకే మాయావాదమని, వివర్త వాదమని, అనిర్వచనీయవాదమని నామాంతరములు కలవు.

ఈ జీవులు అనంతానంతములుగా పుట్టుచున్నవి. పెరుగుచున్నవి. గిట్టుచున్నవి. ఇది అందరికిని కనపడు జీవచరిత్రయే. ఇదియే ప్రపంచము. ఇట్లు పుట్టిపెరిగి చచ్చుటలతోనిత్యమూ మనకు అనుభవము జరుగుచున్నది. ఇట్టి చావు పుట్టుకలతో నిండికన్పట్టు నదియూ ఎప్పటికీ మార్పులేకుండునదియూ అగుటచే ముక్కాలములందుండు వస్తువునకే సత్యమని పేరు తగియున్నది. కావున ఈ చావు పుట్టుకలతోనిండియున్న ఈ జగత్తు సత్యమనుట పొసగదు. పుట్టుటకు పూర్వము ప్రపంచము అదృష్టము. తరువాత కొంత కాలము దృష్టము. తరువాత నష్టమగుచున్నది. కాన ఇది సత్యము కాదు.

పోనీ అసత్యమని అన్నిటిని తీసివేయుదమన్నచో కొలది కాలమైనను మనము చూచుచున్నాము గదా. కాబట్టి ప్రపంచమును ఏమనవలెను. ఉన్నదని వచించుటకా వీలు లేదు. లేదని వచించుటకును అసలే వీలు లేదు. కాన ఇయ్యది అనిర్వచనీయము అనగా ఇదమిత్థమని నిర్వచించుటకు వీలు కానిది. ఈ ప్రపంచ స్వరూపము మనకు తెలియదు. ఇదొక ఇంద్రజాలము. ఇది మాయ. మాయయని దేనిని అందుము? దేనిని కనులార చూచియు ఇది లేదు అని చెప్పజాలమో దేనిని పరిశోధించి పరిశోధించి చూచినచో దాని స్వరూపమును చెప్పుమాట మనకు దొరకదో అదియే మాయ అదియే అనిర్వచనీయము అని

అందుము. గారడీవాడు మనము చూచుచుండగనే మన కనుల ఎదుటఎండిన మామిడిటెంకను పాతిబెట్టి మొలపించును. పుష్పింపజేయును, ఫలింపజేయును. ఆ మామిడి పండును మనచే తినపింపచేయును. మనము నిజముగా మామిడి చెట్టును కాదనగలమా? మామూలు మామిడిచెట్టునకు గారడీవాని మామిడిచెట్టు నకును, ఏమి భేదము. లేకున్న నిజమైన మామిడి చెట్టున కున్న వ్యవహారము గారడీచేత వచ్చి న మామిడి చెట్టుకు అంటుగట్టవచ్చునా? కేవలము మాయమామిడి చెట్టు అనే అందుము గదా. కనులతో చూచిన దానిని చూడలేదనుట కుదురదు కావున లేదనుట కుదురదు. అరగడియలో టెంక మొలక, పువ్వు, కాయ పండులతో కనుల పండువుగా పెరిగి పెద్ద దైనదను విషయమత్యాశ్చర్యకరము గదా. మనకే తెలియని దానిని మరొకరికి తెలియజేయలేము గనుగనే అనిర్వచ నీయమనినారు. జగత్తునకు ఉపాదానకారణమున్ను నిమిత్త కారణమున్ను బ్రహ్మయే అగుచున్నది. సాలీడు తన నోటి నుండి వెడల్చిన దారములకు తానే ఉపాదాన కారణము చేయుటలో కర్త కూడా తానే అగును కాన అభిన్న నిమిత్తో పాదానము అని నిర్ధారణము చేయబడినది. భూమియందు ఓషధులు పుట్టిపెరిగి లయించునట్లు వాటికి భూమియే కారణమైనట్లు వ్యాకృతములైన నామ రూప ప్రపంచమునకు అవ్యాకృత నామరూప ప్రపంచము కారణముగా అయినట్లు వ్యాకృత సలిలఫేన కార్యమునకు అవ్యాకృత కారణమయిన సలిలఫేన రూపము కారణముగా నయినట్లు ఈ జగద్రూప కార్యమునకు బ్రహ్మ కారణమైనదిగా నున్నదని ఐతరేయము.

లేదా విజ్ఞాన వంతుడైన ఒక గారడీవాడు నిరుపాదానుడై స్వరూపోపమర్దము లేకుండా తన వంటివానిని ఒకని సృష్టించుకొని తానే ఆకాశగమనాది కార్యములకు కారణముగా అయినట్లు మహామాయావి చేయుటకు చేయకుండుటకు, అన్యథా కరించుటకు సమర్థుడైన ఆ ఈశ్వరుడే ఈ జగత్తునకుపాదానము నిమిత్తమును అయినాడన్నచో సర్వము సుస్థమగునని శ్రీశంకరాచార్యులు సిద్ధాంతమును ప్రతిపాదించినారు. ఇక అద్వైతసౌధనిర్మాణము చేయబోవుచూ శ్రీశంకరులు బ్రహ్మసూత్రము లకు భాష్యము రచింపబోవుచూ ముందుగా అధ్యాస అనెడి ఒక

1 వేదాన్త సారము - కప్పగంతుల సుబ్రహ్మణ్యశాస్త్రి

గొప్ప పునాదివేసినారు. ఈ పునాది కేవలము ఉపనిషన్మతమునను సరించి శ్రుతిమతతర్కమున సంతరించినదేకాని వేఱుకాదు.

1. అధ్యాస :- 1 జీవుడు లేక నేను అను ఎఱుకను తానైనవాడు దేహేంద్రియా ద్యావరణములలో గల చేతనము నేను అనువాడు విషయి అని అనిపించుకొనును.

2 - బుద్ధి మొదలగు ప్రకృతి పరిణామము, లేక ఈ ప్రపంచమంతయు జడము విషయము అని దీనికి పేరు. ఈ రెండునూ తమః ప్రకాశమువలె విరుద్ధ స్వభావములు కలవి.

చిదాత్మయందుండెడి ధర్మములు జడమునందును, జడమందుండెడి ధర్మములు చేతనమందునూ ఆరోపించుకొనుచున్నాము. దేహము కంటె ఇంద్రియములకంటె మనస్సు కంటే నా యిల్లు నా శరీరము నాచేయి నామనస్సులలో వలె నేను వేఱుగా నున్నది తత్తత్పదార్థములనుండి వేఱుగా ప్రతీతమై కన్పట్టుచున్నను, దేహధర్మాలైన స్థూలత్వాదులను తెచ్చి పెట్టికొని అహం స్థూలఃకృశః నేను లావరిని, నేనుకృశుడను అనియు, ఇంద్రియ ధర్మాలైన కాణత్వాంధత్వముల కంటె నేను వేఱుగా నుండి నేను మూగవాడను, నేను చెవిటివాడను, నేనుకుంటివాడనను విధంగాను, మనోధర్మాలైన కామసంకల్పత్వాదులకు నేను వేఱుగానున్నను దానియందు ఆయా జడధర్మములను ఆరోపించుకొను చున్నాము. ఈ ఆరోపణము పేరే అధ్యాస. అది కానిదానియందు అది యనుబుద్ధియే అధ్యాస. దీనినే కొందఱు భ్రాంతి అని, తద్విశేష అజ్ఞానము అని స్మృతి రూపమైన అన్యత్ర పూర్వదృష్టావభాసమని అన్యత్ర అన్యధర్మాధ్యాస అని అన్యత్ర విపరీత ధర్మకల్పన మనియు పలు విధముల పేర్కొనిరి. ఏదైనను అదికానియందు అదియను బుద్ధి అధ్యాస అని చెప్పనగును. త్రాటియందు సర్పమువలె , ఒకే చంద్రుని యందు ఇద్దరు చంద్రుల వలెను పరమాత్మ యందు ఈ జగత్తు ఆరోపితము. లోగడ పామును, త్రాటిని విడివిడిగా గ్రహించియే యుంటిమి అయినను చీకటిలో అధిష్ఠాన విశేషాజ్ఞానముచేత సర్పభ్రాన్తిచే భయాదులకు లోనయినట్లు నేనునందు బ్రహ్మస్వరూపతత్త్వమును విడిచి జడధర్మములను అవిద్యచే ఆరోపించుకొని సంసారభయమునకు లోనయితిమి. అధ్యాసకే

అవిద్యయని పేరు ఇట్టి అవిద్యలను తొలగించుటకే సర్వభ్రాంతి పోవుటకు దీపపు కాంతివలె వేదాన్త శాస్త్రప్రకాశము దండధారియగుచున్నదని జగద్గురువులు వాక్రుచ్చినారు. ఆచార్యవాన్ పురుషోవేద॥తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్స మిత్పాణిః శ్రోత్రియందు బ్రహ్మనిష్ఠం తం త్వౌపనిషదం పృచ్ఛామి ఇత్యాది శ్రుతులను బట్టి శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడైన గురువును చేరి బ్రహ్మను పరోక్షజ్ఞానముచే తెలిసికొని, నిశ్చిత నిత్యవస్తువును మనన నిదిధ్యాసలు చేసి బ్రహ్మవిదుడై అహం బ్రహ్మాస్మి అను వృత్తితో నుండుటయే ముక్తి. విద్య ఆవిర్భవించుచో ఆరోపమూలకములై భయాదులు తొలగును. ఇట్లు చూచిన విశ్వానికి పారమార్థిక సత్తలేనే లేదని వ్యక్తమగును. ఈయద్వైత ప్రతి పాదక శ్రుత్యర్థ సంపిండిత సారాంశములను శ్రుతిమతతర్కములచే యోజించినవి బ్రహ్మసూత్రములు. ఆ బ్రహ్మసూత్రార్థముల సారాంశమును కూడా స్థాలీపులాక న్యాయముగా ఇచ్చట నిరూపించబడుచున్నది.

అథాతో బ్రహ్మ జిజ్ఞాసా అని ప్రారంభించి అనావృత్తి శ్శబ్దాత్ అనావృత్తి శ్శబ్దాత్ అను చివరి సూత్రము వఱకు వ్యాసభగవానుడు బ్రహ్మసూత్రము లనురచించెనని ఎల్లరకు సువిదితము. బ్రహ్మ సూత్రములపై 1 శంకరులు, 2 రామానుజులు 3 మధ్వులు మున్నగు వారిచే తమ తమ పక్షములను సమర్థించుకొనుచు సూత్రములకు తాత్పర్యార్థనిర్ధారణము సమన్వయ పూర్వకముగా చూపియున్నారు. మరియు వీరి పక్షములలో కొన్ని వాదములు ఇతర పక్షముల నాక్షేపించుచున్నవిగాను కన్పట్టుచున్నవి.

ఇట్టి స్థితిలో కొందఱు నిష్పక్షపాతులమనుకొని సూత్రకారుని సకల సూత్రములను విచారణము చేయగా, శాంకరభాష్యములోని మాయావాదమైన బ్రహ్మసత్యము, జగన్మిథ్య అనుదానిపై వీటికి తాత్పర్యములేదు. కేవలము శంకరులచే ఇది కల్పితమని వాక్రుచ్చుచున్నారు. ఇయ్యది అవిచార మూలకమని సూత్రముల పౌర్వాపర్యములను, తదర్థములనూ అలోచించిన బ్రహ్మాత్మైక్యము నందే తాత్పర్య మని తెలియగలదు. పరమ పురుషార్థమైన మోక్షమును ప్రతిపాదించెడి వేదాన్త భాగము మిక్కిలి గంభీరార్థములు కలది అగుట వలనను అర్థజ్ఞానము ఏవం విధముగానే యుండునని నిరూపించుట దుష్కరమగుటవలనన సహజముగా అర్థజ్ఞానము అందరికి అంతసులువుగా తెలిసికొనదగినది గాదని తెలిసియే వ్యాసాచార్యులు శారీరక మీమాంసా సూత్రములను సూత్రించినారు.

ఇందు వేదాన్త వాక్యములనే ఉదాహరించి విమర్శ చేయబడుట, తత్వనిర్ధారణ చేయుటయే ప్రధానముగా జేసికొని సూత్ర జాతమంతయు ప్రవృత్తమైనట్లు తెలియుచున్నది. శంకరులు తన భాష్యములో వేదాన్త వాక్యకుసుమగ్రథనము కొఱకే సూత్రములు అనివివరించియున్నారు. ఉపనిషత్తులన్నింటికి నీమాయావాదమే అభిప్రేతమయియున్నపుడు తద్వివరణ భూత సూత్రములందు మాయావాదము లేదనుట సాహసోపేతమైనదిగా కన్పట్టుచున్నది. ఉపనిషత్తాత్పర్యము నిర్గుణ పరబ్రహ్మప్రతిపాదన పరమనుటలోనే మాకువిప్రతిపత్తి కలదన్నచో అనేక శ్రుతులకు వ్యాకోపము కల్గునని వేఱుగా చెప్పనక్కరలేదు. మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరం మాయ ప్రకృతి మాయ మహేశ్వరుడు అని శ్వేతాశ్వతరోపనిషత్తు. యత్రద్వైతమివపశ్యతి స ఇతర ఇతరత్ పశ్యతి యత్ర తు సర్వమాత్మై వాభూత్ తత్కేన కంపశ్యేత్ కేన కిం జిఘ్రేత్ విజ్ఞాతార మరేకేన విజానీయాత్ ఏఅవస్థయందుసర్వము ద్వైతముగా చూడబడునో వాడు తనకంటే భిన్నమైన దానిని చూచుచున్నాడు. ఎవరికి సర్వమూ ఆత్మయే అయ్యెనోద్వైత భావమే లేదోవాడు ఏ ఇంద్రియముచే ఏ పదార్థమును చూడగలడు. వాసన చూడగలడు. వినగలడు. అతడు ఆత్మ, సర్వద్రష్ట, సర్వజ్ఞాత, జ్ఞాత, జ్ఞేయములైన ఇంద్రియములచే ఎట్లు చూడబడగలడు.

ఏకమే వాద్వితీయం బ్రహ్మ తత్త్వమసి శ్వేతకేతో సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యము. నిరవయవమైనది బ్రహ్మము. ఏకము, ఆ బ్రహ్మనీవే అగుచున్నావు. ఛాందోగ్యోపనిషత్తు. యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః తత్రకో మోహః కశ్శోకః ఏకత్వమనుపశ్యతః ఏస్థితిలో సర్వప్రకృతి ఆత్మగానే అగుచున్నదో వానికి శోకమోహములెక్కడివి. అని ఈశావాస్యోపనిషత్తు.

నాహం మన్యేసువేదేతి నోనవేదేతీ వేదేచ ఆత్మ ఎప్పుడు చూచేదిగాని, చూడ బడుటలో కర్మ కాదు కనుక నేను బాగా ఆత్మను తెలుసికొన్నాను. అన్నచో నీకు తెలియదనియు అర్థము తెలిసియు తెలిసికొనలేదనిన వానికే తెలియును ఎప్పుడు సబ్జక్టే కాని ఆబ్జక్టు కాదు కర్తయే అగును గాని కర్మకాదు అని అర్థము.

మాయామాత్రమిదం ద్వైతం అద్వైతం పరమార్థతః - ద్వైతమంతయూ మిథ్య అద్వైతమే పారమార్థికము.

నతత్రసూర్యోభాతి న చంద్రతారకానేమావిద్యుతో భాన్తికుతోయమగ్నిః తమేవ భాన్తమనుభాతి సర్వంతస్యభాసా సర్వమిదం విభాతి -

అనిర్గుణ బ్రహ్మకాంతిచేతనే సర్వము ప్రకాశించుచున్నది. ఎట్లు నదులు సముద్రమును పొంది నామరూపాలు అస్తమించి సముద్రము నందు ఐక్యము పొందునో అట్లే నామరూపాత్మక విశ్వము ఆబ్రహ్మయందు లయించును.

ఏషహిద్రష్టా శ్రోతా మంతా ఈతడే ద్రష్ట శ్రోత మంత, అక్షరము.

యథోర్ణనాభిస్సృజతే గృహ్ణతే చ ఇట్లుపనిషత్తులన్నియు ఉపక్రమాదిషడ్విధ తాత్పర్యలింగములచే అనిర్వచనీయ వాదమునే సమర్థించియన్నవి. అవస్థాత్ర సాక్షిత్వమును పంచకోశాతిరిక్తత్వమును ఒకే వస్తువును గూర్చి తైత్తిరీయాదులు బహువిధములుగా ప్రపంచించినవి.

**శ్లో॥ మయాఽధ్యక్షేణ ప్రకృతిస్సూయతేసచరాచరం ।**
**ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా ॥**
**అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ।**

మాయచే అవృతమైన పరబ్రహ్మమే అంతటా నిండియున్నది. మరియు పర, అపర అను విద్యలు రెండు చెప్పిచూడబడెడి విశ్వమును పరప్రకృతిగాను, అపరయనునది ఏది అదృశ్యమో అగ్రాహ్యమో ఇది కాదు ఇదికాదు అనునట్టి వాక్యములతో నిరస్త సమస్త విశేషమగు నిర్గుణ నిరాకారనిరంజనమగు పరబ్రహ్మమొక్కటే సత్యముగా భగవద్గీతయందభి హితమైనట్లు కన్పట్టుచున్నది. ఇట్లాలోచించిన ఉపనిషత్తులన్నియు అద్వైతతత్త్వమునే ప్రతిపాదించు చున్నట్లు తెలియగలదు. సర్వజ్ఞ సత్య సంకల్ప స్రష్టృత్వాది సగుణ భోధకములైన శ్రుతులకు విరోధమగును కదా అన్నచో ఇచ్చట ఈ వాక్యములు నిర్గుణ సిద్ధి బోధకములా? లేక వీటికి అగతిక గతిత్వము చెప్పబడుచున్నదా?

1. ఉపక్రమోపసంహారములు, 2, అభ్యాసము, 3 అపూర్వతా 4 ఫలము, 5 అర్థవాద 6 ఉపపత్తులనెడి షడ్విధ తాత్పర్య నిర్ణాయ కలింగములచే నిశ్చయింపబడిన తాత్పర్యములు గల పూర్వోక్త శ్రుతులచేత సర్వవిశేష నిరాకరణ పూర్వకముగా నిర్గుణతత్వ నిరూపణమే చేయబడినందు వలన మొదటి పక్షము చెప్పదగదు. ఉపనిషత్తులన్నియు సత్యవస్తువు ఉపక్రమముగా కలిగి పిమ్మట తత్సాధనో పాయములైన ఉపాసనలను, కర్మలను బోధించెడివిగా నున్నవి. గాన

మొదటి పక్షముప్రాస్తము. ఇక రెండవ పక్షము అనాదరణీయము. స్వప్రకరణమున ప్రతిపాదితములైన ఉపాసనలకు సర్వజ్ఞ సత్య సంకల్పాది ద్వైతవాక్యములకు అంగములుగా గతి సంభవించు చున్నందున శ్రుతి వాక్యములకు అగతికగతిత్వమే లేదు గాన విరోధమే లేదు. ఇట్లు సగుణ, నిర్గుణ రూపములైన వాక్యములను పరిశీలింపగా కొంత మందికి ముక్తికి సాధనమైన జ్ఞానము విషయముగా గల నిర్గుణ తత్త్వమును సమర్పించుట చేతను, నిర్గుణ బ్రహ్మను సాక్షాత్కరింపజేసికొనుట కసమర్థులైన కొంతమందికి సగుణరూపమును సమర్పించుటచేతను ఉభయ విధవాక్యములకు ఏవిధమైన అనుప పత్తియు వైరుధ్యమును కన్పట్టదు.

ఈ విషయమునే ఈక్షిత్యధికరణమున భగవత్పాదులు వేదాన్తవాక్యముల యొక్క తత్త్వము ద్వైరూప్యముగా నున్నదని వాక్రుచ్చినారు. "నజాయతే మ్రియతేవా విపశ్చిత్ నాయం భూత్వాభవితా వానభూయః అజోనిత్యశ్శాశ్వతోఽ యం పురాణో నహన్యతే హన్యమానే శరీరే" ఇత్యాదిగా గీతయందు ఆత్మతత్త్వము అనేక విధములుగా వ్యాఖ్యానింప బడినది. పతంజలి మహాభాష్యవచనములకు గాని పాణిని ప్రణీతములైన సూత్రములకు గాని ఇదియే నిష్కృష్టార్థమని పూర్వాపర సూత్రపర్యాలోచనమువలన సంపిండితమైన సారార్థమేక విధముగా ప్రదర్శింపబడినట్లే బ్రహ్మసూత్రములకు వానికి మూలమైన ఉపనిషద్వాక్యములకును తదుపరి భగవద్గీతా శ్లోకములకును ఇదియే తాత్పర్యమని స్పష్ట ప్రతిపత్తి పండిత ప్రకాండులకు సంభవించుచునే యున్నది.

ఇక మొట్టమొదటి సూత్రమైన "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అనుసూత్రమునందే మాయావాదము వ్యాసాచార్యులచే సూచింపబడినది. సాధన చతుష్టయ సంపత్తి తరువాత సాధన చతుష్టయముతో కూడిన వాడగుట వలన బ్రహ్మజ్ఞానము కొరకైన ఇచ్ఛ చేయతగినదని సూత్రార్థము ఫలక ల్వార్థక చతుర్థిచేత బ్రహ్మజ్ఞానమే విచారమునకు ఫలముగా సూత్రకారుని చేతనే చెప్పబడినది. బ్రహ్మజ్ఞానమునకు ఫలము బంధనివర్తకత్వ రూపముగానే చెప్పవలసియున్నది. బంధము సత్యము అన్నచో తన్నివృత్తి అనుపపన్నమగును. కాన బంధా సత్యత్వము అధ్యాస వలననే ఏర్పడును. ఇట్లు మాయావాదమును మొదటి సూత్రము లోనభిహితమైనది.

ఇక శంకరభాష్యమునకు వ్యాఖ్యానమైన రత్న ప్రభలో అధ్యాసభాష్యము సూత్రార్థమును స్పృశింపక పోవుటచే వ్యాఖ్యానింపతగినదికాదు అని ఆశంకించి అర్థికార్థము అయిన బంధనివృత్తికి బంధము సత్యమైనది కాదనుటను నిర్వచించుచున్నది. కాన వ్యాఖ్యానించవచ్చునని నిశ్చయించినారు. ఇక సూత్రకారుడు కంఠోక్తిగా "తద్గుణసారత్వాత్తద్వ్యపదేశః" అను సూత్రమున ఆత్మకు బుధ్ధ్యపాధిధర్మములు అయిన ఇచ్ఛాద్వేషాదులు అధ్యాస నిమిత్తముగా వచ్చినవి నిజమునకు లేవు. అనుట సుస్పష్టమే కదా.

ఇక జగత్తునకు ప్రకృతి త్వాది భావము బ్రహ్మయేనని సిద్ధాంతీకరించుటకు "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాంతోపరోధాత్" అను సూత్రము ఉపాత్తమైనది. ప్రకృతిశ్చ ఉపాదాన కారణము, నిమిత్త కారణమున్ను బ్రహ్మయే, ప్రతిజ్ఞా దృష్టాంతోపరోధాత్ ఏక విజ్ఞానముచే సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ ఒక మృత్పిండము తెలిసినచో తద్వికార జాతము తెలియుననెడి దృష్టాంతము విరోధించును. కాన బ్రహ్మకు నిమిత్తోపాదాన కారణములు రెండును తప్పనిసరిగా ఒప్పవలసి యున్నవని ॥వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం॥ అని అచ్చటి దృష్టాన్త వాక్యమును ఛాందోగ్యమే చెప్పుచున్నది. మాయావాదమునందు సమస్తమైన జగత్తు ఆత్మయందు కల్పితమైనది అధిష్ఠాన సత్తకంటే ఆరోప్యసత్త అధికముగా అంగీకరింపబడలేదు. గాన సర్వజగదధిష్ఠానమైన పరబ్రహ్మము తెలియబడినంతనే సర్వజగత్స్వరూప విజ్ఞానము సంభవించునని దృష్టాంత దార్ష్టాంతికములకు సమన్వయము సంభవించుచున్నది. ఇట్లు ప్రతి ఉపనిషత్తు నందును ప్రతిజ్ఞా దృష్టాంతములు విరోధించును గాన సమన్వయము అద్వైతమందే కుదురును.

ద్వైతులకు విశిష్టాద్వైతులకిచ్చట గౌణార్థమే కాని ముఖ్యార్థము సంభవింపదు గదా. ముఖ్యార్థమంగీకరించిన స్వమతవిరోధము అనుపపత్తియు సంభవించును గదా. "యథోర్ణనా భిస్సృజతే గృహ్ణతేచ" అని అభిన్ననిమిత్తోపాదానమునకు దృష్టాంతము ముండకోపనిషత్తు లోనే ఈయబడి నదిగదా. ఆత్మకు పరిణామ్యుపాదానమును శంకించుకొని "కృత్స్న ప్రసక్తిః నిరవయత్వశబ్దకోపో వా' అను సూత్రమున సూత్రకారుడు ఖండించినాడు. బ్రహ్మజగదాకారముగా పరిణమించినదన్నచో అంతయు మారినదా, లేక ఏకదేశము మారినదా. అంతయు మారిన పరిణామ్యుపాదానమగును. అట్లు చెప్పిన నిష్కలము నిష్క్రియము అనెడి నిరవయత్వశ్రుతివిరోధము కల్గును. దాని తరువాత "ఆత్మని చైవం విచిత్రాశ్చహి'

అను సిద్ధాంత సూత్రమును వచించినారు స్వప్నద్రష్టయైన ఆత్మయందు ఎట్లు మాయావశములైన అనేకా కారములైన సృష్టులు కలుగుచున్నవో అట్లే పరమాత్మయందు స్వరూపోపమర్థము లేకుండా సృష్టులు సంభవించుట ఆశ్చర్యమేమి కాదని వివరించినారు. "మాయా మాత్రం కార్త్స్న్యేనానభివ్యక్తి స్వరూపత్వాత్" అను సూత్రమునందు స్వప్నసృష్టి మాయా మయమని నిరూపించు ఎను బట్టి జగదుపాదానత్వము స్వప్నమందువలె బ్రహ్మమునకు కల్పితమేనని తెలియుచున్నది. ప్రకృతిత్వము పరిణామి అనుట నిషేధింపబడినదిగాన ౦రిశేషన్యాయముచే వివర్తోపాదానత్వమే అంగీకరింప బడినదనుట తెల్లమే కదా. ౦వర్తోపాదానత్వము మాయావాదమంటే కుదురును "అసంభవస్తుసతోఽనుపపత్తేః' అని ఆకాశమున కుత్పత్తి వలెనాత్మకునుత్పత్తిని ఆశంకించుకొని సద్రూపత్వము ంభవింపదు కావుననే ఆత్మోత్పత్తి అనుపపన్నమని నుడివినాడు. ఆత్మాతిరిక్తమైన త్పదార్థమేమీ లేదని తెలియజేసినాడు. ఒకరిచే విరచింపబడిన గ్రంథములోని ాత్పర్యము తత్కృతగ్రంథాంతర పర్యాలోచనముచే నిర్ణయించవలసియుండును వ్యాసుని రచనయైన శ్రీ మద్భాగవతమునందు

**"తస్మాదిదం జగదశేషమసత్యరూపం**
**స్వప్నాభమస్త ధిషణం పురుదుఃఖం దుఃఖం**
**త్వయ్యేవనిత్యసుఖబోధతనావనన్తే**
**మాయాత ఉద్యదపియత్సదివావభాతి"**

జగత్తు అసత్యరూపము కలది. స్వప్న వస్తువు వంటిది. అనంతమైన తనువు నందిది వికల్పితమై సద్రూపమువలె భాసించుచున్నదని నిర్గుణ శ్రుతి క్యమునే ప్రకటించుచున్నది. అథాతో బ్రహ్మ జిజ్ఞాసా అనుసూత్రము రత్న భావ్యాఖ్యానమును బట్టి బృహదారణ్యకములోని, యాజ్ఞవల్క్యమైత్రేయీ వాదములో "శ్రో తవ్య వాక్యార్థమైన" శ్రవణ విధిని గూర్చి ప్రవృత్తమైనట్లు ౦యుచున్నది. దీనికి ముందు నిర్గుణ పరబ్రహ్మము. సర్వవిశేషని ౦పూర్వకముగా నిరూపింపబడినది. దానికి అంగముగా సన్యాసమును విధించుచు ్ౖతాదులను నిందించి ఆత్మ ద్రష్టవ్యము శ్రోతవ్యము మన్తవ్యము ధ్యాసితవ్యమని ఆత్మసాక్షాత్కారరూప ఫలమునుద్దేశించి విధివాక్యము

ప్రపఞ్చమయినందున మాయావాదమే సూత్రకారాభిప్రేతమయినట్లు సుస్పష్టమే. "ఇక జిజ్ఞాసాపద స్వారస్యముచే తద్విజిజ్ఞాసస్వతద్బ్రహ్మేతి" అని తైత్తిరీయ భృగువల్లీస్థవాక్యార్థముతో ఏక వాక్యత్వము అంగీకరించెడి వాచస్పతిమిశ్రుల ఆలోచనా సరణిననుసరించినను నిర్గుణ తత్త్వమే ప్రతిపాదింపబడినదనుట తెల్లము కాగలదు. అదెట్లనగా తైత్తిరీయకములోని ఆనందవల్లి "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" సత్యము బ్రహ్మ, జ్ఞానము - బ్రహ్మ, అనన్తము - బ్రహ్మ అని బ్రహ్మ యొక్క స్వరూప లక్షణమును వాక్రుక్కుచ్చినది. సత్యము- బ్రహ్మ సత్యము వికారము చెందనిది త్రికాలాబాధ్యమైనది. వికారములు అనృతములు, ఎప్పటికినీ వికారము చెందనిది సత్యవస్తువు కాన ఇది బ్రహ్మకు స్వరూపలక్షణము.

జ్ఞానము - బ్రహ్మ - జ్ఞానము అనగా తెలివి లేక సంవిత్తు, మనము ఇంద్రియములచే పదార్థములను గ్రహించుట స్పష్టమే ఇది శబ్దము ఇది స్పర్శము, ఇది స్తంభము అని పరస్పర భిన్నములగు వానిని తెలిసికొనుచున్నాము. ఈ తెలిసికొనునపుడు పదార్థముల ఆకారములు భిన్న భిన్నములుగా నుండుటను బట్టి భిన్నభిన్న జ్ఞానములు ఉదయించుచున్నవని తలచుచున్నాము. నిజమునకు పదార్థములు భిన్నములే కాని, వాటియొక్క జ్ఞానము మాత్రము ఏకాకారమని అనుభవములో ప్రతివానికి తెలియగలదు. జ్ఞాన రూపముగా చూచిన తెలివంతయు ఒక్కటే శబ్ద జ్ఞానము కంటె స్పర్శ జ్ఞానము భిన్నమని, ఉపాధ్యాకారమును బట్టి వచ్చిన భేదమే ఇది. భిన్నమనుకొనుట భ్రాంతి, పదార్థము ఎఱుకయే జ్ఞానము ఇది అఖండము. నిరుపాధికము, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాత్రయసాక్షియును అగుచున్నది. ఇది వేదితయొక్క స్వరూపమని చెప్పవచ్చును.

అనన్తము - బ్రహ్మ దేశ కాల వస్తుగత పరిచ్ఛేద శూన్యము. ఇట్లీమూడును బ్రహ్మ స్వరూపలక్షణములు. బ్రహ్మశబ్దము బృహ - బృహి - వృద్ధౌ అను ధాతువు నుండి ఉత్పన్నము. నిరతిశయమహత్వ సంపన్నము విగళిత వేద్యాంతరము బ్రహ్మము ఇయ్యది అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ ఆనందమయ కోశాతిరిక్తము - కోశములు అనగా ఆవరణములు, ఐదు ఆవరణములచే మరుగునబడి ఆనందము భాసించుట లేదు. అన్నముతో వృద్ధి చెందునది అన్నమయకోశము. దానిలో శ్వాసించేది ప్రాణమయకోశము, దానిలో ఆలోచనలను కలిగించునది మనోమయకోశము, మంచిచెడ్డలను ఆలోచించునది విజ్ఞానమయ కోశము, దీనికి ఆధారభూతమైనది ఆనందమయకోశము. దీనిలోపల విరాజిల్లునది

ఆత్మ లేక బ్రహ్మము లేక ఆనందము అని "రసోవైసః రసగ్గంహ్యేవాయంలబ్ధ్వాఽఽ
ందోభవతి' అను మంత్రమును బట్టి రసస్వరూపముగా పేర్కొనబడినది.

పాదములు లేకయే పరుగెత్తును, చేతులు లేకున్నను గ్రహించును,
త్రములు లేకున్నను చూచును, చెవులు లేకున్ననూ వినును. అతడు వేద్యము
ఉగును అతనిని తెలిసికొనువాడెవడును లేడు. "యతోవాచో నివర్తన్తే అప్రాప్య
ునసా సహ ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చనేతి" అని ఆ
ుహ్మము అవాఙ్మానసగోచరముగా నభివర్ణించినది. మరియు దీనికంటే భిన్నమైనది
ల్పమైన దానినే ఎవడు చూచుచున్నాడో వానికి భయము కలుగును అని
త్తిరీయము వర్ణించినది. అట్టి పరబ్రహ్మమును పూర్వప్రకరణమున సాకల్యముగా
ర్ణించి పూర్వోక్త పర బ్రహ్మజ్ఞానమునుద్దేశించియే, తపోరూపమైన సాధనమును
ధించుటకొఱకై భృగూపాఖ్యానము చెప్పబడినది. అందువలననే "తద్వి
జ్ఞాసస్వ" లోని తచ్ఛబ్దము పూర్వోక్త పరబ్రహ్మజ్ఞాన పరామర్శను చేయుచున్నది
ని చెప్పవలసియున్నది. కాన ప్రథమ సూత్రమునందు పై ప్రకరణమును
నుసరించి చూచినను నిర్గుణత్వమభివర్ణింప బడలేదనుట అనుపన్నమే
ుగుచున్నది.

కూటము అనగా - మాయ. మాయ యందున్నవాడు మాయను
శపరచుకొనినవాడు ఈశ్వరుడు కూటస్థుడు అని చెప్పబడును. ఇక ఆ
ూటస్థుని లక్షణమే జన్మాద్యస్యయతః అను సూత్రమున చెప్పబడినది. కాన
ర్గుణ పరబ్రహ్మమునకిది లక్షణము కాదు. శాఖాచంద్రన్యాయమున పరబ్రహ్మ
ును సూచించుటకై సృష్టిస్థితిలయకారణముగా సూత్రింపబడినది గాన దోషము
దు. ఇక ఉభయ లింగాధికరణమున స్థానతోఽ పిన పరస్త్రోభయలింగం
ర్వత్రహి "సర్వకర్మడు సర్వ కాముడు, సర్వగంధుడు, సర్వరసుడు
స్థూలమనణ్వహ్రస్వమ దీర్ఘం ఇత్యాదిగా సగుణ నిర్గుణ లింగములు
సాత్తములైనను స్థానత్వ ఉపాధిని బట్టి సగుణలింగము చెప్పతగదు అని
షేధించి "అరూపవదేవహి తత్ప్రధా నత్వాత్" అని సగుణ నిషేధ పూర్వకముగా
ర్గుణ లింగత్వమే చెప్పవలెను, శ్రుతులన్ని యూతత్ప్రధానములుగా నుండుటవలన
ని నిశ్చయింప బడినది. ప్రకృతైయత్తాధి కరణమున "ప్రకృతేయత్తావత్వం హి
తి తతోబ్రవీతి చ భూయః" అను సూత్రమున ప్రకృతము ఏది

ఇయాత్తారూపావచ్ఛిన్నమై యున్నదో దానిని నిషేధించి అన్యత్ర పరమప్రతిషిద్ధం బ్రహ్మాస్తి" అని వాఙ్మనసాతీతము అవిషయాన్తః పాతి ప్రత్యగాత్మభూతము నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావమైన పరబ్రహ్మమునే సమర్థించినాడు సూత్రకారుడు.

బ్రాహ్మాధికరణమున "బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః" చితితన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమిః అను సూత్రములందు బ్రహ్మాత్మకత్వావాప్తి పొందిన జీవుడు బ్రహ్మముతో అనగా సత్య సంకల్పత్వాదిరూపవాస్త వికభావాపత్తితో నుండును. బోధ స్వరూపుడై ఉండును. లేక చైతన్య మాత్రభావాపత్తితో నుండునని రెండు పక్షములను పై సూత్రములో నభివర్ణించి మతద్వయ విలక్షణముగా "ఏవమప్యుపన్యాసాత్ పూర్వభావార్థవిరోధమాహ బాదరాయణః" అను సూత్రములో ముక్తుడు వ్యవహారిక దృష్టితో ఆరోపితగుణములు కలిగియు గుణరహితమైన చైతన్యమాత్ర భావాపత్తితోను ఉభయవిధముల నుండవచ్చునను సిద్ధాంతము ప్రతిపాదించినాడు.

**అస్యాపిదేవ వపుషోమదనుగ్రహస్య**
**స్వేచ్ఛామయస్యనతు భూతమయస్యకోఽపి**
**నేశే మహిత్వ వసితుం మనసాంతరేణ**
**సాక్షా త్తవైవ కి ముతాత్మసుఖానుభూతేః**

అను శ్రీ మద్భాగవత శ్లోకమున మాయా కల్పితమైన సగుణ స్వరూపముకంటె అతిరిక్తముగా సుఖానుభవ స్వరూపతత్వమున్నట్లు స్పష్టముగా నభిహితమైనది. ఇట్లు శ్రుతి స్మృతి పురాణ ఇతిహాస ప్రమాణములచే శ్రుత్యర్థతాత్పర్య నిర్ణయము దేశ కాలవస్తు గత భేదశూన్యమైన నిర్గుణతత్త్వమందు చేయబడినది కాన బ్రహ్మసూత్రముల తాత్పర్యము ఒక వస్తువు నందే కలదు అని తెలియుచున్నది.

మహావాక్యచతుష్టయము సమన్వయము - జీవేశ్వరుల తత్వములన్నియూ పూర్వ ప్రకరణములందు తెలుపబడినవి. ఇందు మహావాక్య చతుష్టయ సమన్వయము తెలుప బడుచున్నది. జీవో బ్రహ్మైవనాపరః ఈ జీవుడు బ్రహ్మకంటే భిన్నుడుకాడు అను గంభీరార్థమును ప్రకటించు వాక్యములైనందున వీనికి మహావాక్యములు అను వ్యవహారము కల్గినది. ముముక్షువులకు మోక్షసాధనము బ్రహ్మాత్మైక్యజ్ఞానానుభవమే కాబట్టి బ్రహ్మాత్మైక్యజ్ఞానమును

బోధించు వాక్యములగుటను బట్టి నాలుగు వేదములనుండి నాలుగు వాక్యములను తత్త్వవిదులు మహావాక్యములుగా నిర్ణయించినారు.

1. ప్రజ్ఞానం బ్రహ్మ: "ఋగ్వేదాన్తర్గతమగు ఐతరేయోపనిషత్తు లోనిదీవాక్యము . ప్రజ్ఞానము బ్రహ్మస్వరూపము అని అర్థము ఏ చైతన్యముచేత చూడదగిన రూపాదులను జూచుచున్నాడో వినదగిన వాటిని వినుచున్నాడో గంధాదులను దేనిచేత గ్రహించుచున్నాడో ఆ చైతన్యమే ప్రజ్ఞానమని చెప్పబడు చున్నది. బ్రహ్మేంద్రాది దేవతలయందు, మనుష్యాశ్వగవాదుల యందు, సర్వభూతములందు నేను నేను, అనెడి ఏ చైతన్యము దేహేంద్రియాద్యన్త ర్గతమై ప్రకాశించుచున్నదో అట్టి జీవచైతన్యము సర్వజ్ఞమైన ఈశ్వరచైతన్యము చైతన్య రూపముగా జ్ఞత్వరూపముగా నొక్కటియని ఈ వాక్యము నిరూపించుచున్నది.

అహం బ్రహ్మోస్మి - అను వాక్యము యజుశ్శాఖాంతర్గతమగు బృహదారణ్యకోపనిషత్తులోనిది. నేను బ్రహ్మను అగుచున్నాను. సకలదేశము లందును సకల కాలములందును సమస్తవస్తువులయందును నిండియుండి మాయచే కల్పితమైన ప్రపంచమునందలి శరీరముల కెల్ల సాక్షియై ఒప్పుచు నేను అని వ్యవహరింప బడుచున్న జీవునికిని నిరస్త సమస్త విశేషమగు బ్రహ్మకును "అస్మి" అను భావముచే ఐక్యము చెప్పబడుచున్నది.

తత్త్వమసి - అను వాక్యము సామవేదాన్తర్గత ఛాందోగ్యోపనిషత్తులోనిది. తత్ - ఆ నిరుపాధికమైన పరబ్రహ్మము త్వం - నీవుగా, అసి - అగుచున్నావు. తత్పదముచే వ్యక్తావ్యక్తములందు ప్రతీతమైనట్టి సర్వజ్ఞేక్షితమైనట్టిది గ్రహింపవలెను. దేహేంద్రియాద్యతీతమై శరీరత్రయ సాక్షిగా అవస్థాత్రయమందు ప్రాజ్ఞతైజస విశ్వులుగా ఎవడు వ్యవహరింపబడినాడో అట్టి కించిజ్ఞుడగు జీవుడు త్వం పదముచే చెప్పబడుచున్నాడు. తత్ త్వం పదాలకు సర్వ జ్ఞత్వ కించిజ్ఞత్వాద్యర్థములు ముఖ్యార్థములుగా కుదరవుగాన లక్షణచే పై అర్థములు చెప్పవలసివచ్చినది. ఇట్లు తత్ త్వం పదములలో గల సర్వజ్ఞ కించిజ్ఞ రూపములలో విరుద్ధాంశములను పరిహరించి అవిరుద్ధాంశమైన జ్ఞత్వమొక్కటే అని ॥అసి॥ అనుపదముచే ఐక్యము సాధింపబడుచున్నది. కాననిది మహావాక్యము. దీనిని భాగత్యాగలక్షణగా తద్విదులు పేర్కొందురు దీనినే జహదజహల్లక్షణయనియు పేర్కొందురు. పుత్రపౌత్రోపాధి ద్వయ పరి త్యాగముచే పితృపితామహభావము తీసివేసినచో దేవదత్తుడొక్కడే

ఎట్లు భాసించుచున్నాడో అట్లే ఉపాధుల పరిత్యాగమున ఒక పరబ్రహ్మయే నిరుపాధికముగాగోచరించునని దీని యర్థము.

అయమాత్మా బ్రహ్మ - అనునది అథర్వవేదాన్తర్గతమైనది. స్వయం ప్రకాశ స్వరూపము గల్గిన అయం - ఈ పురోవస్థితుడనైన ఆత్మా - నేను, బ్రహ్మ - బ్రహ్మస్వరూపమును, అని అర్థము. ఇట్లు వేదవాక్యమునందును జీవబ్రహ్మైక్యము బోధింపబడినది కాన ఇదియు మహావాక్యమైనది.

ఇట్లు జగత్తుకు కారణ కారణుడు కారణాభాసమగుటచే నిష్కారణుడు అయిన ఈశ్వరుని ద్వారా పరబ్రహ్మను అనుభవ పూర్వకముగా తెలిసికొని కృతకృత్యుడనైన నేను ధన్యుడను. అని హాఉ ఉ హా ఉ హా ఉ అని గానము చేయుచు జీవన్ముక్తుడై బాలోన్మత్త పిశాచమువలె తిరుగుచు ఆనందమే అయిపోవును. ఇదియే అద్వైతానందము. ఇట్టివానికి ఐహికాముష్మిక దుఃఖములు ఉండవు. స్థూలసూక్ష్మ కారణ శరీరములతో ఐక్య భ్రాంతి ఉండదు. పంచకోశములలోనున్న ఆత్మ బ్రహ్మమే అగుచున్నాడు. ఇది అద్వైత సిద్ధాంతము.

# 10వ అధ్యాయము

# కావ్య సమన్వయము

పూర్వప్రకరణమున అద్వైత వేదాన్తము నిరూపించబడినది. ఈ అధ్యాయమున శ్రీ శాస్త్రిగారు రచించిన దత్త భాగవతమునందు తత్సమన్వయము సోదాహరణముగా తెలియజేయబడుచున్నది., 1. మునులధ్యానయోగము 2 దత్తాత్రేయాష్టోత్తర శతనామావళి 3 ప్రహ్లాదాజగర సంవాదము. 4 అవధూతయదు సంవాదము 5 పితాపుత్ర సంభాషణము 6 అలర్క చరిత్రము 7 సప్తోదాహరణములు 8 విష్ణుదత్త చరితము 9 విప్రకుమార విభోధము 10 కార్తవీర్యార్జున చరితము 11 హంసగీత 12 మదాలసబోధము మున్నగునవి వేదాన్తార్థ సాపేక్షములై యున్నవి. ఈ దత్త భాగవతమునందలి మొదటి పద్యము. దీనికి మూలగ్రంథమైన దత్తమాహాత్మ్యములోని మొదటి శ్లోకము అద్వైత తాత్పర్యముతో ముడిబడి యున్నది. శ్రీ మద్భాగవతమువలె బ్రహ్మతటస్థలక్షణ ప్రతిపాదనపరమైన అర్థము గలిగిన శ్లోకముతో ప్రారంభమైనది.



నరసింహా స్వామి

**శ్లో॥ జన్మాద్యస్యయతోన్వయాదితరతశ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్**
**తేనే, బ్రహ్మ, య ఆదికవయే, ముహ్యంతి యత్సూరయః**
**తేజో వారిమృదాం యథా వినిమయో యత్ర త్రిసర్గో మృషా**
**ధామ్నాస్వేన సదా నిరస్తకుహకం సత్యం పరంధీమహి**

దత్తమాహాత్మ్యములోని మొదటి శ్లోకము బ్రహ్మస్వరూప లక్షణ ప్రతిపాదన పరమైయున్నది. అట్టి శ్లోకమునకు అనువాదము అన్యూనా తిరక్తముగా శ్రీ శాస్త్రిగారిచే చేయబడినది. బ్రహ్మస్వరూప లక్షణమును తైత్తిరీయ ఆనందవల్లి "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అని అభివర్ణించినది. సత్యము, జ్ఞానము, అనంతము, బ్రహ్మము అని స్వరూపలక్షణము ఇట్టి బ్రహ్మలక్షణముచే ప్రారంభింపబడుట వలన దీనికి శ్రీమద్భాగవతముతో పోలిక కలదు. ఇట్టి బ్రహ్మమును బుద్ధి గుహయందు కనుగొనవలెను. కనుగొనిన వాడు ఆప్తకాముడై బ్రహ్మయే అగును. బుద్ధి గుహయందు కనుగొను విధమును శ్రుతి ఇట్లు వివరించినది. ఆకాశమునకు అల్పత్వ బహుత్వములు వస్త్వంతరకృతములై ప్రకాశించునట్లు బ్రహ్మకు కూడా వస్త్వంతర కృతములే. బహుభవనములు కాని వాస్తవమునకు బ్రహ్మ ఏకమైనదియే యని నిరూపించుచు ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి అప్పు, అప్పునుండి పృధివి, అని భూతోత్పత్తి ప్రారంభించినది. పిదప అన్నమయాద్యంత కార్యజాతము పుట్టినట్లు త్రిపురము లైన స్థూల, సూక్ష్మ కారణ శరీరములందు అను ప్రవేశము చేసి తదన్తః పాతిగా ప్రతీతమైనట్లుగా తెలియదగినదని, నిరూపించినిది ఈ త్రివిధమైన శరీర సృష్టి బ్రహ్మను తెలిసికొనుటకై వర్ణింపబడినదే గాని ఇది సత్యముగాదు. కల్పిత మైనదే అను నర్థమును ఈ క్రింది దత్త భాగవతారంభ పద్యము తెలియ జేయుచున్నది.

**చం॥ సకలమునైజభానమున సంతతమై వెలుగొందగా పుర**
**త్రికములు శాశ్వతమ్ములొనరించి, తలంచి యను ప్రవేశ సం**
**ప్రకటిత జీవభావ శివభావములంగనిపించి మోక్షల**
**క్ష్మికి భజనీయుడైన విభువ్యగేవలు నయువాని నెంచెదన్**

ఇందు సకలము "నైజభానమున, అనుటవలన" స్వప్రకాశమైన జ్ఞానము బ్రహ్మము అను అర్థము చెప్పబడినది, "సంతతమై వెలుగొందగా అనుటచే

త్రికాలాబాధ్యమైన సత్యత్వమనువర్ణితమైనది. అవ్యయు అను పదము అనన్తపదార్థైక్యము కలిగియున్నది. ఇట్లు సత్యజ్ఞానానన్తలక్షములు ప్రత్యేక ప్రత్యేకముగా విశేషగతితో బ్రహ్మయందు అన్వయించుచున్నవి. త్రిపురములు స్థూల, సూక్ష్మ, కారణశరీరములు ఇట్టి కార్యములందు అను ప్రవేశ సంప్రకటిత జీవ భావ శివభావములంగనిపించి అనువాక్యముచే అను ప్రవేశము కలిగిన వానివలె కనిపించినాడు కాని ఈ అను ప్రవేశము కల్పితమేయను సిద్ధాంతము వ్యక్తమైనది. మోక్షలక్ష్మికి భజనీయుడైన అను విశేషణము ఆత్మబుద్ధి ప్రకాశకమైన, బ్రహ్మతత్త్వము ముముక్షు జన శరణ్యము అను శ్రుత్యర్థ సంపత్తిని ప్రతిపాదించు చున్నది. "కేవలు" అను పదము "ఏకమే నా ద్వితీయ" మను శ్రుత్యర్థ తాత్పర్యము కలిగియున్నది. మోక్షమే పరమ పురుషార్థము. నిత్యము అదియే అందరికినీ కోర తగినది అనియు ఈ పద్య తాత్పర్యము. దీని మూలశ్లోక మిట్లు కలదు.

**శ్లో॥ యద్భాసానిఖిలంవిభాతి సతతం యోవ్యక్త జీవేశ్వరో**
**యస్సృష్ట్వేదమను ప్రవిశ్య బుషిణాచక్రేపురశ్శాశ్వతీః**
**యం నిత్యం సుర సిద్ధ సాధక గణా ధ్యాయంత్యమీముక్తయే**
**వందే నందిత విశ్వ మవ్యయమజంభక్త్యా తమేకం విభుం.**

దత్తమాహాత్మ్యము

ఇట్టి పరబ్రహ్మమే జగద్రూపకార్యమునకు కారణకారణముగాను నిష్కారణము గాను కన్పట్టుచున్నది. కారణములు అనగా మహదహంకార పంచతన్మాత్రలు వాటికి కారణమై యుండుటవలన కారణ కారణమగుచున్నది. నిజమునకు ఈ జగత్తునకు మూలములగు మాయా అది విద్యలలో ప్రతిబింబించి నానా విధేశ్వర జీవ భావముగా వెలుగొందినవాడు ఈశ్వరుడే అగుటవలన ఆ ఈశ్వరుతత్త్వమే కారణా తీతమై నిష్కారణపదవాచ్యమైనది గానూ ప్రకాశించుచున్నది. ఇట్టి తాత్వికార్థమును, వ్యావహారిక సత్యత్వమును బట్టి కారణకారణమును సమర్థనీయములై ఈ క్రింది పద్యమున సుస్పష్టములగుచున్నవి.

**కం॥ కారణకారణునకు ని ష్కారణునకు విక్రమప్రహర్షునకున్ శా**
**ర్ఙ్గారిగదాస్యాద్యాయుధ ధారికి బురుషోత్తమునకు దండనతులజా**

దత్తభాగవతము ప్రథమగుచ్ఛము - పద్యసంఖ్య 44

ఈ పద్యము మునులధ్యానయోగములోనిది. దత్తదేవుడు సాక్షాత్కరింపగా మునులు చేసిన స్తుతిలో ప్రస్తావింపబడినది. కారణ కారణుడైనచో నిష్కారణుడనుట ఎట్లు? నిష్కారణుడైనచో కారణ కారణ మగుట ఎట్లు? అని విరోధము, ఆలోచించిన కారణ కారణముగా కన్పట్టుటయే గాని సిద్ధాంతమున కారణమే కానేరడు. కారణ కారణ మెట్లగును. రజ్జువునందు భ్రాంతి కల్పితమైన సర్పము, భయాదులకు కారణమైనట్లు కల్పితకారణత్వమే బ్రహ్మకు చెప్పదగియున్నది. సిద్ధాంతమున అధిష్ఠాన సత్తకంటె ఆరోప్యసత్త అధికముగా అంగీకరింపబడలేదు. కావుననే ఈ జగత్తునకు బ్రహ్మము వివర్తకారణముగా నొప్పును. వివర్తమనగా అవస్థాంతర భానమాత్రము అని పూర్వవ్యాసముననే నిరూపితము. ఇకవిక్రమ ప్రహర్షనకన్ శార్ఙ్గారి గదాస్త్యాద్యాయుధధారికి బురుషోత్తమునకు దండనతులజా అనునది సగుణ స్వరూపాభివ్యక్తి పరమైతనరారినది. దారువును మథించినచో ఇదివరకే సూక్ష్మముగా అందు ఇమిడియున్న అగ్ని ప్రజ్వలితమగును. అట్లే శారీరారణిలో కల నిగూఢమైన చిదగ్ని శాస్త్ర విచారపరంపరలచే ప్రజ్వలితమగును. 'జీవో బ్రహ్మైవనాపరః" "ఈ జీవుడు బ్రహ్మయే, బ్రహ్మకంటే వేఱుకాడు" అను అనుభూతితో కూడిన తత్త్వము ఈక్రింది పద్యమున ఉపదిష్టమైనది.

**కం॥ శారీరారణి నిమిడివి చారంబున నొచిదగ్ని సరణికి సత్య**
**ప్రారబ్ధోద్భవముఖలీ లారసునకు నీకు నతులలక్ష్య పరేశా**

దత్తభాగవతము - ప్రథమగుచ్ఛము - పద్యసంఖ్య 45

జీవబ్రహ్మైక తత్త్వము ఈ పద్యమునందలి రూపకాలం కారమభివ్యక్తీ కరించుచున్నది. జగదుత్పత్తి స్థితిలయములు ఆయీశ్వరుని లీలాకైవల్యములే అనుటను "విశ్వప్రారబ్ధరసునకు అను విశేషణము వ్యక్తము చేయుచున్నది. "లోకవత్తులీలాకైవల్యం" అనునది బ్రహ్మసూత్రము, లోకములో రాజాదులు ఏ ప్రయోజనమును అపేక్షింపకయే అప్రయత్నముగానే ఒక్కొక్కప్పుడు విహారాదులను చేయుచుందురు. లేదా ప్రతిప్రాణియు అప్రయత్నముగనే అనగా ఏ ప్రయోజన మపేక్షింపకయే ఉచ్ఛ్వాస నిశ్వాసములు చేయుచుండును. అట్లే పరమాత్మకు జగదుత్పత్తి స్థితిలయములు యత్నము లేకుండగనే లీలామాత్రములుగానే జరుగుచుండును. అను బ్రహ్మసూత్రార్థము ఈ పద్యమున ఇమిడియున్నది. ఇట్లే ఈ క్రింది పద్యము అద్వైత బోధకము.

గీ॥ కనులు వీనులు లేకుండగాంచు వినును గాలు సేతులు లేకుండగాజనుగొను
నని శ్రుతులు సెప్పు నెవ్వని నగ్ర్యుమహితు నట్టి పురుషోత్తమునకు మాయానతులివె

దత్తభాగవతము - ప్రథమ గుచ్ఛము - పద్యసంఖ్య 47

ఇందు బ్రహ్మ కన్నులు చెవులు లేకపోయిననూ చూచును, వినును. కాళ్ళు చేతులు లేకున్నను నడచును, స్వీకరించును అనునర్థముగల "అపాణిపాదోజవనో గ్రహీతాపశ్యత్యచక్షుః సశృణోత్యకర్ణః సవేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తాతమాహురగ్ర్యం పురుషం పురాణం" అను శ్వేతాశ్వతరోపనిషత్తు 19వ ఋక్కు యొక్క అర్థము సంగృహీతమైనది. ఇదియూ మునిస్తుతిలోనిదే.

గీ॥ యోగులయి వాయుమానస వేగ మాగి యమలమేకంబు చైతన్యమనుభవించు
నట్టివారెల్ల శమలంబునపుడవిడచి బ్రహ్మభూతులై యుందురెప్పటికి చెడక

దత్తభాగవతము - ప్రథమగుచ్ఛము - 55వ పద్యము

మునులు దత్తదేవుని స్తుతించు సందర్భమున ఈ పద్యము చెప్పబడినది. బ్రహ్మవిదులు బ్రహ్మ భూతులగుదురు. ప్రాణజయము, మనోజయము చేసిన యోగులు నిష్కల్మషులై నిర్వికల్ప సమాధి స్థితిలో చైతన్య రసమాత్రము ననుభవించెదరు. వారెప్పటికి చెడక అట్లేయుందురని దీని తాత్పర్యము. ఇక సూతుడు మునులకు దత్తమాహాత్మ్యమును చెప్పుటకు ముందుగా దత్తదేవధ్యాన నిమగ్నుడై యుండెను. ధ్యానమున సాక్షాత్కరించిన దత్తవిభుని ఈ క్రింది విధముగా స్తుతించెను.

ఉ॥ కావున నాది దేవుని నఖండు జిదాత్మునశేషరూపుస
ద్భావుననూనుద్వైతరహిత ప్రకృతిన్ స్వసుఖానుభూతి సం
భావితుప్రత్యగాత్మపరమప్రభు నిత్యము సంశ్రయించి నీ
పావన నామరూపగతివర్ణన నిట్లు కృతార్థుడయ్యెదన్

దత్తభాగవతము - ప్రథమగుచ్ఛము - పద్యంఖ్య 117

ఇందు అఖండు చిదాత్మ, సద్భావు, ద్వైతరహితప్రకృతిన్ స్వసుఖానుభూతి సంభావితు, ప్రత్యగాత్మ అనునిట్టి విశేషణములన్నియు అఖండైకతత్వ ప్రతిపాదకములై 'ఏకం సద్విప్రాబహుధావదన్తి" అను శ్రుత్యర్థ సంగ్రాహకములై యున్నవి.

గురుశిష్యసంవాదమున "తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణి శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం "నైషాతర్కేణ మతిరాపనేయా" ఆచార్యవాన్ పురుషోవేద తంత్వౌపనిసదం పురుషం పృచ్ఛామి త్యాదులలో ఆత్మతత్త్వము తెలియగోరువారికి శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడైన గురువునే ఆశ్రయించి ఉపనిషద్వాక్యసంశ్రవణము చేసి తరింపవలసినదే కాని, తర్కాదులతో గూడిన బుద్ధితో గురువులేకుండ సాధనము చేయతగదని ఉపదేశము కనిపించును. హితము చెప్పెడి తండ్రి మొదలగువారు గురువులు. అంతకంటె ఉపనేతలు శ్రౌతోపాసనాదీక్షలనిచ్చెడి గురువులు గొప్పవారు. బ్రహ్మానంద ప్రాప్తికి ఆత్మతత్త్వ బోధమును చేసి తాము తరించి ఇతరులను తరింపజేయుగురువులు ఉత్తములు, ఇచ్చట ఆచరణ శూన్యులై శుష్కవేదాన్తబోధలొనరించువారి నాశ్రయించుట యుక్తముకాదని "బ్రహ్మనిష్ఠమను" విశేషణము సూచించుచున్నవి. "జ్ఞానీత్వాత్మైవమే మతం" అని భగవద్గీత దత్తాష్టోత్తర శతనామావళిలోని ఆత్మ, జ్ఞాని అను నామములు అద్వైతవేదాంతార్థ తాత్పర్యము కలిగియున్నవి. ప్రహ్లాదాజగర సంవాదము లోని ఈ క్రింది పద్యము. సమాధి యోగముతో కూడిన అద్వైతతత్త్వాను భూతికి మకుటాయమానమై నట్టిది.

**ఉ॥ చిత్తివిభేదమాహుతిగ జేసిమనమ్మున సార్థమందున**
**చ్చిత్తినిశ్రేల్చియమ్మనము జేర్చివికారకకారణంబునం**
**దత్తతినయ్యహంకృతి మహత్తునదానిని మాయదార్చి**
**యాయత్తము మాయజేయవలె స్వానుభవాత్ముని యందు సమ్మనుల్**

దత్తభాగవతము - 2వ గుచ్ఛము - పద్యసంఖ్య 69

విభేదము అనగా వికల్పభేదము అనగా మనస్సు సంకల్ప వికల్పాల పుట్ట కావున దాని వ్యాపార మెప్పుడు విషయతాదాత్మ్యము కలిగియుండునుగావున విషయములే వికల్ప భేదములు అగుచున్నవి, అట్టి వికల్ప భేదములను విషయ విభేదగ్రాహక చిత్తవృత్తి యందులయింపజేయవలెను. అట్టి చిత్తవృత్తులను విషయనిష్ఠమైన మనస్సునందు హోమము చేయవలెను.

**శ్లో॥ వికల్పం జుహుయాచ్చిత్తౌ తాం మనస్యర్థ విభ్రమే ।**
**మనోవైకారికేహుత్వా తం మాయాయాం జుహోత్యను ॥**

**శ్లో॥ ఆత్మానుభూతౌ తాం మాయాం జుహుయాత్సర్వదృఙ్మునిః**
**తతోనిరీహోవిరమేత్స్వానుభూత్యాత్మ నిస్థితః ॥**

చిత్తము సమస్త సంస్కారములకు ఆధారము అనాత్మపదార్థములు ఆత్మ పదార్థములుగా ఎచట నిలువ ఉండునో అదియే చిత్తము లేక మనస్సు. ఇట్టి మనస్సును, నాది నేనిట్టివాడను, అట్టివాడను అనునట్టి అహంకారమునందు వ్రేల్చవలెను. ఈ అహంకారమే సమస్త వికారములకు కారణభూతమైనది. అట్టి అహంకారమును, నేను నేను అనుజ్ఞాతృత్వస్ఫురణము ప్రథమ సమున్మేషమై నమహత్తు నందు హోమము చేయవలెను. నేను నేను అనెడి మహత్తును మాయయందు లయింపచేయవలెను. ఏదికాదో అది మాయమూలాజ్ఞానము. దీనిని నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వభావమైన చైతన్యమునందు హోమము చేసిన బ్రహ్మాత్మైకత్వము సిద్ధించును. ఇట్లు సమాధి యోగమున సన్మునులు స్వానుభవస్థితితో నుండదగినదని ప్రహ్లాదునికి అవధూతయై అజగరవృత్తితో నున్న దత్తదేవుడు ఉపదేశించెను. యోగమూలకాద్వైత స్థితి ఇందు ప్రతిపాదితము. అవధూతయదు సంవాదమున నద్వైత తత్త్వసారము ఉపవర్ణితము.

**గీ॥ మరియు నర్కునితో గొన్నమతియుయిదియు నతడొకడు నైకవిధతనూపాధివశత**
**దోచునట్లాత్మయేకమై స్థూలమతికి వ్యక్తిభేదచిదాభాసబహుళతనని**

దత్తభాగవతము - 2వ గుచ్ఛము - 110వ పద్యము

ఈ పద్యమున సూర్యుడు ఉపాధి వశమున భిన్నుడుగా జల తరంగాదు లందుతోచును. నిజముగా చూచిన సూర్యుడొక్కడే, అట్లే, వ్యక్తిభేదములైన ఆవరణము లందు చిదాభాసబహుళతయగాని ఆత్మ ఒక్కటియే అన్నభావనను పారమహంస్యమున నున్న దత్తదేవుడు యదువునకుపదేశించెను.

**అమరుబ్రహ్మాత్మభావసమన్వయమున తన్నుయోగిచరాచరాంతర్నిహితమయి**
**వితతమయి సంగరహితమై విడుపులేని నభముగతినెన్నుకొనవలెననుచు వ్యాప్తి**

దత్తభాగవతము - 2వ గుచ్ఛము - పద్యసంఖ్య 103

ఈ పద్యమున నభమువలె సర్వగతము చరా చరాంతర్నిహితమయిన ఆత్మనుగా యోగి తన్నెఱుంగవలెను. నిస్సంగుడై ఉండవలెనని బోధము కలదు. అవధూత యదు సంవాదమంతయూ ఆత్మజ్ఞాన ప్రబోధమే. అవధూత 24 గురుగురువులవలన తానే మేమి ఉపదిష్టుడయ్యెనో తెలిపిన సందర్భము వేదన్తార్థ సర్వస్వమనదగును. ప్రహ్లాదాజగర సంవాదము కూడా అట్టిదియే ఈ రెండునూ

శ్రీమద్భాగవతము లోనివే ఇక దీపక వేదధర్మసంవాదమున సాంఖ్యమును ఖండించి అద్వైతస్థాపన మొనర్చిన ఈ క్రింది పద్యము.

సీ॥ స్వప్రకాశమొకండువస్తువుండకయహంకా రాదిజడతత్త్వక ప్రకాశ
మొనరదుపొమ్మని యనుపపత్తినిగొని బుద్ధ్యాది కరణముల్పు రుషుడెడగ
పనిచేయజాలవు వాస్యాదులంబోలెనని యనుమానంబు ననుసరించి
యౌపనిషదమైన ఆత్మతత్త్వము నిందు వెదకుదు రాత్తవివేక యుక్తి

దత్తభాగవతము - 2వ గుచ్ఛము పద్యసంఖ్య 91

అహంకారాది జడతత్త్వప్రకాశముస్వప్రకాశమైన వస్తువులేనిదే ంభవింపదనెడి ఉపపత్తి చే ఈశ్వరాస్తిత్వము సమర్థించుచున్నది.

॥ భౌమములు పరమాణువుల్పహ్నియునెటు లొక్కదారువునందుండె నక్కరణిని
బ్రహ్మమున శేషజగముచిద్భావభావి తాత్మవగునిన్నెనసియనన్యతవెలుంగు

దత్తభాగవతము - 3వ గుచ్ఛము - పద్యసంఖ్య 243

॥ సకలమునునిష్కలమును నౌజగముదేవి వ్యాప్తమైనదినీచేతనఖిలమిట్లు
ఏదిద్వైత వ్యవస్థితంబేది బ్రహ్మ భావనావస్థితమవు నద్వైతమదియు

దత్తభాగవతము - తృతీయగుచ్ఛము - పద్యసంఖ్య 254

ఈ పద్యము అశ్వతరుడు సరస్వతీదేవిని గూర్చి చేసిన స్తోత్రములోనిది. ంహ్మమున ఈ అశేషజగము మరిగిపోవును. దంతినిదారువికారేదారుతిరోభవతి పితత్రైవ 'జగతి తథా పరమాత్మా పరమాత్మన్యపి జగత్తిరోధత్తే"

మదాలస బిడ్డలకు జోలపాటలతోనే ఆత్మతత్త్వమునుపదేశించినది.

॥ రే క్రీడాన క నామరూపములు లేనేతేని శుద్ధున్నినున్
విక్రాంతుండనిపిల్తు రింకన్నృప సంవిత్కల్పితాఖ్యాస్పతిన్

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - 6వ పద్యము

ఏద్వకు మేద్వకు మిదివినుమోవెట్టి యెద్దానికీ విట్టులేడ్చుచుంటి
వట్టిమేనికి నసలు పొంతువలేదు పంచాత్మకం బిది పరుడవీవు
విశ్వజన్మస్థితి విలయాధికరణము, యకటనీయేడ్పు మిథ్యయతలంప ప్రాణాహతాకా
శభవశబ్దము వివిధమయ్యెనుహీ సమూహమును బొంది

వివిధ తద్గుణార్థవికల్ప్య మానమై యింద్రియవిషయమ్ము లిన్నిగొనము
లరయభూతమయముల యిస్వస్వధర్మస్థితమ్ముల యిస్ఫురించు తథ్యములటు

కం॥ భూతములు దుర్బలమ్ములు భూతములంగలసి వృద్ధిబొందునుగనమే
యీతనువగ్నిజలాదుల స్ఫీతమగుటలేదుహాని వృద్ధియునీకున్

సీ॥ ఐనదుఃఖముదోచుటదియెట్టనెదవాలింగదేహము స్థూలమంగమందు
కలదుదానంజొచ్చికంచుకంబునబోలెనధ్యాస మూఢత్వమవధరించి
తధ్యాసయనగ నన్యగుణంబులన్య మందారోపణమ సేయుటదియేభ్రాంతి
కామవైరేచ్ఛాదికములింగగతముస్థూలాంగస్థవామనోత్తుంగ తాదు
లన్నియును స్వాత్మగుణములంచాత్మ నిత్యసత్య తాదుల తద్వ్యయా సంజితములు
చేసిపేనినసంచితోజిక్కువడితి పొత్తి నూలికాయ పురువు బోలితౌర

దత్తభాగవతము - 4వగుచ్ఛము - 7,8,9, పద్యములు

పై పద్యములలో ఈ జగత్తు నామరూపాత్మకము, ఈదేహేంద్రియ జాతముకంటె నీవు పరుడవు ఈ భూతములన్నియూ, అసత్యములే. సత్యములట్లు తోచుచుండును. ఆత్మకు హానివృద్ధులు లేవు భూతములకే హానివృద్ధులు. ఈ దేహమునకు మూలము అధ్యాస, అది కాని దానియందు అదియనుబుద్ధి కలిగియుండుటయే అధ్యాస అనుబోధము కలదు.

ఉ॥ శుద్ధుడవక్రియుండువటుచూడు శరీరయుగా భిమానితన్
బద్ధుడనన్ శుభంబులశుభంబులు నౌపరకర్మముల్ స్వసం
బద్ధములాచరించుకొని బాపురెపుట్టుచు చచ్చుచుంటివీ
పద్ధతిదేహదుఃఖములె పైబడినీవిగదోచిత్రోచెడిన్

స్థూలసూక్ష్మ శరీరయుగాభిమానముతో బద్ధుడవైతివి. ఈ దేహాభిమానముతోనే శుభాశుభ ములాచరించుకొని చచ్చుచుపుట్టుచుంటివి. ఈ దేహదుఃఖము లేనివిగా అనుకొని బద్ధుడవైతివి.

సీ॥ వెకి వెక్కియేడ్చెదవకట నీవెవ్వరివాడవెచ్చోనుండి వచ్చినాడ
వెచ్చటికేగెదోయెఱుగవు కద యింతకాత్మాభిమానమే యంకురించె

తల్లియంచొక్కింతతండ్రియంచొకకొంతతనయుం డనన్భ్రాతలనిమరింత
పరులని మరికొంతపరకీయ మనిస్వీ యమని కొంత కొంత యధ్యాసలతిక
యల్లిబిల్లిగనికమీద నల్లబోవుచున్నదేమన భూత జాతోత్కరమున
బెరుగనీయకుదానిద్రెంపియిడుమిపుడచాలుచాలు లీలాలోల బాలకుండ

దుఃఖము, ఆగంతుకమేగాని సహజముగాదు అధ్యాసలతొ పెరిగి పరుల
ుఃఖములు కూడా తనవే అని దుఃఖజాతమును పెంచుచున్నది. పెరుగనీయకుము.
ానిని ద్రెంపి సానందుడవు కమ్ము అనువచనము రమణీయము దుఃఖమెక్కడిది
ఃరోపముచే వచ్చినది.

॥ వచ్చెదుఃఖముపోద్రోవవలెనటంచు నడగెదుఃఖముభోగింతుననితలంచు
మూఢుడవిమూఢుడోదుఃఖములు సుఖములు దనవి కావని సహజమోదముననెసగు.

ఆనందము సహజము దుఃఖము తెచ్చిపెట్టికొనినది. అని వివేకి తలంచునని
్పినది. దుఃఖముస్వాభావికమే అని అన్నచో, స్వాభావికమైనది అగ్నికి ఔష్ణ్యము
లె స్వస్వరూపనాశముచేతనే జరుగునని చెప్పవలసి యుండును. అట్టి స్థితిలోముక్తికై
ుత్నము దుఃఖనివృత్తిని బోధించెడు శాస్త్రములు వ్యర్థములే యగును గదా. కాన
నందము స్వాభావికము అధ్యాసచే దుఃఖమాగంతుకమైనదిగా వివేకముచే
ఱుంగవలెను. తనయందు పరమమైన ప్రేమకలుగుచున్నది. తానెట్టి
కార్యములనాచరించినను తనను తాను బహిష్కరించుకొనడు గదా ఈ
రతిశయ ప్రేమమే ఆనందము, సిద్ధాంతవ్యాసమున నియ్యది సోపపత్తికముగా
ూపితము.

। జాతిధర్మములు ద్విజత్వాదికమ్ములు కాణత్వ ముఖము లక్షగుణగుణము
లరుణసితాదికంబగురూపు పొట్టియు పొడవు మున్నగునవి యొుదలివిధము
లిచ్ఛద్వేషమయమునిదియదియైనవి లక్షింపసూక్ష్మాంగ లక్షణములు
మూలమజ్ఞానంబుముదుచునన్నిటి నొంటి నిరతి శయంబుసాన్నిధ్యగరిమ
గేవలుండైన తనయందు కృతకములివియన్నియును భ్రాంతిదాల్పనైయకటయూరి
వారికై ఏడ్వనాయెనీ వఱకనింకనెఱిగియిమ్మడు లెడలింపనెంచుకొనుము

ఉ॥ ఏదియు శాశ్వతంబయినదిందనరాదొకనీవకాకసం
పాదితముల్పదార్థములు పొడఱుచూచుచునుండనవ్వియ
మ్మాదిరినుండగా యమదిభ్రమందుమదింగొనియిట్టి పాటనే
ద్వేదమనంబువృత్తులు లయింపగనుండు మఖండరూపతన్

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - 16వ పద్యము

పై పద్యములతో జాతి ధర్మములు ఇంద్రియధర్మములు దేహధర్మములు మనో ధర్మములు తనవికానివాటిని, తనయందారోపించుకొని బద్ధుడగుచున్నాడు. దీనికి మూలము అజ్ఞానము, కేవలానంద స్వరూపునియందవిభ్రాంతిచే కల్పితములు అధ్యాసభాష్యసార మంతయు ఇందుకలదు. దేహము అ శాశ్వతము, శాశ్వతమైన దేదియు ఈ దేహేంద్రియ సమూహమునలేదు. పుట్టుట గిట్టుటలు మనసున తలంచి మనోవృత్తులనడంచుకొని అఖండైకరసానందముగా ఉండుమను వివేకము తెలియజేయబడినది. మదాలస బ్రహ్మవాదిని ఈశ్వరాంశ సంభూతురాలు కావుననే ఈ చతుర్థగుచ్ఛములోని పద్యములు చైతన్యమాత్రము సత్యమనియు నిర్గుణ పరబ్రహ్మమొక్కటే తెలియదగినదనియు, ఈ విశ్వము ఎండమావి వంటిదే అనియు మదాలసతనకొడుకులకు విక్రాంత సుబాహు శత్రుమర్దనులకు జోలపాటలలో వేదాంతము బోధించినది. ఈ ప్రకరణమునందే "వాచాऽరం భణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యమ్మను" ఛాందోగ్యఉపనిషత్తులోని అర్థము తన భర్తతో పుత్రులనామధేయములలోని యాథార్థ్యమును ప్రకటించు సందర్భములో స్వీకరింపబడినది. బాన, ప్రమిద, కుండ, మూకుడు అను పేర్లు మట్టి వికారములకు కలవు. వీటన్నిటి లోను మట్టియే సత్యమన్నవిధముగా ఈ నామ రూపాత్మమగు ఈ జగత్తు అంతయు వికార జాతము. దీనిలోని సత్ పదార్థమొక్కటియే తెలియదగినదని చెప్పినది. విక్రాంతుడు సుబాహువు శత్రుమర్దనుడు అనుపేర్లు దేహమునకా! ఆత్మకా! దేహమున కన్నచో దేహము జడము, దీనికి వ్యవహారార్థమై ఏ పేరు పెట్టిన నేమి? ఆత్మకు అన్నచో ఆత్మపదార్థము నామరూపవిరహితము గదా యని సమర్థించినది. మదాలస బోధించిన తత్త్వము స్థాలీపులాకన్యాయముగా సమన్వయించితిని. సుబాహువు అలర్కుని ఉద్ధరింపబూనినాడు. అలర్కునికి విషాదయోగమున గాని తత్త్వజ్ఞాన బుద్ధికలుగదని ఎంచి కాశీశుతో కలిసి అలర్కునియుద్ధములో ఓడించెను.

అలర్కుడు పుట్టెడు దుఃఖభారముతో నింటికివచ్చి తన తల్లి ఇచ్చిన ఉంగరము చూచుకొనినాడు. సత్సహవాసము తనదుఃఖభారమును తొలగింపగలదని నిశ్చయించి సహ్యాద్రిచేరి దత్తదేవుని శరణుపొంది దుఃఖముపనయింపమని ప్రార్థించినాడు. స్వామి దయాళువై ఏ కారణమున ఆ దుఃఖము నిన్ను ముంచినదో చెప్పుమనెను. ఈ క్రింది పద్యమున పై భావము చెప్పబడినది.

సీ॥ అనియననని యెదత్త్రాత్రేయుడిప్పుడయవనీశ దుఃఖాపహారమేను
నీకొనరించెదనే కారణమ్మున ముంచెనిన్నదిసత్యమున వచింపు
మెవ్వనివాడవో యెవ్వడవో నీవు నెవ్వానికోదుఃఖమేర్పరింపు
మనయనమ్ములు కలవంగమ్ము కలదొండుకలదు దీనికి మించుకలయునిందు
దుఃఖమెక్కడనున్నది దొరవనీవు నిన్ను నదియేమి సేయు చింతింపుమింత
యనిన గురుమూర్తి వాగమృతానుశాస్తి పృథివిరాధుండు నటవిచారింపజొచ్చె

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - పద్యసంఖ్య 87

అలర్కుడు ఆ ప్రశ్నలను మనసున అనుసంధానించి సముత్తరము బొంది చెప్పిన వేదాంత మీ క్రింది పద్యమున గలదు.

మ॥ తనుసంఘాతమునందుదోచుమును భూతమ్ము ల్విచారింపమే
దినినీరమ్మను నిప్పుగాలినభమున్ దేవుండనే నిందువాం
డును గానక్కట సాక్షిభూతుడనఖండున్ జిరాజ్ఞానయు
క్తినిమేనేన వ దత్సుఖాసుఖములొందెన్నన్ను నిన్నాళ్ళమున్

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - 89వ పద్యము

దేహసంఘాతమును నేను కాను నేను సాక్షిభూతుడనై యున్నదేవుడను, తెలిసికొనక ఇన్నాళ్ళు సుఖాసుఖములనొందితినని గురువుతో వినయముగా తెలిపినాడు ఆ స్వామియు వాని శ్రద్ధాభక్తులకు మెచ్చి

క॥ అననిదియింతియనరవర కనిపలికితినున్నమాట కలిగె మమయనం
గను నమమయన్నబోయెను ఘనసంసృతియదియెదుఃఖ కారణమన్నా

దత్తభాగవతము - 4వ గుచ్ఛము 100వ పద్యము

మమ = నాది అంటే సంసారము నమమ = నాకు సంబంధించినది కాదు అని అనుకొంటే సంసారదుఃఖము తొలగిపోవునని రెండుమాటలతో తత్త్వమును స్వామి చెప్పెను ఇట్లే

సీ॥ **ఘనవృక్షమిదియహంకారాంకురోత్పన్నమైనది హృదయాచలాంచలమున**
**మమతానుబంధసంబద్ధ సంస్కంధంబు గృహభూ విశాఖానుకీలితంబు**
**పుత్రదారాదిసముదితపల్లవమధిధనధాన్యమహాచ్ఛదమ్ము**
**పుణ్య పాపోత్ఫుల్ల పుష్పమ్ముసుఖదుఃఖసుమహితఫల మతి సురచితము**
**మోక్షమార్గమ్మునరికట్టి మూఢసంగిసేవితంబైవిధిత్సాళి భావితమవు**
**దీనిచాయకుజేరిభ్రాంతిసుఖదుఃఖవలితులవువారి కెట్లపవర్గులగుట**
గీ॥ **ఎవరు సత్సంగమనుజూతనెలమినూరి నట్టివిద్యాకుఠారంబువెట్టిదీని**
**భిన్నమొనరింతురవ్వారె చేరువారు బ్రహ్మవనమును దత్త్వమార్గమున సుగతి**

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - 101, 102 పద్యములు

పై రెండు పద్యములలో సంసారమనెడి చెట్టుఎట్లు ఉత్పన్నమై ఎదిగి నదో దాని నీడ కేగిన వారెట్లు ముక్తికి దూరమగుదురో చెప్పి - సత్పురుష సహవాసమనెడి జాయిపై విద్యయనెడి గొడ్డలికి పదునుపెట్టి సంసారవృక్షమును తెగగొట్టిన వారుమాత్రమే బ్రహ్మవనము చేరగలిగి ముక్తిని పొందగలవారని విశదీకరింపబడినది.

కం॥ **ధరముంజేషీకోదుం బర, మశక, విసారసలి లపార్థక్యము భం**
**గిరహించు భేదమాత్మకు శరీరమునకెందు విభుడసత్యమరసితే.**

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - పద్యసంఖ్య 107

ముంజేషీకన్యాయము కఠోపనిషత్తులో పేర్కొనబడినది. ఈనెను ఆకుల నుండి వేఱు చేసినట్లు ఆత్మ-అనాత్మ నుండి వేఱుగా గుర్తించవలెనని దీని భావము. బ్రహ్మతో యోగమెనసి శాశ్వతికసిద్ధి పొందవలెనని దత్తదేవుని యను శాసనము సత్యముమూడు విధములుగా శ్రీ శంకరులు వంగడించినారు. 1. వ్యావహారిక సత్యము 2 ప్రాతిభాసిక సత్యము 3 పారమార్థిక సత్యము - వ్యవహారమున సత్యముగా భాసించునది వ్యావహారిక సత్యము, ఇది మూడు కాలములలో నుండక వర్తమానకాలమున మాత్రమే యుండును. 2 ముత్తెపు

చిప్పయందు వెండి అను జ్ఞానము సత్యముగా తోచినను అది ఆభాస్యము మాత్రమే గాని, నిజము కానేరదు. దీనిని ప్రాతిభాసిక సత్యమందురు. 3 మూడు కాలములందు బాధింపబడక ఎప్పుడు ఉండునది. పారమార్థికసత్యము. ఇందు వ్యావహారిక ప్రాతిభాసికాలు మాయవలన ఏర్పడినవే, ఆ మాయ తత్త్వాన్యత్వాభ్యామ నిర్వచనీయమని చెప్పబడినది.

గీ॥ **వ్యావహారిక సత్యములైన జగము లందు భాసించుజంతువులందు నెల్ల**
**నొక్క చిచ్ఛక్తి గాక వేరొండు లేద స్వామి భృత్యారిమిత్రభావమెటగలదు.**

దత్తభాగవతము - 43వ గుచ్ఛము - పద్యసంఖ్య 253

అలర్కుడు కాశీశుతోను అన్నతోను చెప్పిన మాటలివి. అసత్యమొక్కవిధమే పైవిషయము ను సత్యంచానృతం చ సత్యమభవత్ సత్యానృత రూపములుగా ఆ బ్రహ్మ తత్త్వమే ప్రకాశించుచున్నది. తైత్తిరీయ ఆనందవల్లి చెప్పినది. కుందేటి కొమ్ము వలె అసత్యమునకు ఉనికి యే లేదు. పారమార్థికసత్యము తెలిసినచో, ప్రాతిభాసికసత్యము వ్యావహారిక సత్యము రెండునూ అనృతములే అయిపోవును.

గీ॥ **జడము స విశేష సవికార స ప్రకృతిక జగతివ్యక్తమవ్యక్తంబు జ్ఞానవిషయ**
**మింత వట్టున నెఱుగుచునెవడహమని నిత్యమును నీయెడ స్ఫురించునెమకుమతని**

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - 280 పద్యము

ఈ జగత్తున వ్యక్తావ్యక్తముగా ఎవడు అహమని - నేను నేనని నిత్యము నెఱుంగుచు స్ఫురించుచున్నాడో ఆతనిని వెదకుమను ఉపదేశము ఇందు కలదు. సుబాహువు కాశీశుతో పల్కిన విధమిది.

సీ॥ **మహితమ్ముచైతన్యమాత్రమ్ము దేశకాలాద్యనవచ్ఛిన్న మాత్మ సత్తు**
**స్వప్రకాశము పరసౌఖ్యరూపము సనాతనము పూర్ణమ్ము వాఙ్మన సదూర**
**మమృతాఖ్యమును స్వగతాది భేదత్రయశూన్యము శూన్యమ్ము శుద్ధము పర**
**మైన బ్రహ్మమ్మననేనయనెడు నుడి మతినాగు తెలివినిశ్చితమతోచె**
**తల్లిదండ్రియన్న దత్తదేవుడు వీరికరుణనన్ను నిట్లుగానొనర్చె**
**నొగృతార్థుడను గృతార్థుడను గృతార్థుడను విసంశ యమ్ముడంగెదమము**

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - పద్యసంఖ్య 295

1. చైతన్యము 2. దేశకాలాద్యనవచ్ఛిన్నము 3. ఆత్మ 4. సత్తు 5. స్వప్రకాశము 6. పరానందము 7. సనాతనము 8. పూర్ణము 9. అవాఙ్మానసము 10. అమృతము 11. స్వగతాది భేదశూన్యము 12. అశూన్యము 13. శుద్ధము 14. పరబ్రహ్మము. అనగా నేనే యనియు కృతార్థుడనైతిని కృతార్థుడనైతిని అని అలర్కుని అనుభవ పూర్వకమైన జ్ఞానమిందు గ్రహింప బడినది.

ఉ॥ పూర్ణుని నిత్యసత్యసుఖబోధమయాత్ముడవైన నీయెడన్
వర్ణితమాయతోనొదవివాస్తవమట్లు స్ఫురించుచున్నద
భ్యర్ణగత ప్రపంచమిది స్వప్న సమంబు జడంబు దుఃఖదం
బర్ణవ మందు ఫేన, మననై నిను గప్పి నిజాశ్రయంబునన్

దత్త భాగవము - 5వ గుచ్ఛము - పద్యసంఖ్య 42

ఈ పద్యము శ్రీ మద్భాగవత గత బ్రహ్మస్తవములోని శ్లోకమునకు అనువాదము. కార్తవీర్యుడు దత్తవిభువును స్తుతించిన సందర్భము మరొక పద్యము.

మ॥ అతిసంలోలమలాతచక్రమనదృష్టాదృష్టమై మానస
వ్యతిభాతంబువిలాసమీసకలమున్భావింపవిజ్ఞానమే
కతశోభిల్లువికల్పమెల్లగుణసంకల్ప క్రమాయాత సం
సృతి సర్గప్రసృతంబు మాయిక ముభాసించు స్వభావంబునన్

దత్త భాగవతము - పంచమగుచ్ఛము - పద్యసంఖ్య 43

ఈ సకల విశ్వము మానసవిలాసమే, చలించుచున్న అలాతచక్రము ఒక్కటే అయినను ఋజువుగాను వక్రముగాను, దీర్ఘముగాను, హ్రస్వముగాను ఎట్లు ఆభాసించునో అట్లే ఈ ప్రపంచము విజ్ఞానవిలాసమే అను గౌడపాద కారికలోని అర్థమునకు, కాశీ పంచకములోని శ్లోకార్థమునకిది వివరణాత్మకము. ప్రజ్ఞానమే. ఆత్మ ఏకమై బహుధా ప్రతీతమగుచున్నదను తాత్పర్యము గలది.

కం॥ సదసద్వ్యక్తావ్యక్తం బిదిసర్వము బ్రహ్మమేకమే వాఙ్మనసా
పదము పరము నిత్యంబ య్యది నీవయటంచ్రుమౌనులవ్యయభావా

దత్తభాగవతము - పంచమగుచ్ఛము - పద్యసంఖ్య 89

ఇకదత్తదేవుడు కార్తవీర్యునకు శాస్త్రములు కళలుమున్నగునవన్నియు కడకు మోక్ష సాధనములేయగునని సప్తోదాహరణములు చెప్పెను. విశాలాక్షుడు గాంధర్వ కళాకోవిదుడై బ్రహ్మాదులు పొందలేని సౌఖ్యమునందెను. శ్రుతియు ఆనందముకంటె ఉపేయమేది లేదని వాక్రుచ్చుచున్నది.

**గీ॥ ఆత్మరూపు సుఖమ్మ అన్యమ్ములేదు సుఖము కన్నను పేయమ్ము శ్రుతిమతమిది**
**యేకమాత్రోపజీవులీయెల్లజీవు లాత్మసుఖరూపమందనియనదెశ్రుతియు**

దత్తభాగవతము - 5వ గుచ్ఛము - పద్యసంఖ్య 122

ఆనందోబ్రహ్మేతివ్యజానాత్ ఆనందాపరపర్యాయము బ్రహ్మము అని తైత్తిరీయము ఆనందవల్లి ఈ ఆనందము నిరతిశయప్రేమరూపమని పూర్వమే చెప్పినది.

**క॥ శ్రుతిగోచరమగు బ్రహ్మము ప్రతిభాసింపనుపదేశవంతునొనర్తున్**
**మతిమంతుడయనిపిలిచిని యతునకునద్వైత భావమాదేశించెన్**

దత్తభాగవతము - 5వ గుచ్ఛము పద్యసంఖ్య 135

గానకళచే విశాలాక్షుడు త్రిమూర్తులను ఆనందింపజేయగా బ్రహ్మదేవుడు విశాలాక్షుని అనుగ్రహించి ముక్తినిచ్చెడి అద్వైతమును ఉపదేశించును. దత్తవిభుని వలన విష్ణుదత్తుడు అనేకవరములను పొందెను. సూర్యునివలన కామగమ విమానమును పొందెను. శాస్త్రములు కళలు సత్కర్మానుష్ఠానము అన్నియు తత్వమస్యాది మహావాక్యార్థబోధప్రదీపమునకర్హమగు అవస్థను కలుగజేసి పునరావృత్తి రహితమగు ముక్తికి ఉపాయములే అని యుక్తముగా వివరింపబడినది.

విష్ణుదత్తుడు విప్రకుమారునకొనర్చిన బోధమత్యల్పమత్యున్నతము

**గీ॥ మనుజులకు బంధమోక్షకారణము, మనము స విషయము బంధకరముమోక్షమునగూర్చు**
**నిర్విషయమైన లేదు సందేహమిందు నవధరింపుబుద్ధ్యాదుల కవలివాడు**

**గీ॥ మోక్షమాకాశమున గాని భూతలమున గాని పాతాలమున గాని కలుగబోవ**
**దది యహంకారరూపమోహావసాద మగుటనిజరూపసంస్థానము, యగుగాదె**

దత్తభాగవతము - 5వ గుచ్ఛము - 309, 311 పద్యములు

పై రెండు పద్యాలలో బుద్ధ్యాదులకు పై తత్త్వము పరబ్రహ్మము. అహంకార రూపమోహమును విడచుట స్వస్వరూపానుసంధానముననే కల్గునని విశదీకరించబడినది. ఆత్మకు కర్తృత్వభోక్తృత్వాలు కల్పితములు అనునది పూర్వవ్యాసమున ఉక్తమైనది. ఈ క్రింది పద్యము ఈ యర్థమును సూచించుచున్నది.

సీ॥ కావున మోహమాత్రావృతమీలోకమాత్మచిద్ఘను నిత్యునిశమెనసి
తన్నుకర్తవికర్త దాత భోక్తనటంచుదలచివి మూఢుడై తవులు బలిమి
ప్రత్యయసాక్షిత ప్రత్యక్షమనుభవించియునేనెవడనిట్లు చెందునెందు
నాకు నాత్మజ్ఞానయమనిపరువెత్తు బాహ్యసాధనముల బడయవితగ
జననికుచకోటరాసుప్తదనయుమరచి ఏడ్చుచందంబు నెమకంగనేగునట్లు
గొల్లకక్షస్థమవు గొట్టె పిల్ల బింబమంధువున జూచి భ్రాంతి మల్లాడునట్లు

దత్తభాగవతము - 5వ గుచ్ఛము - 319వ పద్యము

ముక్తులు నాలుగు విధములు, సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యముక్తులు, మొదటి మూడు ముక్తులును ద్వైతులు అంగీకరించిరి. అద్వైతులు సాయుజ్యముక్తిని జీవన్ముక్తిని ఒప్పినారు. జీవన్ముక్తి అనగా బ్రతికి యున్నపుడే బ్రహ్మానందాధిరాజ్య పదవీస్థితుడగుట కార్తవీర్యునికి దత్తదేవుడు చేసిన బోధలో ఇది కానవచ్చును.

మ॥ స్మయమానాస్యలసత్సరోజుడనుకంపామందిరుండిందిరా
ప్రియతావత్సుడు దత్తదేవుడనియెంబ్రీతింవిలోకించిశి
ష్యయతాత్మాయిటదత్త చిత్తుడవు కమ్మా స్వానుభూతాత్మతా
వ్యయసంపత్తి నెలర్చికాగలవు జీవన్ముక్తతావస్థకున్

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 3వ పద్యము

జీవన్ముక్తతావస్థకు తగిన ఉపాయములనుపదేశింపబోవుచూ దత్తదేవుడు దయాళువై కార్తవీర్యునికి తత్త్వముపదేశించు సందర్భములోని పద్యము.

ఆ॥ హ్రస్వమాదిమాత్ర యవలిది దీర్ఘంబు ప్లుతసమాఖ్య నొప్పుమూడవునది
వాగగోచరమయివరలు దురీయార్థ మక్షరతస్ఫురించునక్షరమది.

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - 196వ పద్యము

ఇందు ఓంకారము హ్రస్వదీర్ఘ, ప్లుతసమాఖ్య నొప్పి చతుర్థమగుబిందువు అక్షర పరబ్రహ్మవాచకమై ఆత్మస్వరూపాభివ్యక్తి సాధనమని చెప్పబడినది. దత్తుడలర్కునికి ప్రణవమును బోధించు ప్రకరణములోనిదీ పద్యము. "శాంతం శివ మద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః" అని మాండూక్యోపనిషత్తు, ఓంకారమున విశ్వతైజసప్రాజ్ఞులను మూడు పాదములనుగా పేర్కొని నాల్గవ పాదము తదతీతమై వెలుగొందునాత్మగా విశదీకరించినది.

ఇక హంసగీతములో నద్వైత తత్త్వము కలదు. దరిచేరిన సాధ్యులకు దత్తప్రభువు చేసిన ఉపదేశము. సర్వాకామోపశాన్తి, కోపపరిత్యాగము, మానావమానము లందు సమస్థితి, సర్వసంగ పరిత్యాగము, మౌనము, సత్యము, నియమము, ధర్మము, గలిగియుండుట సమస్త భూత హితము మున్నగు సాధనమ్ములతో ఆత్మసుఖానుభూతికల్గును. ఆత్మసుఖానుభూతి వదలిన సాధనములు ఉపపన్నములగును, పెండ్లికుదిరిన పిచ్చికుదురును, పిచ్చి కుదిరిన పెండ్లికుదురునన్నట్లు స్థితప్రజ్ఞుడైన మౌనికి కర్తవ్యములనుపదేశించిన ప్రకరణమిది.

॥ **ఇన్నిటికి నా స్పదంబగునెఱిగెనేని స్వస్వరూపంబునెఱుగునీసాధనమ్ము**
**లిన్నిగలిగిన బెండ్లి యౌనేని వదలు పిచ్చియది పోయినంగాని పెండ్లికాద**

దత్తభాగవతము - 10వ గుచ్ఛము - 102వ పద్యము

ఇట్లు ద్వాదశ గుచ్ఛములలో అద్వైతము అనుస్యూతమై అద్వైతానుకూలములగు సాధనములు, దత్తదేవుని యనుశాసనములు ప్రధానములై ఈ గ్రంథమలరారినది. సిద్ధాంతవ్యాసక్రమమున ఉదాహరణ సమన్వయమిందు చూపబడుచున్నది. దత్త మహాత్మ్యమున మూడవ అంశలో అష్టమ, నవమ, దశమ అధ్యాయములలోను, శ్రీ దత్త భాగవతమున 6వ గుచ్ఛములోను దత్తదేవుడు కార్తవీర్యునికి అద్వైత వేదాన్తమును సమగ్రముగా సాంగోపాంగము గా ఉపదేశించిన సన్నివేశము కలదు. కేవలము శుష్కవేదాన్తమును ఉపన్యసించుటే కాక వేదాన్తము ఎట్లు అనుభవమునకు తెచ్చికొనవలెనో దానికి తగిన సమాధి యోగమును చెప్పి ఆచరింపజేసి చివరికి అపరోక్షానుభూతిని నిర్వికల్పసమాధిని కార్తవీర్యునికి కలుగజేసి వాడు మూడు పర్యాయములు సమాధ్యానందమనిర్వచనీయముగా ననుభవింపగ నన దత్తస్వామి అద్వితీయానుగ్రహ విధానమును చూపెట్టినట్టి ఈ సందర్భము ఇతర సాధారణముగా కన్పట్టును.

కం॥ నీ రూపునీకుచెప్పెద నోరీముక్తుండవయ్యెదొకమాత్రనిర
ర్థారూథమ్ములయిూరెం డౌరాబద్ధుండు ముక్తుడనుశబ్దంబుల్

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 6వ పద్యము

"మెచ్చితినౌరసత్యమక్రియము నిత్యమగు మార్గమరిసికొనెదె" అని మోక్షపురుషార్థము నిత్యమని చెప్పి ఓరీ నీ రూపునీకు చెప్పెదను. దీన, ముక్తుడవగుదువు. బద్ధుడు ముక్తుడు అనుశబ్దములు రెండును నిరర్థకములైన శబ్దములే సుమా, కారణమేమన బంధము సత్యమన్నచో ముక్తి ఎప్పటికినీ కలుగదు. అసలు బంధమోక్షములు రెండును నామ మాత్రములే వాస్తవ గతిని చూచినచో లేవు. ఉన్నదొకవస్తువు మాత్రవే అయ్యది దేశకాల వస్తుపరిచ్ఛేదశూన్యము, అస్తి భాతిప్రత్యయాభిమతము ఆ అధిష్ఠానవస్తు సత్తచేతనే భ్రమాత్మకమై బద్ధముక్తద్వైతాత్మకభ్రమము ప్రతీయమానమగుచున్నదని పై పద్యములోని భావము. దీనివలన చతుర్విధపురుషార్థములలో మోక్ష పురుషార్థమే నిత్యమని దానికే ప్రయత్నమాచరింపవలెనని పునరావృత్తిరహితశాశ్వతస్థితి మోక్షమువలననే కలుగునని తెలియును.

కం॥ నీరంధ్రమనిర్వాచ్యమ కారణమవిచింత్యమప్రకారమలక్ష్యం
బై రహితనికేతనమై యారాద్దూరములు లేకయది వెలుగొందున్

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 9వ పద్యము.

పై పద్యమున నామరూపవికల్పరూపమైన ఈ జగత్తుకు ఆ వస్తువే అధిష్ఠానము. అది ఇదమిత్థమని నిర్దేశించుటకు వీలుకానిది. మరియు అది అకారణము=దేనిని గూర్చియు కారణము కాదు. అనగా వివర్తము అవస్థాంతరాభాసమాత్రము అవాఙ్మనసగోచరము అంతటా వెలుగొందును అనియర్థము చెప్పబడినది. అట్టి వస్తువు శాస్త్రముచేతనే తెలియ బడును. అప్పుడే ఆత్మోపలబ్ధికలుగును. జ్ఞానమువలననే కైవల్యము అని సిద్ధాంతము గదా.

గీ॥ మోహమాత్రమ్మెభ్రమమురూపుగొనలేద దానికదియునవాదియన్వానికి బుధు
లాదిబాల బుద్ధి శుద్ధికాడుదురది వాస్తవము కాదు శాస్త్ర సంపాదితంబు

గీ॥ జీవుడీశుడు సంశుద్ధ చిత్తుజీవ దేవభిదయునవిద్యతద్ద్వితయ యోగ
మాటివియనాదులంచనిరజ్ఞభావ కల్పితమె యీశ జీవజగత్ప్రక్లప్తి

శ్రీ దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 11, 12వ పద్యములు

ఈ నామరూపకల్పితవిశ్వమంతయు భ్రమమాత్రమేసుమా. ఆ భ్రమకు రూపేదియూ లేదు. ఆ భ్రమయే అవిద్య. ఈ అవిద్య అనాది యని బాలబుద్ధికై చెప్పబడుచున్నది. వాస్తవము కాదు శాస్త్ర సంపాదితమైనదే. 1. జీవుడు 2. ఈశ్వరుడు 3. జ్ఞానము లేక విశుద్ధచిత్తు 4. జీవేశ్వరభేదము 5. అవిద్య 6. అవిద్యకు చిత్తుతో గల సంబంధము ఈ ఆరింటిని గూర్చి సిద్ధాంత వ్యాసమున విపులముగా విశ్లేషించుట జరిగినది. ఈ జగజ్జీవేశకల్పనము సత్యవస్తువును తెలిసికొనుటకే చేయబడినది. అసలు అవిద్యయే లేదు. దేనితో యోగముదేనితో భేదము చెప్పెదవు. ఈ ద్వైతమంతయు ఆ చిదానందముతో ప్రకాశించుచున్నది.

**శా॥ ఆనామమ్ములు రూపముల్పలుకగానాలింపనౌ సత్యమున్**
**జ్ఞాన, మ్మేక, మనంత, మక్షరము, చిన్మాత్రంబ ఖండంబు, బ్ర**
**హ్మానందంబు, తమః పరంబు, ఖము నిత్యం బద్వయం బవ్యయం,**
**బీనామమ్ములు వస్తుతత్త్వమున కౌవృద్ధక్రమాకల్పనన్**

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 14వ పద్యము

ఇందు అద్వితీయమైన ఆ వస్తువునకు గల నామములు వృద్ధాచార క్రమాగతములైనవి. 15 చెప్పబడినవి. ఆ యాత్మమునకే ఈశ్వరుడు పరమాత్మ విష్ణువు సదాశివుడు బ్రహ్మ, శివుడు అగ్ని ఇంద్రుడు సోముడు స్వరాట్టు విరాట్టు అక్షరము ప్రాణము ఈశానుడు సవిత, విభువు నారాయణుడు హృషీకేశుడు ప్రజాపతి మహాభూతము, మహద్యక్షము మనువు హరి. ధాత, విధాత, గురువు త్రిపాత్తు, యముడు, కాలము, ఆగమకర్త, జీవనుడు, మృత్యువు యజ్ఞము ఇజ్యుడు నిధానము అవ్యయముబీజమని బహువిధనామములు బహువిధ రూపములు కలిగినవి.

**మ॥ నను నీవిప్పుడు పృచ్ఛచేసితివె ధ్యానంబీవునెద్దానిగూ**
**ర్చినిమేషం బెడలేక చేసెదని సచ్చిత్తత్స్వరూపంబిదే**
**యని యంతః కరణప్రవృత్తులెడయన్స్వానంద సంపత్తినుం**
**టినజస్రంబపరంబికేమి కలదంటింగంటినంచాడగన్**

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 18వ పద్యము

ఇప్పుడు కార్తవీర్యా! నీవేమిధ్యానించుచుంటివని అడిగితివి. నేను వస్తువు సచ్చిత్స్వరూపములుగాన స్వానందసంపత్తితో నుండి ధ్యానించుచుంటిని. అపరమేమి కలదు. చూచితి నని చెప్పుటకు మరొక్కటి ఏదికలదు ఏమీలేదుగదా.

ఇక, మాయకు గల పేర్లను వివరింతునని ఇట్లు చెప్పెను. 1. ప్రకృతి ప్రధానము, బ్రహ్మయోని, త్రివృత్తము, ఆదిభ్రమము, అవిద్య, పరదేవి, మాయ, అవ్యయవిభ్రమము, శక్తికారణము, అధ్యాసము, అజ్ఞానము, తమము, ప్రస్వాపము, కారణభూతము, కార్యావిద్య, అని బహునామములు మాయకు కలవు. ఈ కార్యావిద్యకే పంచపర్వములు అనగా ఐదు విభాగములు కలవు. 1. స్వస్వరూపాప్రకాశము 2. దేహాభిమానము 3. భోగాభినివేశము 4. కోపము 5. ధనాదుల హానియందు మృతతుల్యత.

గీ॥ **ఆవరణమన విక్షేపమనగరెండు శక్తులు దయించె మొదలి యజ్ఞానమంద**
**పరమపరమను భేదకల్పనమొనర్చె ముందు పరిపూర్ణ మానందమందునేని**

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - పద్యసంఖ్య 21

విభాగములేని ఆ ఆనంద వస్తువునందు ఆవరణ విక్షేపములని రెండు శక్తులు విభక్తములుగా కల్పితములైనవి. విక్షేపమనగా సృష్టి, ఆవరణమనగా బ్రహ్మను కప్పునది. మాయను స్వవశమున నుంచుకొనినవాడు ఈశ్వరుడు అవిద్యకులోబడినవాడు జీవుడు దుఃఖతతికలితుడై యుండును.

గీ॥ **హ్లాదినీ సంవిదాశ్లిష్టుడనఘుడతడు సచ్చిదానందరూపుడీశ్వరుడనబడు**
**నఖిల సంక్లేశనికరసమాశ్రయుండు స్ఫురదవిద్యావృతుండు జీవుండనబడు**

ఉ॥ **భావముకేవలం బదిస్వభావమునం బ్రతిభాతమై జగ**
**జ్జీవపరేశభావమున జిత్రితమైనది దానిదోవవే**
**దావలి భూతవర్గవిలయంబుల గల్పన జేసి చెప్పెనా**
**త్రోవయె సత్యమందురు పరుల్పరిమూఢులనాత్మవేదితన్**

ఉ॥ **ఎక్కడి నూరుభ్రాంతి యిది యెట్టులడంగునటన్న విన్మతా**
**నెక్కటియాత్మలేదిటననేకములోకముదోచు మోహితుం**
**డొక్కనికే తదన్యునకునున్నది యుండునొకండ నిద్రితుం**
**డక్కలగాంచునొక్కరుడహోయపనిద్రునకద్దిచెందునే**

ఉ॥ ఏవిధినున్మనోరథమనేక మనోరథపంక్తినోలినా
నావిషయానుషక్తముగనంబడజేయ దలంచి చూడస
ద్భావముకద్దియందొకవిధంబునకే నటులేయసత్తె స
ద్భావ సమాశ్రయంబుననుదంచితసత్తనదోచుభూవరా

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 25, 26, 27, 28 పద్యాలు

పై నాలుగు పద్యములలో జీవేశ్వరజగత్తులు మాయచే కల్పితములు మాయా నిరాసము కొఱకై విద్యా ప్రదీపమావశ్యకము దీనికొఱకై వేదముచే సృష్టి ప్రళయ వికల్పనము చేయబడినది. తత్త్వమెఱుంగనెట్లు వీలగునన్నచో ఏకాగ్రముగా వినుము. ఏ పదార్థముననెవరికి అజ్ఞానముండునో లేక అన్యథా జ్ఞానముండునో వానికే ఆ భ్రాంతిని పోగొట్టవలసి యున్నదిగదా.

శ్లో॥ విక్షేపస్యచ సృష్ట్యాదిః ఈశ్వరేవరణం తథా శక్తిద్వయం చ తస్యోచుః
విక్షేపావరణంతథా అవిభాగే పరానందే విభాగోయేనకల్పితః

దత్తమాహాత్మ్యము - 3వ అంశ - 47వ శ్లోకము - 8వ అధ్యాయము

స్థాణుచోరభ్రాంతి, రజ్జుసర్పభ్రాంతి, శుక్తికారజతభ్రాంతులు, చక్కగా, చూచు, చూపున, సడలి పోయి యథార్థజ్ఞానము కలుగును. "స్థాణుచోరభ్రాంతి, స్రక్సర్ప విభ్రాంతి, శుక్తి రౌప్యమనీష, చూడలేదె. చక్కగా చూచుచూపునసడలిపోదె భ్రమమెడలేనేని మిగిలిన వస్తువదియె" దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 29వ పద్యమున భ్రాంతినిరాసముకై యత్నము కావలెనని విశదీకృతమైనది.

గీ॥ వస్తుసిద్ధికి సాధనవాంఛవలదు భ్రమనిరాసమ్మునకెయత్నపరతవలయు
యాగయోగాదికమువేదమనువదించుటెల్లని మ్మాత్రకేయనియెంచుమెడద

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 30వ పద్యము.

స్వతః ప్రకాశమైన - వస్తువు పై గల భ్రాంతిని విద్యచేతనే పోగొట్టుకొనవలెను. సద్వస్తువు పరబ్రహ్మముకాన దానికి సాధన వాంఛ అవసరము లేదని పై పద్యతాత్పర్యము.

సీ॥ మునుపునేడునురేపని బుట్టుమాట కర్థమే లేదు భాసించెననెదెయనుము
వినుమృషాభాసమిదియని మనసుసేసె
వనియు మాయామ-యమ్మని యరయుమయ్య

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 31వ పద్యము

ఇదియంతయు మిధ్య. ఈ అన్నృతమైన విశ్వమును మనసుచేసినది కాన మనో విశుద్ధికి వేద విహితకర్మములాచరణీయములని ఈ క్రింది పద్యమున విస్తారముగా వర్ణింపబడినది.

**సీ॥ ఏతదర్థమకదాచేతోవిశుద్ధికి నిత్యకర్మమొనర్పనెగడ వలయు**
**నందువివర్జింపనగు నిషిద్ధముకామ్యమాభిచారి కముఖానర్థకరము**
**మనము భక్తి తత్ర్పవణముగ జేసి సమర్పింపవలెనీశు నందు గృతము**
**ఎంతనెంతప్రీతిభజించు నీశ్వరుసతమంతశుద్ధచిత్తుండవు జనెనినుడు**
**బ్రహ్మలోకముమొదలు సర్వప్రపంచమిదియనిత్యము నశ్వర మింతభ్రమమె**
**మృషయనివిరక్తుడెన్నడౌమృష్టమలుడు వాడపుడె బోధసంపత్తి వడయప్రభుడు**
**గీ॥ ఎవనికి నీ దేవునెడ భక్తియెసగు బరమ మీశ్వరుండెంత గురుడంతయెవనికమ్మ**
**హాత్మునాత్మప్రకాశించునర్థములివి యన్యునకు శబ్దమర్థమ్మెయవగతమవు**

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 33, 34వ పద్యములు.

ఈశ్వరభక్తిచే చిత్తశుద్ధికలుగును. చిత్తశుద్ధి వైరాగ్యమును కలుగజేయును. అట్టి వానికి బ్రహ్మ లోకము మొదలు ఈ సర్వప్రపంచము అనిత్యమని భ్రమమనితోచును. అప్పుడు బోధసంపత్తి కలుగును. దేవుని యందెంత భక్తియో గురునియందునూ అట్టి భక్తినే చేయవలెను. అట్టి వానికి అన్ని అర్థములు ప్రకాశించును. అని పై పద్యముల భావము. దృశ్యమున మేలులేదనెడి బుద్ధిని గడించి స్వాంతమును దృశ్యమున చేరనీక ఆచార్యానుగ్రహమునకై పాటుపడవలెనని ఈ క్రింది పద్యమున గలదు.

**కం॥ ఆచార్యననుగ్రహమున రోచించువిచారముల త్రోవనెతత్త్వ**
**ప్రాచుర్యమ్ము స్ఫురించుం బ్రాచీనత స్వప్రకాశ మానస్థితితోన్**

- 36వ పద్యం

ఈ విధముగా గురుననుగ్రహముతో

**కం॥ ఒకడు సదానంద చిదాత్మకుడవు పరమాత్ముడా వృతస్వానందుం**
**డిక నొకడు పురుషుడను, మాయికపు, విభాగంబుదోచి యంతయుజూవెన్**

- 40వ పద్యము

ఒక్కటే పరబ్రహ్మవస్తువు, అవ్వృత స్వానందుడవు, జీవుడొక్కడు, మాయికవు
ాగముతోచుట చేత యింత విశ్వమును చూపినది అని తెలియవలెను.

। బ్రహ్మమువలన నవ్యక్తమావిర్భావమందెదానవె మహత్తం కుదించె

అను 41వ పద్యమున విక్షేప శక్తి కార్యమైన సృష్టి వివరింపబడినది.
ంతయు సిద్ధాంతవ్యాసమున వివరింపబడి యున్నను ఇచ్చట అతిసంక్షేపముగా
ప్పెదను. బ్రహ్మమువలన అవ్యక్తము అవ్యక్తము నుండి మహత్తు మహత్తునుండి
హంకారము అహంకారమునుండి శబ్దస్పర్శరూపరసగంధములును వాటి నుండి
థ్వివ్యప్తేజోవాయ్వాకాశములు. పంచీకృత పంచమహా భూతములనుండి ప్రాణి
ము జనించినది. పంచమహాభూతముల సత్వరజస్తమోగుణ సంసర్గము సమష్టి
ష్టులచే ఇంద్రియాలు ఏర్పడినవి. ఇట్లు బహువిధములైన సృష్టులేర్పడి నవి. ఇట్టి
ష్టులకొకనియమములేనందువలననే ఒకచోట ఆకాశమునుండి వాయువు
యువునుండి అగ్ని, అగ్ని నుండి అప్పు, అప్పు నుండి భూమి, మిగిలిన
తములు లేదా మొదట జలములు వాని నుండి మిగిలిన భూతములుద్భవము
వి. మొదట తేజస్సృష్టి తరువాత మిగిలిన భూత సృష్టి జరిగినదనియు సృష్టి
ము ఉపనిషత్తులందు బహువిధములుగా కలదు. ప్రాణిసృష్టి అంతయు
ంచభౌతికమని తెలిసి పంచభూతములను, తన్మాత్రలందు, తన్మాత్రలను,
ాంకారమునందు అహంకారమును మహత్తునందు, మహత్తును మాయయందు
యను విద్యతో లయింపజేసికొనవలెను. బ్రహ్మసత్యము జగన్మిథ్యయని
యవలెను. ఈక్రింది పద్యమున నిది కాననగును.

**కావున రాజసత్తమజగమ్మిదిలేదువివేక శీలికిన్**
**కేవల మాత్మపూర్ణమిదిగానదెతోచెవిమోహవేళన**
**ద్భావమభావరూపముప్రపంచమకాగను పట్టుచున్నద**
**జ్ఞావిలచిత్తవృత్తికి యథార్థముచెప్పితి నే మనంగనౌ**

శ్రవణమునకు సద్గురూపసదనమే కర్తవ్యము దానికి ముందు సాధన
ష్టయ సంపత్తి ఉండవలెను. అట్టివాడే వేదాన్త వాక్యశ్రవణమునకు అధికారి
ఈ క్రింది పద్యమున కలదు.

గీ॥ తత్త్వనిశ్చయకరముమద్వాఙ్మయమ్ము వింటివేదాని విజ్ఞులు వినికియంద్రు
సర్వసాధనసంపత్తి జాతనిశ్చయాత్ముఁడధికారి పూరుషుండ మ్మెయికిని
కం॥ అవధారణలక్షణమగు శ్రవణం బొనరింపగగురుసదన మెనయనౌ
నవహితుడు పశమసంశ్రయుడవు బ్రహ్మమెగురుడనం గనొనవ్విధికిన్

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 50, 51 పద్యములు

(1) నిత్యానిత్యవస్తువివేకము (2) ఇహాముత్రఫలభోగవిరాగము (3) 1. శమ 2. దమ, 3. తితిక్షా, 4. ఉపరతి, 5. సమాధాన, 6. శ్రద్ధలు, (4) ముముక్షుత్వము. సాధన చతుష్టయముగా చెప్పుదురు. ఈ విషయమును అథాతోబ్రహ్మజిజ్ఞాసా అను బ్రహ్మసూత్రము కూడా తెలుపుచున్నది.

గీ॥ తత్త్వమస్యాదివాక్యసందర్భమర్థమతిదయాలుగురూప దేశాపితమ్ము
సమ్యగాలోచితములింగషట్కముననొనర్చునది శ్రవణమ్మనబేర్చువింటె

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 52వ పద్యము.

పై విధముగా అధికారియగువానికి గురువు దయాలువై తత్త్వమ సి అను మహావాక్యార్థమును బోధించును. బోధించిన అర్థమును షడ్విధ తాత్పర్యలింగములచే ఆలోచించి నిశ్చయించుకొనవలెనని పై పద్యార్థము సూచించుచున్నది. 1. ఉపక్రమోప సంహారములు, 2. అభ్యాసము, 3. అపూర్వత, 4. ఫలము, 5. అర్థవాదము, 6. ఉపపత్తి, ఈ ఆరింటిని శాస్త్రార్థతాత్పర్య నిర్ణాయకములుగా శాస్త్రజ్ఞులు పేర్కొనిరి. తత్త్వమసి అనువాక్యార్థము దేనిని బోధించుచున్నదో దానిని ఈ ఆరింటిచే ధ్రువీకరించుకొనవలెను. 1. ముందు శాస్త్రార్థము దేనితో ప్రారంభమైనదో దానినే అంతమున కూడా పేర్కొనిన యెడల ఉపక్రమో సంహారము లకైక్యము సంభవించుచున్నది మొదటి లింగము. 2. చెప్పిన అర్థమునే మాటి మాటికి చెప్పిన అభ్యాసమగును. 3. ఈ విషయము ఈ శాస్త్రప్రామాణ్యముచేతనే ఎఱుగదగినదిగా నున్నచో అపూర్వతయగును. 4. శాస్త్రార్థమునకు ఫలముచెప్పిన ఫలమగును. 5. ఉక్తార్థమును గూర్చి స్తుతిప్రశంసలు చేయబడిన అర్థవాదమగును. 6. శాస్త్రార్థ విషయమున దృష్టాంతములు చెప్పిన ఉపపత్తియనెడి ఆరవలింగము అగును.

తత్త్వమసివాక్యము ఛాందోగ్యములోనిది. ఆరుణియనువాడు ఒకజ్ఞాని ఆతనికి శ్వేత కేతువు అనెడి ఒక పుత్రుడు కలడు. 12 ఏళ్లవయసువచ్చినను

అధ్యయనముచేయక విద్యపై శ్రద్ధచూపకుండెను. ఆతనిని పిల్చి తండ్రి ఇట్లనెను. ఓరీ ఇప్పటివఱకు మనవంశములోని వారు చదువులేకుండగనే బ్రహ్మబంధువుల మని చెప్పికొని జీవించువారెవరు లేరు. అందరును బ్రహ్మజ్ఞులై సంచరించిరి. నిన్ను మొదలకొని ఇటుపైన పెద్దలపేరు చెప్పుకొని జీవింపవలసి వచ్చును. ఇట్టి దౌర్భాగ్యము దాపురింపకమునుపే అధ్యయనమున శ్రద్ధాళువుకమ్మని వంశ వృత్తముచెప్పి సుకుమారముగా మందలించెను. శ్వేతకేతువు పితృప్రేరితుడై గురుకులమున 12 ఏండ్లు వేదవేదాంగములను చదువుకొని ఇంటికి తిరిగివచ్చెను. అ ప్రణతస్వభావుడు అనూచానమానిగా నుండెడి పుత్రునిచూచి ఆరుణి ఇట్లనెను. ప్రియదర్శనా! కేవల శాస్త్రాచార్యోపదేశగమ్యమైన ఆ పరబ్రహ్మమును ఏది తెలిసిన అశ్రుతముశ్రుతము అమతము మతము, అవిజ్ఞాతము విజ్ఞాతము, అనిశ్చితము నిశ్చితమగునో దానిని గూర్చి మీ ఆచార్యుని అడిగితివా? అని ప్రశ్నించెను. అన్య విజ్ఞానముచే అన్యవస్తువిజ్ఞానమే కలుగును గాని తదితర జ్ఞానము ఎట్లు ఉపపన్నమగును? అని శ్వేతకేతువు తిరిగి తండ్రిని ప్రశ్నించెను. అరుణి ఇట్లు చెప్పెను. ఒక మృత్పిండకారణము తెలిసిన తద్వికారములైన ఘటశరావాదులు తెలియబడు చున్నవి. ఒక లోహము తెలిసిన లోహమయములైన కటకకేయూరాదులు తెలియును. అట్లే ఏక కారణవిజ్ఞానముచే తత్కార్యజాత మంతయు తెలియబడు ననుటకు దృష్టాంతము చెప్పెను. శ్వేతకేతువు యుక్తిసహమైన ఆ మాటనువిని గురుకుల క్లేశము తలచుకొని నాన్నా ఈ విషయము మాగురువులకే తెలియక పోవచ్చును. తెలిసిన చెప్పి యుండెడివారేగదా! కాన మీరేనాకు ఆ తత్త్వమును బోధింపుడు అని ప్రార్థించెను. అప్పుడు ఆరుణి తత్త్వబోధ మునిట్లారంభించెను. ఓ ప్రియదర్శనా! సృష్టికి మున్ను సద్రూపమొక్కటియే గలదు అది త్రికాలా బాధ్యమైన వస్తువు అను అర్థము గల సత్ పదముతో ప్రారంభించి చెప్పెను. ఉపసంహారమున ఈ సర్వము ఆ సద్వస్తువునకు సంబంధించినదే. ఇదియే సత్యము దీనికే ఆత్మ అని పేరు. ఆ బ్రహ్మపదార్థము నీవే అగు చున్నావు అని ప్రకరణము సమాప్తి చేసెను. ఇట్లు ఉపక్రమోపసంహారములందు బ్రహ్మకు గల పారోక్ష్యమును నిరసించి జీవునితో ఐక్యము బోధింపబడినది కాన ఈ గ్రంథతాత్పర్యము బ్రహ్మాత్మైక్య మందేకలదు అని తెలియుచున్నది.

2. ఛాందోగ్యము షష్ఠప్రపాఠకము అష్టమ ఖండము మొదలుకొని తత్త్వమసి శ్వేతకేతో తత్త్వమసి శ్వేతకేతో అని తచ్ఛబ్దముచే ప్రకరణాదిలోని బ్రహ్మపదార్థమే

పరామర్శింపబడుచు ఆ బ్రహ్మము నీవే అగుచున్నావు అని ఐక్యాభ్యాసము తొమ్మిదిమారులు చేయబడినదిగాన ద్వితీయ లింగముచేత పై తత్త్వమే నిరూపింపబడినది.

3. బ్రహ్మజీవైక్యము ప్రత్యక్షానుమానాదిప్రమాణములచే తెలియ దగినదికాదు. ఈ శాస్త్రప్రామాణ్యము చేతనే తెలియదగిన దై యుండుటవలన అపూర్వత అనెడి తృతీయ లింగము కూడా పై తాత్పర్యమునే సమర్థించుచున్నది.

4. అథముచ్యతే బ్రహ్మాత్మైక్యమునకు ఫలము ముక్తి ఇట్టి ఫలరూపలింగము చేతను పై తత్త్వమే సమర్థింపబడినది.

5. సృష్టి, స్థితి, లయ, ప్రవేశ, నియమనములనెడి ఐదు విశేషములు ఇందు వర్ణింప బడినవి. ఇవి ప్రాకరణికమైన వస్తువును ప్రశంసించునవి గాన, ఈ తత్త్వమే అర్థవాదములు కలదియై యున్నది.

6. ఒక మృత్తు తెలిసిన మృణ్మయములన్నియు తెలియబడుచున్నవి అను దృష్టాంతము ఉపపత్తిగానున్నది.

ఇట్లు షడ్విధతాత్పర్యలింగములతో జీవబ్రహ్మైక్యమందే శ్రుతి తాత్పర్యమ కలదని పై ప్రకరణార్థము నిర్ధారితమగుచున్నది. ఇక తత్, త్వం, అసి, అనుపదములకు అర్థము ఆలోచింపవలసియున్నది. పై మూడు పదములకు అది నీవు అగుచున్నావు. అని వాచ్యార్థము, ఇందు తత్ త్వం పదములు సర్వనామములు. అందును ప్రకరణాదిలో ఏ వస్తువు ఉపాత్తమైనదో ఆ వస్తువునే పరామర్శించి చెప్పునదై యుండుట తచ్ఛబ్దసర్వనామము యొక్క విశేష గుణము. ఈ పదములనిట్లు వరుసగానే అన్వయించినచో తచ్ఛబ్దము పరోక్షబ్రహ్మను నిర్దేశించునది అగును. త్వం అనునది సన్నిహితుడైన జీవుడు శ్వేతకేతువును నిర్దేశించుచున్నది. ప్రకరణమును బట్టి వాటికి ఆయా అర్థములు తత్పదమునకు సర్వజ్ఞుడని వాచ్యార్థమగును. త్వం పదమునకు కించిజ్జ్ఞుడను వాచ్యార్థముగను స్వీకరింపవలసివచ్చినది. సర్వజ్ఞకించిజ్జ్ఞ శబ్దముల కైక్యము కుదురకపోవుట అనెడి తాత్పర్యానుప పత్తిని బట్టి జహదజహల్లక్షణలేక భాగ త్యాగలక్షణచేత సర్వకించిత్త్వులనెడి విశేషాంశములను వదిలి జ్ఞత్వమైన చిద్రూపాంశమును మాత్రమే పరిగ్రహించవలయును. ఇట్లు పరిశిష్టములైన చిదంశములకు ఐక్యము అసి అనుపదముచే సిద్ధించుచున్నది.

దీనికే ప్రత్యభిజ్ఞయనియు పేరు కలదు. మున్నుగన్న శ్రీహీరుని నేడు చూచియతడే యితడనుచు చెప్పిన ప్రత్యభిజ్ఞచే గుర్తించినట్లుగను తత్కాల తద్దేశవాచక శ్రీహీరునికిని ఏతత్కాల ఏతద్దేశ విశిష్టుడగు శ్రీహీరునికినీ భేదమున్నను విశేషణాంశములను వదిలి శ్రీహీరుని పిండైక్యమును మాత్రమే తచ్ఛబ్దఇదం శబ్దములకు అర్థములుగా లక్షణాశక్తిచే పరిగ్రహించిన శ్రీహీరుడొక్కడే అని అభిన్నముగా తెలియబడును. త్వం, తత్, అసి అని అన్నచో త్వం పదము విశేష్యమగును. తత్ విశేషణ మగును. అప్పుడు, జీవుని దుఃఖిత్వమును నిరసించి తద్రూపత్వము విధింపబడుచున్నది. తత్, త్వం అసి అని వైపరీత్యముగా అన్వయించినచో, తత్ అనునది విశేష్యము త్వం అనునది. విశేషణము అగును అప్పుడు సర్వజ్ఞుని పారోక్ష్యమును నిరసించి ఆ శుద్ధమైన పరబ్రహ్మావు నీవే యని రెంటికి నైక్యము తెలియుచున్నది.

**గీ॥ త్వంపదమ్ము విశేష్యమ్ము తత్పదమ్ము తద్విశేషణభావమ్ము నుద్వహించు**
**వీని దుఃఖిత నిరసించి వెలయు తత్స్వ రూపత విధింపబడుచున్న దీ పథమున**
**గీ॥ వైపరీత్యమున నెఱుంగవలె విశేష్యమయ్యెదత్పదలక్ష్య మయ్యె దత్పదలక్ష్యమహార్థమందు**
**ద్వంపదమ్ము విశేషణత్వమున జెంది తత్పరోక్షత్వమెడలించు దాని కయ్యె**

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 59, 60 పద్యములు

**కం॥ జహదజహల్లక్షణచే జిహాసితాంశముల వదలి చిద్భాగములన్**
**సుహితమతినెంచగాశ్రుతి విహితార్థసమన్వయమవువెరవరికనఘా**

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 56వ పద్యము

ఏవం విధముగా ఐక్యమును శ్రవణము వలన సాధించుకొనిన పెదపమననమునకు యోగము కావలెనని దత్తదేవుడు సమాధియోగమును సాంగోపాంగముగా బోధించెను. యోగవిద్యాసమాహారాధ్యాయముననిది మాడదగినది. ప్రాణాయామాదులతో సవికల్పక సమాధికలిగిన దానిని నిది ధ్యాసనమందురు. దానికి ముందుగా విజాతీయ ప్రత్యయ నిరాసముచేసి సజాతీయవృత్తి ప్రవాహీకరణమునకై పాటు పడవలెను. నిశ్చయింపబడిధారణ ంచే చింతితమైన తత్త్వమును యుక్తులచే మననముధ్యానముచే స్వవశము గావించుకొనుట వలన రూఢమగును. నేను ఆ ఆత్మను, బ్రహ్మయే నేను అనెడి మనో వృత్తినిలుచువఱకు యత్నించుట మనన స్థితి యగును.

---

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 15వ పద్యార్థము

శ్లో॥ ధ్యానం నిరంతరం ప్రోక్తం మానసం చ మనీషిభిః ।
సమాధిస్సవికల్పస్తునిదిధ్యాసనముచ్యతే ॥

దత్తమాహాత్మ్యము - 3వ అంశ - 9వ అధ్యాయము - 35, 36 శ్లోకాలు మరియూ 62వ శ్లోకము

పిదపవృత్తియను ఉపాధివిలయము జరుగగా స్వప్రకాశవస్తు సంప్రకాశనము చేయునవసరముండదు. కావున చిత్ప్రతిబింబమే చిత్తు అగును. అజ్ఞాతునియొక్క విషయముననే మనోవృత్తికి ప్రయోజనము, మనస్సుతోనే చూడవలెనని శ్రుతిచెప్పుచున్నదిగావున అట్లు చేయవలెను. అచ్చట మనస్సు బ్రహ్మను తలంపలేదు. వాక్కుకు అందనిది స్వయంప్రభము అట్టిదానికి ఫలాధికరణ వృత్తిత్వమే నిరసింపబడుచున్నది. వృత్యధికరణవృత్తిత్వము కోర దగినదగుచున్నది. బ్రహ్మయందు అజ్ఞాననాశముకొఱకై వృత్త్యధికరణ వ్యాప్యత్వమే కోరదగిన దగుచున్నది. ఎంతవఱకీ వృత్తి శమింపదో ఎంతవఱకు జ్ఞాతృజ్ఞేయ విభాగముండునో అంతవఱకు సవికల్పసమాధి వృత్తిలయించిన నిర్వికల్ప సమాధియగును. అణి మాద్యష్ట సిద్ధులు కలిగినను వాటికై యోగిమక్కువ చూపెట్టిన చెడిపోవును. నివాతస్థ దీపమువలె వృత్తి శూన్యుడైనయోగి బ్రహ్మీభూతుడై బ్రహ్మానందముతోనుండును. అప్పుడు హృదయగ్రంధి (చిదచిద్గ్రంధి) విడివడును. సర్వసంశయోచ్ఛిత్తి సర్వకర్మక్షయము కలుగును. బ్రహ్మానుభవపర్యంతమైనయోగావస్థ నిరూపింపబడినది. ఇట్టి నీవిక హృదయమున నిరూఢమైన పరబ్రహ్మను సుస్థిరముగా చూడగలవు. ఈ యోగాదేశమును అవినీతునకు చెప్పకుము వినీతుడు శుద్ధచిత్తుడగు స్వశిష్యునికే బోధింపవలెనని కార్తవీర్యుని ఆదేశించెను.

శా॥ వృత్తివ్యాప్తివిహీనసుస్థిరుడు బ్రహ్మీభూతుడౌయోగికిన్
చిత్తగ్రంథివిభిన్నమౌసకలసందేహంబులున్ భిన్నతా
విత్తంబుల్కృతకర్మముల్విహతముల్ విద్యల్కృతార్థత్వసం
పత్తుల్గాగలవాక్యమాత్రనృపతీ పాటింపుమిట్లింతయున్

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - 102వ పద్యము

కార్తవీర్యుడును దత్తదేవునికి సాష్టాంగ ప్రణామములాచరించి నీదు పదమే సంసార రోగభేషజము - పూలమాలయందు సర్పభ్రాంతి వలె ఎవ్వనియందు ఈ విశ్వము అనృతముగా తోచుచున్నదో అట్టి గతిని నాకు ఉపదేశించితివి. ఆత్మానాత్మలలో ఆత్మను వేఱుపరచిన పరమహంస స్వరూపుడవైన నీ కనేకనతులు

ఆయా దేవుడవైన నీవే మును, మూలాధారమున ప్రాణవాయు పరిస్పందనమున పరావాక్కుగాను, నాభియందు పశ్యంతిగానూ, హృదయమందు మధ్యమ నామముగాను ముఖసీమ యందు వైఖరీ వాగ్రూపముగా ప్రకాశించి ఇష్టార్థము లను కలుగజేయుదేవాడవైన నిన్ను శరణుపొందితిని, దారువును మధించిన అగ్ని ఉత్పన్నమై ఎట్లు ప్రజ్వలించునో అట్లే ఈ విశ్వమున నీవుంటివి. అదిని ఏకరూపమే అవ్యక్తమే అయి కాలగతిని త్రివృత్తుచే (మాయచే) పుడమి చల్లిన విత్తనములవలె బహురూపుడవై ప్రకాశించు చున్నావు. ఏ నీ యందు ఈవిశ్వము ఓత ప్రోతమైయున్నదో అట్టి జ్ఞానసహస్రభానువైన నిన్ను శరణము పొందుచున్నాను.

మాయావిభాతమైన ఈ సంసారము తరువు. అనాది పుణ్యపాపములు బీజములు, అనేక శతవాసనలే, దీని మూలము, సత్వరజస్తమోగుణములు త్రినాలములు. శబ్దస్పర్శ రూప రసగంధములు స్కంధములు. "ఇంద్రియములే శాఖలు వాతపిత్తకఫములు వల్కలములు (పట్టలు) రెండు పండ్లు సుఖదుఃఖములు, జీవేశ్వరులు పక్షులు. జీవుడు అందొక ఫలము దుఃఖరూపమైనను దానిని అనుభవించుచుండును. హంసలగు వారు సుఖ రూపమైన ఫలముననుభవించుచు జ్ఞానమనెడి గొడ్డలిచే సంసార తరువును నరికి నిత్య సుఖమందుదురు. ఇట్లు విదితవిజ్ఞానుడైన కార్తవీర్యుని హస్తమస్తక సంయోగముచేసి ఏ జ్ఞానమును నా వలన పొందితివో ఆ తత్త్వమును చింతింపుము. అప్పుడు కృతార్థుడవు అగుదువు అనెను.

ఇట్లు దత్తదేవుని అజ్ఞానుసారము ప్రక్కనే ఉన్న గుహను చేరి యోగముతో అల్ప కాలములోనే కార్తవీర్యార్జునుడు సమాధిస్థుడై స్థాణువువలె నిశ్చలుడై 13 మాసములుండి తిరిగి లేచి స్వామి పాదారవిందముల వ్రాలెను. స్వామీ నేను పరమానందభరితుడనైతిని అని నిర్వికల్పసమాధిలోని అనుభవమును యథాతథముగా వర్ణించెను. తిరిగి గురునాజ్ఞతో గుహలో కూర్చుండి 6 నెలలు సమాధిస్థితుడై ఆనందమునందెను. ఇట్లు కార్తవీర్యుడు అద్వైతమతమునకు సంబంధించిన నిర్వికల్పసమాధిని పొందినట్లు ఈ క్రింది పద్యమున కలదు.

**మ॥ పరమానందపదంబునన్ మునిగితి న్భాసింపదయ్యెన్ హృదం**
**తర మందుంద్రిపుటీవిధంబెదియుదత్సం రూపితం బాత్మసౌ**
**ఖ్యరవంబద్ది క్షణార్థమౌననుభవంబందంగనౌ బో బలో**

**త్తర మారబ్ధములాగె దేహదశకున్ ద్వచ్ఛక్తినే మందునౌ**
**కరుణానిలయం ప్రాపుః మనసాసహచిత్తనౌ**
**పరానందపదేమగ్నేత్రితయం న విభాతిమే**
**క్షణార్ధమనుభూయాహమథాద్యంత నిరూపమం**

దత్తమాహాత్మ్యము 3వ అంశ 9వ అధ్యాయము.

కార్తవీర్యుడు ఉప్పుకల్లునీటిలోబడి నీరయినట్లు త్రిపుటినాశమై బ్రహ్మానందముతో వచ్చి తన అనుభవమును గురునకు చెప్పెను. కావుననే కార్తవీర్యుడు మరల మరల తదనుభవమునకై కొసరికొసరిగుహలో నుండి చిన్మయుడై యుండెను. మరొక సంవత్సరమిట్లు గుహయందుండి తిరిగి గురువునకు మొక్కెను. దత్తవిభుడు ఈ క్రింది పద్యములలో లోక సంగ్రహము కొఱకైనను తాను కర్మనాచరించినట్లు కలదు. ఈ యర్థమునే భగవద్గీత యందు కూడా శ్రీకృష్ణుడర్జునునకు బోధించెను. లోకసంగ్రహమే వాపి సంపశ్యన్ కర్తుమర్హసి యద్యదాచరతిశ్రేష్ఠః తత్తదేవతరోజనః సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥భగవద్గీత 3వ అధ్యాయము - 24వ శ్లోకము.

ఓ కార్తవీర్యుడా! తత్త్వమెఱింగిన నీకిక కృత్యంబు లేదు. అయినను లోక సంగ్రహము నెంచి సదాచారముల గూర్చి చెప్పవలసియున్నది. చెప్పెద వినుము తత్త్వమెఱింగిన నీకు నాకు కృత్యమేదియు లేకపోయినను వేదవిధిననుసరింప వలసినదే సుమా, శ్రేష్ఠుడేది యాచరించునో దానినే ఇతరులును అనుసరించు చుందురు. ఆశ్రేష్ఠుడు ఏది ప్రమాణమనిన అదియే లోకమను వర్తించునని భగవద్గీత, కాన నాచారముల విషయమున సందేహ మడుగుమను చెప్పెదనెను.

గీ॥ **ఆత్మరతియైనవెవ్వాడు స్వాత్మతృప్తు డాత్మయందె సంతుష్టుడౌనట్టి యోగి**
**కాచరింపదగిన కార్యంబులేదు కృతమకృతమాతనికి నర్థమిడదెడపడ**

దత్తభాగవతము 6వ గుచ్ఛము - 142వ పద్యము

ఆత్మారామునికి ఆచరింపదగిన కార్యము లేదు. అట్టి అద్వైతనిర్వికల్ప సమాధి కార్తవీర్యునికి అనుగ్రహించిన మహనీయుడు, దత్తదేవుడు.

# ఉత్తరార్థము

## 11వ అధ్యాయము

## హర్షోపేత - కథాంశములు

ఒకప్పుడు నైమిశారణ్యవాసులయిన శౌనకాదులు తమ నిత్యనైమిత్తికాద్య నుష్ఠానములయిన తరువాత చిత్తవృత్తులను ఆపునట్టి ఒక నిశ్చలవృత్తితో ఓ సకల కారణకారణమైన తత్త్వమును ఆలోచించుచుండిరి. ఇంతలో కోటి సూర్యప్రభా సమానమైన నొక తేజః పుంజమును కనుగొనిరి. అంతటా నిండియున్న ఆ తేజమును చూడలేక స్వామీ దురదృష్టవంతులకు దొరకని, గనివలె మాకు ధ్యానమున గోచరించియు కన్నులతో చూచుటకు వలనుకాకుంటివి. మా ప్రార్థనలాలకించి మాయ అనెడి వస్త్రమును తొలగించి అచ్యుతుడవైన నీదర్శన భాగ్యము మాకు కలిగింపుమనిరి. ఆ తేజమునుండి మునులారా! ఇపుడు కనుల తెఱచి చూడుడు, మీకిపుడు దర్శనయోగ్యుడనై వచ్చియుంటినని వినవచ్చినది.

వెంటనే మునులు త్రిమూర్త్యాత్మకమైన దత్తదేవుని చూచిరి. చారు చందన చర్చితుడు చతుర్భుజుడు దండకమండల పాణిస్వర్ణయజ్ఞోపవీతధారి, శంఖచక్ర గదాద్యాయుధధారియైన విష్ణువు గానూ ఒక పరి త్రినేత్రుడు త్రిశూలధారియగు మహేశ్వరునిగాను ఆ మునులకు సాక్షాత్కరించెను. మునులాస్వామికి షోడశోపచార పూజలు చేసి స్తుతించిరి. నీవు నిష్కారణుడవు. కారణ కారణుడవు. పురుషోత్తముడవు యోగులకు పరమాత్ముడవు గాను సాంఖ్యులకు ప్రకృతి పురుషులుగాను, వేదాంతులకు పరబ్రహ్మముగాను మీమాంసకులకు కర్మధర్మ స్వరూపముగాను బౌద్ధులకు విజ్ఞాన మయుడవుగాను ఒక్కడవు అయినను తత్తన్మతస్థులకు ఆయావిధముగా గోచరించుచుందువు. ఎవరెట్లు భజించిన ఆ విధముగా దర్శనమిచ్చుదేవుడవు. పాణి పాదములు లేకున్నను పరుగెత్తి గ్రహించగలవాడవు. కనులు లేకున్నను చూడగలవు. చెవులు లేకున్నను వినగలవు. మరొక్క వేత్తయునీకంటె నెవడులేడు. జీవులకు సంజీవనివి, జ్యోతులకు జ్యోతివి నీనామము మాకు అనుగ్రహింపుమని వేడిరి.

మునులారా! నానామరూపములనంతములు నేను తత్త్వమునకు ముఖ్య సాధనమైన యోగమును నిర్దేశించుటకు అత్రి అనసూయలకు పుత్రుడనైన దత్త దేవుడను పేరుతో నవతరించినవాడను, నాతత్త్వమును ఈ సూతుడు వివరింప

గలడు, అని ఆ దేవుడు అదృశ్యుడయ్యెను. ఇంతలో శౌనకాదుల శిష్యులు అడవి నుండి సమిత్కుశఫల పుష్పాదులతో ఆశ్రమములకు తిరిగి వచ్చిరి. మునులు తమకు కల్గిన దత్త విభుసాక్షాత్కారమును శిష్యులకు వివరించిరి. ఆ స్వామి విశ్వరూపమును మేము చూడలేక పోతిమే అని మిగుల పరితపించిరి. మునులు వారినోదార్చిరి. ఆ స్వామిరాకవలననే కాబోలువనమంతయు నిష్కంటకమై నానావిధపుష్పఫలభరితమై నూత్నముగా నేడు వింతగా కన్పించినదని గురువులకు శిష్యులు విశదీకరించిరి. శిష్యులతో బాటు సూతుని వద్దకు ఆ దత్తదేవుని లీలా విశేషములను వినుటకై వెళ్లిరి.

1 దత్తుడను పేరు ఆ స్వామి కెట్లు వచ్చినది. 2 బాలోన్మత్తజడపిశాచలీలలు ఆ దేవునికెట్లు తగును? 3 ఆ స్వామి భక్తులగాథలెట్టివి? 4 యోగాదేశావతారుడై యోగతత్త్వమే మియుపదేశించెను? 5 లోక సంగ్రహార్థమాతడొనర్చిన విధులేమి? వివరింపుమని మునులు అర్థించిరి. సూతుడు ఆకాశమున తమ శక్తి కొలది పక్షులెంతవఱకెగురగలవో, అట్లే నా శక్తి కొలది ఆ దత్త మాహాత్మ్యమును వివరించెదనని నరనారాయణులకు, మనస్సుల మలమును అపహరించెడి గంగమ్మకు, సరస్వతికి, వ్యాసునికి, గణపతికి, గురువులకు, మునులకు, మ్రొక్కెను. దత్తదేవుని నిధ్యానించెను. మానసమున సాక్షాత్కరించుకొని, ఇట్లు కొనియాడెను. శివ, విష్ణు, స్వరూపుడవు, జ్ఞానివి, చేతులు లేనివానికి వేయిచేతులనిచ్చి సప్త ద్వీపాధిపత్యము నొసంగి కార్తవీర్యుని, అలర్కుని, యదువును, ప్రహ్లాదుని, ఇంద్రాదులను కాపాడి విముక్తిమార్గమునుపదేశించినవాడవు. నీ పాదమును కడిగిన జలలేశము గంగ, ద్వైతరహితడవు అని స్తుతించిరి. స్వామియు దర్శనమిచ్చి ఓయీ ఈ మునులకు నా అవతారమును వివరింపుమని సూతునకు ఆనతిచ్చి అంతలోనే అదృశ్యుడయ్యెను.

సూతుడిట్లు దత్తాత్రేయానుగ్రహమును పొంది దత్తమాహాత్మ్యములో శ్లోకముగాని, శ్లోకార్థము గాని, తదక్షరముగాని చదివెడు వినెడు మహాత్ములకిది కొంగుబంగారము. ఏడు వారములు పఠించిన, సంకటస్థితి తొలగి సర్వకామములు సిద్ధించునని ఫల శ్రుతినుడివి, గురుశిష్యసంవాదాత్మకమైన దత్తకథను వినుడనగా మునులు గురుశిష్యపదములకు అర్థము తెల్పుమనిరి. సూతుడిట్లు చెప్పెను. ఒకప్డు బ్రహ్మ చాతుర్వర్ణ్యమును, ఆశ్రమ చతుష్టయమును, చతుర్యుగాచార ధర్మ పురస్సరముగా సృజించెను. కాలము ననుసరించి కలియుగమున తగు

ధర్మమర్యాదను చేయుటకై కలి పురుషుని కూడా సృజించెను. ఆ కలి పురుషుడు మిగుల క్రూరుడు పిశాచముఖుడై, ఏడ్చుచూ, రోత పుట్టించుచూ ఒక చేతితో మగ గుతిని మరొక చేతిలో నాలుకను పట్టుకొని దిగంబరుడై ఒక పరి నవ్వుచూ బ్రహ్మఎదుట నిలబడెను.

ఓరి దుష్టుడా నీవు నా యాజ్ఞచే భువికేగి వర్ణాశ్రమ ధర్మపరిపాలన మొనర్పుమని బ్రహ్మ చెప్పెను. స్వామీ పేనునకు పెత్తనమిచ్చినట్లు నాకీయాజ్ఞ ఏల? ప్రజలకు సర్వనాశము కలుగ గలదు. మరియూ ధార్మికులు గురుభక్తితత్పరులు మొదలగు వారందరు నాకు శత్రువులే అట్టియెడనేనెట్లుండగలనని కలి ప్రశ్నించెను. ఓయీ నీవు కాలమల మైనవాడవు. మలమునకు శుద్ధి లేనట్లే నీకును శుద్ధి యుండదు. యథేచ్ఛగా భువియందు విహరింపుము. గురుభక్తి తత్పరులవద్దకు వెళ్ళకుము అని విధి ఆనతిచ్చెను. స్వామీ గురుశిష్య శబ్దముల కర్థము వివరింపమని కలి అడుగగా బ్రహ్మ ఇట్లు చెప్పెను. గురుశబ్దము బ్రహ్మ, విష్ణు మహేశ్వరాత్మకము గురుశిష్య సంవాదమున ఈ పదముల కర్థము తెలియునని విధి ఇట్లు చెప్పదొడగెను.

గోదావరీ తటమున వేద ధర్ముడను గురువు కలడు. అతని శిష్యులో దీపకుడు ఉత్తముడు. ఒకమారు తన గురువును గూర్చి గురు శబ్దార్థము వివరింపుడని ప్రార్థించెను. వేద ధర్ముడిట్లు చెప్పెను. గకారము గణేశ బీజము, తదుపరి ఉకారము విష్ణువాచకము, రేఫము అగ్ని బీజము అశుభనాశకము ఇట్లు గురుశబ్దమునకర్థము సర్వసిద్ధిప్రదుడు అశుభనాశకుడైన అచ్యుతుడే సుమా! మరియు హితము చెప్పువాడు కాన గురువు అనుపదము తల్లితండ్రి అత్త మామపినతండ్రి పెత్తండ్రి అన్న ఇట్లు అందరి యందూ వర్తించును. వేదాన్తమును బోధించినవాడు మహాగురువు అగుచున్నాడు. బ్రహ్మనిష్ఠుడైన శ్రోత్రియగురువును తన గురు శుశ్రూషను గుర్తుచేసికొనుచూ ఇట్లనెను. శ్రీ దామా! మనగురువుదారలు సమిత్కుశ ఫలపుష్పాదులకై వనమునకు పంపిరి. మార్గమధ్యమున గాలివాన దాపురించి దారిడొంక తెలియక రాత్రి అంతయూ చలితో వాననీటిలో శ్రమించితిమి. తెల్లవారిన తరువాత శిష్యవత్సలుడగు గురువు మనలను వెదకుచు వచ్చి మనకు సర్వసిద్ధులను ఆధ్యాత్మిక విద్యనూ అనుగ్రహించినాడు, కాన గురుసేవా పరాయణునకు సర్వము సిద్ధించునని బాల్య చరిత్రమును గుర్తుచేసి గురువులేక ఎంతటి ప్రతిభావంతునికైననూ ఏదీ సిద్ధింపనేరదు అనెను. తరువాత

కొంతకాలమునకు వేద ధర్ముడు కొంత ప్రారబ్ధముననుభవింపవలసి వచ్చినది. కాశీపురి యందున్నచో తక్కువ కాలము లోనే తీరిపోవునని కాశీకి పయనమయ్యెను. గురుసేవా పరుడగు దీపకుడు వెంటనంటివచ్చెను. కాశీమహిమమునడిగెను. 1 విశాలాక్షి 2 విశ్వేశ్వరుడు 3 గంగ 4భైరవుడు 5 ఢుంఢి6 దండపాణి. ఈ ఆరుగురిని సేవించిన వానికి షడింద్రియజయము కలిగి షడంగయోగముచే తరింపగలడని గురువుచెప్పెను.

ఇంతలోనే వేద ధర్మునికి కుష్ఠురోగము అంధత్వము ప్రారబ్ధము వలన సంప్రాప్తమయ్యెను. రోగముల వలన సహనము,వాత్సల్యము, పోయి, కోపియై, యుండెడి గురువునకు రాత్రింబవళ్లు ఏమఱక దీపకుడు సేవచేసెను.ఒకపరి తిట్టినను,కొట్టిననూ చలింపక గురువు రుచి, పాకాలకనుగుణముగా భిక్షి తాన్న మునిచ్చి సేవ చేసెను. శివుడు వరము కోరుకొమ్మని ననూ, కోరుకొనలేదు. తనగురువు ప్రారబ్ధము,పోగొట్టు మనెడి ప్రార్ధన కూడా చేయవలదనగా మానివేసెను. ఇపుడు ప్రారబ్ధమును అనుభవింపకున్న మరొక జన్మ మెత్తవలసివచ్చునని గురువు చెప్పగా నట్లే పరిచర్య చేయుచుండెను. శివుని వలనదీపకుని గురుభక్తిని గూర్చి విని మాధవుడు స్వయముగా వరమీదలచి వచ్చెను. దీపకుడపుడు కూడా ఏమీకోరక గురమహిమను గూర్చి అడిగి తెలిసికొని యధాతధముగా గురుశుశ్రూష నొనర్చెను. మాధవుడును అతని భక్తికి మెచ్చి అదృశ్యుడయ్యెను. గురువు ఇట్లిరువది ఒక్కవత్సరములు ప్రారబ్ధము అనుభవింపగా అది నశించినది. వేదధర్ముడు మునుపటి వలె నీరోగుడై ప్రకాశించి తనకు పరిచర్య చేసిన దీపకుని మెచ్చుకొని వరము కోరుకొమ్మనెను.దీపకుడవుడు దత్తదేవు మాహాత్మ్యమును వివరింపుమనగా ఆ ప్రశ్నకు ద్విగుణముగా సంతసించి ప్రేమించి శ్రీ దత్తదేవ చరితమును సవిస్తరముగా శిష్యునకు చెప్పదొడగెను.

11-2 :- వేదధర్ముడు దీపకునికి, దత్తాత్రేయాష్టోత్తర శతనామావళిని దత్తకవచమును, దీపకునికి ఉపదేశించెను. దత్తదేవుని జన్మవృత్తాంతమునిట్లు చెప్పెను. అత్రిమహర్షి అనసూయతో బాటు సంతానార్థియై శత సంవత్సరములు తపమాచరించెను. ఆతపమునకు ప్రసన్నులై త్రిమూర్తులు తమ అంశములతో మీకు పుత్రులమై పుట్టెదమని,వరములనిచ్చిరి. బ్రహ్మ, చంద్రుడుగానూ, శివుడు దుర్వాసుడు గాను, విష్ణువు స్వయం ప్రదత్తుడౌట వలన సార్థకనామధేయుడై

త్తునిగాను ఆ దంపతులకు సుతులుగా నయిరి. అందులో, దత్తదేవుడు ›గాగాదేశావతారమై విలసిల్లినాడు. ప్రహ్లాదుడా స్వామిని ఇట్లడిగెను. స్వామీ ఏమీ నకయే బలిసిన వానివలెను విత్తాదులు లేకున్నను భోగభాగ్యాలతో నిండిన నివలెను ప్రయత్నము లేకుండా ఇట్లేల యుండగలిగితిరి. ఈ నీవృత్తి మాకు చిత్రముగా నున్నది వివరింపుమని ప్రార్థించెను అపుడా దత్తాత్రేయుడు హ్లాదునితో నిట్లనెను.

ప్రహ్లాదా! నీవు భాగవతోత్తముడవు, కామోపశాంతివలన, సౌఖ్యమెక్కువ ని నీవెఱుగవా! ఆశవలన సర్వానర్థములు కలుగును. దానిని వీడినవానికి నంతసౌఖ్యమమరునుగదా ! యాదృచ్ఛికముగా అభ్యసించితిని. రాళ్లయందు చిత్రతల్పములందు మట్టిబెడ్డ, రత్నములందు దివ్యమాలయందును తృణముల ందును సమభావముతో నుందును. ఒక చోదిగంబరుడను, పీతాంబరుడను, స్తవిభేదమునందు చిత్తినిప్రేల్చి,చిత్తిని. చిత్తమునందు చిత్తము, అహంకారము దు, అహంకారము మహత్తునందు, మహత్తు మాయయందు మాయను నము నందులయింపజేసి స్వస్వరూపాను భూతితో నుందును. నాకేటికి ఈ ఖదుఃఖచింత? అని చెప్పగా విని ప్రహ్లాదుడా ఉపదేశమునకానందించి పురమును చేరెను.

దానిని విని, గురుదేవా! ఆజగర వృత్తితో నున్న ఆతడు దత్తదేవుడనుకొనుట ్ల? అని దీపకుడు గురుని అడిగెను. దత్తదేవుడు అనియతనామరూపములు నాడు. కార్తవీర్యార్జునునికి అవిద్యను తొలగించిన మహనీయుడు. అణిమాద్యష్ట ్ధలనిచ్చి రావణాదివీరులను కూడా బందీలనుగా చేయించుకొనగలట్టి పరాక్రమములను కార్తవీర్యునికిచ్చినాడు. అలర్కాదులకు యోగతత్త్వో శకుడు, తండ్రిచే నిర్వంశుడగుదువని శపించపబడియు యదువు, దత్తదేవ ు ప్రసాదమున అవిచ్ఛిన్నముగ సంతతిని అందును మహావిష్ణువే కృష్ణునిగా తరించగలిగినట్టి సద్వంశమౌటను వరమునుగా పొందినాడు. శివుడు కోపించిన ువు రక్షింపగలడు, గురువు కోపించిన ఎవడు రక్షింపలేడన్న సూక్తియదు ాేరాజు విషయమున చరితార్థము కదా మరియు, నొకపరి దత్తదేవుని నువిట్లడిగెను. ఓ అవధూతా ఔపనిషదమైన ఆత్మతత్త్వమెఱింగించుము. ుము కర్తవుగావు. నిర్మమ నిరహంకార రూపుడవై నిరంజనుడవై కామివిగాక

యుండెడి ఈ మార్గమును నీకెవరు నేర్పిరి. ఇంద్రియ జయము నీకెట్లు అబ్బినది. అని సవినయముగా నడిగెను. అప్పుడు అవధూతయగు దత్తస్వామి ఇట్లు పలికెను. పంచభూతములు, చంద్రరవులు, కపోతాజగర, సింధువులు, పతంగ మధుపేభములు, మధుహరుడు హరిణమీనములు, కురర, పింగళార్భకులు, నాగ శరకృత్కుమారీమణులు, ఊర్ణనాభి, భ్రమరము ఇట్లు మొత్తము 24మంది గురువుల వలన ఈ నడవడి నాకు అబ్బినది. దానిని వివరించెదను వినుము.

1. తన జన్మము,వ్యాపనము, పరోపకారమునకగుటయు, ప్రాణులెట్లు తిరిగినను చలింపకుండుటయు అను ఈ రెండును భూమివల్ల నెఱింగితిని.

2. అన్నమేదైనా ప్రాణము తృప్తమగుట, అనేక విధ గుణసంయోగమున్నను వాటితో చేరకుండుటను బట్టి యోగి జ్ఞానమునణచనట్టి అన్నము తినవలెను గుణసక్తుడు కాకూడదను నీ రెండును వాయువు వలన తెలిసి కొంటిని.

3. అంతటనిండియు, నిస్సంగత్వమును, వాయువుచే చెదరగొట్టబడిన మేఘాలు కల్గియు వాటిచే స్పృశింపబడకుండుటయు ఆకాశము వలన నేర్చుకొంటిని.

4. నీరము స్వభావమధురము. భిన్న భిన్న దేశములనుండుటనుబట్టి, తత్తద్గుణములు కలిగినదగును.అట్లే ఆత్మనిర్గుణము, గుణోపాధులనుబట్టియే, భేదములు వచ్చెనని తెలిసికొంటిని

5. అగ్ని సర్వభక్షకుడయ్యుదోషమును పొందదు, మఱియు కాష్ఠాకృతులను బట్టి ఆయా ఆకారము కలిగియుండును. అట్లే ఆత్మశుద్ధము స్వీయమాయోపాధి తనువులతోకూడి తత్తద్రీతిగా తోచుచు ఉండునని, జ్వాలలకు ప్రకాశా ప్రకాశముల వలె ప్రకాశములు శరీరమునకే కాని ఆత్మకు లేవని అగ్ని వలన గ్రహించితిని.

6. చంద్రుని కళలకు హాని వృద్ధులుగాని, చంద్రునికి లేనట్లే షడ్భావ వికారములు దేహమునకే కాని ఆత్మకులేవు అని చంద్రుని వలన గ్రహించితిని.

7. సూర్యకిరణములకే జలము గ్రహించి విడుచుట కాని, సూర్యునికి లేనట్లే ఆత్మ నిష్క్రియము రవి ఒక్కడైననుతరంగములలో ప్రతిబింబించి, బహు రూపుగుటను బట్టి, ఆత్మకెట్టి సంబంధము లేదనియు, ఉపాధి భేదము చేనానావిధములయ్యెనని రవి నుండి తెలిసి కొంటిని.

8. కపోత దంపతులు తమ పిల్లలపై అతి స్నేహము చేయుటవలన వ్యాధుని వలలో చిక్కి అందరు చనిపోవుటను చూచి, అత్యాసంగము అతి స్నేహము ఎచ్చటను చేయకూడదని నిర్ణయించుకొంటిని.

9. తనకుపలబ్ధమైన ఆహారముతో సంతుష్టి నందియుండుట అజగరము వలన శిక్షితుడనైతిని.

10. నదులతో ప్రవాహోప్తి కలిగియున్నను లేకున్నను సముద్రుడెట్లు గంభీరుడై యుండునో యోగియు. నట్లేయుండవలెనని సముద్రుని వలన శిక్షితుడనైతిని.

11. నిప్పును జూచి, మిడత, పండని భ్రమపడి అందుపడి నశించునట్లేధన కనక యోషిదాదులందు మోహవిభ్రాంతిచే యోగి నశించునని మిడతవలన నేర్చుకొంటిని.

12. ప్రతి పుష్పమునుండి సారము గ్రహించు తుమ్మెదవలె యోగి సర్వశాస్త్ర సారము సంగ్రహింప వలెనను నర్థము తుమ్మెదవలన తెలిసినది.

13. తేనె టీగలు తేనెను కూడబెట్టి చావునోవులకగ్గమగు చుండుటను చూచి యోగికి పదార్థ సంగ్రహముకూడదను జ్ఞానము తేనెటీగల వలన నాకు కల్గినది.

14. ఆడ ఏనుగుపై గల కామాంధత్వమున గజము బంధింపడుటను చూచి కర్రతో చేయబడిన లేక శిలారూపమైన కామినినైయైనను కలలో నైనను యోగికి చూడదగినది కాదని గజము వలన నేర్చుకొంటిని.

15. హరిణము గ్రామ్యగీతము యొక్క వినుకలిచే కదా ఉచ్చులోపడుచున్నది యోగికి గ్రామ్యగీత మందొకప్పుడైనను వినుకలి కూడదని హరిణము వలన తెలిసినది.

16. జిహ్వాచాపల్యముచే మీనము(చేప) చచ్చుచున్నది యోగికి జిహ్వాచాపల్యము పనికి రాదనెడి నీతిని చేపనుండి సంగ్రహించితిని.

17. పింగళ అను వేశ్య వలన నిర్వేదమే నైరాశ్యమేసుఖకరమని తెలిసికొంటిని.

18. మాంసము ముక్కునగఱచినపుడు బలిష్ఠములైన పిట్టలతో పోరు వచ్చినది. ప్రియమైన ఆ మాంసమును వీడిన తోడనే పోరువదలినది. కావున ప్రియమును విడనాడుట యోగికి శ్రేయస్కరమని లకుముకి పిట్టవలన తెలిసికొంటిని.

19. భూమి యందిర్వురే సుఖులు 1. యోగి 2. అర్భకుడు. తనలో తాను ఆడు కొనుచుండుటను బట్టి యోగి ఆత్మారాముడై ఉండవలెనని బాలునిచే బోధింపబడితిని.

20. ఒక కన్యక తన పెండ్లి చూపుకైవచ్చిన బంధువులకు వంటకము చేయబూనినది, పిండిగొట్టవలసివచ్చినది. గాజులు చప్పుడు కాకుండుటకై ఒంటిగాజు ధరించినది. ఆమెవలన, యోగి ఒంటరిగా నుండవలెను రెండవ వాడున్న యోగి చెడిపోవునని తెలిసికొంటిని.

21. ఇషుకారుడు తనప్రక్కనుండి రాజువెళ్లుచున్నను ఎట్లు గమనింప కుండునో అట్లే మనస్సు సర్వతః నిరుద్ధమైనపుడే సుఖము కల్గునని ఇషుకారుని వలన ఉపదేశింపబడితిని.

22. ఊర్ణనాభి తననోటినుండి తీసిన దారమును తాను గ్రహించునట్లు పరమాత్మ కూడా ఈ విశ్వమును ప్రపంచించి తనలో లీనమొనర్చుకొనునని ఊర్ణనాభివలన ప్రబోధింపబడితిని.

23. పసరు పురుగును తన్నుకొనివచ్చి గూడులో పెట్టి బంభ్రమింపగా, ఆ కీటము భ్రమరమునే ఐకాంతికముగా చింతించుటవలన భ్రమరనౌటను చూచి యోగి భక్తితో ఈశ్వరుడై పోగలడను నిజమును భ్రమరమువలన శిక్షింపబడితిని.

24. పామువలె యోగి గృహనిర్మాణ ప్రయాసముమాని ఇతరులచే చేయబడిన వసతిలో దూజీయుండుట శ్రేయస్కరమని తలచితిని.

ఇట్లు బోధసాధము పొందితిని చావు పుట్టుకలు గల ఈ సంసారముననుండుట కంటె నిస్సంగుడనై విముక్తుడనై చరించుటమేలని తలంచితిని. అన్వయవ్యతిరేకము లచే గురువు బోధించిన దానిని చింతించి స్వానుభవముతో తెలిసికొనవలెను గాని నిజమునకుపైవారందరు గురువులగు దురా, నిగమవేదియైనవాడే సద్గురువు. అనియదువునకు దత్తవిభుడు బోధించెను. అవధూతయదు సంవాదము విన్నవారికి ముక్తి కలుగునని గురువు చెప్పెను.

11-3 దీపకుడుదత్త కథామృతము ద్రావుటకై ఆత్రపడగా వేదధర్మ్మడిట్లు చెప్పెను. మధ్యదేశమున వేదవిదుడొకడుండెడివాడు. వానికి సుమతియను నొకపుత్రుడు కలడు. వాడు బధిరాంధజడోపముడు. ఉపనయనము కావించి

చదువబెట్టెను. ఏమి చేసినను పలుకక, ఉలుకక, హితోపదేశము జేసెడి తండ్రి కొకనాడు నవ్వి ఇట్లనెను, ఓ మహాత్మా ఈ శరీరము బుడగవంటిది. దీనికొక కాలమనునది కలదా, విద్యల చదివించితివి, ఒక్కటీ అక్కఱకు రాదు,ఏ మభ్యసించినను చచ్చుచు పుట్టుచుండుటయే కదా! ఉత్తమ, మధ్యమ, అధమములైన పదివేల జన్మలలోని వృత్తాంతములు కనులకు కట్టినట్లు కన్పించు చున్నవి. ఇచ్చితి, పుచ్చుకొంటిని, నవ్వితి, ఏడ్చితిని, తిరిగితిని, దొంగిలించితిని ఆడితిని, బాల్యకౌమార యౌవన వార్ధక్యములలో దుఃఖములన్నియు పలకపారాల వలె ఎదుటకన్పట్టుచున్నవి. కాని ఇవేమియు సౌఖ్యావహములుకావు, నిర్గుణ పరబ్రహ్మోపాసనమే శ్రేష్ఠమని నిశ్చయించితిని, తండ్రి తనయుని మాటలను, విని, ఏరా, మున్నెన్నడును లేని వేదాన్తమును వచించుచుంటివి. అప్పుడా జాడ్యమేల ఇపుడీ వివేకమెట్లు? పూర్వజన్మ జ్ఞానమెట్లు కలిగినది? సత్యము చెప్పుమనెను. తండ్రీ నేను పూర్వజన్మమున విప్రపుత్రుడను. సజ్జన సహవాసమువలన అభ్యాసయోగమున తత్త్వవేదినైతిని. బ్రహ్మనిష్ఠుడను.కావుననే ప్రాగ్జన్మస్మృతి కల్గినది. నీయడిగిన సందేహములకు సమాధానమునిచ్చి పితౄణవిముక్తి నొంది తరించెదనని సుతుడు పల్కెను.

తండ్రి, ఓరీ, నీవు నాకొక్కడవేపుత్రుడవు. నీవిట్లు అయిననేనీ సంసారము నందుండుటయా దీనిని త్రెంచుకొనిపోవుటయా నీవేచెప్పుమనెను ఓ తండ్రీ వెంటనే ద్వంద్వరహితుడవై బ్రహ్మాత్మైక్య మను దుఃఖ భేషజమును స్వీకరింపుము, అట్టియోగము అలవడుటకు అడవి కేతెంచి సన్యసించి తరింపుమనెను. కుమారకా! అట్లయిన ఎట్టి అభ్యాసముతో విక్షిప్తము కాని యోగముఅలవడునో అట్టి బ్రహ్మాత్మైక్య జ్ఞానయోగము నాకు ఉపదేశింపుమనెను. కొడుకు అట్లయిన నీ కలర్కాదులకు దత్తదేవుడు ఉపదేశించిన యోగమును నుడివెదననగా, దత్తదేవు డెవరు ఎవరిపుత్రుడు, అతని చరితమును వివరింపమనగానిట్లు చెప్పెను.

పూర్వము ప్రతిష్ఠాన నగరమున కౌశిక వంశజుడొకడు కలడు, వాడు ముందనేక దోషములనాచరించి చివరికి కుష్ఠురోగి అయ్యెను. ఆతని భార్య సుమతి మహా పతివ్రత భర్తకోరిన వేశ్యవద్దకు, తన సొమ్ములను తాకట్టుపెట్టి ధనము తీసికొని ఒక తట్టలో భర్తనుంచుకొని వేశ్యవాటికకు ఎత్తుకొని పోవుచుండెను. చీకట్లో ఆమెభర్త అణీమాండవ్యుని తెలియక తన్నెను. ఆ మహర్షి సూర్యోదయము నకు నీ భర్త మరణించునని శపించెను, అదివిని సూర్యోదయము కాకుండుగాక

అని ఆ పతివ్రత పల్కినది. ఆమెపలుకునకు సూర్యుడుదయించలేదు. లోకములు తల్లడిల్లినవి. దేవతలు బ్రహ్మ ఆదేశముచే అనసూయాసతిని శరణుపొందిరి. వారివలన వృత్తాంతమంతయునువిని అప్పరమ పతివ్రత, సుమతిని కొనియాడి సూర్యోదయమగునట్లు శాసింపవలసినది. మా పాతివ్రత్యమహిమచే నీ భర్తను బ్రతికించెదమని నమ్మింప చేసినది, ఆమెయు అనసూయయందలి ఆదరము చే సూర్యోదయమునకు ఆజ్ఞఇచ్చినది. తన భర్త మరణింపగా అనసూయ తానుగా కలుగజేసికొని ఆమె పతిని బ్రతికింపజేసి ఆ దంపతులను దీవించినది, దేవత లందరును త్రిమూర్తులు విస్మయావిష్టులై వరము, కోరుకొమ్మనిరి వారు ముమ్మూర్తులవంటి సుతులను కోరుకొనిరి.

అత్రికి అనసూయకై దాచి ఉంచిన శుక్రము మనస్సంగమువలననే కనుకొనలనుండి కారి దశదిశావ్యాప్తమయ్యెను. దిశలు గర్భిణులుకాగా బ్రహ్మాంశచే వారికి సోముడుదయించెను. విష్ణువు అత్రి దంపతులకు స్వయంప్రదత్తుడగుట వలన దత్తదేవుడను సార్థకనామధేయుడై అనసూయాస్తన్యమును గ్రోలినాడు. రుద్రుని అంశమన దుర్వాసుడను పేరుతో మూడవవాడుగానుదయించినాడు. పుట్టిన దత్తదేవుడు తన్ను చేరిన వారికి యోగతత్త్వాలను పదేశించుచు ఒకనారితో కలిసి దివ్యవర్ష శతమునొక సరస్సున వసించి మద్యము పుక్కిటబట్టి ఆదివ్యవనితతో కూడిపైకి వచ్చినాడు తన కొఱకు అంతదనుక వేచియున్న వారికి యోగమునుప దేశించి కృతార్థులను కావించెను. వారిలో కార్తవీర్యార్జునుడొకడు. ఈతడు కృతవీర్యుని పుత్రుడు. అవిటి చేతులతో పుట్టెను. తండ్రి అనంతరము రాజ్యమునకు పట్టాభిషిక్తుడగు టకును, పాపానికిని వెఱచి వెనుకాడెను. సామర్థ్యము సంపాదించి రాజ్యము చేయుదునని, ఉపాయమును చెప్పుమని మంత్రులనడిగెను. అందు గర్గాచార్యుడు, సహ్యాద్రిని దత్తదేవాశ్రమము కలదు. జంభాసురుని వధకై ఇంద్రాదులు శరణు పొందగా దత్తదేవుడు యుద్ధములేకుండగనే కాపాడెను. ఒడిలోని అనఘను అపహరింప జంభాదులు వచ్చి ఎత్తుకొని పోసాగిరి. అట్టి కూడని పనిచేసి ఇంద్రాదుల చేతిలో జంభాదులందరు చచ్చిరి, అల్పకాలములోనే భక్తులకోర్కెలను సఫలముచేసి రక్షించిన మహనీయుడు దత్తాత్రేయుడు. అని ఉదాహరణము చెప్పెను. అచ్చట స్వామిని ఉపాసింపుము నీకోరిక తీరునని మంత్రదీక్షనిచ్చెను. అతడట్లే దత్తదేవానుగ్రహపాత్రుడై 1. సహస్ర బాహుత్వము, 2 సప్తద్వీపాధిపత్యము, 3 కామగమవిమానము 4 తననుస్మరించినంతనే నష్టద్రవ్యలాభము 5 ప్రసిద్ధునిచే చావు 6 అష్టసిద్ధులు 7 సకల జనమనః ప్రత్యక్షత్వము మున్నగువరములను

పొందెను. దాన తపోయోగవిజయాదులందు కార్తవీర్యునితో సమానులగు రాజులెవ్వరు "నభూతో న భవిష్యతి" అని అంగిరునిచేత కూడా పొగడ్తనందినాడు. ప్రతివత్సరముదత్తదేవుని మహోత్సవము జరిపించెడివాడు. మహాయోగి, తత్వజ్ఞుడు 85వేల ఏండ్లు ఏకచ్ఛత్రాధిపత్యముగా భువినేలినాడు. ఇక అలర్క చరిత్రను చెప్పెదను వినుము. శత్రుజిత్తు అను రాజునకు ఋతుధ్వజుడనునొకకుమార్డు కలడు. ఆతనికి నాగకుమారులు అత్యంత మిత్రులు. వారలతో విడదీయరాని స్నేహము కలిగి క్రీడించుచుండెడివాడు. నాగకుమారుల తండ్రి అశ్వతరుడు, ఆతడు మిత్ర కృత్యమేదేని కలదాఅని ఒకప్పుడు వారలనడిగెను. మిత్రుడైన ఋతుధ్వజుని కార్యమొకటి కలదనిరి. గాలవుడనునొక ఋషి తన యాగసంరక్షణార్థమై ఋతుధ్వజుని పంపుమని శత్రుజిత్తును అడిగెను. అతడట్లేనని ఋతుధ్వజుని పంపెనుఅశ్వమును చూపించి దీనిపైనెక్కి శత్రుజయము చేయుము కువలయా శ్వుడనుపేరు కూడా నీకు కల్గుననగా ఆ గుఱ్ఱమును అధిరోహించి యాగరక్షణ చేయుచుండ రాక్షసుడొకడు పందిరూపమున వచ్చెను. ఆతనిని వధించుటకై ఋతుధ్వజుడు వెంటనంటెను. ఆ రాక్షసుడు తన నివాసమునకు వచ్చి అదృశ్యుడయ్యెను. ఋతుధ్వజుడు అచ్చట విశ్వావసుకూతురు మదాలసను చూచెను. ఒకరినొకరు చూచి మోహపడిరి. కుండలయను మదాలస చెలికత్తె అచటనే యుండి రాజునకిట్లు చెప్పినది. పాతాళ కేతుడను ఈ రాక్షసుడు తనసుతునకు ఈ మదాలసను కట్టబెట్ట దలచి త్రయోదశి వివాహము జరిపించుటకు నిశ్చయించి మాయోపాయముతో ఇటకు తీసి కొని వచ్చినాడు. విషయమును తెలిసిన మదాలస చనిపోవుటకు నిశ్చయించినది. ఇంతలో కామధేనువు కనిపించి నిన్ను రాక్షసుడు నిర్బంధించి ఏమియుచేయలేడు రాక్షసుని చంపుటకు మర్త్యలోకమునుండి ఒకరాజు రాగలడు. ఆతడే నీకు పతియగును అని ఉపదేశింపగా ఆత్మహత్యమానినది. నిన్ను చూచి ఈమె మోహపడినది. కాన మదాలసకు నీవేపతివి. మాగురువు తుందిలుడుమీకు కల్యాణము నిర్వర్తించ గలడు. పరవంతుడవని తలచవద్దు. దైవము దుర్విభావ్యము గదాయని కుండల పెళ్లిచేయించి వెళ్లిపోయినది. ఋతుధ్వజుడు మదాలసను గుఱ్ఱము నెక్కించుకొని వెళ్ళుచుండగా పాతాలకేతువు యుద్ధమునకు వచ్చెను. యుద్ధమున ఆ రాక్షసుని చంపి రాక్షససోదరుడైన తాలకేతువును మూర్ఛాక్రాంతు నొనర్చి తన మహిమో పేతమైన అశ్వముమీదనెక్కి తల్లిదండ్రుల చేరి, వారల నానందింప జేసెను.

తాలకేతువు ఋతుధ్వజుని పై పగ తీర్చికొనుటకై రాజు ఒకపరి, వేటకేగెను. మాయా తపసివేషము బూని రాజును అతిథినిగా పిల్చి నేనొకయాగమొనర్చు

చుంటిని, దానికి ధనముగ నీ నామాంకితమైన ఉంగరము నిమ్మనేను వచ్చునంత వఱకిటనుండి నా ఆశ్రమము కాపాడుమని చెప్పి తాను శత్రుజిత్తువద్దకు వెళ్లెను. అచ్చట ఋతుధ్వజుని ఒక రాక్షసుడు చంపినాడు, మేమాతని దహించితిమి. ఆతని గుర్తుగా ఉంగరమొక్కటే మిగిలినదని సమదుఃఖివలె నటించి ఉంగరమిచ్చెను. వారును పుత్రశోకాతురులై దుఃఖించిరి. మదాలస పతివ్రత ఈ ఘోరవార్తను విని ప్రాణత్యాగము చేసినది. తాలకేతువు తనపగను ఇట్లు దీర్చికొని ఋతుధ్వజుని వద్దకేగి తనకీ సహాయ మొనరించినందుకు కృతజ్ఞుడననెను. ఋతుధ్వజుడింటి కేగగా రాక్షసుని మాయచే మదాలస చనిపోయిన దని దుఃఖించి చేయునది లేక మరొక కన్యను వివాహము చేసికొనను అని ప్రతిజ్ఞ యొనర్చి అట్లే ఉండెను. ఇట్లు మామిత్రుని కాపదవచ్చినది, మీరేమైన ఆతనికి సహాయము చేయుడని నాగకుమారులు అశ్వతరునికి చెప్పిరి. అశ్వతరుడు తన సోదరుని కంబలుని వెంట పెట్టుకొని సరస్వతీస్తవము చేసి తదనుగ్రహమును పొంది ఈశ్వరుని గూర్చి తపమొనరించెను. ఈశ్వరుడు ప్రత్యక్షముకాగా మదాలస యథాస్థితరూప వయోవిలాసయైన పుత్రికగానిమ్మని వరము కోరెను. ఈశ్వరుడు నీపితరులకు శ్రాద్ధమొనరించి పిండప్రదానమున మధ్యమపిండమును నీపత్నిచే తినిపించిన నీకోర్కెనెఱవేరగలదని ఆశీర్వదించెను. అశ్వతరుడట్లుచేయగా, మదాలస, తనకు కన్యయయ్యెను. తనకుమారులచే ఋతుధ్వజుని రావించి మదాలస నొప్పగించెను. మదాలసను పొంది ఋతుధ్వజుడు రాజై సర్వసౌఖ్యములనందుచు నల్వురు సుతులను కనెను. 1వ వానికి విక్రాంతుడని, 2వ వానికి సుబాహువని 3వ వానికి శత్రుమర్దనుడని ముద్దుగా రాజు పేర్లు పెట్టగా మదాలస నవ్వినది. నేను పేరుపెట్టగా నవ్వితివి. 4వ వానికి నీవే పేరుపెట్టుమనగా ఆమె భర్త అనుమతితో అలర్కుడని పేరుపెట్టినది.

11-4 మదాలస తత్వజ్ఞురాలు పిల్లలకు వేదాన్తమునంతయు పాటలలో నిమిడ్చి యుపదేశించినది. నామరూపములే ఈ విశ్వము, దేహేంద్రియ జాతమంతయు పాంచభౌతికము. దీని కతిరిక్తమై నిత్య శుద్ధ బుద్ధముక్త స్వభావమై వెలుగొందునదియే బ్రహ్మపదార్థము ఈ శరీరాదులకే హాని వృద్ధులు గాని ఆత్మకు లేవని అధ్యాస చేతనే దుఃఖము. అదియు ఆగంతుకమని బోధించినది మొదటి 3గురు పిల్లలు తెలిసి కొని ఆత్మనిష్ఠులై మెలగి చివరకు సన్యసించి వనమున కేగిరి. అలర్కునికి కూడా, జ్ఞానబోధచేయుచుండగా రాజు చెవిన

బడినది. కోపముతో మదాలసను ఆపి అందరినిట్లు జ్ఞానబోధచేసి పంపిన రాజ్యలక్ష్మిని చేపట్టువారెవరు? వీనికైనను ప్రవృత్తి మార్గమునుపదేశించి రాజ్యార్హతను కల్పింపుమని కోరెను. తన భర్తకోర్కెప్రకారము అతనికి నీతి శాస్త్రమును బోధించినది. అలర్కుడను పేరు పెట్టుటలోగల విశేషమును రాజడుగగా మదాలస విక్రాంతుడు, సుబాహువు, శత్రుమర్దనుడనుపేర్లు దేహమునకా, దేహేంద్రియాద్యతీతమైన వస్తువునకా, ఆత్మవస్తువునకు పేరెట్లు పొసగును. వ్యవహారార్థమై పేర్లు అని అన్నచో అది అలర్కుని యందు సమానము కదా అలర్కపదమునకు - పిచ్చికుక్క అని అర్థము అయినను -ఈ విభేదాలన్నియు తత్త్వదృష్టితో చూచిన కల్పితములే కదా అనిసమాధానమిచ్చినది. అలర్కుని రాజ్యప్రతిష్ఠితుని చేసి మదాలస ఋతుధ్వజునితో వనమునకు తపస్సుకై వెళ్ళుచు అలర్కునికి ఒక ఉంగరము ఇచ్చినది. కష్టసమయమున ఇందలి అక్షరములను చదువుకొనిన కష్టముతొలగునని శాసించి వెళ్ళినది. అలర్కుడు ధార్మికముగా ప్రజలను పాలించుచు రాజోపభోగములతో నలరారు చుండెను. వీని అన్న సుబాహువు తన తమ్ముడు తత్త్వమార్గప్రవిష్టుడు కాక సంసారపతితుడయ్యెనని విచారించి విషాదము కల్గిన గాని, వైరాగ్యము, జ్ఞానము, అంకురించదని తలచి తన రాజ్యభాగమునకై కాశీరాజును సహాయునిగా అర్థించి యుద్ధమునకు వచ్చెను. అలర్కుడును వారితో పోరి విరథుడు అయ్యెను మరునాడన్నీ సమకూర్చుకొని వచ్చెదనని చెప్పి ఇంటికి వెళ్లెను. ఇట్టి సంకటస్థితిలో తన తల్లి ఇచ్చిన ఉంగరము మీది అక్షరములు జ్ఞప్తికి వచ్చి చదువుకొనెను. సజ్జన సంగముచేయుమనెడి అక్షరసత్యమును కనుగొని దత్తదేవుని శరణమునొంది తన దుఃఖమును చెప్పికొని ఏడ్చెను.

దత్తవిభుడు ఓరీ దుఃఖము నీకే కారణమున కల్గినది? నీవెవ్వడవు? దుఃఖము శరీరానికా। అవయవాలకా - అందలి జీవాత్మకా? ఇట్లాలోచించిన దఃఖమెక్కడ కలదు. ఉపాధిభేదముచే ఆకాశమునకు నానాత్వమువలె, ఆత్మకు కూడా ఉపాధులను బట్టి యే భేదము కాని సత్యవస్తువు ఒక్కటియే కదా. మమ, అంటే సంసారము, నమమ అన్నచో సంసారమే లేదు. అజ్ఞానముచే వచ్చినదే దుఃఖమని, జ్ఞానమును బోధించెను. ఆత్మ జ్ఞానము స్థిరపడుటకై యోగమును సాంగోపాంగముగా నాతనికి తెలియజేసెను. ఇట్లత్యల్పవ్యవధిలోనే అలర్కుడు జ్ఞానియై ఆత్యన్తిక సుఖభాజనుడయ్యెను. ఇట్లు దత్తాత్రేయ బోధము ఆతని యెడ సఫలమైనది. మరునాడు సర్వమ్మును సుబాహు కాశీరాజులకు అప్పగించెను.

సుబాహుడును సోదరుని జ్ఞాన మార్గమున కొఱకే వచ్చినవాడౌటవలన తా వచ్చిన విధమంతయు చెప్పి కాశీరాజుకు రాజ్యమిచ్చెను. కాశీరాజు ఆ సోదరుల ప్రవృత్తివలన ఉపదేశమువలనను తాను కూడా విరక్తుడై కృతకృత్యుడయ్యెను. అట్టి యెడ అలర్కుడు ఆ రాజ్యమును సంతతికి ఇచ్చి జ్ఞానానందమయుడై తానిట్లు పాడెను. నాకంటె సుఖులెవరున్నారు - ఇట్టి మోక్ష సుఖమును విడనాడి సుఖాభాసమైన సంసారమున బడి జనులు దుఃఖభాజనులగుచున్నారు. దేశకాలాద్యనవచ్ఛిన్నము, సచ్చిదానందము, భూమము, సజాతీయవిజాతీయ స్వగతభేద శూన్యము, స్వప్రకాశమును అయిన ఆపరబ్రహ్మమును నేనే అని పాడినాడు. సత్సహవాసముచే దత్తదేవునిచే బోధింపబడి అల్పకాలములోనే కృతార్థత అతనికి సిద్ధించినది అని అలర్కుని కథను దత్తదేవ మహిమను కొని యాడి యోగతత్త్వ మార్గమును సోదాహరణముగా వచింపగా సుమతి తండ్రియువిరక్తుడై సన్యసించి ఆత్మనిష్ఠతో బంధవినిర్ముక్తుడై సిద్ధినొందెను. సుమతి కూడా తన తండ్రి కట్లుపదేశించి తరించెను.

11-5. గురువరా! దత్తదేవుడు ఎప్పుడు భక్తులకనాచారిగాను మద్యమాంసాశనుడు గాను స్త్రీలోలుడుగాను, ఉన్నట్లు వర్ణనములు, కన్పట్టుచున్నవి. శ్రేష్ఠుడేది ఆచరించిన లోకముదానిని అనువర్తించును గదా తానట్లేలచేసెనో సెలవిమ్ము అని దీపకుడు గురువునడిగెను. వత్సా! నింద్యములాచరించినను ఈశ్వరుని కది దోషము కానేరదు. జ్ఞానికి ఏదోషములంటవు అని శ్రుతియే చెప్పుచున్నది. శ్రీరాముడు తాటకావధరూపమైన స్త్రీహత్య చేసెను, రావణుని చంపి బ్రహ్మహత్య చేసెను. అయినను అది దోషజనకము కాదు. ఇక శ్రీ కృష్ణుడు గోపికలతో చిన్నతనంలోనే వ్యభిచరించెను. రాక్షసులనెందరినో చంపెను. ఇట్టివి పుణ్యపాపకర్మలు ఈశ్వరుడెన్ని చేసినను ఏమియు ఆస్వామికి అంటవు. అందరికి ఆత్మ, అంతర్యామి, ఈశ్వరుల విషయమున కన్పడెడు సాహసములు, ధర్మాతిక్రమములు దోషావహములు కావు అట్టివి, మనము చేసిన నాశమునొందగలము, శివుడు విషము మ్రింగి హరించుకొనెను గదా అని మనము విషము మ్రింగిన నాశము నొందుదుము, నేను, నాయది అని అహంకార మమకారములు లేని వాడై ఆదేవుడాచరించెను. మనమట్లు చేయరాదు. దత్తదేవుడు కూడా ఎప్పుడు నింద్యములైన కర్మలే కాదు. తపోయోగ ప్రతిష్ఠాదులెన్నియో మంచికర్మలను ఆచరించి మార్గదర్శకుడైనవాడు. ఆతడు కాశిలో ఈశ్వరలింగమును ప్రతిష్ఠించెను. ఒకప్పుడు దిగంబరుడు,

పీతాంబరుడు, మరొకప్పుడు త్రిమూర్తి, గురుమూర్తి, గానుండి భక్తానుగ్రహము చేయుచుండిన మహనీయుడు. అట్టి వానిని గూర్చి పశుబుద్ధితో చేసిన ఈప్రశ్నను మరెప్పుడును చేయకుమని వేదధర్ముడు శిష్యుని హెచ్చరించెను.

ఒకప్పుడు కార్తవీర్యార్జునుడు దత్తదేవుని సమీపించెను. గురువునకు సాష్టాంగపడెను. పాపము నింకింపజేయు జ్ఞానమునను గ్రహింపుమని ప్రార్థించెను. నీవు కరుణింపకున్న వేఱొకదిక్కులేదు అని అట్లే నిలిచెను.ఇంతలో సిద్ధులు మున్నగువారు నానా విధములైన కానుకలు తెచ్చి యిచ్చి నమస్కరించిరి. వారు దత్తదేవుడు యోగ సమాధిలోనున్నాడని గ్రహించి స్వామిని చేరువేళకాదని, వెనుకకు మరలిరి. సహ్యాద్రి వాసులైనమును లెందరో వచ్చి చుట్టూ చేరి స్వామిస్థితిని కాంచి విస్మయము నొందిరి ఆ ఆశ్రమమంతయు యోగులతోను జ్ఞానులతోను, భక్తులతోను నిండిపోయినది. ఇట్లు చాలాకాలము వేచియుండగా సూర్యోదయ సమయమునకు దత్తవిభుడు వీరాసనమును వదలి యోగమునుండి ఈవలకు వచ్చెను. శాంతతపుడు, సత్యవాక్కు, గుణనిధి,వేద విదుడు మున్నగు వారు తెచ్చి ఇచ్చిన మృజ్జల, దంతకాష్ఠ, భస్మ, స్నానీయ స్నానజల వల్కలాదులతో కాలవిధులను అహ్నిక కృత్యములను చేసికొని మధ్యాహ్నము, కోల్హాపురి లక్ష్మి చేతితో నిడిన భిక్షను స్వీకరించి తన స్థానమున సుఖాసీనుడై యుండ అందరును మరల మ్రొక్కిరి అంత శాంతతపుడు స్వామీ నీ భక్తుడుకార్తవీర్యుడు ఖిన్నుడై నీ కొఱకై వేచియున్నాడు. అని చెప్పెను.అంతట స్వామి వారినందరిని సమముగా నాదరించి కార్తవీర్యుని పిలిచి ఇట్లడిగెను. వత్సా! లెమ్ము ఇటు రమ్ము ఖేదము నొందకుము నీకేమి కావలెనో చెప్పుము. జ్ఞానము అనుగ్రహించెద ననెను. వాడును ముందుకు వచ్చి స్వామీ! ఈ విశ్వముసత్యమని పండితులు వచించుచుందురు. నాకు విశ్వసనీయమైన వేదార్థ తాత్పర్యమును వివరించి ముక్తికనుకూలమగు జ్ఞాన భిక్షనొసంగుడని వినయముగా నడిగి స్తోత్రము చేసెను.

దత్తవిభుడును వత్సా! నీవు చేసిన స్తోత్రము సర్వులకు ప్రాతః కీర్తనీయమని మోక్షమార్గమిట్లు చెప్పెను. ఓరీ శాస్త్రములు కళలు వేదములు పురాణములు, అన్నియును మోక్ష సాధనములే సుమా! ఒకప్పుడు ఇంద్రుడు బృహస్పతి వద్దకు వెళ్లెను. బృహస్పతి ఆసమయమున కామకళను, దండనీతిని, బౌద్ధములైన శిల్ప శాస్త్రాదులను తన శిష్యులకు బోధించు చుండెను. ఇంద్రుడు గురువర్యా! ఈకళలు తత్త్వదర్శనమునకు విరుద్ధములు ఇట్లేలబోధించుచుంటిరని అడిగెను.

దానికి గురువు ఇట్లు ప్రత్యుత్తరమిచ్చెను. ప్రాణులకు కామము సహజమే అయినను దానికి శాస్త్రమెందు లకని గదా నీ ప్రశ్నము సప్తోదాహరణము లను వచింతును, కామ కళాశిల్ప శాస్త్రాదులెట్లు మోక్షపురుషార్థ ప్రదములో నిక వినుమనెను.

1 కాంపిల్యపురమునందు విధిజ్ఞుడను ఒక శిల్పి కలడు, తన శిల్ప నైపుణ్యముతో ననేకములైన మేడలను భవనములను కట్టించి అనేకులైన శిల్పులకు శిక్షనిచ్చి అనంతమైనధనమును గడించెను. ఆతడు దేవ, పితృదేవాది పూజలకు దేవాలయాదులకు ధనమును ఖర్చుచేసి సర్వులకు హృదయంగముడై తన దేశపు రాజుచేతను దేశాంతర రాజులచేతను పూజింపబడిన విద్యకలవాడై ధర్మాత్ముడని పేరొందెను. అంత్యకాలమున స్వర్గమునకేగి స్వర్గసుఖముల ననుభవించి తిరిగి ఆ దేశమునకే రాజయ్యెను. మరుజన్మమున విప్రుడై పుట్టివేదవేదాంగముల చదివి ధ్యానయోగాదుల పూని సన్యసించి అపరోక్షానుభూతిని నొంది తరించెను. కనుక శిల్పకళాశాస్త్రములు ముక్తి ప్రదములు సుమా.

2 మాహిష్మతీ నగరమున విశాలాక్షుడను కామకళావిదుడొకడు కలడు. స్త్రీ పురుష లక్షణముల నెరిగినవాడు అనిష్టముగానున్న తన పత్నిని విడనాడి కన్యార్థియై తిరిగెను. మరియు అతడు గీతవాద్య నృత్యాది సమస్త కళల నెఱిగినవాడగుట వలన ఒక దేశపు రాజువద్ద జ్యోతిషము చక్కగా చెప్పెను. ఆ రాజు తన కన్య జాతకమెట్లున్నదని చూపించి అడిగెను. దానిని జూచి విశాలాక్షుడు సర్వమును చెప్పి ఆ రాజకన్యనే ప్రేమించి ఆమెనిమ్మని అడిగెను. రాజు కూడ తన పుత్రికకీ విషయముచెప్పి విశాలాక్షుని చూపింపగా ఆమెకూడా విశాలాక్షుని చూచి మోహించెను. వారిద్దరికి వివాహము జరిపెను. కళాస్థానములను తెలిసి ఆ పత్నితో ధర్మావిరుద్ధములగు కామ సౌఖ్యములననుభవించెను. ఆతని సౌఖ్యము బ్రహ్మేంద్రాదులకు కూడలేనిది. పాపము చేయక పుణ్యకర్మల నాచరించుచు నిత్యము గానకళారాధనముతో నానందించుచుండెడివాడు. వాడొకపరి గానముచేయుచుండ ఆ పాటలను వినిన పరమేశ్వరుడు కూడ సంతసించి ఒకదివ్య విమానము నొసంగెను. విమానముతో సర్వలోకములలో సంచరించుచు విష్ణువును, బ్రహ్మను, కూడా తన పాటలతో తన్మయత్వమును పొందించి తదనుగ్రహములకు పాత్రుడయ్యెను. బ్రహ్మ ఆతనికి అద్వైతమును బోధించి తనతో క్రమముక్తికి పాత్రమైన వానినిగా జేసెను. ఈవిధముగా కళారాధనముతో ముక్తుడైనాడు.

3 విశాలపురమున వేదశర్మ అనునొక్కడుండెను.వానికొక కొడుకు గలడు వాడు బ్రహ్మ రాక్షసునిచే పీడింపబడి భక్ష్యాభక్ష్యముల నెఱుంగక తినుచు విరుద్ధ ప్రవర్తనమున నుండెడివాడు. తండ్రి బ్రహ్మరాక్షస విముక్తికై ఎన్నో యత్నములు చేసెను, అన్నియు విఫలములయ్యేను. ఖిన్నుడై యుండ ఒకరోజున వైశ్వ దేవాంతమున నొక అతిథి వచ్చెను. వాడు దుర్వాసుని అన్నవలె దుర్గంధ భూయిష్ఠుడై భిక్షార్థియై వచ్చెను. వానియందును దత్తాత్రేయరూపము పొడగట్టగా పూజించి వెంటనంటెను. ఆతడును వేదశర్మను చేతికి, దొరికిన కత్తి, రాళ్లు ఇటుకలతో ననేకవిధములకొట్టెను. అదియు మహాప్రసాదమని పాదములబట్టి విడువకుండెను. అట్టి వేదశర్మను పరీక్షించి దత్తదేవుడు కరుణించి ఏడుగురు బ్రహ్మరాక్షసులు నీపుత్రుని ఆవహించి యున్నారు. అని ఏడుబీజములతో నున్న ఏడు మంత్రములను ఉపదేశించి 7 రోజులు జపింపుము. 7 బ్రహ్మరాక్షసులు తొలగిపోదురని చెప్పెను. అతడట్లు చేయగా బ్రహ్మరాక్షసులు వదలి పోగా సుతుడు ప్రకృతి స్థుడయ్యెను. ఇట్లు వైదిక మంత్రానుష్ఠాన మాతనిని తరింపజేసినది.

4 మాతాపురమున విష్ణుదత్తుడను సోమయాజి కలడు. ఈతడు కర్మఠుడు నిత్యము వైశ్వదేవముచేయుచు భూత బలిని ఇచ్చిభుజించుచుండెడివాడు. ఒక బ్రహ్మరాక్షసికి భూతబలిని నిత్యము తినుటవలన ఆకలిదప్పికలు తగ్గినవి, అందుచే రాక్షసుడు తనకు ఆకలిని శమింపజేసి సుఖమును కలుగజేసిన విష్ణుదత్తుని కి ఉపకారము చేయదలచి ఒకరోజున నీకేమికావలెనో కోరుకొమ్మని ప్రత్యక్షమై అడిగెను. విష్ణుదత్తుడు మాకిష్టదైవము దత్తాత్రేయుడు అతనిని చూపుమని అడిగెను. బ్రహ్మ రాక్షసి ఆ దేవుని సమీపమునకు వెళ్లరానివాడను, అయినను 3 మారులు ఆదేవుని చూపించెదను నీవే ఆదత్తదేవుని పాదములను పట్టుకొని తిట్టినను చంపినను విడువక తదనుగ్రహమును సంపాదించుకొనుమని చెప్పివెళ్లిపోయెను. మొదటి మాటుగా మద్యశాలలో ఈగలు ముసరుచున్నచోటున ఈతడే దత్తదేవుడని సోమయాజికి చూపి పట్టుకొనుమని చెప్పెను. సోమయాజి మద్యశాలలోనికి సంశయించి ఈతడు దేవుడెట్లగునని వెనుకకు మరలెను. మరల బ్రహ్మరాక్షసుడు న్పించి 2వ మారు శ్మశానములో తిరుగుచున్న ఆదేవుని చూపి ఆశ్రయింపుమనెను. సోమయాజియు ఆతని పాదములను పట్టుకొనబోగా తిట్టికొట్టితన్నెను. తన పక్కనున్న కుక్కలచే కఱిపించెను. ఆ బాధలను తట్టుకొనలేక ఇంటికి వచ్చి పత్ని ఉపచారములు చేయగా ఎట్లోతేరుకొనెను. బ్రహ్మరాక్షసుడు వచ్చి ఓ విప్రోత్తమా

నీవు 2మార్లు దత్తదవుని చేరి ప్రసన్నునికావించుకొనలేకపోతివి. 3వ మార్లైనను పట్టువదలక ఆతనిని సేవింపుమని ఒక చండాలుర పల్లెలో తిరుగుచున్న ఆదేవుని చూపెను. తన పత్ని తనకు తగినంత ధైర్యమునీయగా పట్టువిడవక ఆదేవుడు తిట్టికొట్టితన్నినను గాడిదమాంసము కోసియిచ్చి తినుమన్నను వెనుదీయక, చంపినను ఇచ్చటనే చచ్చెదను నీపాదములను వీడనని అట్లే ఉండగా స్వామి కరుణించి స్వస్వరూపముతో కన్పించెను. చండాలవాటిక మద్యమాంసాదులు అన్నియు అదృశ్యమయ్యెను. దత్తుడు ఏమి కావలెనో కోరుకొమ్మనెను. సోమయాజికి ఏమీ తోచలేదు. కర్మశ్రద్ధకలవాడు గాన తన ఇష్టదైవసాక్షాత్కారమున పట్టపగ్గాలు లేని ఆనందముతో రేపు పితృతిథి భోక్తగారావలెనని వరము కోరెను. దత్తదేవుడట్లే అని అదృశ్యుడయ్యెను. తన పత్నికి స్వామి అనుగ్రహమును చెప్ప ఆమెయు అత్యన్త శ్రద్ధతో పాకముచేసినది. దత్తుని జూచిన ఆనందముతో మిగిలిన భోక్తలను చెప్పకయే శ్రాద్ధాంగములు సమకూర్చుకొనుచుండగా ఇంతలో దత్తదేవుడు భోక్తగా వచ్చి కూర్చుండెను. రెండవ భోక్త విశ్వేదేవస్థానమున ఎవరని పలుకగా సోమయాజి తలగోకికొనెను. అతని పత్ని పతివ్రత. దత్తదేవా, నీ అనుగ్రహమైన పిలిచెదనని చెప్పి సూర్యుని ఇట్లు ప్రార్థించినది ఓదేవా పితృస్థానమున దత్తదేవుడు భోక్తగా వచ్చియున్నాడు. నీవు ఆ దేవునిప్రక్కన విశ్వేదేవస్థానమున వచ్చి కూర్చుండి మా అభీష్టముతీర్చుమనెను. సూర్యుడట్లే బ్రాహ్మణునిగా వచ్చి కూర్చుండెను. తరువాత దత్తదేవుడు విష్ణుస్థానమున భోక్త ఎవరని ప్రశ్నించెను. విష్ణుదత్తుని పత్ని స్వామీ తమ అనుగ్రహమైనచో ఇప్పుడే పిలిచెదను అని ఇంట్లో ఉన్న గార్హపత్యాగ్నిని తృతీయ భోక్తగా పిలిచినది. ఆ అగ్నిదేవుడు కూడ తగిన వేషముతో విష్ణుస్థానమున కూర్చుండెను. సోమయాజి మంత్రము వచ్చిన వాడగుటచే శ్రాద్ధమును శాస్త్రీయముగా పెట్టెను. తృప్తులమైతిమని వారావిప్రుని దీవించిరి. విష్ణుదత్తుడు అతని పత్నియు ఆ స్వామికి సాష్టాంగపడి అష్టోత్తర శతనామావళితో పూజించిరి. వారిస్తుతికి ఆనందించి ఐహికాముష్మికముల నొసంగి వారికి చతుర్ముఖ బ్రహ్మతో క్రమ: ముక్తి నొసంగెను. భుక్తపాత్రలను బ్రహ్మరాక్షసునికిమ్మని ఆతడు తరించునని చెప్పిస్వామి అదృశ్య డయ్యెను. ఇట్లు కర్మలు కూడా ముక్తి ప్రదములైనవిగదా!

5 విష్ణుదత్తుని వద్దకు వచ్చిన ఒక సాధ్వి తన పతికి కలిగిన బహురోగములకు చికిత్సయొనర్చుమని ప్రార్థింపగా అట్లే అని బ్రహ్మహత్య చేసినందువలన క్షయకల్గినదని దానికి చికిత్స 1వత్సరము వ్రతాదులను ఆసాధ్విచే చేయించి

పోగొట్టెను. హరి విద్రోహమువలన జలోదరము వచ్చినదని మరొక వత్సరము వ్రతమాచరించపజేసి పోగొట్టెన. వాతగుల్మము, నిత్యజ్వరాదులకు మూలములైన పాపముల నిట్లుచెప్పి వ్రతాదుల చేయింపగా వైద్యములకు లొంగనిరోగములన్నిటిని పోగొట్టెను. తనభర్త రోగములతో ప్రాణాపాయస్థితిలో నుండగా రోగములను పోగొట్టి దీర్ఘాయువును చేసినందులకు ఆ సాధ్వి ఎంతో భక్తితో విష్ణుదత్తునికి మ్రొక్కినది. ఇట్లు రోగ నిదానములను చెప్పి దానికి శాంతియొనర్చు ఉపాయము లను గూర్చి చెప్పుట కూడ ముక్తిప్రదమే.

6 ఇంట్లుండనొకప్పుడు ఒక విచిత్రమైన సంఘటన జరిగినది. ఒక విప్రునికి అందగత్తెయైన భార్య ఉండెడిది. ఆతడు ఒకపరి నెలరోజులు ఒక కార్యమునకై పట్టణమునకు వెళ్లవలసివచ్చి కావలసిన వన్నియు భార్యకిచ్చి పట్టణమునకు వెళ్లెను. ఒక కామపిశాచము ఆ విప్రుని అందగత్తెయైన భార్యననుభవించుటకై తగిన సమయముకొఱకు వేచియుండి ఆతడు లేకుండుట చూచి ఆరాత్రే ఇంట విప్రుని వేషముతోడనే ప్రవేశించి ఆమెతో కామోపభోగములదేలజొచ్చెను. ఆమెయు ఏల వచ్చితివనగా కామపిశాచి నగరమున చూడదలచిన మిత్రుడిచ్చటనే తటస్థించగా ఆకార్యమును సాధించుకొని వచ్చితినని బొంకెను. తన భర్త వలె ఉండుటవలన ఆమె కనిపెట్టలేక పోయెను, కాని విచిత్రములైన కొన్ని పనులచే నీతడు తన భర్తకాదనుకొనెను. నెలరోజుల తరువాత అసలు తన భర్తరాగా ఆతనితో అంతయు చెప్పినది. అతడు కామపిశాచి ఇద్దరును నాభార్య నా భార్య అని వాదులాడుకొని వీధినబడిరి. వీరిలో నిజమైన వారెవరో ఎవరును కనిపెట్టలేకపోయిరి. చివరికి విష్ణుదత్తుని వద్దకు విప్రుడు చేరితన గోడును చెప్పెను. వారిద్దరిలో నొకరు పిశాచమని ఎరిగియు అసలు వానిని గుర్తించుటకై 4 పరీక్షలను బెట్టెను. గేహమున ఏమేమియున్నవో విడివిడిగా తెలిసికొనెను. ఇద్దఱును ఒకేవిధముగా చెప్పిరి. ఈ పట్టణమైదుక్రోసులు ఎవరుముందు ప్రదక్షిణము కావించి వచ్చిన వారికి సుందరి దక్కుననెను. అందునను కామపిశాచి సమానముగా తిరిగివచ్చినది. ఈ పురికి సమీపమునగల గిరి ప్రదక్షిణముచేసి చుట్టునున్న దేవాలయములను మునులను లెక్కపెట్టి యథాతథముగా వర్ణింప వలెనని 3వ పరీక్ష పెట్టెను. అందును వారిద్దరు సమానముగా నుండిరి. ఇక నాల్గవ పరీక్షలో ఒక కమండలును తెప్పించెను. ఇందుపైభాగమునుండి దూరి కొమ్ములోనుండి బయటకు ముందుగా ఎవరువచ్చిన వానికే ఈ సుందరి

దక్కునని ఇద్దరికి చెప్పెను. పిశాచి విప్రుడు, ఈ పరీక్షలో తాను ముందుగా నెగ్గిన సుందరి తనకే దక్కునని సూక్ష్మరూపముగా లోపల ప్రవేశించెను. విష్ణుదత్తుడు దానిని గమనించి వీడు పిశాచముగా నిందు దూఱినాడని కమండలు ద్వారములను రెండింటిని నిర్బంధమంత్రములచే బంధించెను. అప్పుడా విప్రుడు ఆ నీతిక్రమమునకు మెచ్చుకొని పలుమార్లు అతనికి మ్రొక్కెను. ఆ దంపతులు సుఖముగా నింటికి చేరిరి. ఇది నీతి శాస్త్రము. దీనిచే విప్రుని భార్యకు కామపిశాచినుండి విముక్తికల్గినది.

7 మరొకసమయమున ఒక విప్రదంపతులు తమకేకైక పుత్రుని వెంట నిడుకొని విష్ణుదత్తుని చేరిరి. పిల్లవాడు బాలోన్మత్త పిశాచజడులవలె పలుకడు ఉలుకడు. తిష్ఠన్మాత్రుడు, ధావన్మాత్రుడునై నిల్చుండియే అన్నపానాదుల స్వీకరించుటలను వివరించి వీనిని స్వస్థుని కావించుటకెన్నియో తిప్పలు పడితిమి మీరే ఈ పుత్రుని స్వస్థునికావించి మాకానందము కల్పింపుమనిరి. విష్ణుదత్తుడు ఆ దంపతులను భోజనమునకు వెళ్లిరండని పంపి ఆ పిల్లవానిని దగ్గఱకు పిలిచి నీవెవడవు అని ప్రశ్నించెను. ఆ కుర్రవాడు నేను జ్ఞానానందమయుండును. దేనిని గూర్చి కర్తనుగాను భోక్తనుగాను అనెడి వేదాన్తమును వచించెను. విష్ణుదత్తుడిట్లనెను. వానికి బంధమోక్షములను విశదీకరించి బుద్ధ్యాదులకు నీవు అవలివాడవు. ఇంటి పనిలో వ్యగ్రయయ్యు నారిస్వపతిసంగసుఖాస్వాద మాలోచించినట్లు జ్ఞాని బహిర్వ్యాపారము కలిగియు పరానంద సమ్పన్నుడై చెలగుటమంచి లక్షణము, అహంకార మమకార పరిత్యాగము కలిగియుండుట కర్తవ్యము. అందరివలె ప్రవర్తించినంత మాత్రమున నీ జ్ఞానమేమియు నశింపదు. అని నీ తలిదండ్రులకు పుత్రునిగా మెలగి వ్యవహరించుము, భావమునందు అద్వైతముండవలెను, క్రియయందు అద్వైతము కూడదు అని తగిన నీతులను ధర్మములను బోధించి స్వస్థుని చేసెను. ఇంతలో వాని తలిదండ్రులు వాని స్థితిని జూచి మారియుండుటను గమనించి విష్ణుదత్తునికి నమస్కరించి స్వస్థానమునకేగిరి. ఇట్లు శాస్త్రములు కళలు వేదవిహితకర్మలు అన్నియు తత్త్వపర్యవసానములై నిత్యసుఖప్రదములగునని ఇంద్రునికి సప్తోదాహరణములను గురువు వివరించెను. దీనిని దత్తదేవుడు కార్తవీర్యకకుపదేశించెను.

11-6 ఇక తత్త్వము నిట్లు బోధించెను. వత్సా నీరూపునీకు చెప్పెదవినుము బంధము అధ్యాసవలన వచ్చినది. దేహాదులందాత్మ బుద్ధి చేయుటయే అధ్యాస

ఈ విశ్వము నామరూపాత్మకమే కుండ, మూకుడు, ప్రమిద,బాన అను పేర్లతో మట్టి వ్యవహరింపబడినట్లు ఈ విశ్వము నదంతటను ఆ పరబ్రహ్మ మొక్కటియే నిండియున్నది. ఆ పరబ్రహ్మ పదార్థము సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యము ఆయాత్మ పదార్థమును ఆవరణ విక్షేపశక్తులు రెండావరించి వస్తుయాథార్థ్యమును తేటపరచకున్నవి. విద్యచే ఆవరణభంగమొనర్చి సిద్ధ వస్తువైన పరబ్రహ్మను భూతిని పొందుటయే ముక్తి. ఇట్టి శ్రుత వేదాన్తమురూఢమగుటకై మనననిది ధ్యాసనములను జేయవలెను. ఉపక్రమోపసంహారాది షడ్విధతాత్ప ర్యలింగములతో బ్రహ్మవస్తువొక్కటే అని శ్రుతితాత్పర్యమును గ్రహించవలెను. ఇదంతయు శ్రవణ విధి ప్రపంచము, ఇక మననమునకు యోగమావశ్యకము మననము అనగా యుక్తులతో వస్తువును మాటి మాటికి చింతించుట - యోగమష్టాంగములు కలది. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార ధ్యాన, ధారణ, సమాధులను, అష్టాంగములలో యమములు ఐదు, నియమములు ఐదు, స్వస్తిక వీరాసన, పద్మాసనాదులు ఆసనములు అనేకములు, 4వది ప్రాణాయామము, ప్రాణవాయువును కుంభకమొనర్చుటచే, సర్వముశోధనము జరుగును. విషయములనుండి మనసును ఒకచోటికి తీసికొని వచ్చుట ప్రత్యాహారమనబడును. మనస్సును ఒకే వస్తువునందు సమానవృత్తులనేకధారగా తెచ్చికొనుటను ధ్యానమందురు. మనసును ఆత్మయందే నిశ్చలముగా నిలుపుట ధారణ మనబడును. ధారణముచేతనే వృత్తిలయము జరుగగా నుండెడి స్థితియేసమాధి యనబడును. సమాధి సవికల్పకము నిర్వికల్పకము అని రెండు విధములు, అందు యమ, నియమాసనాలు, మూడును ప్రాణాయామమునకు ముందు కూర్చుకొనవలసియున్నది. ప్రాణాయామము అన్నిటికంటె చాలా ముఖ్యమైనది. ఎడమ ముక్కుతో 16మాత్రల కాలము గాలిపీల్చుటను పూరకమందురు. పీల్చినగాలిని 64 మాత్రలకాలములోపల బిగించుటను కుంభకమందురు. ఆగాలిని 32 మాత్రలకాలము నెమ్మదిగా కుడిముక్కుతో వదులుటను రేచకమందురు. ప్రతిదిన మిట్లభ్యాసముచేయగా వాతపిత్తాది దోషములు తొలగి నీరోగియగును, ప్రాణాయామము చేయగా చేయగా ప్రత్యాహారము సిద్ధించును. ధ్యాన ధారణములు 12 రెట్లు సాధనమొనర్చిననచో సవికల్పకసమాధివచ్చును. ఈ సవికల్పక సమాధినే నిదిధ్యాసనమని చెప్పుదురు. పూర్వోక్తవేదాన్తజన్యజ్ఞానమును మనమునందుంచు కొని విజాతీయ, సజాతీయ, వృత్తులను తొలగించుచు తత్త్వమస్యాదిమహా

వాక్యార్థమైన వస్తువునందు మనమును ధారణా శతములతో ఈశ్వరుని యందు నిల్పుకొనుటచే సమాధి వచ్చును. చిత్తవృత్తులను చిత్తమందడగించి ఆచిత్తమును బ్రహ్మమందులయింప జేసిన ధ్యానము ధ్యేయము ధ్యాత లనెడి త్రిపుటి కూడ నశించి బ్రహ్మకారాకారితమైన అనుభూతి నిర్వికల్పక సమాధియగును. యోగము వలన అణిమాద్యష్ట సిద్ధులు సంభవించినను వాటిపై బద్ధిని పెట్టకూడదు వృత్తి వ్యాప్తివిహీనుడై యుండెడి వానికి చిదచిద్గ్రంధివిడిపోయి సర్వసంశయోచ్ఛేదము కల్గును.

కార్తవీర్యార్జునుడు స్వామి ఆదేశముననుసరించి యోగాభ్యాసముచేసి ప్రక్కనే ఉన్నగుహయందు చేరి ఈశ్వర ప్రణిధాన స్వరూపానుభవముపొంది స్థాణువువలె చిరకాలముండెను. మరల తిరిగివచ్చి గురుపాదములకు మ్రొక్కి తన అనుభవమును చెప్పెను. మరల తదాదేశముగైకొని ఒక సంవత్సరమచ్చటనే సమాధి గ్రస్తుడై తిరిగి గురువును చేరెను. దత్తదేవుడు ఓరీ నీవు కృతకృత్యుడవైతివి. పొమ్మనెను. స్వాత్మతృప్తునకాచరించదగినదేమియులేదు. అయినను రాజ్యము నేలికొనుచూ అప్పుడప్పుడూ అర్థివై కనిపించి వెళ్లుచుండుమని అనుజ్ఞ ఇచ్చెను. ఇది శ్రీ దత్తదత్తయోగతత్వవైభవము.

11 - 7 ఒకప్డు మరల కార్తవీర్యుడు దత్తదేవుని వద్దకు చేరెను. నీదయవలన నేను జ్ఞానినైతిని మాఘ స్నానమున వచ్చు పుణ్యఫలమెట్టిదో వివరింపుడు. జ్ఞానికి పుణ్యపాపములు ఎట్టిఫలితముల నీయవు గదా అట్టి యెడ మీకీ మాఘస్నానమేల? అని అడిగెను. ఓయీ మాఘస్నానము బాహ్యాభ్యంతరముల మలములను పోగొట్టును విష్ణుభక్తిలేని విప్రుడు, ప్రయోగపద్ధతి లేని శ్రాద్ధము, బ్రాహ్మణులు లేని క్షాత్రము, ఆచారములేని వంశము, డంబాచారముకల ధర్మము, అదృఢమైన జ్ఞానము, కోపముతో కూడిన తపస్సు సాక్షిలేని భోజనము, సప్రమాది శ్రుతము, గురుభక్తిలేని నారి, నారీసాంగత్యముగల బ్రహ్మచారి, అదీప్తాగ్నిహవనము కొఱకైనకన్య, తన కొఱకైన పాకము, శూద్రునడిగి చేయుయజ్ఞము, లోభి ధనగరిమ, సూర్యుడు మకరమందుండ స్నానమాడనట్టిజన్మము; వ్యర్థములు, సుమా, దానికొక ఉదాహరణము చెప్పెదను వినుము. ఋచీక యను నొక బాలవితంతువు కలదు. ఆమె మిక్కిలి దుఃఖముతో తపము ప్రారంభించెను. అకరటంక క్షేత్రమున, వింధ్యగిరివద్ద గల నర్మదయందు నారాయణ పరాయణయై నిత్యస్నానమాచరించుచు దేవ, పితృ, ద్విజాతిథులకు, బెట్టి తాను తినుచుండెడిది. షష్ఠకాలమున

భుజించెడిది. 60 ఏండ్లు మాఘస్నానము చేసినది. అంత్యకాలమందు మరణించి విష్ణులోకమున నాలుగు వేలయుగములు నివసించి దేవ కార్యార్థమై దేవలోకమున తిలోత్తమ అను అప్సరసగా పుట్టినది. ఆమెయే సుందోపసుందులను సౌందర్యముతో నాకర్షించి, వారికి వివాదము కలుగజేసి వారిని చంపి దేవతలకు కూడా సుఖము కల్గజేసినది ఆబాల వితంతువే సుమా. కావున మాఘమాసస్నానము పెక్కు జన్మముల పాపములనణచును.

మరియొక ఇతిహాసము చెప్పెదను. పూర్వము కృతయుగమున నైషధపురియందు హేమకుండలుడను వైశ్యుడు కలడు, వాడు వ్యాపారమువలన కోట్లకొలదిగ ధనమునార్జించెను. చివరి వయసులో శ్రీకుండిలుడు, వికుండిలుడు అను ఇర్వురు పుత్రులు పుట్టిరి, చివరి కాలమున, అయ్యో నేనేమి పుణ్యములను చేయక పోయితినను బాధతో తాను సంపాదించిన ధనములో 6వభాగమును దేవాలయ, తటాక, సత్రాదుల నిర్మాణమునకై వెచ్చించెను. ఎచ్చట చూచినను వానిచే వినిర్మితములైన, వాపీకూప, తటాక, దేవాలయాదులే. పురాణాదులను విని యావజ్జీవప్రాయశ్చిత్తము చేసికొని కొడుకులకు ధనము పంచి తాను వైకుంఠమునకరిగెను. వాని కుమారులు తండ్రి ఇచ్చిన ధనమును, దేవాలయాదులకు వెచ్చించినవాటిని అన్నింటిని వేశ్యాలోలురై ఖర్చు చేసిరి. చివరకు దరిద్రులై తినుటకు లేక చౌర్య వృత్తి నవలంబించిరి. రాజు చేత పట్టుబడవలసివచ్చునని అడవులలో తిరుగుచు దారులు కొట్టి భిల్లులతో స్నేహమాచరించితిరుగుచుండిరి. ఒకడు ఒక పులిచేతను మరొకడు పాము చేతను కాటుపడి ఇద్దరునూ చచ్చిరి. ఇద్దరును ఘోరపాతకముల జేసినవారైనను వికుండిలుని దేవదూతలు, స్వర్గమునకు తీసికొని వెళ్లుచుండిరి. కుండిలుడు యమలోకమునకు అరిగెను అపుడు వికుండిలుడు దూతను స్వర్గద్వారములైన ధర్మములనడిగెను. ఆ దూతయు పలువిధములైన ధర్మా ధర్మములనెఱుకపరచెను. సాలగ్రామ శిలా మాహాత్మ్య మును చెప్పెను. వికుండిలుడు నేను ఏ ధర్మకార్యమునొనరించుట వలన ఈ సద్గతి నొందితినో వివరింపుమని అడిగెను. అంత నాదూత ఓయీ యమునా నదీ తీరమున నొకప్పుడు నీమిత్రుడైన సుమిత్రుని మైత్రి వలన ఆతని ఆశ్రమమునుండి, రెండు నెలలు మాఘ మాసస్నానములను చేసితివి, పాపములు నశించినవి, మరొక మాఘమాస స్నానముచే నీకు స్వర్గము వచ్చినదనెను. వికుండిలుడు ధర్మసూక్ష్మములను చెప్పుమని మరల దూతను అడిగెను. ఆతడిట్లు చెప్పెను.

భక్తితో హరిహర పూజనము, పుణ్యతీర్థ స్నానము, వర్ణాశ్రమోచిత ధర్మానుసరణము సాలగ్రామ శిలా మహత్త్వము, తులసీదళ పూజలు, అతిధ్యభ్యాగత సమర్చనము దానతపోనియమాదులు మున్నగు ధర్మములను బోధించెను. అందులకు సంతసించి నా అన్నకు నరకము నుండి విముక్తి కేమైన ఉపాయమున్నదా ఉన్నచో చెప్పినర బాధావిముక్తి కలుగజేయుమని ప్రార్థించెను. అప్పుడు ఆ దూతయిట్లనెను.

మునుపు మధువనమున శాకలియును నొకముని కలడు, ఆతనికి రేవతి అను భార్య యందు తొమ్మండ్రు పుత్రులు కల్గిరి. 1. ధ్రువుడు 2. క్షమి 3. మధుష 4.తారుడు 5. జ్యోతిష్మంతుడు 6.అపవిమోహనుడు 7. జితమాయుడు 8 ధ్యానకాష్ఠుడు 9. గుణాతిగుడు, అందు నల్వురు విరక్తచిత్తులై సన్యసించిరి మరియు ఆత్మానాత్మవివేచనము చే పరమహంసలై సంచరించుచు ఒకప్పుడ వారునీ వసతిలో విశ్రమించ, వారికి నీవు ఆతిధ్యమునిచ్చితివి. అట్టిపుణ్యమ ఎన్నటికి తరగనిది . ఇయ్యది ఈ జన్మమునకు 8వ జన్మమున నీవు చేసిన పుణ్యమిది. దానిని మీ అన్నకిచ్చిన ఆతడు నరకము నండి విముక్తుడగునని చెప్పెను. వెంటనే వికుండిలుడా పుణ్యమును తన అన్నకు ధారపోయగా, ఆతడున వికండిలుని చేరెను. ఇద్దరును ఇట్లు వైకుంఠమునకరిగిరి.

ఇట్లుదత్తదేవుడు చెప్పగా కార్తవీర్యుడు మాఘస్నానమంత గొప్పదా వైశ్యునక 1 నెల మాఘస్నానము సకల పాపముల పోగొట్టెనంటిరి, రెండవ నెల మాఘస్నానమ స్వర్గమునిచ్చెనంటిరి, వైశ్యుడు చేసిన పాపమా కొండంత కలదని చెప్పితిరి ఇదెట్లు? అని ప్రశ్నించగాదత్తుడిట్లు సమాధానమొసర్చెను. ఓయీ నీళ్లు పరవ పవిత్రములు సుఖకరములు. జీవుల కందరికిని ప్రాణమునిచ్చునట్టివి. వేదముల నీళ్లే నారాయణస్వరూపమని వాక్రుచ్చుచున్నవి. వాపీకూప, తటాకోదకములే మాఘస్నానమున అత్యంత పుణ్యప్రదములని చెప్పుచుండనదీతీర్థోదకముల మాట వేరే గొప్పగా చెప్పవలయునా? ప్రయాగ తీర్థమున స్నానమాడుట అన్నింటి కంటె మిన్న. ఒక రోజు లేక, 2,3,4,5, రోజులు స్నానములాడినను అనంత పుణ్యఫలప్రదములే అగుచున్నవి. కాంచన మాలిని అనునొకతె ఒక పాపకారియైన రాక్షసునికి 3 రోజులు స్నానము చేసిన ఫలమును ఇచ్చి రాక్షసజన్మమునుండి ఆతనికి విముక్తిని కలుగజేసినది.

కాంచనమాలిని అనునొక అప్సరస గలదు. ప్రతిదినము ప్రయాగలో స్నానమాచరించెడిది. శివాలయమునకేగెడిది. స్నానమొకరోజు చేసి వెళ్లుచుండగ తడిబట్ట నీటితుప్పరలు బ్రహ్మరాక్షసుని పై బడినవి. అంతమాత్రము చేతన

రాక్షసుని క్రూరబుద్ధి తొలగి మనసు శాంతి కలిగినదాయెను. వెంటనే ఆ కాంచనమాలినికి కనిపించి, తనకు కలిగిన అనుభవమును చెప్పి నీకింతటి ఆకాశగమనము, లావణ్యము మహిమము కల్గుటకు కారణము వచింపుమని ప్రార్థించెను, ఓరీ రాక్షసానేను, సుమేధుడను, నొక గంధర్వుని కన్యను, కలింగేశ్వరునికి వేశ్యగానుండి ప్రసిద్ధిబడసి బహుళమగు ధనమును గడించితిని, చివరివయసున, రాజ పురోహితుని తరణోపాయమునడిగితిని. ఆతడు మాఘమాసమున ప్రయాగ స్నానమాచరింపుమని దానివలన సమస్త పాపములనుండి వినిర్ముక్తురాలవు కాగలవని చెప్పినాడు, నేనట్లు చేసి సమస్త పాపవినిర్ముక్తురాలనై మరుసటి జన్మమున కాంచనమాలిని అను అప్సరోవరిష్ఠనై మాఘస్నానము ప్రయాగమున మరువక చేయుచుంటిని. ఈ స్నానఫలము అనంతము, నిత్యము స్నానము చేసి శివారాధన తత్పరురాలనై యుండుట వలన నింతటి మహిమ కల్గినదని చెప్పెను. అరాక్షసుని వృత్తాంతమును కాంచనమాలిని అడుగగా ఆతడిట్లు చెప్పెను.

నేను బ్రాహ్మణబ్రువుడను,వేద పారంగుడను కాశిలోనుండెడివాడను, అనేకములైన దుర్దానాదులను బట్టి దుష్కర్మములచే పాపాత్ముడనైతిని. నేను చేయని పాపములు లేవు. అయినను కాశీపురిలో మృతి చెందితిని. కాశిలో మరణించినవానికి నరకము లేదు. సర్పజన్మములు 3 గద్దజన్మలు 2 గుడ్లగూబజన్మ పందిజన్మలు 2 పులిజన్మ 1 మొత్తము తొమ్మిది జన్మల అయినతరువాత భైరవాజ్ఞతో పదియవ, జన్మలోరాక్షసునిగా పుట్టితివి. ఇందుండి 3 యోజనముల దూరముననున్న ప్రాణి వర్గమును క్రూరముగా హింసించి తినుచుందును. ఇట్టి నాకు ఈ రాక్షస జన్మనుండి విముక్తిని కల్గింపుము. నీవు ప్రయాగమున మాఘస్నానమాచరించిన ఫలమునా కొసంగినన్ను కాపాడుమని ప్రార్థించెను. కాంచనమాలినియు, దయతో 3 రోజులు ప్రయాగ మాఘస్నానఫలము నిచ్చెను. వెంటనే ఆ రాక్షసుడు స్నాన ఫలమహిమచే రాక్షసజన్మమును వీడి దివ్యరూపముతో దివికేగెను.

**11-8** అత్రి అనసూయలకు సోమదత్త, దూర్వాసులను ముగ్గురుపుత్రులని శ్రీదత్త దేవుని కృపవలన అలర్క హైహయాదులెందరో తదనుగ్రహపాత్రులై తరించిరని ఇదివరలోనే చెప్పబడినది. కార్తవీర్యార్జునుడు శ్రీదత్తవిభుని అనుగ్రహముచే సహస్రబాహువులను సప్తద్వీపాధిపత్యమును సర్వజనమనః ప్రత్యక్షత్వమును వరములనుగా పొందెను. ఒకప్డు వనమునకు వేటకై వెళ్ళెను.

అచ్చట సమీపములోనున్న ఋచీకా శ్రమము చేరెను. జమదగ్నియు ఆతని కర్ఘ్యపాద్యాదు లిచ్చెను. సేనతో కూడివచ్చిన రాజు హోమధేనువు గొప్పరత్నముగా నెంచి వలదన్నను బలాత్కరించి తన యింటికి గొంపోయెను. జమదగ్నికి చివరిబిడ్డడైన పరశురాముడాతనిని సహింపక కార్తవీర్యార్జునుని మా ధేనువును మాకిచ్చి నతి చేయుమనెను. కార్తవీర్యార్జునుడట్లు చేయుట కంగీకరించలేదు యుద్ధమునకు రాగా యుద్ధమున సహస్ర బాహువులను, తలను నరికి తన హోమ ధేనువును ఆశ్రమమునకు తీసికొని వచ్చి తల్లిదండ్రులకు నమస్కరించెను తరువాత కార్తవీర్యుని పుత్రులు పరశురాముడాశ్రమమున లేకుండా చూచి రేణుక గుండెలు బాదుకొనుచు వలదు, వలదని, వారించుచున్నను లెక్కచేయక జమదగ్నిని చంపిరి. పరశురాముడు పితృవధమునకు మిగుల వగచి కార్తవీర్యుని కుమారుల నందరిని హతమార్చివచ్చెను.

దీపకుడు గురుని గూర్చి ఇట్లు అడిగెను. పరశురాముడు క్షత్రియాంతకరమైన ప్రతిజ్ఞనెందులకు చేసెను? కార్తవీర్యార్జును డంతటి వాడగుటకు కారణమెయ్యది? గురుడిట్లనెను. వత్సా! పూర్వము విష్ణుని చేతియందలి సుదర్శనచక్రము మిక్కిలి గర్వించినది. నేను చేతియందుండటవలన గదా విష్ణువు సమస్త రాక్షస సంహారము చేయగల్గుచున్నాడు అని గర్వించెను. అతని గర్వమును చూచి కోపించి విష్ణువు భువిపై జన్మింపుమని శపించెను. సుదర్శనుడు వెంటనే తన గర్వముచే నింతటి శాపము కల్గినదని పశ్చాత్తప్తుడై విష్ణుపాదములపై బడెను. వత్సా! నీవు భువిపై కార్తవీర్యార్జుననిగా జన్మించెదవునా అనుగ్రహముననే సహస్ర బాహుత్వము సప్తద్వీపాధితపత్యము మున్నగు వరములను పొందెదవు. పరశు రామావతారమున నిన్ను సంహరించి మరల చేతికి భూషణముగా ధరించెదనని శాపావసానమున వచించెను. కావున విష్ణుని చేతి సుదర్శన చక్రమే కార్త వీర్యార్జునుడు పరశురాముడు కార్తవీర్యార్జునుని పుత్రుల జంపి సకల క్షత్రియాంత కరమైన ప్రతిజ్ఞనిట్లు చేసెను నాతల్లి ఇరవై ఒక్కమార్లు గుండె కొట్టుకొని ఏడ్చినది కావున ఇరవై ఒక్కమార్లు భూమియందలి రాజులను వెదకి వెదకి చంపెదననెను. రేణుక పరశురామా ముందు నీ తండ్రికి సంస్కారము చేయవలెను. ఆగుమని విన్పించునంత వఱకు సహ్యాద్రికి చేర్చవలసినదని ఆజ్ఞాపించెను. రాముడును అట్లే యని వారినిద్దరిని రెండువైపుల కావడిలో ఉంచుకొని సహ్యాద్రియందు ఆమలక్యాశ్రమప్రాంతమున తిష్ఠ తిష్ఠ అనెడి మాటవిన్పింపగా అచ్చట కావడిని దింపి, తల్లి యాజ్ఞననుసరించి

దత్తదేవునికై వెదకెను. దిగంబరుడైన ఆ దత్తదేవుడు తన కాంతకు మద్యమిచ్చుచు మిక్కిలి అనాచారుడై కన్పించెను. అయినను పాదములనుబట్టి తనతండ్రికి సంస్కార విధిని నీవే చేయించవలెనని యాచించగా తన్ని పొమ్మనెను. అయినను పట్టువిడువక తన తల్లి ఆజ్ఞను యథాతధముగా చెప్పెను. అపుడు ఆస్వామి నీతల్లి రేణుక ఇచ్చటికి వచ్చినదా అయినచో వచ్చుచున్నాను. అని ముందుగా రేణుకకు మొక్కి సర్వతీర్థముల స్నానమొనర్చి క్షణములో రమ్మని రామునికి ఆజ్ఞనిచ్చెను. పరశురాముడు వెంటనే ఒక బాణమును ధనువునందు సంధానించి సర్వతీర్థములును ఒకచోట చేరునట్లు కొట్టెను. అదొక సరస్సు అందుండియే కృష్ణానదీ ఆవిర్భావము అందు స్నానమొనరించి దత్తదేవుడు చెప్పినట్లు సంస్కరించుచుండగా రేణుకకూడా సహగమనముచేసి దేదీప్యమానవిగ్రహయై తన భర్తతో బాటు పరశురామునికి కన్పించినది. ప్రతిజ్ఞను నిర్వర్తించిన తరువాత ఆ తలిదండ్రులిద్దరు స్వర్ణమయమైన పత్నిని గూర్చుకొని కశ్యప దత్తాత్రేయుల సహాయముతో యజ్ఞముల చేయుమని ఆజ్ఞాపించిరి. పరశురాముడు 21 మార్లు తిరిగి తిరిగి రాజులను వధించి ప్రతిజ్ఞను తీర్చి యజ్ఞముల ననేకముల గావించెను. ఆ యజ్ఞములచే దేవతలందరు ప్రీతి నొందిరి. ఋత్విగ్దక్షిణగా తాను జయించిన భూమినంతటిని కశ్యపునికి దానమొనర్చి సముద్రుని కొంతమేర అడిగి అందు నివసించెను. ఆమలాశ్రమ మహిమమును రేణుకా దేవి మహిమను గూర్చి దీపకుడు అడుగగా గురుడిట్లనెను.

ఒకప్పుడు నలువసృష్టి చేసెను. అందరు విరక్తులు, తపస్సులు, జ్ఞానులు నయిరి. సృష్టివృద్ధి చెందని కారణముగా అవిద్యను పంచపర్వములతో సృజించెను. తాను సృజించిన అవిద్యచే తన కూడా వేదము విస్మరించెను. తిరిగి వేదములను తెలిసికొనుటకై దత్తాత్రేయుని రేణుకను శరణు పొందెను. వారలు బ్రహ్మను, పాలకడలిలోనున్న విష్ణువును సేవించి రమ్మనిరి. విధి అట్లే అని వెళ్ళి అచ్చట విష్ణువు లేకుండుటచే తత్స్థానమున నున్న అమలక వృక్షమును (ఉసిరిగ) తీసికొని వచ్చెను. దత్తవిభుడు పరశురామునిచే ప్రతిష్ఠింప జేసి దాని క్రింద తానధివసించెను. రేణుక వేదములను కొంతవఱకు చెప్పి ఈ దత్తాత్రేయుడు అన్నింటిని సమగ్రముగా బోధించగలడని ఆదేశించినది. రేణుకా వపుర్దేశమునుండి వేదరాశియు, దత్తాత్రేయాంక స్థితయగు లక్ష్మినోటియందును ప్రవేశించు చుండుటచే విధి చూచెను. ఇట్లు రేణుకా మహిమచే ప్రభావితుడైన దత్తాత్రేయుడు

సర్వవర్ణములకును నాద మొక్కటియే మూలమని ఛందస్సులు హల్లులు, అచ్చులు ఓంకారము, ఆత్మఅంతయు అష్టపర్యాయవాచక సకల వేద మాతయును ఈరేణుకయే సుమా అని చెప్పెను. రేణువు అను రాజు తపముచేసి ఈ వేదమాతను కూతురుగా వరమందుటవలన రేణుక అను పేరుతో నుండెననియు చెప్పగావిని బ్రహ్మ రేణుకకు దత్తదేవునికి మ్రొక్కి వేదములను పొంది తనస్థానమునకు వెళ్ళెను. బ్రహ్మదేవుడు మునుపు విష్ణువును గానక ఆమలక వృక్షమును తీసికొని వచ్చుటచే పరశురాముడు ఆశ్రమమున నాటుటవలన ఆమలక్యాశ్రమ మని ఆ గ్రామమునకు ఆమలక గ్రామమని పేరు కల్గినది. ఇయ్యది ప్రతీతానదీతీరములో గలదు. పింగళనాగుడను నొక తపస్వి కృష్ణామలకము క్రింద నున్న దత్తదేవుని స్వామీ! 4 ఆశ్రమములని వినియుంటిని. తమ ఆశ్రమము వానికంటె విలక్షణముగా కానవచ్చుచున్నది వివరింపుమని అడిగెను. అపుడా స్వామి ఓయీ ఇది నిజమే కామక్రోధాదుల ద్రుంచి విరక్తచిత్తము కలవానిది ఈ ఆశ్రమము పంచమము అని చెప్పెను. అతడు ఆ దత్తాత్రేయుని అనుగ్రహమును పొంది ఆ స్వామి ఉదరమున ప్రవేశించెను. ఆ తీర్థమునకు పద్మతీర్థమని పేరు. క్షీరాబ్ధి మధనమున పీయూషామలకము పుట్టినది. వైకుంఠమున కృష్ణామలకము పాతాలమున అమృతామలకము భువియందు సిద్ధామలకము ఇది దత్తాశ్రమమున ప్రతిష్ఠింప బడినది. దత్తాత్రేయాశ్రమమునకే మాతాపురమను పేరు కల్గినది.

పూర్వము, చాంఘ్రికుడను ద్విజుడు కలదు. తన భావినితో తీర్థములన్నియూ తిరిగి ఆకాశవాణిపల్కులచే మాతృతీర్థము గొప్పదని విని రేణుక ఎదుట పితృ శ్రాద్ధమునాచరించి తరించినాడు. ఇక సూర్యుడొకప్పుడు తనభార్య ఉషయందు భానుమతి అనుకన్యను కనెను. ఆమె మిక్కిలి అందగత్తె కాగా తానే తన కూతురును మోహించెను. భానుమతి తన తండ్రిని తప్పించుకొని తిరిగెను. తరువాత దేవతలు ఆ సూర్యుని కామమును ఆక్షేపింపగా వెనుకకు మరలెను. కూతును కామించుటచే కుష్ఠరోగపీడితు డయ్యెను. భానుమతి దేవతలను ప్రార్థింపగా వారు కూతురును కామించుట పంచమహాపాతకాలకంటె గొప్ప పాతకము. కాన పద్మతీర్థమున స్నానముచేసి ఏక వీర రేణుకను నమస్కరించిన పాపము పోవుననిరి. సూర్యుడు తన కూతురువలన అంతయునువిని అట్లుచేసి రోగవిముక్తుడయ్యెను. ఇట్లు దత్తాశ్రమమున గల ఈ తీర్థములన్నియు మోక్ష ప్రదములు. ఇవి పరాశరమైత్రేయ సంగదితము. స్కంద ముని సంవాదము దీపక వేదధర్మ ప్రశ్నోత్తరరూపము.

11-9 ఒకప్పుడు పరశురాముడు తన తల్లి రేణుకాదేవి మహిమమును చెప్పుమని దత్తదేవుని అడిగెను. దత్తదేవుడు ఓయీ నీ వెఱుగవా! అనఘు, స్థూల సూక్ష్మ మయమైన దివ్యతత్త్వము. ఆమెయందే భువన త్రయము కలదు. వనములు, నదులు, సముద్రములు, గిరులు, ప్రాణులు, వృక్షములు మునులు దేవతలు తీర్థములు ఆ జనని యొక్క స్థూలరూపములే సుమా. తల, అతల, వితల, సుతల, తలాతల, రసాతల, పాతాళ లోకములు, భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకములనెడి 14 భువనములు ఆ జననికి స్థూలరూపమే.

ప్రకృతి, మహదహంకారములు శబ్దస్వరూప, రస, గంధములు, ఇంద్రియ గోచరములన్నియు ఆ రేణుక సూక్ష్మరూపములై యున్నవి. పూసలలో దారమువలె ఈ అన్నిటికి శక్తినిచ్చునట్టిది ఆమాతయే, ఆమెయే చిచ్ఛక్తి. మునులు కుమారస్వామిని ప్రశ్నింపగా మాతృతీర్థమును గూర్చి ఇట్లు చెప్పెను. మాత రేణుక, ఆమె బ్రహ్మకు సదావిస్మృతిని కల్గించేవేదరాశి దత్తదేవుని అంకస్థితయైన లక్ష్మినోటియందు ప్రవేశింపజేసిన వేదమాత, ఆమె త్రికాల సంధ్యాస్వరూపిణి, ఈ సమస్త బ్రహ్మాండములకు కారణమైనట్టిది. పరశురామావతారోత్పత్తికి కారణమైనట్టిది. జమదగ్ని తన తపస్సుచే సాక్షాచ్ఛివుడనబడుచున్నాడు. ఆతనిని రేణుక, శక్తి స్వరూపిణియై భక్తానుగ్రహమును చేయదలచి అనుసరించినది. రేణుకాజమదగ్నులు పార్వతీ పరమేశ్వరులు అని తెలిసికొనుము. ఆ తల్లి ఉండుటకు ఆలయమైన తీర్థము కానమాతృ తీర్థము అను పేర విలసిల్లినది. ఇచ్చటనే ఆ రేణుక, ఏకవీరలకు మొట్టమొదటగా సర్వతీర్థోకములచేఅభిషేకము చేయుదునని దత్తాత్రేయుడు అభిషేకించి అచ్చట జమదగ్నిని ఆ రేణుకను సంస్కరించి మునులందరు చూచుచుండగనే అదృశ్యుడయ్యెను. ఎచ్చటికేగెనో అని అందరు అన్వేషించుచుండ అంతలోనే అచ్చటప్రత్యక్షమాయెను. సురలు మునులు ప్రణమిల్లిరి. స్వామీ నీవెచ్చటికేగితివో ఏమాచరించితివో మాకు వివరింపుమని ప్రార్థించిరి. దత్తాత్రేయు డిట్లనెను. నేను సంధ్యావందనము నాచరించుటకు వెళ్ళితిని. పగటికి రాత్రికి కల మధ్యభాగమునకు సంధి అనిపేరు అట్లే వృత్తికి, వృత్తికి మధ్య నుండెడిది కూడా సంధియే. సంధియందలిది కాన సంధ్య అయినది. ఇట్టి సంధులయందు మధ్యనుండు కాలమునకే సంధ్యాకాలము అనిపేరు ఆమెయే ప్రాతఃకాలమున గాయత్రిగాను, మధ్యాహ్నకాలమున

సావిత్రిగాను, సాయంకాలమున సరస్వతిగాను అందరిచే ఉపాసింపబడు దేవత రేణుకయే. ప్రజాపతి వ్యష్టిగా ప్రాణులను సృజించెను. సమష్టిగా సంధ్యను సృజించెను. ఈ విధముగా జూచిన రేణుక బ్రహ్మరూప సంధ్యాదేవత అట్టిదేవతయే ఏకవీర, ఆమెను వృత్తిలయము కల్గిసేవించుటయే సంధ్యావందనము అని చెప్పబడుచున్నది.

1. అమ్మహాదేవితప్ప అన్య ంబెరుంగకుండుటను ఉత్తమ సంధ్యగా చెప్పుదురు. అనగా నిర్వృత్తికముగా నుండుట.

2. ఇడ, పింగళనాడుల ద్వారా గాలిని పీల్చి కుంభించిన గాలిని సుషుమ్నా నాడికి ఎక్కించి భూమిని మరచి హృదయమధ్యమున ఇరమ్మదతేజస్సును చూచుట మధ్యమ సంధ్యయనబడుచున్నది.

3. గాయత్రీ, సావిత్రీ, సరస్వతీ రూపములుగా ప్రాతర్మధ్యాహ్నసాయం సమయములలోనుపాసించుట అధమ సంధ్యగా చెప్పబడుచున్నది.

ఇట్లు దత్తాత్రేయా శ్రమమున విని మునులు సురలు దత్తాస్వామిని కృష్ణామలక వృక్షము క్రింద రేణుకాదేవి సంపత్తిని మెచ్చుకొనుచు మ్రొక్కి ఆ స్వామిని అభిషేకించి పూజించి స్వస్థానముల కేగిరి. అని రేణుకామహిమమును కార్తవీర్యునికి ఉపదేశించెను. అంతట కార్తవీర్యునికి ఇంత ప్రభావము అని తరదుర్లభమైన ఆధిపత్యము యోగతత్త్వములు కల్గి ఆతడుసర్వోత్తముడుగ ఆయెనంటిరి. ఇట్టి పుత్రుని పొందుటకు ఆ తలిదండ్రులు ఆచరించిన వ్రతమెట్టిదియో? వివరింపుమని దీపకుడు గురుని అడిగెను. గురుడిట్లు చెప్ప దొడగెను. ఇది వఱకు ఇది కొంత చెప్పబడినదై నను మరికొన్ని విశేషములతో ధర్మరాజునకు కృష్ణుడు బోధించిన విధము తెలిపెదను. శ్వేత వరాహకల్పమున వైవస్వతమన్వంతరములోని మొదటియుగమునందు కృతవీర్యుడను నొకరాజ భువిని పాలించెను. అతనికి చ్యవనమహర్షి శాపమువలన వందమంది పుత్రులు పుట్టియు వెంటవెంటనే చనిపోవుచుండిరి. ఆరాజు మిక్కిలి దుఃఖించి వంశాంకురమునకై బృహస్పతిని చేరి ఉపాయమడిగెను. ఆదేవగురువు సప్తమీస్నపన వ్రతమునుపదేశించి నియమములతో చేయుమనెను. ఈ వ్రతము మృతాపత్య యగు వనిత సప్తమమాస గర్భిణియై యున్నప్పుడు చేయదగినది. భర్తతోగూడి సప్తబ్రాహ్మణదంపతులను పిలిచి దీనిని ఆచరింప వలెను. ఈవ్రతమునకు

సూర్యుడధిదేవత, సౌరసూక్తములతో రుద్ర సూక్తములతోను సూర్యునికి, రుద్రునకు అభిషేకమాచరించి పూజలు హోమములు చేయవలెను. అర్క, పాలాశ, సమిధలు, తిలమిశ్రితములుగ చేసి అష్టోత్తర శతహోమము చేయవలెను. ఏడుకలశములు వానిపై అద్దములనుంచి సప్తర్షి మంత్రములతో మండపారాధన ముగింపవలెను. సప్తబ్రాహ్మణదంపతులను వస్త్రభూషణాదులతో నర్చించి స్కందుని పూజింప వలెను. విత్తశాఠ్యమాచరింపరాదు. భూరిదక్షిణల నీయవలెను. హోమముచేయగా మిగిలిన చెరువును గర్భవతియు ఆమె పతియు భుజింపవలెను.

ఈ సప్తమీస్నపనవ్రతముచేసెడి వారికి కలుగు పుత్రుడు జ్ఞాని, యోగియు నగును. వ్రతవిధానము నంతయు కృతవీర్యుడు చేసెను. ఇక కృతవీర్యుని భార్య తన యింటికి ఒకప్పుడు యాజ్ఞవల్క్యుని భార్యమైత్రేయిరాగా ఆమెవలన అనంత వ్రతమును తెలిసికొని ఆచరించినది. ఇది సంవత్సరకాలము ఆచరింపతగినది. ఈ వ్రతమునకు దేవత విష్ణువు. ఇక అనఘాదేవత దత్తాత్రేయవ్రతము మార్గశిర బహుళ అష్టమినాడు ప్రారంభింపవలెను. అనఘాశక్తి సమేత అనఘుడు దత్తాత్రేయుడు ప్రధానమైన దేవతగా కలది. అనఘ అనగా లక్ష్మి. అనఘుడనగా విష్ణువు. ఈ వ్రతమును కృతవీర్య దంపతుల చేసి తత్ఫలముగా కార్తవీర్యార్జునుని మహా యోగీశ్వరుని జ్ఞానిని పుత్రునిగా పొందిరి. అని దీపకునకు గురుడు తెలిపెను.

11-10 దీపకుడు దత్తాత్రేయావతారమును గూర్చిఅడుగగా వేద ధర్ముడిట్లు చెప్పెను. ఓయీ విష్ణుని అవతారములనేకములు. అందు 12 అవతారములు సుప్రసిద్ధములు 1 మత్స్య, 2 కూర్మ 3. వరాహ 4. నారసింహ, 5.వామన, 6. శ్రీరామ 7.పరశురామ, 8. బలరామకృష్ణ, 9. బుద్ధ, 10. కల్కి, 11. దత్తాత్రేయ 12 వ్యాసావతారములు అని మత్స్యపురాణమునను, శ్రీమద్భాగవతమందును కీర్తింపబడినవి. 12 మాసములు వ్రత సిద్ధికై పన్నెండు అవతారములను పూజింపవలెనను విధికూడా కలదు. స్వారోచిషమన్వంతరమున దత్త, నిశ్చ్యవన, స్తంభ, ప్రాణ, ఔర్వ, కశ్యప బృహస్పతులను, సప్తర్షులలోను దత్తదేవుడు చెప్పబడినాడు యోగచ్యుతినుండి రక్షించి తత్త్వమును ఉపదేశించుచుండు మహనీయుడు. జంభాదిదైత్యులను సంహరించి ఇంద్రాదులు అర్క కార్తవీర్యార్జునాది సిద్ధులను యోగులను సంరక్షించినవాడు కావున దుష్టశిక్షణ శిష్టజనసంరక్షణ

అనెడి అవతార కృత్యములను నిర్వర్తించినాడు. వేదోదిత కర్మలు వర్ణసాంకర్యమ
శిథిలత్వమొందగా అనఘాశక్తి యుక్త అనఘదేవుడై వాటిని పునః ప్రతిష్ఠితము
యదుమహారాజును, ప్రహ్లాదుని, ఛాంఘ్రికుడు శాంతతపాదుల నెందర
సముద్ధరించిన స్వామి కాన దత్తాత్రేయావ తారము సుప్రసిద్ధమైనదని అప్రసిద్ధ
కాదని చెప్పెను. ఒకప్పుడు వనవాసమున నున్న ధర్మరాజు పరశురామాశ్రమము
వెళ్ళెను. అకృత వ్రణుడనునొకముని పరశురామ దర్శనము అష్టమి చతు
తిథులలో జర్గును. ఈనాడు చతుర్దశి ఆస్వామి దర్శనము ఈ రోజు రా
కల్గును. ఈ పరశురాముడు మహావిష్ణువు యొక్క అవతారమని భక్తితో స్వా
సేవించెను. దత్తదేవుని వలన వరములను పొంది కార్తవీర్యార్జునుడు మిగ
గర్వించెను. రాజుల నెందరినో జయించి దేవతలను మునీశ్వరులను లక్ష్యపె
సంచరించెను. అట్టియెడ దేవతలు, మహావిష్ణువును చేరి కార్తవీర్యార్జున
సంహారమును జేయుమని ప్రార్థించిరి. మహావిష్ణువు అందులకంగీకరించి సుర
పంపివైచి తాను బదరికాశ్రమమునకు జేరెను. కాలాంతరమున నాత
సంహరించెను. కాన్యకుబ్జాధీశుడు గాధియను రాజు అచ్చట నివసించుచు
అందమైన కన్యకను కనెను. భృగువంశమునందు పుట్టిన ఋచీకుడనువాడు
కన్యకను తనకిచ్చి వివాహము చేయుమనెను. ముని మాటను కాదన్న ఏ
ముప్పువచ్చునోయని నీవంటి మునిని కన్యాశుల్కమడుగరాదు అయిన
మావంశాచారముగా వచ్చుచున్న శుల్కమును తీసికొనకుండుటయు త
పనికాదు. కావున ఒకచెవి నల్లగా నుండిన శ్వేతాశ్వములను వేయిం
కన్యాశుల్కముగా నిచ్చినచో ఈ కన్యకనిచ్చెదనని వచించెను. ఋచీకుడు అ
వేయి గుఱ్ఱములనిచ్చి సత్యవతియను ఆకన్యకను వివాహమాడెను. కోడ
కొడుకు వచ్చి భృగువుకు నమస్కరించిరి. భృగువు మిగుల సంతసించి సత్యవ
వరము కోరుకొనుమని చెప్పెను. తనకు తనతల్లికి ఉత్తమ పుత్రులు కల్గున
వరమునిమ్మని ఆమె వేడెను. భృగుమహర్షి సాధ్వీ! నీవు నీతల్లి ఋతుస్నాత
పిదప నీవు మేడిచెట్టును కౌగిలించుకొనుము. నీతల్లి రావిచెట్టు
కౌగలించుకొనవలయును. మీకై రెండు యజ్ఞహోమ శిష్టములైన రెండు చరువుల
ఏర్పరచి ఉండెదను. ఒకటి బ్రాహ్మతేజము రెండవది క్షాత్రతేజము. మొదటిదా
నీవు స్వీకరింపుము. రెండవదానిని నీతల్లికిమ్మ. మీరిద్దరు పుత్రశ్రేష్ఠుల
పొందగలరని దీవించెను. కొంతకాలమునకు వారు అట్లు చేయగా సత్యవ

తల్లియు గర్భవతులైరి. భృగువు వచ్చి తన కోడలిని చూడగా క్షాత్రతేజోవంతమైన గర్భముగ తోచి అడిగెను. నీ తల్లి నిన్ను మోసగించినది. నీకు క్రూరుడగు క్షాత్రతేజముకలవాడు పుట్టునని చెప్పెను. సత్యవతి భృగువు కాళ్లపైబడి స్వామీ నా కుమారుడు బ్రాహ్మణశ్రేష్టుడే కావలెను. మీమాట నా మనుమనికి సత్యమగునట్లు అనుగ్రహింపుమని ప్రార్థించినది. భృగుమహర్షి తనకోడలు కోరినవిధముగానే వరమునిచ్చి అదృశ్యుడై తపమున కేగెను సత్యవతి మామగారి వరప్రభావమువలన జమదగ్నిని కనెను. అతడు సూర్యసముడై వేద వేదాంగముల జదివి సాంగోపాంగ మగుధనుర్వేదమును కూడా తనవశము కావించుకొనెను. ఒకప్పుడు జమదగ్ని రేణువు అనుమహారాజును చూడబోయి అతని కన్యయగు రేణుకను తనకిమ్మని అడిగెను. రేణువు తనకన్యనిచ్చి వివాహముచేసెను. జమదగ్ని రేణుకయందు 5గురు పుత్రులను పొందెను. చివరివాడే పరశురాముడు. బదరికాశ్రమమునకు వచ్చిన శ్రీ మహావిష్ణువు చరురూపమున జమదగ్నిలో ప్రవేశించి రేణుకయందు పరశురామునిగా నవతరించెను.

రేణుక ఒకప్డు స్నానార్థినియై దగ్గఱనున్న జలాశయమున కరిగెను. మార్తికావతదేశమునేలు చిత్రరథుడను రాజు తన భార్యలతో జలక్రీడలాడుచుండ చూచి సుఖమన్నరాజులదే కాని విప్రులకుండునా అని ఆ రాజును సస్పృహముగా జూచెను. తన మనసు చలించుటచే ముని ఏమి శపించునో అని భయపడుచు జమదగ్నిని చేరినది. ఆమెను చూచునప్పటికే అంతయు తెలిసి జమదగ్ని మండి పడెను. ఈ పాపాత్మురాలిని చంపవలసినది అని జ్యేష్ఠపుత్రుని ఆదేశించెను. వాడు కాదనగా మిగిలిన మువ్వురు సోదరులును అట్లు చంపుటకు వెనుకాడిరి. అనల్వురిని, మృగ, పశు, పక్ష్యాదుల బుట్టుమని శపించెను. ఇంతలో పరశురాముడు రాగా తల్లి తలను తెగగొట్టుటకాదేశించెను. అతడును వెంటనే తనతండ్రి యాజ్ఞను శిరసా వహించి తనగండ్రగొడ్డలితో తలను నరికెను. జమదగ్ని రాముని వరము కోరుకొనుమని చెప్పెను. పరశరాముడు మా అమ్మ నేను చేసిన ఈ వధమును మరచి పునరుజ్జీవితురాలుగా చేయవలసినదనియు నా సోదరులు యథాతథముగా నిన్గొల్చుచుండునట్లును వరములను గోరెను. జమదగ్నితథాస్తు అని ఆశీర్వదించి అట్లే చేసెను. రేణుక సాధ్వియై పతిని గొల్చెను.

ఒకప్డు కార్తవీర్యార్జునుడు వేటకై జమదగ్ని ఆశ్రమమున జమదగ్ని ఆతిథ్యమును స్వీకరించెను. హోమధేనువు సృష్టించిన బహువిధ భక్ష్యముల

నారగించి ఆశ్చర్యపడి కార్తవీర్యుడు అహోమధేనువునడిగెను. ఋషి ఈయకే
అందుచే బలాత్కరించి హోమధేనువును తనవెంట తీసికొనివెళ్లవలెననుకొని
పరశురాముడా విషయమును తెలిసికొని కార్తవీర్యునెదిర్చి ధేనువును సవినయమ
నర్పింపక పోవుటచే సహస్రబాహువుల ఛేదించి తలనరికి తన ధేనువును తి
తెచ్చుకొనెను. కార్తవీర్యుని పుత్రులు పరశురాముని ఎదుట నెదిరింపలేక అత
ఆశ్రమమున లేనపుడు చూచి జమదగ్నిని చంపిరి. రేణుక 21మార్లు రొమ
బాదుకొని ఏడ్చినది. ఆ విషయమును వినిన పరశురాముడు వెంటనే కార్తవీర
పుత్రుల నందరిని చంపిదీనికి మూలము రాజులకున్న గర్వము కదా '
21మార్లు భూమిని తిరిగి వెదకి వెదకి రాజులను చంపుటకై ప్రతిజ్ఞపూనె
జమదగ్నికి తన తల్లికిని సంస్కారములు యథోక్తముగా నాచరించెను. పిమ
తానుచేసిన ప్రతిజ్ఞను పాటించి ఆ పాపము పోవుటకై తల్లిదండ్రులు అనుమ
స్వర్ణపత్నిని చేకూర్చుకొని అశ్వమేధయాగమును జేసి తాను జయించిన భూమి
కశ్యపునికి దానమిచ్చినట్టి మహనీయుడు అని పరశురాముని వృత్తాంతమ
అకృతవ్రణుడు వివరించెను. పిమ్మట ధర్మరాజునకు పరశురాముడు దర
మిచ్చెను. ధర్మరాజు పూజచేసెను. పిదప రాజర్షికి ఆవిప్రర్షి ఇట్లనెను. నీవు
కలిగియు ద్రౌపదిని కేశములను బట్టినిండు సభలోనికి ఈడ్చినను అపకార
లెన్నింటిని చేసినను శత్రువులపై శమమును చూపెట్టిన శాంతుడవు. నే
విప్రుడనై పుట్టియు, నృపజాతిని క్రూరముగా హింసించి విప్రధర్మము
విడనాడినవాడను. శాంతియే కత్తిగా గల నిన్ను చూడవలెనని ఎంతయోవేడుక
నుంటిని. నీవే నాకంటే కీర్తనీయుడవని పల్కెను. ధర్మరాజు పరశురాము
మ్రొక్కి అతని దీవెనలందుకొని వెళ్ళెను. పరశురాముడు దక్షిణ దిక్కుగా నేగె

స్వామీ దత్తదేవుని ఉపదేశములను మునుపు సాధ్యులు పొందిరని చెప్పితి
ఆహంసగీతమును వివరింపుమని దీపకుడు గురుని అడిగెను. గురుడిట్లనె
దీపకా, ఆత్మానాత్మలను వేఱుచేసికొని ఆత్మానుభవము కలవారిని హంసలందు
అట్టిహంస రూపుడైన దత్త విభుని చేరి సాధ్యులు. సిద్ధిస్వరూపమునడిగిరి. ఆద
దేవుడిట్లానతిచ్చెను. మనస్సుకు, ధైర్యము, సత్యము, శౌచము, శమమ
మున్నగునవియే ఉత్తమసిద్ధులను గూర్చును. కోపించినవానిపై కోపించ
తితిక్షపూనుట ఉత్తమము. తన కోపము తనను దహించును కోపమే మ
పుణ్యములను పోగొట్టును. మానావమానములందు సముడుగా ఉండవలెన

ఎవడు హితద్రోహి అనాచారి. కామాంధుడు గాక ఉండునో వాడే పుణ్యాత్ముడు. రూక్షాక్షరవచనములనాడనివాడు ధార్మికుడు. దురభిమానము విడిచిపెట్టి ఎవడు ఆత్మనిబ్బరము కల్గి పరుల వలన ఎన్ని కష్టనిష్ఠురములు కల్గినను చలింపక ఎవడుండునో వాడే ఉత్తముడు. కొట్టువానిని కొట్టక తిట్టువానిని తిట్టక ద్రోహియైన వాని యెడ ద్రోహిగాక ఉండెడి నరునికి దేవతలు ఎదురువచ్చి అన్ని సిద్ధులను సమకూర్చెదరు. మనమును ఎప్పుడు ఆనంద తుందిలముగా జేసికొని, సర్వభూతములందు సమహితత్వముతో చరించువారికి అన్ని సిద్ధులు సమకూరును. సత్సహవాసము ముఖ్యము. సద్గుణములు అమరినచో ఆత్మబోధమమరును. ఆత్మబోధము కల్గిన సద్గుణములు సంభవించును. ఇంద్రియములనెడి అశ్వములను మనస్సనెడి పగ్గముతో పట్టుకొని వశమొనర్చుకొనుట వివేకమని వారలకు ఉపదేశించెను. సిద్ధులు, సాధ్యులు అట్టి దత్తాత్రేయోపదేశామృతమును గ్రోలి నిజవసతికేగిరి.

దీపకుని ప్రశ్ననుసరించి దత్తమహిమోపేతమగు మరొక కథనిట్లు గురుడు చెప్పెను. కుంజలమను పేరు గల బోధవిభ వోజ్జ్వల మగు నొకపక్షి కలదు. ఆ పక్షికి నల్వురు జ్ఞానులైన బిడ్డలు కల్గిరి. ఇవి దిక్కులందు ఆహార సంపాదనార్థమై వెడలుటయేగాక చూచిన వింతలను కూడా తమ తండ్రికి తెలియజేయుచుండెడివి. అందు కపింజలమను పక్షి ఒకా రోజున ఇట్లు చెప్పెను. ఈ రోజున గరుడవాహనారూఢుడైన విష్ణువును, మరొక వింతను చూచితిని. శ్రీశైలమున తుంగుడను యోగి కలడు. అతనికి వేనుడనుపుత్రుడు ఉద్భవించెను. వాడు మిక్కిలి పాపాత్ముడై రోగగ్రస్తుడై సదాదుఃఖిగా నుండెడివాడు. తండ్రి యాజ్ఞచే పెక్కువత్సరములు తపము జేసెను. తరువాత ఆరోగ్యమును రాజ్యమును పొందెను. విష్ణువు నిట్లు ప్రార్థించెను. స్వామీ, నీ అవతారమలనేకములు. దత్తాత్రేయావతారము వాటిలో చాలా గొప్పదనివిని యుంటిని. సంకటస్థితిని తొలగించెడి ఆ దత్త దేవుని మహిమను నీవలన వినదలచితిని అని అడిగెను.

విష్ణువిట్లు చెప్పెను. ఆయువనెడి రాజుకలడు. అతడుపుత్రార్థియై దత్త విభుని జేరి తదనుగ్రహమునకై పాట్లు పడెను. దత్తదేవుడు పొమ్మని గెంటినను పాదములను వీడక పట్టుకొని పలు విధముల ప్రార్థించెను. అతని భక్తి విశ్వాసములకు మెచ్చి వరము కోరుకొనుమనగా ఉత్తమ పుత్రుని వరముగా వేడెను. దత్తదేవుడు ఒకఫలమును ఇచ్చి దీనిని నీ భార్యచే తినిపింపుమనెను. అట్లేనని ఆరాజు

తనపత్నికి ఆఫలమునిచ్చెను. కొంత కాలమునకు రాజు భార్య ఇందుమతి గర్భవతి అయ్యెను. ఆమెకు ఒక స్వప్నము వచ్చినది. అందొక పురుషుడు దత్తాత్రేయాకారముతో వచ్చి ఇందుమతిని తన శంఖములోని పయస్సుతో స్నాపితను చేసెను. రత్న సంయుత సహస్రఫణములుకల్గిన ఒక పాము మిల మిల మెఱయుచుండెను. పిదప దత్తుడు సుధాకలశమున కనిపించి నవ్వుచు ఆమెతో నిట్లనెను. నీ భర్త కీర్తివలె తెల్లగా నున్న ఈ ముత్యాలహారమును కంఠమున ఈ పద్మమును చేతియందు ధరింపుమని ఇచ్చి ఆ దత్తవిభుడు అదృశ్యుడయ్యెను స్వప్న వృత్తాంతము తన పతికి ఇతరులకును చెప్పెను. దత్తాత్రేయాను గ్రహమున నీకు ఉత్తమ పుత్రుడు కలుగునని అతనిచే మీధనము సురక్షితము కాగలదు. మీ చంద్రవంశము సముద్ధరింప బడునని స్వప్నఫలమును దైవజ్ఞుల చెప్పిరి. నేడో రేపో హుండాసురుని వధకై ఆయువునకు పుత్రుడు పుట్టనున్నాడ అని చారణులు చెప్పికొనుచుండగా హుండాసురుని కూతురు వారి మాటలన వినినది. వెంటనే తన తండ్రియైన హుండాసురునికీ విషయమును తెలిపినది హుండాసురుడు అశోకసుందరి శాపమును తలచుకొని ఉలికిపడి ఆయుష బిడ్డను పురుటింటిలో నుండు తనయింటికి కొనివచ్చెను. ఈ బిడ్డను చంపి వండి పెట్టమని వంటవానికి చెప్పెను. వాడును బిడ్డను చంపుటకు పూనుకొని విఫలుడయ్యెను. వీడెవడో దేవతానుగ్రహపాత్రుడు అని అచటనున్న ఒకదాసి చెప్పి ఒకలేడి మాంసమును వండి ఇది ఆ బిడ్డయొక్క మాంసమే అని నమ్మించి హుండాసురునిచే తినిపించిరి. హుండుడు కూడా తన శత్రువునశించెనని ధైర్యముగా నుండెను. వంటవాడు దాసియును కలిసి ఆ రాత్రి వశిష్ఠాశ్రమమునకు వెళ్ళి ఆ బిడ్డను అటదింపి వచ్చిరి.

ఇచట ఇందుమతియు పుత్రుని కనియు తన ప్రక్కన వాడు లేకుండుట తాను తన పతికి చెప్పెను. వారిరువురును మిగుల దుఃఖించిరి. దత్తదేవు ప్రసాదము విఫలమైనదని విలపించుచుండగా నారదుడు వచ్చి దంపతులనిద్దరి ఓదార్చి శ్రీదత్త విభుని అనుగ్రహము ఎన్నటికినీ విఫలము కానేరదు. మీకుమారుడ కారణ జన్ముడు మరొకచోట పెరుగుచున్నాడు. కొద్ది కాలములోనే సాధిత కృత్యుడై మిమ్ము చేరగలడని ఆశీర్వదించి వెళ్ళెను. వశిష్ఠుడు తన ఆశ్రమమ ముంగిటనున్న పసికందును అచ్చటి మునిపత్నులచే పెంపొందించి పెద్దవాని గావించి వేదవేదాంగములను శాస్త్రార్థ కౌశలమును శస్త్రాస్త్రజ్ఞానమును సమ

సంస్కారములతో సంతరింప జేసెను. ఒక దినమున అడవినుండి సమిత్ కుశాదులతో ఆశ్రమమునకు తిరిగివచ్చుచుండ ఒకకిన్నర పక్షులజంట ఆయువు పుత్రుడు మహాతేజుడు నహుషుడను పేరుతో పిలువబడుచు వశిష్ఠాశ్రమమున పెరుగుచున్నాడు. శివకన్యయగు అశోకసుందరితో ఈతనికి వివాహము కాగలదు. హుండాసురుని చంపి తన తల్లిదండ్రుల వద్దకు చేరగలడు. అను మాటలను చెప్పుకొను చుండగా నహుషుడు వినెను. నహుషడు వశిష్ఠుడు వద్దకు చేరి తన కధను తెలసి కధను తెలిసి కొనెను. ఆగురువుయొక్క ఆనతిని శిరసావహించెను. విల్లంబులనిచ్చి హుండాసురుని జయించుమని తన గురువు దీవింపగా విజయార్థమై పయనమాయెను. దేవేంద్రుడు తన రధమును సారధితో పంపెను. హుండాసురుని వద్దకు చేరి యుద్ధమునకు పిలిచి అతనితో ఘోర యుద్ధము చేసి హుండాసురుని వధించెను. ఇంతలో రంభ అను అప్సరోమణి శివకన్యయైన అశోక సుందరిని వివాహము చేసికొనుమని ఇది దేవతలనిర్ణయమని తెలుపగా అశోక సుందరిని వివాహము చేసికొనెను. తన భార్యతో కూడి తలిదండ్రుల వద్దకు చేరెను. వారును అమితానందముతో కొడుకును కోడలిని దీవించి నోచిన నోములు ఫలించినవని ఆదరించిరి. ఓయీ వేనుడా దత్తాత్రేయుని మహిమ ఎట్టిదో వింటివి గదా అత్రిసుత ప్రభావము గణింప నెవ్వరికిని శక్యముకాదు. ధ్యాన గోచరుడైన జనార్ధనుని అనుగ్రహము వేనునికి కల్గుట, నహుషోత్పత్తి హుండాసురవధ అశోక సుందరీ పరిణయము, గరుడారూఢుడైన విష్ణు సందర్శన మను వింతలను తన తండ్రి కుంజలునకు కపింజలుడు వివరించి చెప్పెను.

11-11 వేద ధర్ముడు దీపకుని ప్రశ్నము ననుసరంచి వర్ణాశ్రమ ధర్మములను వ్రతములను దత్తదేవుడు నారద సనత్కుమారసంవాదముతో పేర్కొనబడిన వాటిని ఇట్లు పదేశించెను. వ్రతములలో నన్నింటికంటె గొప్పది ఏకాదశీవ్రతము విష్ణుప్రీతికరము. దశమి, ద్వాదశులలో నొక పూటమాత్రమే భుజించవలెను. ఏకాదశి ఉపవాసముండవలెను. ఈ వ్రతము చాతుర్వర్ణ్యమువారు స్త్రీలు, పురుషులు, అందురును ఆచరింపవచ్చును. ఇయ్యది సర్వపాపక్షయకరము. దశమి, ఏకాదశి ద్వాదశి తిధులలో పై విధముగా ఉపవసించి విష్ణువును పూజించువారికి వైకుంఠ ప్రాప్తి కలుగును. గంగనుపోలిన తీర్థము, విష్ణునిపోలిన దేవత, తల్లికి సాటియైన గురువు, ఉపవాసముతో చేసిన తపము. వీటితో తుల్యములైనవి ఈ లోకమున నేమియు లేవు. ద్వాదశి పారణము అత్యుత్తమము,

దీనిని బోలిన వ్రతమే లేదనుట నిక్కము. నర్మదాతీరమున గాలవుడనువాడొక కలడు. అతనికి భద్రశీలుడను పుత్రుడు కలిగెను. వాడు పుట్టినప్పటిను అన్యులతో నాటలాడక విష్ణునిమట్టి బొమ్మనొకదానిని సతతము పూజించు నతులు, నుతులను మాటిమాటికి చేయుచుండెడివాడు. ఏకాదశీ వ్రత ఏమఱక చేసెడివాడు అట్టి పుత్రుని జూచిగాలవుడు. నీకు ఈ చిన్నవయసు ఈ ఏకాదశీవ్రత నిష్ఠ ఏల కల్గినదని అడిగెను. వాడు ఈ ధర్మమును యమధర్మరా వలన ఉపదేశింప బడితిని. పూర్వజన్మమున నేను ధర్మకీర్తి అను రాజును అపు దత్తదేవుని వలన ధర్మ సందేహములకు సమాధానములెన్నింటినో వినియుంటి అట్టి దేవుని చే శిక్షింపబడియు రాజ్యధనమదగర్వముచే కనులు నెత్తికె ధర్మములతో బాటు అధర్మములను అనేకములను జేసితిని. 9వేల సంవత్సరము రాజ్యమేలితిని. ప్రజల పాపాలు కుడా కొన్ని పొందితిని ఒకప్పుడు వేటకు వెళ్లితి అడవిలో తిరిగి తిరిగి నర్మదలో స్నానమాడితిని నాసేన నా వెంట రాలేక వెనుక తిరిగి వెళ్లిపోయినది. నేను ఏకాకినై ఆకలి దప్పికలతో అలమటించు పట్టణమునకు మిక్కిలి దూరస్థుడనైతిని. ఆరోజు ఏకాదశి పగలు అంతయు ఇ కాగా రాత్రికి నర్మదా తీరవాసులైన మునులు, ఏకాదశి ఉపవసించి రా జాగరణము వేదాధ్యయనముతో కొనసాగించుటను చూచి వారివేదవాదము విచారణములను వినుచు అచ్చటనే ఎక్కువసమయమును గడిపి ఆకలి దప్పి కోర్వలేక అక్కడనే ప్రాణములను వదలితిని. యమభటులు నన్ను బాధించు యమాంతికమునకు చేర్చిరి. యమధర్మరాజు నా పాపములన్నింటిని విని వీడె పాపాలొనరించినను ఏకాదశినాడు ఉపవాసము జాగరణము నర్మదానదీ స్నాన మునుల సందర్శనము అయత్నముగా సిద్ధించుటచే పుణ్యాత్ముడయ్యె యముడు నమస్కరించి ఉన్నతాసనమున కూర్చుండబట్టి పూజించి నా పరిచర్యలొనర్చెను. తన భటులకు ఏకాదశీవ్రతపరులు హరిహరభక్తులు శిక్షార్హు కారని ఆజ్ఞను ఇచ్చెను. పిదప నన్ను వైకుంఠమునకు పంపగా చిరకాలవ అచ్చటనుండి భువికి వచ్చితిని. జాతిస్మరత్వము కలిగి పుట్టినప్పటినుండి యము మాటలు గుర్తు ఉండుటవలన ఏకాదశీవ్రతము మానక చేయుచుంటి ఇట్టివ్రతనిష్ఠకు దత్తాత్రేయోపదేశము సహకృతమైయున్నదని చెప్పెను. గాలవు దత్తాత్రేయ శిక్షితమేదో తెల్పుమనగా భద్రశీలుడిట్లు చెప్పదొడగెను. ధర్మకీ అనుపేరుతోనున్న నేను ఒకప్పుడు సహ్యాపర్వతమున దత్తాశ్రమమునకు వెళ్ళితి

నన్నెంతకొట్టి తిట్టి తన్నినను ఆ స్వామిపాదములను వదలకసేవించితిని. అందు అనేక ప్రశ్నములనడుగగా అన్నింటికి సదుత్తరములనిచ్చి సత్కర్మలనాచరింపుమని హెచ్చరించినాడు. వర్ణాశ్రమ ధర్మములను సదాచారములను సదాపాటించుచు రాజ్యమును సుఖముగా నేలితిని. కొంతకాలమునకు వీడనిపాపములచే దుర్జనసంసర్గముకలిగి దురాచారుడనై ధర్మమార్గమును వీడి పాపములచేసితిని. ఆస్వామి ఏకాదశీవ్రతము ఉపవాసము జాగరణములతో చేయుమనినాడు. నాలుగు వర్ణములవారు తమతమ వర్ణాశ్రమోచిత ధర్మములను ఆచరించిన ఈశ్వరారాధనమే కాగలదు. మధుపర్క సమయమున, పశువధ, దేవర న్యాయమున సుతోత్పత్తి మాంసముతో శ్రాద్ధము అసవర్ణ కన్యలను వివాహమాడుట దత్తద్రవ్యము తిరిగి స్వీకరించుట అశ్వమేధము, గవాలంభము, నరమేధము, నౌకలెక్కి సముద్రయానము చేయుట, నైష్ఠిక బ్రహ్మచర్యము, వానప్రస్థము, సన్యాసము, మహాప్రస్థానము, కలియుగమున నిషిద్ధములు. ఏయే దేశముల ఆచారములు ఆయా దేశములలోనే చెల్లును. ఎట్టిస్థితిలోను ధర్మాచరణము విడువకూడదు. అందునను విప్రధర్మముగొప్పది, విప్రులకే దాన మీయదగును, ఋతుకాల గమనము ప్రశస్తమని ధర్మములను బోధించినాడు. ఆదేవుని కరుణవలననే, జీవితాంతమున అయత్నముగా ఏకాదశీ వ్రతము నాచరించి ఉత్తమస్థితిని పొందితిననెను.

11 - 12. భద్రశీలుడు తనతండ్రికి దత్తదేవుడుపదేశించిన శ్రాద్ధవిధానము నిట్లు చెప్పెను. శ్రాద్ధదత్తములన్నియూ పితృదేవతలకు విశ్వదేవతలు చేర్చెదరు, మన పితరులు దేవతలుగానో, నరులుగానో, పశువులుగానో, స్థావరములుగానో పుట్టియున్నను విశ్వదేవతలు శ్రాద్ధదత్తములను వారివారికి తగిన ఆహారములనుగా కల్పించి తృప్తిని కల్గజేయుదురు. శ్రాద్ధమును సంరక్షించువాడు శ్రీమహావిష్ణువును శ్రాద్ధములో తండ్రి తాత ముత్తాతలకు, తల్లి పితామహిప్రపితామహులను ఉద్దేశించి బ్రాహ్మణునకు ఇవ్వబడిన అన్నియును, విశ్వేదేవతలు పితరులకు వారివారికి అనుకూలమైన ఆహారమునగా చేర్చుచుందురు. కాన శ్రాద్ధ సంరక్షకుని స్థానము విశ్వేదేవస్థానము పితృస్థానము వీనియందు ముగ్గురు భోక్తలని మంత్రించి శ్రాద్ధమ నాచరింపవలెను. కర్తశ్రాద్ధ పూర్వదినమున వ్రతమునాడు ఒంటిపూట భోజనము బ్రహ్మచర్యము అవలంబింపవలెను. భోక్తలును పై నియమమును పాటింపవలెను. ఈశ్రాద్ధమును మజ్జనకుడే మొట్టమొదటగా ప్రారంభించినాడని

నాతో దత్తదేవుడు పల్కినాడు. శ్రాద్ధమునందు 1 బ్రాహ్మణభోజనము 2 కరణము 3 పిండప్రధానము 4 తిలతర్పణములు ముఖ్యములు. విష్ణు ర్విష్ణు విష్ణునామస్మరణము చేయుచు చేసిన లోపము జరుగనీక శ్రాద్ధఫలవ సంపూర్ణముగా కర్తకిచ్చును. ద్రవ్యాభావమున తిలోదకతర్పణములు పితృదేవత గూర్చిచేయవలెను. ఆరోజు గోవులకు గడ్డిని ఇచ్చుట కూడా శ్రాద్ధము చేసినట్లు ఇవేమియు చేతకాని ఎడల తమ తండ్రి తాతముత్తాతలను తల్లి మహీప్రపితామహీలను తలచుకొని అడవిలో ఏకాంతమున ఏమిచేం పోయితినని ఏడ్చుటకూడ శ్రాద్ధమగును.

శ్రాద్ధము అపరాహ్ణవ్యాపినులగు తిథులందు ఆచరించుకొనవ శుభములు ఉదయపు తిథులతో ఆచరింపవలెను. వ్రతములు తిథివిద్ధవ కొన్ని తిథులు సంపూర్ణముగా నుండునపుడు కొన్నిశేషతిథులలోను ఆచ తగినవి. ఇట్లు హరి, చోదితములైన శ్రాద్ధాదికర్మలను వ్రతములను వేదోక్తము విధివిధానముగా నాచరించిన హరిసంతుష్టుడగును. ముక్తికి చేరువయిన వాడ జ్ఞానమువలననే మోక్షముగాన ఈ కర్మవలన చిత్తశుద్ధికలిగి జ్ఞానవైరాగ్యమ అపరోక్షాత్మానుభూతికలిగి జనులు తరించగలరు. ఓ ధర్మకీర్తి నీవు మరుజన్మ తరించగలవని కూడా,నాకు ఆస్వామి చెప్పినాడు. అంకముచేరి దత్తభోధవ యమశిక్షితమును, వివరించిన భద్రశీలునివలన విని గాలవుడు మిక్కిలి సంతు తాను కూడా ఏకాదశీవ్రతాదులతో తరించెను. ఇది నారద సనత్కు సంవాదము.

పిదప దీపకుడు కార్తవీర్యార్జునుడు ఆపవుని శాపముచే నశించెననిఅం ఆ కథను విపులముగా చెప్పుడు అని గరువు నడిగెను. కార్తవీర్యుడు చివరికాల తనతో సమానడెవడునులేడని గర్వించెను. అగర్వప్రకారము చూచియు మంత్ర సేనాపతులు మిన్నకుండిరి. వాయుభట్టారకుడు మాత్రమాతనిని ఓ హెచ్చరించెను. ఓయీ బ్రాహ్మణులు నీకంటె గొప్పవారలు, వారి శక్తికంటె గొప్పదికాదు. ఉన్న సంపదను చూచుకొని గర్వమునొందుట తగిన పని భృగువు, వశిష్ఠుడు, అగస్త్యుడు నీకు వరములిచ్చి ఇంతటి వానినిగా చేసిన త్రేయుడు మున్నగువారు విప్రులేకదా యోచించుమని చెప్పెను. ఆమాట కార్తవీర్యుడు సంతసించి కృతజ్ఞతను చెప్పికొనెను. కాని దైవమును గెల్వనెవరివ

సూర్యుడు బ్రాహ్మణవేషమున తన ప్రయోజనమునకై కార్తవీర్యుని చేరి వనాళిని తగులబెట్టుటకై యాచించెను. ఆసూర్యదేవుని యాచనము కాదనలేక వనములను పురములను పల్లెలను తగులబెట్టజొచ్చెను. అనవుడు అను వశిష్ఠాశ్రమమున నివసించు మహాముని కార్తవీర్యార్జునా నిన్ను పరశురాముడు తన గండ్రగొడ్డలితో సహస్రబాహువులను తెగగొట్టగలడు అని శపించెను. ఆ శాపప్రకారమే విష్ణ్వంశ సంభూతుడైన పరశురాముడు ఆ కార్తవీర్యార్జునుని సంహరించినాడు. కార్తవీర్యు నివంటి చక్రవర్తి లేడు చివరికి సుదర్శన చక్రమై హరికరమునలంకరించినాడు.

ఇందలి కథాంశములలోని పాత్రలన్నియు మహామహిమోపేతములు అద్వైత వేదాన్తతత్త్వము ప్రధానముగా గలిగి దాని దార్ఢ్యమును సంపాదించుటకైన యోగ మిందు సమగ్రముగా నిరూపింపబడిదని వేదధర్ముడు చెప్పి ఏమివరము కావలెనో కోరుకొనుమని చెప్పెను. శిష్యుడు స్వామీ నేనే మీకు గురుదక్షిణను సమర్పించుకొనవలసినవాడనుగదా, అట్టిస్థితిలో మీరేనాకు కోరదగిన దానిని వచించి ఇమ్మని ప్రార్థింపగా గురుడు హస్తమస్తక సంయోగముచేసి జ్ఞానయోగ మనుగ్రహించి తరింపజేసెను. ఇది గురుశిష్యసంవాదము, బ్రహ్మకలి సంభాషణాత్మకము. సూతశౌనకప్రశ్నోత్తరరూపము. దత్తదేవుని హరిహరాద్వైతమగు విశ్వరూప సందర్శనముతో ప్రారంభమయి ధర్మక్రియోత్తరముగా శిష్యుని సంతర్పణము ప్రధానమై ముగింపబడిన గ్రంథము. జ్ఞానముతో ప్రారంభమై చివర వేదోక్తకర్మో పాసనలు గల్గి ఉపసంహరింపబడియుండుట వేదాంతగ్రంథముల లక్షణమై యున్నది. జ్ఞానము జనించుటకు మనశ్శుద్ధి ఆవశ్యకము తత్త్వమస్యాది మహావాక్యార్థము గురువులు ఒకసారి చెప్పినంతనే అనుభవమునకు వచ్చుట మిక్కిలి కష్టమైనది. వేదాంతముచెప్పుట తేలికయే కాని అనుభవమునకు వచ్చుట, ముక్తి, శతకోటి జన్మ సుకృతములతో కాని సంభవింపదనుజగద్గురువులు శంకరాచార్యుల వచనము. కాన సగుణమూర్తిని సర్వాత్మనా నిన్ను శరణపొంది తిని. నమో స్తు అన్నచో ఆహరియే సంసారభేషజమగు ముక్తిని పొందింపగలడు. పాపములను చేసి యమబాధలను పొందుటకంటే పున్నెములనాచరించి స్వర్గములందుటయే మేలు? అని చెప్ప దత్తదేవ సూక్తులు, ఇందు ప్రపంచితములు, దత్తావతారము మీకు మాకు జగతికి దిక్కగుగాక, ఈ పురాణమును ఇందలి శ్లోకమును, ఒక శ్లోక అర్థమును ఒక అంశమును ఒక పద్యమును తదంశమైనను శ్రద్ధతో పారాయణము చేయువారికి సకలాభీష్టములు కల్గి ఆదత్తదేవుని పరోక్షజ్ఞానము ఆపైని అపరోక్షజ్ఞానము కల్గి ముక్తులగుట నిస్సంశయము ఓంద్రాం

దత్తాత్రేయాయనమః అను మంత్రమును అక్షమాలతో జపించిన స్వామి ప్రత్యక్షమగును. రాత్రింబవళ్లు తనను ఎవరెవరు పిల్చెదరా అని దత్తవిభుడు ఎదురు చూచుచుండును ఇది దత్తభాగవత కథా సారాంశము.

## 12వ అధ్యాయము

## లసత్కవితారీతులు.

ఆంధ్రప్రబంధసంగతములగు పరిశోధనవ్యాసములందు కవితాగుణములను పరిశీలించు ఔచిత్యము కలదు. అనువాదగ్రంథములయినను కవిప్రసిద్ధి చేతనిత్యనూతనముగను స్వతంత్రమైనవివలె విలసిల్లు కవిత్వమునందు సాధారణముగా అధికముగా మూలసంగృహీతమైనను కవికంఠము అక్కడక్కడ వినవచ్చుచుండును. అట్లే అలంకారములందు, వర్ణనలందు సంఘటనలందు కవియొక్క వ్యక్తిత్వముకాన వచ్చును. ఈగ్రంథమును ఆధ్యాత్మికము ఔపనిషదమును అగుతత్త్వమును నిర్దేశించుటకు ఉద్దేశింపబడినది కావున ఒకవిధముగా శాస్త్రగ్రంథము వంటిదే. శాస్త్రగ్రంథమునందు రసాలంకారాదులను నెమకుట తృప్తికరముగా నుండకపోవచ్చును. కల్యాణకైవర్తకది అనేక ప్రబంధకర్తయగు శ్రీ శాస్త్రిగారు అచ్చటచ్చట పోహళించిన వర్ణనాదులను ఈ వ్యాసకర్త తనకుతూహలము కొలది సంప్రదాయముననుసరించి ఆయా కవితా విశేషములను ఉగ్గడింపపూనుకొనుచున్నాడు. 12-1 వర్ణనానిపుణ కవిః అని అభియుక్తోక్తి వర్ణనమందు ఉత్సాహముకలవి. కవి వీలయినంత వఱకు మూలమందలి వర్ణనములకు మెఱుగులు దిద్దుచూ అవకాశమున్నచోట సందర్భానుగుణముగా స్వతంత్రించి వర్ణనమొనర్చును. గ్రంథ ప్రారంభమందు నైమిశారణ్యగతులగు మహామునులు ధ్యాననిష్ఠులై యుండగా దత్తదేవుడు విశ్వరూపమున సాక్షాత్కరించును. ఆమునుల యొక్క ధ్యానయోగమును వర్ణించుచు ఈ క్రింది పద్యమును స్వతంత్రమగు ఊహతో కవి రచించెను.

సీ॥ కదలి కదలనిదై కాయమ్ముల ధరించె నాధారితా దేని నండగొనెనో
అప్పులనిప్పులో నిప్పులనప్పులో కార్యకారణభావ కలనలడగె
హృదయంబులోగొననాదవించె నొక ధాటి దివ్యగం ధంబులదేలిగాలి
గాలికురంగాళి కాలికి నెడమీక నిరవకాశంబ యునిండెనింగి



శ్యామలాదేవి

అనగ వినగనగానైన యదియులేమినారగను గొన్నవాడేని ననునెవనికి
చెప్పినను చెప్పకున్నను చెప్పినట్లేకాకముల చెందకుండు నేకాకియొకటి

దత్తభాగవతము - ప్రథమగుచ్ఛము - పద్యసంఖ్య - 12

ఇందు సీసము నాల్గుపాదములందు పంచభూతముల ప్రాకృతిక ప్రాపంచిక రూపములు సునిశిత దృష్టితో, పరిశీలించి వర్ణింపబడినవి. ఇది అనంత సాగర మేఖల అన్నది ఔపచారికవిశేషము. సప్తసముద్రములకు ఆవలచక్రవాళ పర్వతము కలదని పెద్దలు చెప్పుదురు. భూమి అనంత ఇది స్థిరమైనది అని శాస్త్రములు చెప్పినవి. శ్రీ శాస్త్రిగారు "కదలి కదలనిదై" అని పేర్కొనినారు. చలనము చలనరాహిత్యము విరుద్ధగుణములు సృష్టిక్రమమును పరిశీలించినచో వాయువునుండి అగ్నియు, అగ్నినుండి జలము, జలమునుండి భూమియొక్క సృష్టియు జరిగినవి. కారణగుణములు కార్యములందు సంక్రమించుట కాదనరానిది. వాయువునకు గల చలన గుణము తత్కార్యములందు సంక్రమించినది. భూమియందు కూడా సంక్రమించకుండునా? హిరణ్యాక్షుడు ఈ భూమిని చాపచుట్టగా చుట్టి సముద్రమున పాఅనైచెనట. ఆదివరాహమూర్తి కోఱతో ఆ భూమిని పైకెత్తి యథాస్థితికి తెచ్చెనట. చలనమున్నట్లా లేనట్లా? భూమినుండి ఉద్భవించిన వికారములగు పర్వతములు పూర్వము రెక్కలతో ఎగురుచుండినట్లు పురాణములందు కలదు. అపాతాళపరివ్యాప్తములగు స్థావరశైలరూపములు చలనము కలవైనచో అచలనము ఉపాదానమో, సమవాయమో, నిమిత్తమో కావలసిన భూమికి మాత్రము ఏల ఉండదు. భూమియందు ఉద్భవించిన ప్రాణికోటి చలనము ఔపచారికముగా భూమికి సమన్వయించినచో విప్రతి పత్తిఏమి?

కావుననే శాస్త్రిగారు కదలి కదలనిదై అని భూమిని వర్ణించుటలో సునిశితమైన పరిశీలనము కలదని భావింపవచ్చును. సమస్త ప్రకృతిని తాను ధరించినది కాయములనగా సర్వోపాధులకు ప్రతీకములు భూమిని విశ్వంభర అంటిమికదా, అట్టి విశ్వంభరయగు ధాత్రి అనగా ధరించునట్టిది ఏ ఆధారముతో నిలచినదో శేషుడు మోయుచున్నాడని, మహా "కమఠముమోయుచున్నదని దిగ్గజములు మోయుచున్నవని పురాణములు చెప్పుచున్నవి. ఇవి అన్నియు సృష్టిస్థితిలయముల లోనికి చేరినవా, కావా? చేరకున్నచో ఇందలి సిద్ధాన్తము ఇక్కడితోనే ఆగినది, చేరినవన్నచో భూమి సృష్టికి అనంతరమే భూతసృష్టి అట్టి యెడల భూమి సృష్టికి

తరువాత జన్మించిన భూతములు భూమికి ఆధారమగుట ఎట్లు? ఇదియంతయు మూలప్రకృతి వైభవము కావుననే తాదేని నండగొనెనో అను ప్రశ్నమునో సందేహమునో, పాఠకులకే వదలి వేసినారు. రెండవ పాదమున జలభూతమును, అగ్నిభూతమును ప్రస్తావించినారు. నీటి నుండి అగ్నిపుట్టినా అగ్నినుండి నీరుపుట్టినా సృష్టిక్రమమున అగ్ని నుండియే జలసృష్టి జరిగినట్లు కలదు. ఒక పురాణము నందు "అప ఏవ ససర్జాదౌ" అని విస్పష్టముగా నున్నది. ఈ సందర్భమున మరొక అంశముకూడా పరిశీలింపవచ్చును. పంచభూతములందు అగ్నిశబ్దము వహ్నిని బోధించునా తార్కికమతమున ఈయదితేజఃపదముచే సంగృహీతము. ఈతేజశ్శబ్దము వేదమునందు కూడా కనపడుచున్నది. సముద్రమందు బడబాగ్ని, జలమునుండి ఉద్భవించినట్లు చెప్పబడుచున్నది. జలమునుండి వైద్యుత తేజస్సు ఉద్భవించుట ఈ కాలమున కూడా ప్రసిద్ధము. కావున ఈ రెండిటిలో దేనిని కారణమన వలయును. దేనిని కార్యమనవలయును.

మునులు ధ్యాననిమగ్నులైరి. పంచేంద్రియవృత్తులు నిరుద్ధములై ఉపసంహృతములైనవి. పంచేంద్రియధర్మములు తత్కారణములైన భూతములందు అంతర్లాపితములైనవి. పంచభూతములు ఉపసంహారక్రమమున కారణభూతములందు లీనములైనట్లు సంభావితములు కాగా భూమి జలము నందు జలము అగ్నియందు లీనములైనట్లుగా గోచరించినవి. ఆయగ్నియు వాయుతత్త్వము నందు అడగినది. అట్టియెడ సదాగతియగు వాయుతత్త్వము ఉపసంహృతమై హృదయాకాశమునందు అనిర్వాచ్య పరిమళ విశేషముతో భాసించినది. ఆవాయువును అంతర్లీనమొనర్చుకొని ఆకాశము అనంతమై నిరవకాశమై పరివ్యాప్తమైనది. వాయువునకు వాహనము కురంగమని ప్రసిద్ధి. ఆలేడి అడుగు తీసి అడుగు వైచుటకు కూడా ఎడములేనంతగా ఆకాశమునిండిన దని చెప్పుట కవి పండించిన చమత్కార విశేషము. ఈ విధముగా పంచభూతములు ఉపసంహరింపబడినచోట అనునది వినునది, కనునది, కనబడునది, చెప్పునది, చెప్పబడునది, ఏమియులేని అద్వైతము ఏకాఖండముగా పరిఢవిల్లినది. సాక్షిభూతమగు చైతన్యము ఎవడున్నాడని చెప్పును? ఇంతటి విషయము స్వస్వరూపానుసంధానమున అనుభవైక వేద్యమైనపుడు చెప్పినను స్వసంవేద్యమైనట్లే ఏకాకియగు ఒక్క వస్తువు కాకములకు అనగా సుఖదుఃఖములకు బంధమోక్షములకు సర్వద్వైతమునకు అతీతముగా ప్రకాశించుచున్నది. సమాధి

నిష్ఠలగుమునులకు కల్గిన స్వరూపానుసంహితమైన అనుభూతివిశేషము ఇటువంటిది. స్వతంత్రమైన ఊహతో శాస్త్రీయములగు విశేషములను ఉపబృంహణము చేయుచో శ్రీశాస్త్రిగారు రచించిన అపరోక్షానుభూతివర్ణనము నాయకమణివలె విరాజిల్లుచున్నది. మూలమునందు విశ్వరూపుని వర్ణనమును

**శ్లో॥ త్రివర్ణం త్రియుగంత్ర్యంశం త్రిగుణేశంత్రయీమయమ్**
**ఆదిమధ్యాంతరహితం అనంతేతి చ విశ్రుతమ్**

అని ఒక చిన్నశ్లోకముననున్న దానిని శ్రీశాస్త్రిగారు విస్తరించి వర్ణించుట అత్యద్భుతముగా నున్నది.

**సీ॥ మూడురంగులపోడుములు మొల్లములుగాగ ముగురుమూర్తుల రూపములనొసంగ**
**తొలిచదువులమూటివెలయించుటీకగాత్రియుగ ధర్మంబులుదేజరిల్ల**
**మూడుతేజమ్ములమొదలింటిదుంపగా ముల్లోకముల చందములు మెలంగు**
**శక్తులుమూడు సంసక్తిభాసింపగా వర్గత్రయంబపవర్గము గొన**
**నాదిమధ్యాంతరహితంబనంతకంబు ముక్తికాంతాస్వ శుద్ధాంతముక్తిదూర**
**మైన విభువిశ్వరూపమందవధరించిరల్లయర్థంబులర్థి మహర్షివరులు**

దత్తభాగవతము - ప్రథమగుచ్ఛము-పద్యసంఖ్య 21

మూడు రంగుల పొడుములు అనగా శ్వేత, రక్త, నీలవర్ణములు, సత్త్వరజస్తమోగుణములు చెప్పకనే చెప్పినట్లయినది.ముమ్మూర్తులనగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. తొలిచదువులనగా వేదములు. అవి ఋగ్యజుస్సామ భేదములతో మూడు తెఱగులు. ఈ మూటిని త్రయి అందురు. (ఇతి వేదాస్త్రయస్త్రమీ అని అమరకారుడు) త్రియుగములనగా కృత, త్రేతా, ద్వాపరములు, మూడు తేజములనగా చంద్రసూర్యాగ్ని తత్త్వములు, మూడులోకములు భూర్భువస్సువర్లోకములు, మూడుశక్తులు శ్రీవాణీగిరిజలు,ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులని ఆగమ సంప్రదాయము. వర్గత్రయమనగా ధర్మార్థకామములు, ఇవి అపవర్గమున అనగా మోక్షపురుషార్థమున అనుప్రవిష్టములైనవని భావము. అట్టి విశ్వరూపము మోక్షకాంతకు అంతఃపురమువలెనున్నదట. ఇట్టి విశ్వరూపము యతోవాచో నివర్తంతే అను ఉపనిషత్ప్రమాణప్రకారము అనిర్వాచ్యముగా ప్రకాశించుచుండెను. అట్టి విశ్వరూపమును మునులు చూచిరని త్రిసంఖ్యావాచకశబ్దముతో దృగ్దృశ్యద్రష్టృ

రూపమగు త్రిపుటీవిలయమును సూచించుట ఈ వర్ణనమునందు విశేషము మూలమునందు సామాన్యముగ కన్పట్టు శివవర్ణనమును వీరనువాదమున మెఱు చేసిన తీరు ప్రశంసాపాత్రముగనున్నది.

**శుద్ధశ్వేతవృషారూఢం శుద్ధకర్పూరవర్చసమ్ కైలాసరూఢకైలాసమివ శీతాంశుశేఖర**

దత్తమాహాత్మ్యము - ప్రథమాంశ - శ్లోక సంఖ్య

తెల్లని వృషభమునందు అధిరోహించిన వాడై కర్పూరఖండము వలె తెల్ల కాంతిగలిగినవాడు గనుకనే కైలాసమున పుట్టిన మరొక్కకైలాస పర్వతమువ ఒప్పుచున్న చంద్రశేఖరుని మునులు దర్శించిరని దీని భావము. ఈ పద్యము మాతృకగా గైకొని అనువాదమున వీని వర్ణనమిట్లు సాగినది.

**శ్రీరజతాచలంబుపయిశ్వేత మహోవృషభంబుదాన గ**
**ర్పూరపరాగపాండురుడు భూతివిభాసితుడైన తానుకో**
**టీరమునన్సుధాకిరణడింభకుడంతకుబైనశుద్ధగం**
**గారసమైన శంభుని ప్రకాశము ముమ్మరమయ్యె జూడ్మికన్**

దత్తభాగవతము - 1వ గుచ్ఛము - పద్యసంఖ్య

మొదట వెండికొండయట దానిపై తెల్లని ఎద్దునందికేశ్వరుడట, ఆపై కర్పూరపురజనువలె తెల్లని శుద్ధస్ఫటికమూర్తి ఆతని శరీరమున తెల్లని బూడిదపూ శిరస్సున శ్వేతమయూఖయగు చంద్రరేఖ అంతకు పైన తెల్లని గంగాప్రవాహము, ఈ సర్వశ్వేతాకృతికనులకు మిఱుమిట్లుగొల్పినదట. ప్రతిభాసిద్ధమైన వర్ణ వైచిత్ర్యముతో ఈ అనువాదము మూలమునకే వన్నెతెచ్చినది. మూలము నం చెప్పబడని భస్మాంగరాగము గంగానది ఈ వర్ణనాక్రమమున చోటు చేసికొను కవిశక్తి.

12 -2 - అలంకార చారుత్వము:-

శబ్దార్థామూర్తిరాఖ్యాతౌ జీవితం వ్యంగ్యవైభవం హారాదివదలంకారా స్తస్యురుపమాదయః" అను ఆలంకారిక వచన ప్రమాణమున కావ్యముల శబ్దార్థములు రెండు కలసి శరీరము వంటివనియు వ్యంగ్యము ప్రాణవ వంటివనియు ఉపమాదులు హారాదులవలె అలంకరించుననియు దీని తాత్పర్యమ శ్రీ శాస్త్రిగారి అనువాద ప్రబంధమున అలంకారసామగ్రీపోషణ విధానము ఎట్లున్న

స్థాలీపులాకముగా పరిశీలింపబడు చున్నది. ఈ గ్రంధము కవితా విశేషప్రగల్భతను వెలయించునుద్దేశ్యమై రచియింప బడియుండలేదని ముందే మనవి చేయబడినది. అందుచేత మాదిరికి ఒండు రెండు అలంకారములు ప్రదర్శింపబడుచున్నవి. తృతీయగుచ్ఛమునందు పితాపుత్రసంవాదమున జడభరతునివంటి కుమారుని విషయమై ముఖ్యమును జడత్వముగను మూఢత్వముగను భావించి తండ్రి బుజ్జగించి అడుగగా పూర్వజన్మజ్ఞానముగల ఆకుమారునకు గల్గిన వైరాగ్యమునకు కారణమును చెప్పుచూ అనేక జన్మలనుండి తానను భవించిన సుఖదుఃఖాదులను క్లేశములను, అవస్థలను వర్ణించి చెప్పిన సందర్భములో ఈ క్రింది పద్యము కలదు.

**గీ॥ బాల్యకౌమారయౌవనవార్ధకముల జంతునానావిధోద్భవసంకటముల**
**నున్నదుఃఖంబులెన్నియోయన్నియుపుడు పలకపాఠంబులవలెగన్పట్టుచుండె.**

దత్తభాగవతము - 3వ గుచ్ఛము - పద్యసంఖ్య 14.

పలక పాఠమనగా పలకయందు వ్రాసిచూపెట్టిబోధించు నట్టిపాఠము. ఈ పలకనేటి కాలమున ప్రాధమిక విద్యార్థులుఓనమాలు దిద్దుకొను పలకమాత్రము కాదు. ఎందుచేతననగా అది అక్షరములను లేదా పదములను దిద్దపెట్టునదియే కాని పాఠమునకు పాఠబోధనమునకు సాధకతమమైనది కాకపోవచ్చును. గోడయందో ఎత్తైనచోటనో ఈ నాటి నల్లబల్లవలె శబ్దపు పలకను వేలాడదీసి ఉపాధ్యాయుడు వాటి విషయమునకు సంబంధించిన వివిధాంశములను అందులిఖించి సమన్వయ మొనర్చి పాఠమును చెప్పును. అందు ఉపక్రమమునుండి ఉపసంహారమువఱకు గల వివిధదశలు, వివిధ అవస్థలు మార్పుచేర్పులు కూర్చబడియుండును. దానిని చెరిపివేయువఱకు అందలి విశేషములు సర్వసుగ్రహముగా చూచినవానికి గోచరించును, అట్లే ఒక వర్తకుడు తనవద్దగల వస్తుసంచయమును మూల్యపుపట్టీలతో సహా పెద్దఫలకమున వ్రాసివ్రేలాడదీయును. దానివలన క్రయ్యములగు వస్తువుల వివరమంతయు అందు కన్పట్టును. అట్లే నిరంతరము ధ్యానానుసంధానము చేయువానికి ధ్యేయమగు వస్తువు కాని విషయముకాని తత్తద్విశేషములతో చిత్త సన్నిహితమై నిరంతర భావనా బలమువలన మనఃఫలకమునందు చిత్రింపబడినట్లు గోచరించును. దృశ్యమగుచోట పలకమీర వ్రాయబడినది. ఎట్లు స్పష్టముగా ప్రతిపన్నమగునో భావనాదార్ఢ్యమున మనః ఫలకచిత్రితమగు అంశముకూడా అంతస్పష్టముగానే సంభావింపబడును.

అనేకములైన పూర్వజన్మములందు కృమికీటక పశుపక్ష్యాది నానాజన్తురూపము
ఆయాజన్మలయందు ఏర్పడిన బాల్యకౌమారయౌవన వృద్ధత్వము
జన్మరోగమరణాది సంకటములు ఈజీవుని చే స్వయమనుభూతము
దుఃఖాతిశయ విషణ్ణమైనమానసమునందు నిరంతరాను స్మరణవ్యవసా
బలమువలన ఏకత్రగ్రాహ్యములై మనోదృష్టికి గోచరములగు చుండు
పలకయందు వ్రాసిన పాఠమువలె స్పష్టావదాతమగుచున్నదని ఉపమాలంకా
స్ఫూర్తితో చెప్పిన తీరు హృదయంగమముగనున్నది. ఇందు పూర్వజన్మ దుః
క్లేశపరం పర ఉపమేయము పలక పాఠము ఉపమానము, పోలె అనున
ఉపమావాచకము, కన్పట్టుట సమానధర్మము దర్శనార్థముగల ధాతువు ల
జ్ఞానార్థము చెప్పుటకూడా శాస్త్రసంప్రదాయ సిద్ధముగావున, 'కనుపట్టు' ధాతుః
నందలి దర్శనార్థముతో జ్ఞానార్థముకూడా సమాక్షిప్తము కావున కనబడు
తెలిసికొనబడుట అను ఈ రెండర్థములు అభేదాధ్యవసితములై ఈ అలంకారమ
నకు ఉపోద్బలకములగుచున్నవి. ప్రథమగుచ్ఛమునందు బ్రహ్మకలి సంవాదము
బ్రహ్మదేవుడు కృతత్రేతా ద్వాపరములను సృజించి అనంతరము కలిపురుషు
సృష్టిచేసెను. సృష్టిచేసెనే కాని అతని వంక చూచుటకు కూడా రోతపుట్టినంతప
యై నిన్నునియోగించిన ప్రకారము భూమికి పోయి అచ్చట నీయుగలక్షణములతో
ప్రవర్తింపుమని అనుశాసించెను. అప్పుడు కలి పురుషుడు బ్రహ్మతో నేనుసర
నాశనము చేయువాడను, పేనుకు పెత్తనమిచ్చినట్లు గా నాకిట్లు పట్టము కట్టిపం
వలదని మనవి చేయును. ఆ సందర్భము లో ఈ క్రింది పద్యముకలదు.

సీ॥ **నన్ను నంపకుమీశ నరతండములమీద బెత్తనంబు నమర్చిపేనునట్ల**
**సర్వవిచ్ఛేదంబుసలుపనౌవానినిరానందునదయు నిరంకుశగతి**
**గలహనిద్రాప్రియుగలుషాత్మబరదార పరధనహరణ తత్పరహృదయుని**
**మాత్సర్యలోభదంభ ప్రియజనసఖు స్వోదర పూరణ కాదరుఖలు**
**నేను ప్రభుడనైననేకాంత సంయోగన్యాసకైతవముల నందునందు**
**పరులదమ్మునొకటవంచించి వెడగులైయందు నందు జెడుదురెల్లవారు**

నిర్దయత్వము, నియమమునుల్లంఘించు స్వేచ్ఛ, కలహము, నిద్ర పాపబుద్ధి పరదార పరద్రవ్యాపహరణములు మాత్సర్యలోభాదులు, స్వార్థపరత్వము ఇవి యన్నియు కలిపురుషుని లక్షణములు. కల్గి యుగపురుషుడగుటచే గొప్పవాడైనను కలి ఇన్ని దుర్లక్షణములు కలిగియుండుటచేత చాలా హీనుడుగను. క్షుద్రుడు గను, అల్పుడుగను నికృష్టుడుగను దుష్టకృమివలె పరిహరింపతగిన వాడుగను తోచుచున్నాడు. మనకు తోచుటయే కాదు. తానిట్టి వాడనని యే తానే చెప్పికొనినాడు. ఇట్టి హీను తాను పేనువంటివాడనని పోలికకూడా చెప్పికొన్నాడు. ఈతని యందుగల దుర్లక్షణము లన్నియు పేనునకు లేవు. అదికేవలము క్షుద్రజన్తువు. దీనిని పాణిని క్షుద్రజన్తువని గ్రహించినారు. ఇది చాలా నీచమైనది. కేశమూలమునందు స్థానము సంపాదించుకొని స్వోదరపోషణమాత్రమునకే అగుగాక స్వవంశవర్ధనమునకే అగుగాక స్వాశ్రయవినాశమొనర్చుట స్వాశ్రయజన్తువులను బాధించుట దీనియందలి దోషము. భగవంతుడు దానినట్లు సృజించినాడు. ఆ భగవంతుడే ఈ కలిని ఇట్లు ఇందుకు సృష్టించినాడు. కావున పేనుకంటె నీచత్వము ఆయాలక్షణముల చే కలియందు ఉపచరితమై పరస్పరసాదృశ్యమును సాధించినది. ఇచ్చట పేనుకుపెత్తనమిచ్చినట్లుగా అన్నసామెతను మార్చిఉపమా లంకార ముగా ప్రదర్శించుట రమ్యముగ నున్నది. ఈ ఉపమానము మూలమునందు లేదు. కవికల్పితమగు ఈ సామ్యము సందర్భమునకు చక్కగా నతికి భావ వైశద్యమును ప్రసాదించుచున్నది.

ద్వితీయ గుచ్ఛమునందు నారదుడు ధర్మరాజుకు ప్రహ్లాదాజగర సంవాదమున వివరింపబోవు సందర్భమున ఈ క్రింది పద్యభాగము కలదు.

**సీ॥ నిశ్రేయసకరంబునిశ్శ్రేణివోలెవర్ణాశ్రమాచారధర్మా చరణము**
**యతిధర్మమింతకా, యతి, కర, మన నందు నతడు సిద్ధావస్థనడుగు టయును**

దత్తభాగవతము - 2వ గుచ్ఛము - పద్యసంఖ్య 45

వేదములన్నియు కర్మోపాసనలను ప్రస్తావించి కైవల్య ప్రాప్తిపర్యవసితమగు మానవధర్మమును బోధించుచున్నవి. అట్లే ధర్మశాస్త్రములన్నియు వర్ణధర్మములు ఆశ్రమ ధర్మములు, ఆచార పద్ధతుల బోధించుచూ కైవల్యమార్గమును చూపుచున్నవి. "జ్ఞానాదేవతుకైవల్యమని" స్పష్టతరమే అయినను అట్టిజ్ఞానమును సాధించుటకు ఈ ధర్మములన్నియు అవాంతరస్థానకములై పరంపరచేత ఉత్తమ పదాధిరోహణమునకు కారణములగుచున్నవి. ఈ ధర్మములయొక్క

క్రమికత్వమును కూడా ప్రసిద్ధముగా ఈ విషయముల సూచించును. జాతకర్మాది సంస్కారములు ఒకదానివెంట నొకటి మానవుని జీవభావప్రకాశ సమగ్రతకు దోహదమొనర్చుచు న్నవి. అట్లే బ్రహ్మచర్యాది ఆశ్రమములు జీవునియొక్క ఆధ్యాత్మికస్థితి సాధనకు తగిన ఔన్నత్యక్రమమును పొందించుచున్నవి. లక్ష్యము నిశ్రేయసము. అది సర్వోత్తమ స్థితి రాగద్వేషాది దోషదూషితమైన సంసారపంక కూపమునందు ఉన్నవానికి ఆచార ధర్మాదులు క్రమక్రమముగా ఒక్కొక్కమెట్టు అధిరోహించి నిర్భయమగు స్థానమును చేరుటకు ఉపకరించుసోపానములు. కావుననే ధర్మాచరణము నిశ్రేణివలె అనగా నిచ్చెనవలె మోక్షపదమును అధిష్ఠింపజేయును వర్ణాశ్రమధర్మాచార వర్గక్రమము నిచ్చెన వంటిది. ఇయ్యది నిశ్రేయసకరత్వమనుటలో ఉన్నత పదాధిరోపకత్వము వ్యంజనచేత సమాక్షిప్తమై సామాన్యధర్మముగా గోచరించి ఇచ్చటి ఉపమాలంకారమును నిర్వహించుట విశేషము. తృతీయగుచ్ఛమునందు ఋతుధ్వజుడుమదాలసను చూచు సందర్భము నందు ఆమె సౌందర్యమును సమగ్రసంగ్రహముగా ఒక్కమాటలో చెప్పుట జరిగినది. సంస్కృతమున "కామముక్తాంరతింయథా" అను ఉపమానము గలదు. ఇందలి ముక్తశబ్దముయొక్క అనౌచిత్యమును తొలగించుచు శ్రీశాస్త్రిగారు "కాముడు వద్దలేనిరతికామిని నాదగు" అను అనువదించిరి. ఇట్టి అనువాదము ఉపమాలంకారము యొక్క సౌందర్యమును పోషించుటయేగాక, మూలమునకు మెఱుగుపెట్టినట్లున్నది. అసలిది ఉపమయా ఉత్ప్రేక్షయా మూలమునందు ఉపమాలంకారము స్పష్టముగా కనపడుచున్నది.అనువాదమున నాదగు అను మన్యే అర్థకమో ప్రాయోర్థకమో అయిన పదమును ప్రయోగించుటచేత అన్యధర్మ సంభావనము కానవచ్చుచున్నందువలన మూలమునందలి ఉపమ అనువాదమున ఉత్ప్రేక్ష వాలకములో దర్శనమిచ్చుచున్నది.అన్యధర్మ సంబంధనిమిత్తా దన్యస్య అన్యతాదాత్మ్య సంభావనముత్ప్రేక్షా అని లక్షణము ఈవిధముగా అనువాదమున అలంకార పరివర్తన మొనర్చుటయు కవితా సౌందర్యములలోని ఒకలక్షణము.

ద్వితీయగుచ్ఛమునందు అవధూత యదుసంవాదమనునది. మనోహరమైన గాథ. ఇందవధూతుడగు దత్తాత్రేయుడు ఆయా గురువుల వలన తాను నేర్చికొనిని లక్షణములను వివరించుచు భూమి, వాయువు మొదలగు ఇరువదినలుగురు గురువులను గురించి వివరించును. ఆగురువులలో పింగళయను వేశ్య ఒకతె! ఈమె ఒకనాడు ఎప్పటివలె ధనవంతుడగు విటునికొఱకు ఎదురుచూచిచూచి

నాడు ఎవ్వండును,లభింపమికివిసిగివేసారి దురాశ దుఃఖము చేతై ఆకలిదప్పులతో స్దరకెడపడి వైమనస్యముచెంది నవసిన కనులతో జవమునెడిన శరీరముతో ప్పృహతో నిర్వేదముతో విషాదమునంది వేశ్యావృత్తి యందే గాక సాంసారిక వృత్తి యందే వైరాగ్యముచెందినదాయెను.

పశ్చాత్తాపముచెందిన ఆ రూపాజీవ ఇట్లనుకొనుచున్నది.

**భవమహాకూపమందునిపతితివిషయ విషముషితవీక్షణుండఘువెలయకున్న**

**యాత్మగాలాహిసంగ్రస్తునన్యుడెవ్వడేననుచు నుద్ధరింపనధీశ్వరుండు**

దత్తభాగవతము - 2వ గుచ్ఛము - పద్యసంఖ్య 155

ఇంతవఱకు హృదయగతుడై సుఖాత్ముడగు ఆత్మారాముని విస్మరించితిని. తనితోకలిసి మెలసి విహరించుచు విషయ విషయములుగల భేదభావమును త్యజించెను. ఆ జగదధీశ్వరునికంటె నన్నుద్ధరించు మహానుభావుడు ఎవ్వడు డు. ఈజీవుడు సంసారకూపమున బడినాడు. విషయ విషదోషమున కనులకు రలు గ్రమ్మినవి. కాల సర్పముగ్రసించినది. ఇట్టి జీవుని ఆయీశ్వరుడే ద్ధరింపవలెను అని దీనిభావము. ఇచట సంసారమునందు కూపత్వము యములందు విషత్వము కాలమునందు సర్పత్వము ఆరోపింపబడినది. వున ఇది అభేదరూపకము. "విషయ్యభేదతాద్రూప్యరంజనం విషయస్య త్ "అని లక్షణము,

చతుర్థగుచ్ఛమున దత్తాత్రేయుడు అలర్కునకు జ్ఞానబోధన చేయుచు ట్లు చెప్పుచున్నాడు. సంసారము అను వృక్షము మోక్షమనెడి మార్గమునకు ముగా విస్తరించియున్నది. ఈ సంసారవృక్షము హృదయపర్వతము నందు ాంకారమనెడి బీజమునుండి మొలచినది. మమకారమే ఈ వృక్షమునకు ను. గృహభూమి కనకాదులే దీనిశాఖలు. పుత్రదారాదులే చిగురాకులు, ్మలు, వస్తువాహన ధాన్యాదులు జొంపములు. పుణ్యపాపములే దీనికి ్పములుకాగా, సుఖదుఃఖములు ఫలములు. నిరంతర సంకల్పములు మ్మెదలుగా ఈ వృక్షమున మూగుచుండును. భ్రాంతియే దీని నీడ. ఈ ్ముమును ఛేదింపనిదే మోక్షమనెడి ఉద్యానములోనికి ప్రవేశింపవలనుకాదు. ఈ సారవృక్షమును భేదించుటకు జ్ఞానమనెడి గొడ్డలి కావలెను. ఆగొడ్డలికి నుపెట్టవలయును కదా! సజ్జన సంగమనెడి శిలయందునూరగా నూరగా

జ్ఞానకుఠారము ధారావంత మగును. కావున సజ్జన సాంగత్యమువల సంసారసాగరమును తరించు మార్గము లభించునని దత్తదేవుడు బోధించ సందర్భమునగల ఈ క్రింది సీసపద్యమునందు రూపకాలంకారముసావయవ పరంపరితమైన వటవృక్షమువలె విస్తరించి ఇది ఈ సందర్భమున అమూల్యాలంకారముగా ప్రకాశించినది.

**సీ॥ ఘనవృక్షమిదియహంకారాంకురోత్పన్నమైనది హృదయాచలాంచలము**
**మమతానుబంధసంబద్ధసంస్కంధంబుగృహభూ విశాఖానుకీలితంబు**
**పుత్రదారాదిసముదితపల్లవనవమధిధనధాన్య మహోచ్ఛదమ్ము**
**పుణ్యపాపోత్ఫుల్లపుష్పమ్ముసుఖదుఃఖసుమహిత ఫలము తిసుచిరచితవ**
**మోక్షమార్గమ్మునరికట్టిమూఢసంగిసేవితంబై విధిత్వాళిభావితమవు**
**దీనిచాయకుజేరిభ్రాంతిసుఖదుఃఖవంతులవువారి కెట్లపవర్గులగుట**

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - పద్యసంఖ్య 1

భార్గవుడగు జమదగ్ని మహర్షి రేణుకయను రాజకన్యను వివాహమాడెన పతిసేవాపరాయణయగు రేణుకాదేవి ఒకనాడొక జలాశయము వద్దకు స్నానార్థవ పోయి అచట భార్యలతో జలక్రీడలాడుచున్న చిత్రరథుడను రాజునుగాంచెన అతని రాచరికపుచిన్నెలకు అంతః పురకాంతల వన్నెలకు జలక్రీడా విహా సౌభాగ్యమునకు ముచ్చటపడి అచ్చెరువు పడి అట్టె చూచుచున్న మహాసాధ్వియ రేణుకకు రాచపుట్టువగుట వలనద్వాసనాసమాకృష్టమగు మనమునం సౌఖ్యమనగారాచరికపు వారిదే సుమా. ఆశ్రమవాసులగు బ్రహ్మణులకు ఇ సౌఖ్యములబ్బునా అన్న భావము పొడమెను. అంతమాత్రమునకే నిశ్చలదృఢవ్రతవ సత్త్వప్రసన్నమైన ఆమె మానసము వాతాహతమై పద్మమించుక కదలాడుట ఈపచ్చలితమగు ప్రశాంత జలమువలె తద్భావనావశమున చంచలమాయెన నియతభావనా పరాధీనమైన మనస్సు ప్రసంగవశమున అన్యభావనా సమాకృష్ట నచో అదివ్యభిచరించినట్లగును. వ్యభిచారము పరపురుషసంపర్కమే కానక్కరలేద అట్టి ఆలోచన వచ్చినను వ్యభిచారముగను. తన పురుషుని యందు సంసక్తమై మనస్సు అన్యపురుషుని యందు కూడా సంసక్తమగుట మానసికమగు వ్యభిచారవ అలంకారశాస్త్రము నందు ఐకాంతికరసనిష్ఠములు కాని ఇతర రస సాధారణముల

భావములను వ్యభిచారిభావములని పేర్కొందురు. కావున ముని ధర్మమగు నిస్సంగత్వమునకు, నిస్పృహత్వమునకు, వీతరాగత్వమునకు ఏకాయత్తము కావలసియున్న మనస్సు భోగములననుభవించిన వారినిచూచి సకౌతుకమైనచో మనస్సు యొక్క ధర్మైకనియతత్వము చెదరి అన్యత్ర సమాకృష్టమై చంచలమైన దగుటచేత మానసికస్థితి వ్యభిచరించినదన్నమాట. ఇది పాపము కావచ్చును. పరపురుషుని యందాసక్తి కాకపోవచ్చును. స్వధర్మాయత్తమగుచిత్తవృత్తి తద్విరుద్ధ ధర్మమును సమాలోచనచేయుట చేత ధర్మభంగమైనది. తపస్సాధనచే అంతకంతకు ఉత్తరోత్తరము ఉత్తమత్వమును సాధించు మనస్సునందు ఏపాటి వికారముసోకినను తద్వ్యవస్థ భిన్నతను గాంచును. సాధారణులకిది ఒకలెక్కకాక పోవచ్చును. బిందెడు జలమునందు ఒక్క నూనె బొట్టు జలరూపమును జలధర్మమును నాశనముచేయును.

ఉప్పుగల్లు కటాహమునిండిన పాలనైనను నాశనముచేయును. తాత్పర్య మేమనగా రేణుకయొక్క మనస్సు తద్రాజసౌభాగ్య దర్శనమువలన విక్లవమైనది. ఆమెనియమభంగమనకు అదిచాలు. రేణుక ఆశ్రమమునకు తిరిగివచ్చినది. జమదగ్ని ఆమెను చూచెను. ఆమె ముఖమున చిన్నతనము తోచెను. ధైర్యము విశ్లథమైనట్లు గోచరించెను. ఋషిపత్ని యగు ఆమె మోమున బ్రహ్మవర్చసపుఠీవి పలుచనై వెల వెల పోవుచుండెను. జమదగ్నివంటి జగత్ప్రశంసాపాత్రుడైన భార్గవమౌని అణుమాత్రమైననూ అపకీర్తిని సహింపజాలడుగదా. సామాన్యముచే ఇంతటి విశేషమును సమర్థించిన అర్థాన్తర న్యాసాలంకారము ఈ సందర్భమున ఈ క్రింది పద్యమునందు చోటుచేసికొనినది.

**కం॥ ధైర్యము విచ్యుతమయ్యెన నార్యకుబ్రాహ్మిసిరిదొలగెనని యెఱిఁగి తపో**
**ధుర్యుండుధిక్కరించెను దుర్యశము భరింపగలరెస్తుతమతులెందున్**

దత్తభాగవతము - 10వ గుచ్ఛము - పద్యసంఖ్య 47

అవధూతయదుసంవాదమున కపోతముయొక్క కథకలదు. కపోత దంపతులు ఒక వృక్షము నందు గూండ్లు కట్టుకొని పిల్లలతో సుఖముగనున్నవి. ఒకనాడా దంపతులు ఆహారార్థము దూరప్రదేశములకు పోగా ఒకబోయవాడు ఆ చెట్టు క్రింద వలపన్ని పిల్లలన్నిటిని అందుపడవైచెను. కపోతి తిరిగివచ్చి తనపిల్లల దుస్థితిని జూచి వాటిని చేరబోయి తానుకూడ వలలోచిక్కెను. కపోతము

భార్యాపుత్రులకై వగచి తాను కూడా నిర్వేదముతో ఆ వలయందే పడిచిక్కికొనెను. బోయవాడు పరమానందముతో ఆ పక్షుల నన్నిటిని చుట్టబెట్టుకొని ఇంటికి పోయెను. పక్షులకు కలిగిన దుఃఖము బోయవానికి అక్కరలేదు. బోయవాని సంతోషము ఆ కపోతములకు లేదు. ఈ ప్రపంచమునందు ఎవరి సుఖములు వారివే ఎవరి దుఃఖములు వారివే. హృదయ విదారకము, అతినృశంసమైన ఈ సన్నివేశమున నిక్షేపించిన అర్థాంతరము హృదయమును హత్తుకొనుచున్నది.

**గీ॥ క్రూరమతియైన ఆలుబ్ధకుండు నలకపోతికపోతకములనుగొనుచు**
**బోయెసిద్ధమనోరథుడైయిలు జొరనెవరి సుఖదుఃఖములు వారివేజగమున**

దత్తభాగవతము- 2వ గుచ్ఛము - పద్యసంఖ్య 122

తృతీయగుచ్ఛమున దత్తాత్రేయుని చరిత్రము నందు దత్తాత్రేయుడు నిస్సంగుడై సంచరించుచుండగా ఎందరో మౌనులు తత్త్వబోధము కోరి అతని ననుసరించిరి. నిష్క్రియుడగు దత్తాత్రేయుడు ఒకచోట హ్రదమునందు మునిగి కూర్చుండెను. మునులందఱు అతని రాకకొరకు ప్రతీక్షించుచుండిరి. కొన్ని సంవత్సరముల తరువాత దత్తాత్రేయుడు ఆ సరస్సునుండి ఒక కాంతతో బయటకు వచ్చెను. ఆకాంత చషకమందలి మద్యమును పుక్కిటగొని యొసగు చుండగా దత్తస్వామి తద్వారుణీరసమును ఆస్వాదించుచుండెను. ఇతని ప్రవర్తనముచూచి మునులందఱు ఏవగించుకొని తొలగిపోయిరి. మునికుమారులు వీడిపోయినంతమాత్రమున ఆతనియందు ఎట్టి దోషమును లేదు. మాయా కల్పితములగు వారుణీతరుణీభోగముల లౌల్యము లేవియు దత్తవిభునంటినవికావు. వాయువునకు స్పృశ్యము గాని అస్పృశ్యము గాని లేనట్లే బ్రహ్మరూపుడగు నా స్వామికి ఏగుణదోషములును లేవని వర్ణించు సందర్భమున "మరుద్గతింకలవెపోలన్ స్పృశ్యతాస్పృశ్యతల్" అను అర్థాన్తరన్యాసము సందర్భోచితముగా కుదిరినది.

**శ్లో॥ తుల్యాయాసవిధిక్రియుండనిమహాత్మున్ స్వాంతమందెంచిని**
**ష్కల్యుల్వీడినమాత్రవానియెడ దోషంబున్నదేవారుణీ**
**మాల్యామూల్యవిభోగచిహ్నములనమ్మాన్యుండు భాసించెబో**
**లౌల్యంబేదిమరుద్గతింగలవెపోలన్స్పృశ్యతాస్పృశ్యతల్**

దత్తభాగవతము - 3వ గుచ్ఛము - పద్యసంఖ్య 98

తృతీయగుచ్ఛమునందు జంభాసుర పరాభూతులైన ఇంద్రాదిదేవతలు దత్తాత్రేయుని శరణుపొందగా నేను మద్యపానముతో స్త్రీ చాపల్యముతో దూషితుడనైతిని వాసి వాసినది, వన్నె తరిగినది. ప్రజ్ఞలోపించినది. తపము చెదరినది. విద్యాశక్తులు శౌర్య ధైర్యములు అణగారినవి. స్త్రీ సంగమున మద్యపానమున, భ్రష్టుడనగు నన్ను ఆశ్రయించి మీరు ఘోర రాక్షసులను సంహరింపదలచుకొనుట హాస్యప్రాయమగును. ఓటు బోటును గైకొని ఎవ్వరైన సముద్రము నీదబోవుదురా అని దత్తాత్రేయుడు పలికిన సందర్భము ఈ పద్యమునందలి అర్థాన్తరన్యాసము ప్రకృతసమర్థకమై హృదయంగమ ముగనున్నది.

**కం॥ నన్నుగొనిమీరుశాత్రవ సన్నాహమడంచుటరిది చనుడాదివ్యుల్**
**మున్నోటిబోటుగైకొని చన్నెసమద్రముదరింపజనుటయనుటయున్**

దత్తభాగవతము - 3వ గుచ్ఛము - పద్యసంఖ్య 129

దత్తాత్రేయ కార్తవీర్యసంవాదమునందు కార్తవీర్యుడు వివిధదర్శనముల యందలి సిద్ధాన్తభేదములను ప్రస్తావనచేసి ఈ శాస్త్రవాదములయందు ఇన్ని విధములైనవి ప్రతిపత్తులుండగా దేనిని ఆశ్రయింపతగును? మోక్ష స్వరూపమెట్టిది అని ప్రశ్నింపగా దత్తాత్రేయస్వామి సందేహసంకులమైన మనస్సునకు ఉపదేశమెక్కదు. కనుక ముందు సందేహ నివృత్తిచేసి పిదప మోక్ష స్వరూపమును ఉపదేశించుదునని చెప్పిన ఈ క్రింది పద్యమునందలి అర్థాన్తరన్యాసముతత్త్వబోధ విధానమును అందలి ఔచిత్యమును వెలయించుచున్నది.

**కం॥ సందేశించెదమోక్షవిధిందరువాతనిపుడిదిమదిం జొనుపుమినా**
**సందిగ్ధచిత్తునకు నెన్నందగనుపదేశమెక్కునా ఎంతేనిన్**

దత్తభాగవతము -5వ గుచ్ఛము --పద్యసంఖ్య 106

### 12 -3) సామెతలు - జాతీయములు :-

ప్రతి భాషయందును ఆ భాషయొక్క పలుకుబడినిబట్టి ఆయాప్రాంతము లందున్నవాడుకలను బట్టి, కొన్ని కొన్ని సామెతలు, జాతీయములు, భాషయందు చోటు చేసికొనును, సమకాలీనభాషాప్రవాహమునందు ఒఱవడిపడిన ఆయా సామెతలు జాతీయములు సందర్భానుసారముగా ఆకవి కావ్యములోనికెక్కును ఇవి అన్నియూ కవి యొక్కలోకజ్ఞతకు, మాండలికపదానుసంధానదక్షతకు నిదర్శనములు. ఇట్టి వానిని ప్రయోగించుటచేత గ్రంథమునందలి ఆయా

సందర్భములు నుడికారపు సొంపులతో ఇంపులొల్కుటయే గాక ఆ భాషయందు ఆత్మీయత తెలుగుతనము తేటతెల్లమై చదువరులను అలరించును. ఈ గ్రంథమునందు కొన్ని సామెతలు, జాతీయములు ఈ క్రింద పేర్కొనబడుచున్నవి.

సామెతలు : -

1. నిధిగాంచి అంధుడౌనిర్భాగ్యుడు దత్తభాగవతము - 1వ గుచ్ఛము - పద్యసంఖ్య 76
2. అజముఖమునకూష్మాండము దత్తభాగవతము - 1వ గుచ్ఛము - పద్యసంఖ్య 98
3. మేరువు ఆవగింజలో ఇముడునా దత్తభాగవతము - 1వ గుచ్ఛము - పద్యసంఖ్య 98
4. కుంటికుధరమెక్కగలడా దత్తభాగవతము - 1వ గుచ్ఛము - పద్యసఖ్య 98
5. అందనిఫలములకై చేతులెత్తిన పొట్టి దత్తభాగవతము - 1వ గుచ్ఛము - పద్యసంఖ్య 197
6. నారుపోసినవాడు నీరుపోయును దత్తభాగవతము - 10వ గుచ్ఛము - పద్యసఖ్య 197
7. పిల్లికోడిపిల్లను తిన్నప్పటి దుఃఖము ఎలకపిల్లనతిన్నప్పుడు కలుగదు దత్తభాగవతము - 4వ గుచ్ఛము - పద్యసంఖ్య 99
8. బ్రతుకులే గరలములు దత్తభాగవతము - 5వ గుచ్ఛము - పద్యసఖ్య 18
9. ఏ పుట్టలో ఏపాముున్నదో దత్తభాగవతము - 5వ గుచ్ఛము - పద్యసంఖ్య 298

జాతీయములు: -

1. ఒంటరమింటరము దత్తభాగవతము - 1వ గుచ్ఛము - పద్యసంఖ్య 204
2. పోకాలుమని దత్తభాగవతము - 1వ గచ్ఛము - పద్యసంఖ్య 206
3. చీమచిటుక్కుమన దత్తభాగవతము - 2వ గుచ్ఛము - పద్యసంఖ్య 115
4. కన్నులకు కట్టినట్లు దత్తభాగవతము - 2వ గుచ్ఛము - పద్యసంఖ్య 118
5. పలకపాఠము దత్తభాగవతము - 3వ గుచ్ఛము - 14వ పద్యము
6. గడియారమాగినట్లు దత్తభాగవతము - 3వ గుచ్ఛము పద్యసంఖ్య 51
7. పంచకరపాట్లు దత్తభాగవతము -3వ గుచ్ఛము - పద్యసంఖ్య 127
8. ఎంగిలిమంగలము దత్తభాగవతము - 3వ గుచ్ఛము - పద్యసంఖ్య 127

9. ప్రాతచుట్టాలు దత్తభాగవతము - 3వ గుచ్ఛము - పద్యసంఖ్య 136

10. గుండెగుబుక్కుమని దత్తభాగవతము - 3వ గుచ్ఛము - పద్యసంఖ్య 224

11. వెన్నతో పెట్టినది దత్తభాగవతము - 3వ గుచ్ఛము - పద్యసంఖ్య 281

12. తారటలాడు దత్తభాగవతము - 4వ గుచ్ఛము - పద్యసంఖ్య 184

13. నీకడుపుచల్లగా దత్తభాగవతము - 5వ గుచ్ఛము - పద్యసంఖ్య 156

14. నక్కజిత్తులు దత్తభాగవతము - 5వ గుచ్ఛము - పద్యసంఖ్య 271

15. రక్కసిగుండ్రం దత్తభాగవతము - 5వ గుచ్ఛము - పద్యసంఖ్య 271

16. సికపట్లు దత్తభాగవతము

12 -4 ) శైలీలిత్యము : -

శైలియనగా పదములకూర్పు. ఈ కూర్పులో పదములు సుకుమారముగ నుండును. కఠినముగా నుండును. ఇటునటుకాకయుండును. అట్లే అసమాసత, దీర్ఘసమాసత, నాతిదీర్ఘసమాసత కానవచ్చును. పైనచెప్పిన తారతమ్యములన్నియు తత్తద్రసభావప్రాధాన్యమును ఆశ్రయించి నడచును. ఆలంకారికులు దీనిని సంఘటనయనియు వక్కాణించిరి. శబ్దసంకలనస్వరూపయగు శైలి అర్థసందర్భ పురస్కారముచేత తత్తద్రసాభివ్యంజనమొనర్చును. కావున సంఘటనయందు ప్రసాదాదిగుణములు వ్యాప్తములై యుండును. సంఘటనగుణాశ్రయమా? గుణములు సంఘటనాశ్రయములా! అనవాదములు ఇట్ల అప్రస్తుతములు. శబ్దార్థములు రసస్ఫోరకములు అగుటయందుగల తీవ్రత అనగాదీప్తి ఓజస్సు అనబడును. గాఢబంధత్వముకూడా అనుషంగికము అవిలంబితరస ప్రతీతి కరమగు శబ్దార్థముల ఐకార్థిక సమన్వితియందలి నిర్మలత్వము బోధ సౌలభ్యము ప్రసాదమగును. ఇది సర్వసాధారణమని ధ్వన్యాలోకకారుడు నుడివినాడు సుకుమారములైనరసములను అతిపేశలముగా ఆస్వాదింపజేయగల మాధుర్యము శబ్దార్థగతమై శృంగారకరుణాదులయందు సమాదరింపబడును. కావున ప్రధానముగా రసానుగుణములైన ఓజః ప్రసాదమాధుర్యములు శైలియందు అను స్యూతములై తత్తద్రసప్రతీతికి విశేషకారణములైన రచనాస్వరూపములగు రీతులను అర్థసందర్భస్వరూపములగు వృత్తులను సహకారులుగాగొని శైలి ద్వారా

ఆయారసములను పండించుట సహృదయానుభవసిద్ధము, కవి రసభావమారి డైనచో తత్త్రదసప్రకాశనపు ఔచిత్యము మేరకు శైలి అతని చెప్పుచేత నడచును. గద్యమగుగాక పద్యమగుగాక వర్ణనీయాంశగత వివిధాంశము పాఠకులు హృదయమున అవిలంబితప్రతీతిని కల్గించు లక్షణము కవిశక్తియ ఉండును. ప్రకృతము మహాకవులగు శ్రీ శాస్త్రిగారు రచించినది. పురాణమై అందున అనూదిత పురాణమైనను కవిగతరచనానిర్మాణ శక్తినపేక్షించి గ్రంథము నందలి శైలి ఆయావిషయములకు సందర్భములకు కథాభాగము తగినట్లుగా గుణములను వృత్తులను, రీతులను తనలోని మిడ్చికొని గం శరన్నదివోలె ప్రసన్నముగా ప్రవహించినది. పరిశోధనాచాపల్యమున ఆయాప నుండి కొన్ని ఉదాహరణములు చూపబడుచున్నవి.

1) మాధుర్యము : -

ఉ॥ దీనునివీనివీడిపతిదేవతతుల్యమనోనుకూలయౌ
సానియు సాధువైన తన సంతతితో దివమందబోయెడిన్
గానికి గాని పాడ్వడునగారములన్విధురుండనుండగా
నౌనెటుదుఃఖజీవితుడనై మునినై యొకరుండనైయికన్

దత్తభాగవతము - 2వ గుచ్ఛము - పద్యసంఖ్

2) ప్రసాదము : -

గీ॥ తత్పదమ్మున, బరమతత్వమ్ముజూపి త్వంపదమున బురుషునవాదవె
అసిపదమ్మున బోధించనైక్యమల్ల వాక్యము ధ్రువమ్ముగానిదిపట్టుకొన

దత్తభాగవతము - 6వ గుచ్ఛము - పద్యసం

3) ఓజస్సు : -

చం॥ వివిదిషుబోధహేతుధృతవిగ్రహునాత్మసుఖానుభూతి తు
చ్ఛవిహితవిగ్రహున్ నసురచారణముఖ్యవృతాంఘ్రివిగ్రహున్
ప్రవిలసదంగనానయనభా పరిషక్త సమగ్రవిగ్రహున్
స్థవిరయువార్భకత్వవిలసత్సమునిగ్రహుగొల్తు నెప్పుడున్

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - పద్యసంఖ్

1) వైదర్భీ : -

ఉ॥ కాముడువద్దలేని రతికామిని నాదగుకన్నెనొక్కతెన్
భూమివిభుండుకాంచనవిభూషితతల్పనిషణ్ణజూచిని
స్తామసరాజసుండయిరసాతల దేవతగాఁదలంచెనా
సామినిగాంచిమైమఱపుసంగతిజెందెను బాలలోలతన్

దత్తభాగవతము - 3వ గుచ్ఛము - పద్యసంఖ్య 196.

2) గౌడి :-

జ్వలనార్కప్రతికాశశస్త్రకలితాస్త్రవ్రాతధారాశతం
బు లవర్షించెదపస్విరాముడగురామున్ నించెగర్జారవం
బులరోదోంతరమున్విమోహముజనంబుల్పొందియుర్వింబడన్
బలికెన్ రాజని జాంతరస్థరసభావంబుల్విభాసింపగాన్

దత్తభాగవతము - 8వ గుచ్ఛము - పద్యసంఖ్య 54

3) పాంచాలి : -

శా॥ దేవాకారవిరాజమానుడయిసందీవ్యద్విమానంబునం
దావిష్టుండయిస్వప్రభావళులతో నాశల్వెలుంగంగసం
భావించెందనకింతగూర్చిన పతిన్ బ్రార్థించె శిక్షింపుమం
చావరిష్ణుని జూచిమెచ్చియనెదివ్యస్త్రీలలామంబిటుల్

దత్తభాగవతము - 7వ గుచ్ఛము - పద్యసంఖ్య 264

1) కైశికి : -

ఎన్నడు ననవమ్మెఱుగని యన్నయమున నిన్నె తలఁచునాత్మకృతంబౌ
పున్నెమ్మున జెందితి నీపున్నెమ్మికదీనినెట్లు ప్రోచెదొయనుదున్

దత్తభాగవతము - దశమగుచ్ఛము - పద్యసంఖ్య 249

2) ఆరభటి : -

శా॥ ఆగ్నేయాస్త్రముచేతరాముడరిబాహాస్తంభసంభూతి ని
ర్భగ్నంబుంబొనరించెమించెననెనారాజ్యసింహం బుతో

మగ్నంబైనవి,నీపరాక్రమములస్మద్విక్రమాంభోధిలో
లగ్నంబైనదిచింతసేయుమదికాలప్రాప్తమంచా తడున్

దత్తభాగవతము - 8వ గుచ్ఛము - పద్యసంఖ్య 62

3) భారతి : -

ఉ॥ ఈశునిగొల్వలేదుకమలేశుమదింగొనియాడలేదు దు
ర్గాశరణంబనన్గదధరాసురులన్మదిమెచ్చచేయలే
దీశతనొక్కప్రాణిహితమేనొనరింపనిన్నయేటికే
లేశముపున్నెమున్సలుపదుగడించితినేనమెంత యున్

దత్తభాగవతము - 7వ గుచ్ఛము - పద్యసంఖ్య 237

4) సాత్వతి : -

ఉ॥ ద్వాదశకోటిలింగముల స్వర్ణసరోజసహస్ర పంక్తిచే
ద్వాదశకల్పకాలమధిభక్తిసమర్చితముల్ వొనర్పనౌ
నేది ఫలంబుగల్గునదియేకదినంబున జక్రపూజితో
ద్వాదశభేదముల్గలవుతచ్ఛిలలందును వైశ్యసత్తమా

దత్తభాగవతము - 7వ గుచ్ఛము - పద్యసంఖ్య 161

అర్థప్రతీతియందలి ద్రుతవిలంబితత్వములననుసరించి అందందు ద్రాక్షాపాకము, నారి కేళపాకము కదళీపాకములు కానవచ్చుచున్నవి.

1) ద్రాక్షాపాకము : -

ఉ॥ తల్లికిదండ్రికిన్ స్నుషయుదాననమస్కృతులాచరించెనా
తల్లియుదండ్రియుంగొడుకు తత్సతిదీవనలొప్పనే త్రహ
ర్షోల్లసితాశ్రులందడిపిరొయ్యనగౌగిటజేర్చిరొచితిం
జెల్లెసమాగమక్రమముసిందులు ద్రొక్కిరి తృప్తితో నరుల్

దత్తభాగవతము - 10వ గుచ్ఛము - పద్యసంఖ్య 267

3 నారికేళపాకము : -

ఉ॥ చిత్తవిభేదమావలంతిగజేసిమనమ్మనసార్థమందున
చ్చిత్తినిబ్రేల్చియమ్మనముజేర్చివికారకకారణం బునన్
దత్తటినయ్యహంకృతిమహత్తునదానినిమాయ దార్చియా
యత్తము మాయజేయవలె స్వానుభవాత్మనియందు సన్మనుల్

దత్తభాగవతము - 2వ గుచ్ఛము - పద్యసంఖ్య 69

3) కదలీపాకము : -

శా॥ ఇంకేమీ ప్రతికూలదైవ మిది యెట్లేద్రోవగానేర్తుని
శ్శంకాతంకతబోరమార్గానిరిపున్ జంకింతుదేజోయశో
నంకంబుల్సమకూరుదానభయమేలాచావకేయుందురే
కంకాళంబుధరించువారలెవరున్గానిమ్మటంచుగ్రుడై

దత్తభాగవతము - 10వ గుచ్ఛము - పద్యసంఖ్య 224

ఏవం విధలక్షణాలక్షితమై ఒడిదుడుకులు లేక సమతలమున ప్రవహించు నదివలె ఒప్పారెడుప్రశాంతము ధారాశుద్ధిగలదియు పరివృత్తిని సహింప లేనిదియగు రచన శయ్యాసౌభాగ్యముతో నలరారునది అగును.

కం॥ అనుమానముకలదదివో ననుమానము చిరిపువందితాంఘ్రిసరోజా
యనుమానముదితసత్తాయను మానమువానికనియెననుమార్చితుడున్

దత్తభాగవతము - ప్రథమ గుచ్ఛము - పద్యసంఖ్య 240

ఈ విధముగా వీరి శైలియందలి లక్షణములు స్థాలీపులాకముగా పరిశీలింపబడినవి. సాధారణముగా సింహావలోకనము తిక్కన శైలికి తూకమిచ్చు నదిగా అనిపించుచునున్నది. ఒక్కఉదాహరణము.

కం॥ ఆశరీరుండననయి సర్వశరీరములందునింగిభంగివెలయుచున్
సశరీరుడయ్యెబశువుల భృశముక్తులజేయవానివెరవొకవిధమే

దత్తభాగవతము - 1వ గుచ్ఛము - పద్యసంఖ్య 37

ఒక్కొక్కచోట శ్రీనాధుని శైలిని తలపించు సీసపుహరువుకలదు.

సీ॥ పవనమందారచంపకకోవిదారాదివల్లీతతద్రుమప్రోల్ల సితము
హంసకారండవాద్యబ్విహగాకీర్ణస్వబ్జసరోవరాభ్యంచి తమ్ము
సంచారవన్మృగశాఖామృగాప్లుతభూభూజశాఖికాపూరి తమ్ము
గోబ్రహ్మబృందాగ్నికుశమృగాజినముఖసుహితా ధ్యయనరావ శోభితవ
నైనకృతకాశ్రమముసుకృతాశ్రమమనిబొచ్చెమన రాజసూనుడుత్సుకమతియ
తానుమునుసాముచచ్చినతాలకేతుడసురుడందుండె మునివేషమాక్రమించె

దత్తభాగవతము - 3వ గుచ్ఛము - పద్యసంఖ్య

12 -5 రసపోషణము :-

మనము కావ్యమును చదివి ఆనందించెదము, ఈ ఆనందము యొ స్వరూపమట్టిది. కథాసంవిధానము బాగున్నది. వర్ణనము బాగున్నది. మంచి అ కారములున్నవి. ధారాశుద్ధికలదు. ప్రసాదమాధుర్యములున్నవి. ఇట్టి కావ్యమ చదివి కావ్యము బాగున్నదని అనుకొందుము. ఈ అనుకొనుట సాధారణ కవి నడిపించిన పూర్వోక్త విశేషముల యొక్క సామగ్రిచేత కథాగతమగు వస్త దీప్తమగును. దీప్తమగుటయనగా తద్గతములగు ఉపస్కారములచేత మన నందు లౌకికములగు ప్రవృత్తులు నశించి అలౌకిక అనుభూతికి ఉన్ముఖీభావ కల్గును. అట్టి మనస్సునందు వస్తువు సందర్భమునకు అనుగుణమైన భావ ఉదయించును. వస్తుదీప్తివలన ఇట్టి భావముల పరంపర ఏర్పడివిగళిత వేద్యాంత ధ్యానధారవలె భావధారయగును. ఈ భావధారతదనుగుణములైన విభావానుభ దులచే మనసుకు హత్తుకొనునట్లుగా ఆస్వాదయోగ్యము కావింపబడును. ఇ సంపన్నమైన భావము ఎక్కువకాలము స్థాయిత్వమునందిరసశబ్దవాచ్యమగు

ఈ రసము అనుభవగోచరమగునపుడు మనకొక ఆనందముకలుగు కావ్యము యొక్క లౌకిక ప్రణాళికను మెచ్చుకొనునప్పటి ఆనందమునకు ఆనందమునకు వైలక్షణ్యముకలదు. అదిలౌకికము. ఇది అలౌకికము. ప్రతివిషయము నందున లౌకికత్వము అలౌకికత్వ స్పష్ట ప్రతిపన్నములగు లోకమున మనము శృంగారాది రసములను అనుభవించుచుందుము. మన ఆలంబన మౌదుము. సుఖమునో లేక దుఃఖమునో పొందుచుందుమ అలౌకికమగు కావ్యాంశమున అనుకార్యుని యందు, సుఖదుఃఖములను గమనిం చున్నను మన మనస్సునందు తదనుగుణమైన భావము ప్రసరించుచున్నను

తత్సంబంధులగు సాత్త్వికాదులు తన్మయీభావమున మనకు కలుగుచున్నను మన మనస్సు ఆనందమునే అనుభవించును, కరుణ రస ప్రధానమైన మహాకావ్యమును ఆస్వాదించి కన్నీరు పెట్టుకొనిమనకు కష్టము కల్గినట్లుగా మనస్సు బాధపడుచున్నను తద్విలక్షణముగా ఆరసానుభూతికి ద్రవించిన మనస్సుకు అనిర్వచనీయమగు ఆనందము అనుభవైకగోచరము. కావ్యానందమనగానిట్టిది ఇది బ్రహ్మానందము వంటిదని పెద్దలు చెప్పుదురు, దీనిని "వంటిది" అని చెప్పుట ఏలనగా ఇది కార్యము అయినది కనుక రసప్రస్థాననిరూపణమున ఆలంకారికులు అనేకములైన సమాలోచనలు చేసిరి. సామాజికనిష్ఠమని నిర్ధారించిరి.

శ్రవ్యకావ్యవిషయమున పాఠకులు శ్రోతలే సామాజికులు. కావ్యముల యొక్కస్వరూపములను బట్టి ప్రబంధలక్షణముల ననుసరించి ప్రధానముగా శృంగారవీరరసములను నిబంధించుట సంప్రదాయముగా నున్నది. మిగిలిన రసములు కావ్యములందు ప్రధానములై అక్రమించినపుడు మిరియపు పాలు ఎక్కువైన పానకము వలె ఆస్వాదమునందు అసౌకర్యము కలుగును. అంతియేగాక కొన్ని రసములయందు మరికొన్ని రసముల సాంకర్యము చెందుటలో వైరుధ్యము తలెత్తును. శృంగార వీరములయందు అంగాంగిభావముచేత ఇతరరసములను సందర్భవశమున గూర్పవచ్చును. కరుణ ప్రధానములైన ఉత్తరరామచరితాదులు కొన్నిలేక పోలేదు. ఆకావ్యములు నిర్వహించిన తీరట్టిది. కవియొక్క సామర్థ్యమునుబట్టి నిర్వహణాశక్తిని బట్టి తనకు తోచిన రీతిగా సర్వ ప్రపంచమును అలౌకికత్వమును పొందించి తనచిత్తమువచ్చినట్లు ప్రదర్శింపగలడు. భారతమును చూచినచోదానిని ఏరసమందుము? అన్నిరసములు అందందు పరివ్యాప్తము లైనవి. అతిదీర్ఘమైన మహాగాథ అగుటచేత సన్నివేశ సందర్భములు బహుపర్వములు ఆక్రమించినవగుటచేత, ఉపక్రమో పసంహారాంతము, ఒక్క మనస్సుతో చదువగల ఓర్పునేర్పులు దుర్లభమగుట చేత మనము అందలి రసపాకమును నిర్దిష్టముగా నిర్దేశింపలేకున్నాము. పూర్వమాలం కారికులు పరిశోధించి భారతము శాంతరసప్రధానమని నిర్ధారణచేసిరి. అట్లే మరికొన్ని కావ్యములు మొదటినుండి తుదివఱకు గల కథాక్రమమున అనుకార్యనిష్ఠమగు లౌకికరసస్వరూపము కవిశక్తిచేత అలౌకికముగా జేయబడి సామాజిక హృదయ ప్రతీతమై ఉపసంహరణాంతము తత్తద్భావతరంగములను తనలోలీనమొనర్చుకొని సముద్రము వలె వెల్లి విరిసినట్లు ఏది అనుభవింపబడునో ఆ రసము ప్రధానము, అది ఏ రసమైననేమి? శృంగారము

కావచ్చును. శాంతము కావచ్చును. ప్రకృతిమీ దత్తభాగవతమున శాంత ప్రధాన రసము.

శాంతము రసమగునా,కాదా అన్నది అలంకారికులలో చర్చనీయాంశమై నాట్యశాస్త్రమును రచించిన భరతముని శృంగారాదులగు ఎనిమిది రసము వానియొక్క ఎనిమిది స్థాయి భావములను నిరూపించెను. తరువాత భట్టోద్భట కావ్యాలంకారసార సంగ్రహమున శాంతమును చేర్చి తొమ్మిది రసముల అభివర్ణించెను. ఈతడు భరతుని నాట్యశాస్త్రమునకు వ్యాఖ్యానము వ్రాసె ప్రసిద్ధి కలదు. తదనంతరము నాట్యశాస్త్రమునందు నవరస నవస్థాయిభావములగల శ్లోకములు కానవచ్చుచున్నవి.కొందరు విమర్శక శాంతరసము భరత సమ్మతముకాదనియు శాంతరసము యొక్క స లక్షణములను ఎక్కడను పేర్కొనలేదనియు, ఆనందవర్ధనుడు శాంత ప్రతిపాదనమొనర్చుచు తగిన ఉపపత్తులతో నిరూపించెనే కాని భరతుని యొ వాక్యములను ప్రమాణముగా చూపలేదనియు, ఫలితముగా శాంతము రస కాదని ఆక్షేపించిరి. భరతుని నాట్యశాస్త్రమునందు "క్వచిచ్ఛమః" అనియుండు భరతుడు కంఠోక్తిగా రససంఖ్యలో పేర్కొనకపోయినను రసత్వమును నిరసించలే కొందరివాదము. నాట్యమునందు నానాభావములు నానా అవస్థలును నానా వృత్తాకరణములు కలవని పేర్కొనుచు నాట్యాంగముకాని దేదియు ప్రకృతియందే లేదని నిర్ధారణ చేసెను.

దశరూపవ్యాఖ్యాన మొనర్చిన ధనికుడు అనాది ప్రవృత్తములైన ద్వేషాదుల యొక్క నిర్మూలనమసాధ్యము కనుక తత్ప్రశమరూప శాంతరసము అనుపపన్నమని చెప్పెను. అయితే ఆనందవర్ధనుడు మిగి రసములవలె ఈ శాంతరసమునకు సర్వజనానుభవ గోచరత్వములేకున్న లోకాతీతములగు చిత్తవృత్తులు అంగీకరింపబడినట్లే, శాంతరసమును అంగీక వచ్చును. అని పేర్కొనెను. అభినవగుప్తుడు కూడా మోక్షపురుషార్థము అనుగుణమగు చిత్తవృత్తి స్థాయిత్వ మందినపుడు శాంతము రసము ఎట్లుండును అని సూచనతో అంగీకరించెను. అట్టిమోక్షార్థులే ఈ శాంతరసము అస్వాదన యోగ్యులగు సామాజికులని కావ్యాలంకార సంగ్రహవ్యాఖ్య య కలదు. దశరూపక కర్త ప్రశమరూపమగు శాంతము నభినయించుట శక్య కానందున ఈ రసమునకు నాట్యమునందు తగినంత పరిపుష్టిలేదని చెప్పె

తద్వ్యాఖ్యాతయగు ధనికుడు శబ్దప్రతిపాద్యతలో విప్రతిపత్తి లేదు కావున శ్రవ్యకావ్యములందు నిబంధిపవచ్చును. అని పేర్కొనచు శాంతరసస్వరూపము నిర్ణయించెను. విశ్వనాథుడు యుక్తవియుక్తదశలయందలి సంశమమే శాంతరసము నకు స్థాయి యగును. దీనికి విభావానుభావాదులు కూడా విరుద్ధములు కావని నుడివెను.

రసము అనుకర్తనిష్ట మను అభిప్రాయములుగల కొందఱు నటునియందు శమప్రదర్శనము సాధ్యము కాదు కావున శాంతము రసము కాదని వచించినను, అభినవగుప్తుడు రసము సామాజిక నిష్ఠమని నిరూపించి శాంతులు తత్త్వవేత్తలు అగు సామాజికులు ఉన్నప్పుడు రత్యాదిభావములవలె శమము కూడా శాంతరసోద్బోధనమొనర్చుటకుబాధలేదని చెప్పెను. కొందఱు శాంతమును దయా వీరమున అంతర్భావమగునని చెప్పిరి. ఉత్సాహము స్థాయి భావముగా గల వీరమునందు ప్రవమరూప గుణాంతరమును అంతర్భావ మొనర్చుట యుక్తము కాదు. ఈ విధమైన కొందఱు వాదములుండగా కొందఱు అభియుక్తులు శాంతము చిత్తముయొక్క ప్రకృతిరూపమనియు, అందునుండి వికృతి రూపములుగా రత్యాది భావములు ఉదయించుననియు, కావున శృంగారాదులు చిత్తవికారరూపములగు రత్యాది భావములవలన సిద్ధించుననియు, ప్రకృతిరూపమగు శాంతావస్థయందు స్థాయిత్వమున శాంతరసము కలదనియు భరతుడు వికృతి రసములను నిరూపించెను. కాని ప్రకృతి రసముగావున శాంతమును గుఱించి ప్రత్యేకముగా చెప్పలేదనియు సర్వభావములు స్వస్వనిమిత్తములను అనుసరించి శాంతమునుండి ఉద్భవించి అనిమిత్తములు అణగినప్పుడు ఆభావములన్నియు శాంతము నందే లయ మగుననియు నిరూపించిరి. ఈ రసమునకు శమము స్థాయి భావము. కొందఱు నిర్విశేష చిత్త వృత్తి , ధృతి, నిర్వేదము. ఉత్సాహము, జుగుప్స, ఆత్మరతి, మున్నగునవిస్థాయి భావములని చెప్పిరి. భావప్రశమరూపమగు శమమందు తత్సజాతీయములగు నిర్వేదాదులు అంతర్భూతములగును. జుగుప్సాదులు సంచారులగును కాని భావత్వమును పొందలేవు. రత్యాదులగు భావములన్నియు ప్రకృతి రసమగు శాంతమునకు స్థాయిభావములు కావచ్చునని పేర్కొన్నను అదియుక్తిసహముకాదు. కావున భరతునిచే సూచింపబడి ఆనంద వర్ధనాదులచే నిరూపింపబడి సంస్కృతాంధ్రాదిభాషలయందు అనేక కావ్యనాటకము లలో వర్ణింపబడి

తత్త్వవేత్తలగువారిచే హృదయ దఘ్నముగా ఆస్వాదింప బడుచున్న శమ స్థాయికమగ శాంతరసము ప్రత్యేకముగా ఉన్నదనుటలో సందేహము లేదు.

మోక్షపురుషార్థానుకూలమగు ప్రశమ రూపమైన ప్రాకృతిక చిత్తభావమ సర్వ వ్యాపార ఉపశమాత్మకమై ఆత్మానుభూతిరూపమగు రసముగా రూపొందును దీనికి సంబంధించిన భావాదులు ముందు పేర్కొనబడును. ఈ మోక్షమనునది అద్వైత సిద్ధాంతానుగుణముగా సర్వబంధవిముక్తిచే కల్గు కైవల్యము, కావు నిర్గుణతత్త్వానుసంధానమున భక్తిభావముకూడా లయము నొందును. మో మార్గ విధానములయందలి సగుణోపాసనా ప్రక్రియ వఱకు ప్రజ్వలించిన భ భావము అహంబ్రహ్మాస్మి భావనయందు భక్తి భక్తభజనీయతా తారతమ్యమ నశించి చిత్తగతసర్వవ్యాపారప్రశమమందు అంతర్లయము చెందును. అలౌకికము తారతమ్యము నశించి చిత్తగతసర్వవ్యాపార ప్రశమమందు అంతర్లయమ చెందును. అధిలౌకికమున గుణత్రయరూపమగు చిత్తవృత్తి అధిదైవికము రజస్తమముల విడనాడి కేవలసత్త్వరూపమై ఆధ్యాత్మికమందు గుణాతీతమగ వ్యవస్థయందు అణగారిపోవును. గాన సర్వభావములవలె భక్తిభావము కూడ బుద్బుద ప్రాయమగును ఈ దత్తభాగవతమునందు భక్తుల యొక్క చరిత్రములందు వర్ణింప బడిన భక్తి భావమంతయు ప్రధానమగు శాంతరసమునక అంగమైనది. శమదమాది సాధనము లందలి ఇంద్రియనిగ్రహరూపమగ శమమునకు నిర్వికారరూపమగు శాంతరసస్థాయిభావమగు శమమునక వ్యత్యాసము కలదని గమనింపనగును.

ఈ శాంతరసమునకు శమము స్థాయి యగు భావము కావున ఉత్తములగ నాయకులు దీనికి ఆధారభూతులు,శమమనగా వైరాగ్యము సత్సంగముచే ఈశ్వరానుగ్రహము మున్నగువాటిచేత విషయాభిలాష విముఖమైన మనస్సు కలిగియుండుట అనిత్యత్వాది జ్ఞానముచేత సర్వవస్తువులయందు గోచరించిన యర్థ్యము మరియు పరమాత్మ స్వరూపము దీనికి ఆలంబనములు. పుణ్యాశ్రమ క్షేత్రతీర్థారామాదులు సత్సంగములు సదుపదేశశ్రవణాదులు ఉద్దీపనములు రోమాంచోదయసన్యాసాదులు నిర్వేదము,హర్షము, స్మరణము, మతి,ధృతి మున్నగునవి వ్యభిచారులు. ఏతత్సామగ్రిచేత శాంతరసమభివ్యక్తమగును. ఇక్కడ కొంత ఆలోచన చేయవలెను. ఈగ్రంథమునందు శాంతరసము ప్రధానమంటిమి దీనివిభావానుభావాదులిట్లున్నవి. ప్రకృత గ్రంథమున ఈ శాంతమునకు ఆలంబన

మెయ్యది? దత్తాత్రేయస్వామి అందును ఆ స్వామి శాంతరసమునకు ఆలంబనమన్నచో సామాజికులందు రసోత్పత్తి దత్తాత్రేయస్వామితో సాధారణీ భావమున కలుగు చున్నదా అట్లు కలుగుటలేదు. మనము దేవాలయమునకు పోవుదుము, దేవుని దర్శింతుము. మనయందు విషయసౌముఖ్యమో విషయ వైముఖ్యమో మనప్రవృత్తిని బట్టి కలుగుచున్నది. సంసారమునందలినిస్సారతను భావించుటచేత సంసారమును తరింపవలెనను భావనచేత మన మనస్సునందు లౌకికముగా శమభావము కలుగుచున్నది. దానికి దేవాలయమందలి దేవుడు గానీ తద్దర్శనము కాని ఉద్దీపన విభావమగును. ఆలంబనము మనమే అగుదుము, శమమును ఆత్మనిష్ఠమునుగా అనుభవించి నప్పుడు భగవన్నిష్ఠములైన దయావాత్సల్యాదులు భావకత్వ వ్యాపారముచేత మనచే అనుభూయమానము లగుచున్నవి. కాని శమము భగవన్నిష్ఠముగా అనుభవగోచరమగుటలేదు.

కావున దత్తాత్రేయ స్వామియు విశ్వరూపసందర్శనాదులు అవతారవిశేష వర్ణనాదులు శమమునకు ఉద్దీపనములగును గాని ఆలంబనములు కావు. కథా ప్రారంభమునుండి విశ్వరూపమును చూచి భగవత్కృపకు పాత్రులై తన్మహిమ శ్రవణాసక్త చిత్తులై సూతముఖమున తల్లీలావిశేషములను ఆకర్షించి ఆనందాను భూతిని చెందిన శౌనకాదులు సముదయముగా ఆలంబనమగును. ఆలంబనములు భిన్నములైనను సామాజికానుభూయమానమైన రసైకాంతికత్వమున విరోధము భాసింపదు. కావున సమంజసమే అగును. ప్రవచనమొనర్చుచున్న సూతుడును ఉద్దీపనముక్రిందకే వచ్చును.వీరి ప్రసంగమున బ్రహ్మ కలిసంవాదము గురు శిష్యసంవాదము తత్ప్రసంగమున దత్తమాహాత్మ్యము అందునవాంతర కథలు తత్త్వబోధములు కూర్చబడినవి. ఏకథకు ఆకథయే తావన్మాత్రపరిచ్ఛేదముచేత దత్తాత్రేయమహిమానువర్ణన పరమగుటచే శౌనక, కలి, దీపకాదుల విషయమున ఉద్దీపనత్వమును స్వీకరింపవచ్చును. అస్మదాదుల విషయమున వస్త్వైక్యము లేకున్నను రసైకమత్యమున తన్నిర్వాహము అవిరుద్ధమై శౌనకాదులతో దీపకాదులతో అవాంతర కథాగతులను అలర్క విష్ణుచిత్తాదులతో సాధారణీ కరణము అను భూయమానమగుచున్నందున అఖండ శాంతరసాను భూతికి బాధలేదు. కావున శౌనకాదులతో దీప కాదులతో అవాంతర కధాగతులగు అలర్క విష్ణుచిత్తాదులతోసాధారణీకరణము అను భూయమానమగు చున్నందున అఖండ శాంతరసానుభూతికి బాధలేదుకావున శౌనకాదులు, మనమున్ను

ఆలంబనముగా అగుదుమని నిశ్చయింపబడుచున్నది.-ఈ కావ్యమున ఆవాంత కథాసన్నివేశములయందు పొడసూపెడి శృంగారాది రసములు అంగభూతము ప్రధానవిషయమగు శాంతరసమును పోషించుచున్నవి. శాంతరసస్వరూపమై నిర్వికార చిత్తత్వము ప్రధానవిషయమగు అద్వైతతత్త్వమును సమన్వయించ ప్రకరణము నందు సమగ్రముగా పరామర్శింపబడును గావున ప్రకృతమిచ దిఙ్మాత్రముగా ఉదాహరింపబడుచున్నవి.

తృతీయ గుచ్ఛమునందు పితా పుత్ర సంవాదమున కుమారుడు పూర్వజన సుకృతవిశేషమున పూర్వజ్ఞానము కలవాడై సర్వవిషయములందు వైరాగ్యమున అలవరుచుకొని నిర్వికారచిత్తుడైయుండెను.

ఉదా : -

**కం॥ పలుకడు,కులుకండలుకడు కలికితనములేనియిట్టికాన్పేటికట**
**చలుచగనాడెడు నొరులకు నలుకండనె నట్టెనవ్వియాతనికి దుది**

దత్తభాగవతము - 3వ గుచ్ఛము - పద్యసంఖ్య

అలర్కుని చరిత్రమునందు అలర్కుడు కాశీరాజు ముట్టడింపగా ఎదిరిం జయింపలేక దుఃఖితుడై తల్లి చెప్పిన ఉపదేశముమేరకు అంగుళీయకమునంద అక్షరములను చూచుకొని సత్సంగము కోరి దత్తాత్రేయ స్వామిని ఆశ్రయించును దత్తాత్రేయుని యొక్క సాంగత్యమువలన ఆతని మొదటి ప్రశ్నమున అలర్కునియందు వివిదిష బయలుదేరినది. శత్రుమిత్రాదులందరును మాయ కల్పితులని తోచి విజిగీషాచింతా దుఃఖాదులు ఉపశమించి మనస్సు నిర్వికారమైనది

**చ॥ అరియును, నాకు లేడు సఖుడైనను లేడు సుఖంబు దుఃఖమున్**
**బురమును గోశముందురగమున్ రథము న్మొదలైనవి ఏన్నితే**
**వరయగలేవు వానికిని నన్యునకున్ మఱివేనికేని నో**
**కరసమఖండమేకమె సుఖంబుస్ఫురించెడు, దా, స్వయమ్ముగన్**

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - పద్యసంఖ్య 9

నైమిశారణ్యమున శౌనకాదిమహర్షులు వేదచోదిత ధర్మాచరణముచేత శరీరేంద్రియములు శుద్ధములై నిరంతరము ఈశ్వరుని ధ్యానించుటవలన తదను గ్రహముచేత వారి మనస్సు నిర్వికారమైనట్లు వర్ణింపబడినది. ఉదా : -

ఉ॥ చిత్తము సుస్థమై యొకట జేరి మహర్షులొకప్డు నిత్యమై
మిత్తిక సత్క్రియాకృతులమేకొని లోకగురుల్ స్వధర్మని
ర్వృత్తి విచారశీలులయవృత్తుల నొత్తెడు వృత్తినెత్తియా
వృత్తికి జొచ్చుచోటయినివృత్తి నెసంగిరి నిశ్చలాంగులై

దత్తభాగవతము - 1వ గుచ్ఛము - పద్యసంఖ్య 11

పంచమగుచ్ఛమున విష్ణుదత్తుని చరిత్రమునందు దత్తాత్రేయస్వామి ప్రత్యక్షమై నీకేమి వరము కావలయునో కోరుకొనుమనగా విష్ణుదత్తునకు కోరవలసిన దేదియూ తోచినది కాదు. ఆతని నిస్పృహత్వము కనులకు కట్టినట్లు వర్ణింపబడినది.

ఆ॥ వరముగోరుమనెడు వరదునినేవరం బడుగవలెనొ తెలియదాయెద్విజున
కాలుచెప్పలేదయారక్కసుడు నన్నం డేమిసేయుపాపమా మహితుడు

దత్తభాగవతము - 5వ గుచ్ఛము - పద్యసంఖ్య 192.

పైన పేర్కొన్న విధముగా సత్సంగాదులవలన నిర్వికారమగు మనస్సు కలిగి యుండుటయే శమమను స్థాయిభావము. ఇందలి పుణ్యాశ్రమవర్ణనములు కాశీక్షేత్ర వర్ణనము. తీర్థ మాహాత్మ్యవర్ణనము ఎడనెడ చక్కని ఉపదేశములు ఈ రసమునకు ఉద్దీపనములగునట్లు చక్కగా పరిపోషింపబడినవి.

1. ఆశ్రమవర్ణనము : -

తే॥ జాతి సంభవవైరముల్ సంత్యజించి మునుల పోలికకగు మృగములకనుగొని
భ్రమరగీతమ్ము కోయిలపాటనెమ్మి యాటవేకలతో వినియాగకేగి

దత్తభాగవతము - 5వ గుచ్ఛము - పద్యసంఖ్య 35

2. క్షేత్రవర్ణనము ( కాశి )

తే॥గీ॥ ఇందువినువత్సవిశ్వవిశ్వేశ్వరుండు గంగభైరవుడును డుంఠిగణపతియును
దండపాణియు నారంగ దర్శుకాము లకు షడంగయోగంబిదిసుకరమగును.

దత్తభాగవతము - ప్రథమగుచ్ఛము - పద్యసంఖ్య 263

3. తీర్థవర్ణనము

మ॥ సిరిదార్చున్సురగంగదోగినగురుక్షేత్రంబుతోబాటిటే
ధరనైనంబదిరెట్లు వింధ్యయుతయే స్థానంబునంగాశిను
త్తరతో వాహిని నూరురెట్లగుగళిందప్రోద్భవాసంగతన్
దరమేపశ్చిమవాహినింబొగడసందర్శించినంజాలదే

దత్తభాగవతము - 7వ గుచ్ఛము - పద్యసంఖ్య 221

4. సదుపదేశప్రసంగము

గీ॥ అదికె నామదినీనుడులన్నిమేలు జ్ఞానమావిర్భవించె త్వత్సక్తిమేలు
బ్రాహ్మణోత్తమకారుణ్యవర్షమిట్లు మెఱసి వర్షించితివి మేలు మేలు మేలు

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - పద్యసంఖ్య 228

కేవలము ఉదాహరణము కొఱకు ఒకపద్యము చూపబడినది కాని గ్రంథమునందు ప్రతికథయందు ప్రతి సందర్భమునందు ఇట్టి ఉపదేశ ప్రసంగములు కలవు.

ఈ శాంతరసమునకు అనుభావములైన రోమాంచస్వేదాదులు సందర్భానుగుణముగా అందందు ప్రసక్తములైనవి.

రోమాంచాదులు : -

గీ॥ వికచ వదనాంబుజుడు దివ్యపీతవసన ధరుడు దత్తేశ్వరుండు ప్రత్యక్షముండి
వరమిడగ వచ్చినాడ నీ వాడననుడు సూతుమెయిస్వేదరోమాంచ సుహితమయ్యె

దత్తభాగవతము - 1వ గుచ్ఛము - పద్యసంఖ్య 120

భూతదయ : -

విష్ణుదత్తుడు దత్తాత్రేయ వరప్రభావముచేత సిద్ధపురుషుడై ప్రతిఫలాపేక్ష లేకుండా పరమకారుణికత్వము చేత ఆశ్రయించినవారియొక్క ఆదివ్యాధులను పోగొట్టెను.

గీ॥ ఆదరమ్ము౯ననల్లదయాపరుండు బుజ్జనముతోడనడుగంగబూవుబోడి
భర్తృదేహజ దుఃఖసర్వస్వమనియె దానొనర్చినకృతులు విశాయగుటయు

దత్తభాగవతము - 5వ గుచ్ఛము - పద్యసంఖ్య 239

సన్యాసము : -

పితా పుత్రకథయందు కుమారుని తత్త్వబోధమునకు జ్ఞానవంతుడై తండ్రి సర్వసంగ పరిత్యాగమొనర్చిసన్యాసాశ్రమమును స్వీకరించును.

ఆ॥ అంతగొంతతటికి సంత్యాశ్రమముగొని యాత్మజయమునొంది యధిగుణంబు
బంధమందువదలి పరమసిద్ధింబొందె ననివచించియిట్టులను గురుండు

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - పద్యసంఖ్య 300

నిర్వేదము : 6

దుఃఖాదులచేత కలిగిన విషయవైమనస్యరూపమగు నిర్వేదమునకు

కం॥ నోరెండజిత్తముంజెడ నారీరత్నముదురాశనవయుకనులతో
నీరహినిర్వేదమ్ము౯న సారసుఖముజెందిజింతసడలనరేంద్రా

దత్తభాగవతము - 2వ గుచ్ఛము - పద్యసంఖ్య 143

శృంగారరసమునకు - 140

చం॥ అదితుది నూహపేసి యనెనాతనితో స్మరసుందరుండ చె
ప్పుదునెటు? లూరకుందునెటు? పోనినుజూపి యనంగుడమ్ము౯లం
గుదెగొని ముద్ద పేరురము గ్రుచ్చుచునుండె దయందొఱంగి యం
గదకిటులయ్యె నింతి వినుగాథ యగాధధృతీ? వచించెదన్

దత్తభాగవతము -

వీరరసమునకు - 143

చం॥ అదివినిరాజసూతి క్షణమాగి కనుంగొన నింతలో భయ
ప్రదదితిజ ప్రధాన బలరాజులతో నెదిరించె వైరియు

న్మదమున మర్త్యవీరుడు నమర్త్యులు మెచ్చనరాతిసంహతిం
బ్రదరపవిప్రవర్ష ముల వాలొనరించి కలంచియాడుచున్

దత్తభాగవతము - తృతీయ గుచ్ఛము - పద్యసంఖ్య 212

కరుణరసమునకు -482

ఉ॥ వారలజూచి మెచ్చుకొనె వారిజలోచన లోచనాబ్జము
ల్వారిధులై పయోధరముల న్సుహితార్థములం బొనర్పనె
వ్వారికి నెందుగల్గలె విపత్తులు? నోములు నోచి నోచి నే
నోరిచి కన్న కాన్పు జగమో యనబోయిన దేమి మాయయో?

దత్తభాగవతము - 10 వ గుచ్ఛము - పద్యసంఖ్య 176

అద్భుత రసమునకు - 265

ఆ॥ పక్కణంబులేదు పలలంబు లేదు కు క్కలు సృగాలకరటములును లేవు
చేతి కత్తి లేదు చిన్ముద్ర ముద్రితుం డున్న వాడొకండె యున్నవాడు

దత్తభాగవతము - 5వ గుచ్ఛము - పద్యసంఖ్య 189

రౌద్రరసము - 493వ పేజీ

సీ॥ మూడుగూడెములొంట ముట్టించె ముక్కంటి యానాటిమంట చల్లారకుండె
దక్షాధ్వరమ్ము ప్రధ్వంసమ్ము గావించు వీరభద్రుమెు గానపెచ్చు పెరిగె
బరమేశ్వరుండ శంబరవైరి నేర్చుట కల్లార్చుటను దమ్మినారితేజె
రాజుల జెండు భార్గవు పరశ్వథధార మచ్చిక గ్రోతి కొమ్మచ్చులాడె
నదె ప్రతాపాగ్నియన్న పేరవధరించి, దత్తువరము వశిష్ఠు ప్రపత్తిగొన్న
నహుషు జేకొని నేడు దానవకులముల నీఱుసేయుచు గవిసినదా ఇదింక

దత్తభాగవతము - 10వ గుచ్ఛము - పద్య సంఖ్య 230

భయానకరసమునకు - 261

మ॥ చలచిత్తుండుకపాలిరక్త నయనాంచ న్మూర్తిశుద్ధాస్థికుం
డలకేయూరకిరీటహార వలయ వ్యానద్ధడౌ వేల్పుగు

క్కలు వెన్నంటి యెలుంగుతో దఱుమనక్కర్మాస్థితుం డార్తుడై
కలకంబాటెను దారిడొంక యనకే కంపం బనల్పం బుగన్

దత్తభాగవతము - 5వ గుచ్ఛము - పద్యసంఖ్య 168

బీభత్సమునకు - 41వ పేజీ

ఉ॥ ఆత్రముతోడ దీపకుడహర్నిశముం గనిపెట్టిపూయువి
ణ్మూత్రములెత్తిపోయుదన మూపున చీరమునొత్తియొత్తిని
ర్మాత్రమునేయుసుమ్మిమదిరంజిల మాటలు సెప్పుజేరిత
ద్గాత్రము సోక నీడు మశకమ్మునకుం జలి చీమ కీగకున్

దత్తభాగవతము - ప్రథమ గుచ్ఛము - పద్యసంఖ్య 203

హాస్యమునకు - 282వ పేజీ

సీ॥ ఎక్కడివాడ వీ వెవ్వండవు యన్ననెక్కడివాడవీవెవ్వడవని
నక్కజిత్తులు నేర్చినాడవు లేయన నక్కజిత్తులె నేర్చినాడ వయని
రక్కసి గుంట్రయీ తక్కులాడనియన్న రక్కసి గుంట్రయీతక్కరియని
పెక్కుమాటలికేల? వెడలు వీధికటన్నపెక్కుమాట లికేల? వెడలుమయని
యన్న మాటనెయనుచుదారన్నుకొఱకు, గట్టిగావాదు లాడి లగ్గలకు నెక్కి
మిగిలిసిగపట్టకగ్గమై మేర మీర నూరి వారలు ప్రోవైరి వీరువారు

దత్తభాగవతము - 5వ గుచ్ఛము - పద్యసంఖ్య 271

దత్తాత్రేయప్రభావ వర్ణనా పరమగు ఈ గ్రంథము నందు అవాంతర కథాసందర్భానుగుణముగా ఇతర రసములన్నియు యథోచితముగా పోషింప బడినవి. ఆలంబనాదులయందు భేదముండుటచే విరోధము పరిహృతము ఈ రసములన్నియు శాంతరసమునకు ఉపస్కారములై తరంగముల వలె తలఎత్తుచు అంతలోనే ఉపశమించుచు శాంతరసమును సర్వతోభద్రముగ అఖండముగా ఏకముగ నిలిపినవి.

# 13వ అధ్యాయము

# హ్రీం మంత్ర రహస్యములు

హ్రీం మాయాబీజము, పూర్వప్రకరణములలో కొంత వివరించితిని. ఇచ్చట ఇతరమంత్రములు, తద్రహస్యములు విశదీకరింపబడుచున్నవి.

బ్రహ్మమానస పుత్రుడగు నారదమహర్షి మొదలగు మహానుభావుల ప్రవృత్తి 'స్వయం తీర్ణః పరాన్ తారయతి' అనునట్టిది. అనగా తాను జ్ఞానియై తరించుటయే గాక మిగిలిన వారందరిని ఉపదేశబోధలతో మంచి మార్గమున ప్రవర్తింపజేసి వారందరును తరించునట్లు త్రోవచూపువారని యర్థము. మునులందరు ఇట్టివారే. తాము వేద వేదాంగములు పఠించి ఉపనిషత్తులనావర్తించి అందలి తత్త్వము నెరింగి ఆ తత్త్వమును ఇతరులకు బోధించు అభిప్రాయముకూడ కలిగి యుండుట అసాధారణమైన విశేషము. ఒక రకముగా చూచినచో కైవల్యము సిద్ధించిన వానికి ఇది నియతము కాదని తోచును. ఏలయనగా 'అహం బ్రహ్మాస్మి' అను అనుభూతి స్థిరమై స్వభిన్నమైనది మిథ్యగా స్ఫురించు చుండగా ఆకాశమువలె సర్వ పరివ్యాప్తమై అఖండమై నిరతిశయానంద రూపమైన తాను తన కంటే భిన్నుడు ఎవడుండునని చెప్పబోవును. చెప్పువాడు వినువాడు లేడు. 'సర్వం ఖల్విదంబ్రహ్మ' ఇట్టి అపరోక్ష కైవల్యానుభూతి సిద్ధించినవాడు జీవన్ముక్తుడే. అట్టి వానికి ఈ దృశ్యమగు విశ్వమంతయు మిథ్యయగును. కావున అట్లు తరించి ముక్తుడగువాడు మరొకరికి బోధించునన్న ప్రసంగము అసంగతమే గదా! అయితే నారదాదులగు జీవన్ముక్తులు వ్యావహారిక సత్యమైన ప్రపంచమందు లోకానుగ్రహము కొరకు సంచరించుచు ప్రారబ్ధవశమున పంచక్లేశములతో ఈషణాత్రయముతో జన్మజరామరణములతో సుడిగుండమునందు పురుగులవలె అస్వతంత్రులై పరిభ్రమించుచున్న జీవులను సముద్ధరించ వలెనను కరుణకలిగి అనేక విధములైన మార్గములతో తత్త్వోపదేశమును చేయుచుందురు. తత్త్వబోధమునందు కొనజాలని వారికి కర్మమార్గమును, ఉపాసనామార్గమును, భక్తిమార్గమును బోధింతురు. లోకము నుద్ధరించుట కొఱకు నారదుడు మహావిష్ణువు నొద్ద సత్యనారాయణ వ్రతకల్పము నెఱింగి ప్రచారము చేసినట్లు రేవాఖండమున కలదు. ఈ విధముగనే పెద్దలందరును తత్త్వజ్ఞులయ్యును, భక్తుల తారతమ్యముననుసరించి తగిన మార్గము నుపదేశించుట ప్రచురముగా నున్నది. ప్రకృతమున శ్రీశాస్త్రిగారు అపరోక్షాను



శ్రీరామ పట్టాభిషేకము

భవమును సాధించి పూర్ణపురుషులై తామనుభవించిన తత్త్వమును శ్రద్ధాళువులగు వారికి అందించుట కొఱకు పూనుకొని అవినయమును పరిహరించుటకై స్వోపజ్ఞమని కాకుండా దత్తమాహాత్మ్యమును అనువాదమొనర్చు వ్యాజముతో మంత్ర రహస్యములను ఎడనెడ నిక్షేపించిరి. అధికారి తారతమ్యము ననుసరించి ఈ తత్త్వము అవగతము కానివారు ఉత్తమగతిని పొందుటకు యోగశాస్త్ర రహస్యములను కూడా ఉట్టంకించిరి. ఐహికాముష్మిక సాధనమునకు తగినట్లుగా సందర్భమును బట్టి కొన్ని వ్రతములను కూడా మనోజ్ఞముగా పొందుపరచిరి. అట్లే జపించుటకు వీలయిన కొన్ని మంత్రములను ఈ గ్రంథము నందు వివరించుట జరిగినది అట్టి మంత్రములు, స్తోత్రములు పరిశీలించి విశేషము లిచట ఉల్లేఖింపబడుచున్నవి.

1 గురుమంత్రము :- గురు శబ్దము గొప్పవాడని అర్థము చెప్పునట్టిది. భారమైన అర్థము కూడా కలదు. గొప్పతనమునపేక్షించి గురుశబ్దము ఆచార్య పరముగా బహుళ ప్రచారములో నున్నది. ఈ గురువనువాడు బ్రహ్మవిష్ణు మహేశ్వరరూపుడనియు ఈశ్వర సమష్టిరూపమగు బ్రహ్మమనియు గురుర్బ్రహ్మ అను శ్లోకమున కలదు. శివునకు కోపము వచ్చినను గురువగువాడు రక్షింప గలడు. గురువే కోపించినచో ఎవ్వడును రక్షింపజాలడను అర్థము గల "శివేరుష్టేగురుస్త్రాతాగురౌరుష్టేనకశ్చన" అను శ్లోకభాగము, ఇంకనిట్టి పెక్కు వాక్యములు గురువు యొక్క గౌరవమును, ప్రాశస్త్యమును, ప్రాముఖ్యమును ఉగ్గడించుచున్నవి. ఇట్టి గురుశబ్దము యొక్క వైయుత్పత్తికమైన నైఘంటుకమైన అర్థములకు భిన్నముగా శాస్త్రకారులు విశేషార్థములను కూడా నిర్వచించియున్నారు. గుకారస్త్వంధకారస్స్యాత్ రుశబ్దస్తన్నివర్తకః అంధకార నిరోధిత్వాత్ గురు రిత్య భిధీయతే" మనస్సును ఆవరించి యున్న అజ్ఞానమనెడి చీకటి "గు" అను అక్షరమునకు అర్థము "రు" అను అక్షరమునకు అట్టి అజ్ఞాన అంధకారమును పోగొట్టువాడని అర్థము. కాగా గురు శబ్దమునకు అజ్ఞాన తిమిర నివారణము చేయువాడని తాత్పర్యముగా పెద్దలు చెప్పుచున్నారు. ఆగమసంప్రదాయ మందు గురుత్రయమను మాట వినబడును. గురువనియు పరమగురువనియు పరాపరగురువనియు అందలి విభాగము, జీవచైతన్య ప్రకాశముతో వైయుష్టికముగా భాసించు ఉపాధితరూపమునందు గురుభావము నొనర్చిన వానికి సమష్టిరూపమగు

నిరుపాధిక పరమేశ్వర తత్త్వము పరమ గురురూపమున తన్నిమిత్త కారణమైన అఖండ బ్రహ్మచైతన్యము పరాపర గురువుగా, ధ్యానానుగతముగా భాసించును.అప్పుడే గురుర్బ్రహ్మ అను శ్లోకము అద్యంతము యథా సంప్రదాయముగా సమన్విత మగును. ఈ విధముగా గురు శబ్దము ఆగమములయందు, శాస్త్రముల యందు పురాణముల యందు నిర్వచింప బడియుండగా ప్రకృతమైన దత్తమాహాత్మ్యమున ఈ గురుశబ్దము బీజాక్షరముల సంపుటిగా ఉద్ధారము చేయబడినది. ఇందుగకారము గణపతి దేవతాకమైన బీజము. రేఫము అగ్ని బీజము. ఉకారము విష్ణుదేవతాకమైన బీజము, గణపతి సర్వసిద్ధులను ఇచ్చువాడు. అగ్ని పాపములను దహించువాడు. విష్ణువు జ్ఞానమును మోక్షమును ఇచ్చువాడు. ఏ విద్యలను ఉపాసించినను తత్ప్రతిబంధకములకు ప్రారబ్ధకర్మలు నశించి విద్య సిద్ధించి జ్ఞానము కలుగవలయును. కావున ఏతద్దేవతాత్రయాత్మకమగు వర్ణసంపుటితో సిద్ధించిన గురుపదము రెండక్షరముల మంత్రముగా ప్రకటింప బడినది. దీని మూలానువాదములుదాహరింప బడుచున్నవి.

1. శ్లో॥ గకారస్సిద్ధదః ప్రోక్తః రేఫః పాపస్యదాహకః ఉకారోవిష్ణురవ్యక్త స్త్రితయాత్మాగురుః పరః
2. గణేశోవాగ్నినా యుక్తోవిష్ణునాచసమన్వితః వర్ణద్వయాత్మకోమంత్రః చతుర్వర్గఫలప్రదః

దత్తమాహాత్మ్యము - శ్లోకసంఖ్య 53, 54, 1వ అంశ - 5వ అధ్యాయము

తే॥ గీ॥ సిద్ధినిచ్చుగకారంబశివమడంచు రేఫముహరియుకార మాత్రితయము గురు
వా గణేశాగ్నిబీజమధ్యమున నున్న యచ్యుతుడె ద్వ్యక్షరాత్మకమ్మయ్యె మనువు

దత్తభాగవతము - 1వ గుచ్ఛము పద్యసంఖ్య 149

గురుశబ్దమునకు మంత్రత్వమును సిద్ధింపజేసిన పురాణ మందలి రహస్యమును అనువాద రూపమున ఆంధ్రపాఠకులకు అందజేసిన విధము హృద్యముగ నున్నది. ప్రత్యేక వివరణము లేనిచోట ఓంకార పూర్వకముగను చతుర్థనమోంతముగను చేసి నామమంత్రముగ నుపాసించుట సాధకుల సంప్రదాయములో నున్నది "ఓం గురవేనమః" షడక్షర మంత్రము భక్తిశ్రద్ధలతో జపింపబడి గణపతి వహ్నివిష్ణువులకు ప్రీతికరమై ధర్మార్థకామ మోక్షములను ప్రసాదించును. గణపతి సర్వప్రథముడుగా పూజనీయుడు. శారీరకయోగమున మూలాధార స్థితుడగు గణపతి ప్రథమార్చనీయుడు. శ్రౌతస్మార్తకర్మములన్నియు గణపతి పూజతో ప్రారంభమగును. అగ్నికర్మకాండకు ఉపాసనాకాండకును ప్రతీకము. ప్రాణాయామమున వాయువు అగ్నిరూపమును దాల్చుట యోగశాస్త్ర

మందలి రహస్యము. వేదాధ్యయనము నందునకూడా శ్రీ గురుభ్యోనమః అను నమస్కారముతో ప్రారంభించుట సంప్రదాయము ఇక్కడి గురుశబ్దమందలి బహువచనమునకు కూడా గణేశాగ్నివిష్ణువులు గురుత్రయముతాత్పర్యముగా అన్వయించు కొనవచ్చును.

సర్వమంత్రములకు ప్రారంభమందు గురుప్రార్థనము తప్పనిసరి. ఉపాధి రూపముననున్న ఉపదేష్టయగు గురువుకు మంత్రాధిపతియగు దేవతకు అభేదభావనము ఇందు సూచింపబడుచున్నది. గురువునందు ఎంతభక్తి కలదో దైవము నందు అంతటిభక్తి కలుగవలయును. దైవమందు గల భక్తి గురువునందు కూడా ఉండవలెను. గురుదేవతల యందు గల భక్తిభావము క్రమక్రమముగా భిన్నాంశ త్యాగము చేత ఏకాధికరణమై బుద్ధిదీపమును జ్వలింపజేయును. గురువు ఉపదేశించిన విషయములే కాక ఉపదేశింపని బహురహస్యములు స్వయంవ్యక్తములై శిష్యులకు ప్రకాశించును.

**శ్లో॥ 'యస్యదేవేపరాభక్తిః యథాదేవే తథా గురౌ**
**తస్యైతే కథితా హ్యర్థాఃప్రకాశన్తే మహాత్మనః**

ఈ కారణముచేతనే ప్రాచీన సంప్రదాయము నుండియు గురువున కింతటి ఔన్నత్యము గల్గినది. శ్రీ శాస్త్రిగారు తమగ్రంథమున తనకు ఓనమాలు దిద్దపెట్టిన దండయ్యగారి వద్ద నుండి గురువుల నందరిని పేరుపేరున పేర్కొని స్తుతించుట గమనింప తగియున్నది. వారు ప్రతినిత్యము నిత్యతర్పణము సేయు సమయమున దండయ్యపంతులు గారితో సహాగురువులకందరకు తర్పణము చేయుట ప్రతి గ్రంథమునందును తమ గురువులను పేరుపేరున ఉట్టంకించుట ఈ వ్యాసకర్త స్వయముగా సన్నిహితుడై యుండిచూచిన విషయము. వీరి యొక్క గురుభక్తికి ఇంతకన్న వేరే నిదర్శనమక్కరలేదు. కావుననే కేవలము మూలానువాదమైనను ఈ గ్రంథమున పేర్కొనబడిన గురుమంత్ర వైభవమును గురించి ఇంతగా విశదీకరించుట జరిగినది. ఈ సందర్భమున ఇంకొక అంశము ప్రస్తావింప వలసి యున్నది. తల్లిదండ్రులను అత్తమామలను జ్యేష్ఠసోదరులను వయోవృద్ధులను గురువులని భావించుట శాస్త్రవిహితము, లోకవిశ్రుతము, అగు విషయము. మరి ఇంతటి గూఢార్థము గల గురుశబ్దము వీరందరియందు ఎట్లె ప్రవర్తించుచున్నదను సందేహము కలుగును. వ్యాసుని వాక్యమునందు సందేహములు కలిగిన చోటనే తత్సమాధానము కూడా పొందుపరచబడి

యుండునని శాస్త్రిగారు "మత్స్యప్నమను సంస్కృతకావ్యమున" పేర్కొనిరి. అట్లే పై సందేహమునకు ఈ పురాణమునందే గురుశబ్దమునకు వ్యుత్పత్తియు పేర్కొనబడినది. గృణాతి హితమస్యేతి గురుః మేలును కోరువాడు గురువనబడును. కావున శ్రేయః కాముకులైన మాతాపిత్రాదులు అందరు గురు శబ్దవాచ్యులగుటలో విప్రతిపత్తిలేదు.

2. దత్తాత్రేయ మంత్రము :- శ్రీ శాస్త్రిగారు ఆత్రేయసగోత్రులు, దత్తాత్రేయుడు వీరి వంశమున మొదటివాడు. వీరి గృహావరణమున దత్తాత్రేయస్వామి సుప్రతిష్ఠితుడై నిత్యపూజ లందుకొనుచున్నాడు. వీరికి అనేక సందర్భములలో యోగోపసర్గములు సంభవించినపుడు ఉపాస్యదైవము ఆ స్వామిగా మార్గదర్శకుడై రక్షించెనను విశ్వాసము వీరికి కలదు. మరియు దత్తాత్రేయుడు కూడా శాక్తేయుడన్న అర్థము ఈ పురాణమున చెప్పబడినది. దత్తాత్రేయ స్వామి యోగా దేశకరుడన్నది పురాణ ప్రసిద్ధమైన సత్యము. నిత్యము దత్తాత్రేయ మంత్రమును అనుష్ఠానము చేయు శాస్త్రిగారు తదను గ్రహవిశేషముచేత దత్తమాహాత్మ్యమును అనువదించి తద్గతమగు ఆత్మీయ భావముతో ఆస్వామి యొక్క మంత్రముకూడా మూలమున లేకున్నను గ్రంథాంతమున పొందుపరచిరి. మంత్ర శాస్త్రగ్రంథములు అనేకములు కలవు. విష్ణురుద్రాదులు ఎందరో మహర్షులు స్వోపజ్ఞముగా మంత్రద్రష్టలై తత్త్వరహస్యము లను వివరించుచు, యామళము, మహోదధి, అర్ణవము, కౌస్తుభము, ఇళకము మున్నగు నామధేయ విశేషములతో మంత్రగ్రంథములను రూపొందించిరి. దేవతలు, ఋషులు, మంత్రద్రష్టలై అనేక వినియోగములతో సాధించి దర్శించిన బహువిధములైన మంత్రస్వరూపములను ఆయా గ్రంథములందు నిక్షేపించిరి. ప్రతిమంత్రమునకు ఋషిదేవతాఛందములు, బీజశక్తి కీలకములు వినియోగములు న్యాసములు ధ్యాతవ్యస్వరూపములు ప్రత్యేకములుగనున్నవి. గురూపదేశమున మంత్రము పొందిన సాధకుడు అందలి రహస్యముల నెఱింగి ఉపాసన మొనర్చిన సిద్ధిని పొందగలడు. అట్లే కల్పభేదములతోను ఉద్ధారవైవిధ్యములతోను దత్తాత్రేయ మంత్రములు అనేకములు కలవు. ఏకాక్షరి మొదలుకొని వింశత్యక్షరి వఱకు బహువిధములైన మంత్రములు ఆగమ ప్రసిద్ధములు. ఈ మంత్రములలో అనేకములైన బీజములు సంపుటి కావింపబడి యున్నవి. బీజము అనగా ప్రధానమైన వర్ణమని అర్థము, లౌకికార్థము "విత్తనము". వృక్షము ప్రాదుర్భవించుటకు విత్తనమెంత అవసరమో జపరూపమైన దోహద విశేషముచేత మంత్రరూపమగు

మహావృక్షము సఫలమగుటకు బీజాక్షరము అంత ముఖ్యము. ఒక్కొక్క మంత్రమునకు విభిన్నములైన బీజాక్షరములు ఉండును. ఆ అక్షరముల కధిదేవతలై కొన్ని శక్తులుండును. ప్రయోగపరముగను, వినియోగపరముగను ఆయాశక్తులు సత్త్వరజస్తమః ప్రధానములై సాధకాభీష్టమును నెఱవేర్చుటకు సంసిద్ధముగా నుండును. ఆ బీజముల యొక్కయు ఆశక్తులయొక్కయు సుప్రసాదము కొఱకు సాధకుని ఉపాసన ఒక్కొక్కసారి తీవ్రతరము కావచ్చును. అటువంటి ఉపాసన యందు సాధకులకు జాగరూకతయు గురుసన్నిధానమును ఆవశ్యకములు. మరికొన్ని మంత్రములు సాధారణముగా శ్రేయోదాయకములై కష్టనివారకములై దేవతానుగ్రహప్రదములై విలసిల్లును. అట్టి మంత్రములను నామ మంత్రముల వంటివానిని ఎవరైనను నిర్నిబంధముగా తగిన శ్రద్ధాసక్తులతో తగిన ఆచార నియమములతో యథాశక్తిగను యావచ్ఛక్తిగను ఆచరించుకొనవచ్చును. ఇట్టి అవకాశమును పాఠకులలో సాధకులగు వారికి కల్పించుట కొఱకు శ్రీ శాస్త్రిగారు "ఓంద్రాందత్తాత్రేయాయనమః" అను నామమంత్రమును మాయా బీజముతో సంపుటీకృతముగావించి దానిని ఓంకారముతో అమృతీకరణము చేసి పొందుపరచినారు.

కం॥ దత్తాత్రేయాయపదం బెత్తినమోంతముగవెంటనే ద్రామనిమా
యోత్తరపూర్వమ్ముగ్రబణ వాత్తంబిటునటునొనర్పనావిభుమనువౌ

దత్తభాగవతము - 12వ గుచ్ఛము - పద్యసంఖ్య 114.

కల్పకౌస్తుభాది గ్రంథముల యందు దత్తాత్రేయ మంత్రములు కలవు. వానిలో ఏకాక్షరి, షడక్షరి, అష్టాక్షరి, షోడశాక్షరి, వింశత్యక్షరి మొదలైన మంత్రములు కలవు. వానియందు ద్రాం దత్తాత్రేయాయనమః అనునది అష్టాక్షర మంత్రముగా ప్రదర్శితము ఇందు బీజాక్షరము "ద్రాం" అనునది. ఈ బీజమునకు దత్త మంత్రములలో ప్రాధాన్యము కలదు. దక్షిణామూర్తి బీజమగు దకారముతో రామబీజమగు రేఫమును శివరూపమగు మకారమును సంపుటీకృతములై ద్రాంబీజమైనది. ఈ బీజానుష్ఠానము వలన జ్ఞానము సంపద, కైవల్యము కల్గును. ఈ బీజమునకు అనుష్ఠాత త్రిమూర్తిరూపుడగు దత్తాత్రేయుడు. చతుర్థ్యంతనమః పదములు తదుస్మైకీకరణమున వేగమును సాధించును, ఇట్టి మంత్రమును శ్రీ శాస్త్రిగారు పూర్వసంప్రదాయముల పరిశీలించి బీజములకు గల సిద్ధులను తదనుస్యూతమగు మంత్ర వర్ణముల మహిమములను అవగతము చేసికొని ద్రాం బీజమును నమః పదము తరువాత చేర్చి సకలార్థ సాధకమగు హ్రీం

బీజమును ఇరుప్రక్కల గూర్చి ప్రణవసంపుటితో "ఓం హ్రీందత్తాత్రేయాయ నమః ద్రాం హ్రీం ఓం" అను మంత్రమును ఉద్ధరించి చూపిరి. ఈ మంత్రమునందలి మాయాబీజములు ఐహికాముష్మికములగు సంపత్తులనొసగును. ప్రణవములు హ్రీం బీజమున గల తీక్ష్ణత్వమును అపాకరించును. ఈ బీజముల సంపుటిచేత, నమస్కారముచేతను ఆరాధింప బడుచున్న దత్తాత్రేయుని ఐహికాముష్మిక సంపదలను జ్ఞానకైవల్యములను ప్రసాదించుటకు ఉన్ముఖునిగా చేసుకొనవచ్చును. ఇందుకు సంబంధించిన న్యాసధ్యాన వినియోగాదులు అందుకు సంబంధించిన కల్పములందు గమనింప వచ్చును.

3. అనుష్టుభమంత్రము :- దత్తాత్రేయ ప్రకాశములైన మంత్రములలో ఈ మంత్రము అనుష్టుప్ఛందనమును కలదు. తద్వైభవ మహిమావర్ణన పరములైన నామపదములు ఇందు కలవు. దీని స్వరూప మిట్లున్నది.

**శ్లో॥ దత్తాత్రేయ హరేకృష్ణ ఉన్మత్తానంద దాయక**
**దిగంబర మునేబాల పిశాచ జ్ఞాన సాగర.**

ఇదియును దత్త ప్రీతికరమైన మహామంత్రముగా షడామ్నాయ మాలికయందు కనుపట్టు చున్నది. ఈ మంత్రమును కూడా శాస్త్రిగారు ఈ క్రింది పద్యమున సూచన చేసిరి.

**శ్లో॥ దత్తాత్రేయ హరీదిగంబరమునీంద్రాకృష్ణ సంజ్ఞాన ను**
**న్మత్తానందవరప్రదాయక అఖండజ్ఞానవారాకరా**
**సత్తామాత్రపిశాచబాల విధి విశ్వస్వామి, నన్నేలు మా**
**యెత్తుండంజ లినీకటన్న నుడికాయాతుండతండయ్యెడున్.**

దత్తభాగవతము - 12 వగుచ్ఛము - పద్యసంఖ్య 116.

మంత్రములను యథావర్ణముగా లిఖించుట సంప్రదాయ నియమ రహస్యములకు విరుద్ధము. ఆ దృష్టితోనే శాస్త్రిగారు మొదటి మంత్రమును ఉద్ధార పద్ధతిలోను రెండవ మంత్రమును ఆంధ్రపద్య అను గుణమైన కూర్పుతోను సూచించిరని చెప్పదగును. ఈవిధముగా మంత్రములను సూచించుటలో శ్రీ శాస్త్రిగారి అభిప్రాయము దత్తాత్రేయ కల్పపీఠిక యందిట్లున్నది. "కఱువు కాటకములు సంభవించినప్పుడు భోజనము లేకపోయినను సకాలములో పంటలు పండించు కొనుటకు విత్తనములావశ్యకము లగును, అదే రీతిగా ఇట్టి గ్రంథములు

ఈ కానికాలములో ఉపయోగింపబడక పోయినను యుక్తకాలము వచ్చినపుడు అప్పటి సాధకులకు తప్పక ఉపయోగించుననియే నా సంగృహీతమైన అభిప్రాయము."

4. అష్టోత్తర శతనామ స్తోత్రము :- దత్తాత్రేయ మాహాత్మ్యమునందు రెండుచోట్ల రెండురకములుగా దత్తాత్రేయునికి సంబంధించిన అష్టోత్తర శతనామములు కలవు. అందొకటి వేద ధర్ముడను గురువు దీపకుడను శిష్యునకు దత్తమహిమమును బోధించుచు శ్రీ దత్తాయనమః మొదలుకొని దత్తాత్రేయాయనమః వఱకు నూటెనిమిది నామములను సర్వపాప వినాశకములు గను సర్వేప్సితప్రదములుగను, దత్తప్రసాదకరములుగను బోధించిన సందర్భములోనిది. ఇది దత్తమాహాత్మ్యమున ప్రథమాంశమందు దశమాధ్యాయమున కలదు.

ఇక రెండవది విష్ణుదత్త వృత్తాంతము నందు విష్ణుదత్తుడు దత్తాత్రేయుని స్తుతించిన సందర్భములోనిది. ఇది దత్తమాహాత్మ్యము - తృతీయాంశమున పంచమాధ్యాయము నందు కలదు. దత్తాత్రేయ స్వామి ఈ స్తోత్రముతో సంతసించి విష్ణుదత్తుని అనుగ్రహించుచు ఈ నామములతో నన్నుస్తుతించిన వాడు నా అనుగ్రహమునకు పాత్రుడు కాగలడని సెలవిచ్చెను.

శ్రీ శాస్త్రిగారు తమదత్తభాగవతమున మొదటినామావళిని ద్వితీయ గుచ్ఛ ప్రారంభమునందు రెండవ నామావళిని పంచమగుచ్ఛమునందు పొందుపరచిరి. (దత్తభాగవతము పంచమగుచ్ఛము పద్యసంఖ్య 211 నుండి 214 వఱకు గల పద్యములలో)వీనిలో మొదటి నామావళి వద్ద విశేషము కలదు. ఇందలి నూట ఎనిమిది నామములను శిరస్సు మొదలుకొని పాదాన్తము వఱకు ఆరు అవయవములను తాకుచు నామములను పఠించినచో కవచ రూపమున సర్వరక్షణము గావించునని చెప్పబడినది. అంతియేగాక మొదటి నామావళి యందలి ఒక్కొక్క నామమును మంత్రరూపమనియు ఈ నామములను ప్రత్యేకముగా జప, తర్పణహోమములతో పురశ్చరణముగావించి సిద్ధిని బడయవచ్చుననియు ఇందలి ప్రతినామమును దశావృత్తముగా నిత్యము పఠించినచో విశేష ఫలదాయకమనియు మూలానువాదములలో పేర్కొనబడినది.

# 14వ అధ్యాయము

# సౌమనస్యము - యోగదర్శనము

సాంఖ్యులమతమునందు కర్మేంద్రియ పంచకము జ్ఞానేంద్రియ పంచకము మనస్సు ప్రాణ పంచకము కలిపి పదునారు వికారములు చెప్పబడినవి. ఏడు ప్రకృతి వికృతులు మహదహంకారములు శబ్దస్పర్శ రూపరసగంధములు, వీటన్నిటికి మూల కారణమైనది. మూలప్రకృతి. దీనినే అవ్యక్తమనియు, ప్రధానమనియు అందురు. ఇవి మొత్తము 24 తత్త్వములు. ప్రకృతియు వికృతియు కానట్టివాడు పురుషుడు. ప్రధాన పురుషులు నిత్యులు. ప్రధానమే జగత్కారణము పురుష సన్నిధానము వలన ప్రకృతి జగత్కారణ మగుచున్నది. ప్రకృతి స్వరూప వివేచనము లేకపోవుట చేతనే పురుషునకు సంసారబంధము కలుగుచున్నది. ఇది సాంఖ్యుల సిద్ధాంతము. యోగుల మతమునందు పైన చెప్పిన ఇరువదైదు తత్త్వములుండగా ఇర్వై ఆరవవాడు ఈశ్వరుడు కలడు. అతడు క్లేశాదులు లేనివాడు. పురుషుడు క్లేశవంతుడు సంసారబంధమంతయు ఈతనికే కలదు. ఈశ్వరుడు నిత్యముక్తుడు. పురుషునకు యోగమువలన బంధము తొలగిపోవును ఆ యోగము క్రియాయోగ మనియు సమాధియోగమనియు రెండు విధములు. తపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధానములు క్రియా యోగము, సమాధియోగమునకు, యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులు అష్టాంగములు. చిత్తవృత్తి నిరోధము సమాధి, అందు బాహ్యావృత్తి నిరోధము. సంప్రజ్ఞాత సమాధి - సర్వవృత్తి నిరోధము అసంప్రజ్ఞాత సమాధి. పురుషుడు అభేదావగాహనము చేత క్లేశాది వశముచే బద్ధుడగుచున్నాడు. ఇట్టి పురుషుడు యోగానుష్ఠానముచేత పరమేశ్వర ప్రణిధానముచేత సత్త్వపురుషాన్యతాఖ్యాతి కలవాడై క్లేశవిముక్తుడై కైవల్య సిద్ధి నందును. ఇదియోగ శాస్త్ర సిద్ధాంతము.

ముముక్షువగువాడు నిత్యానిత్యవస్తు వివేకముచేత వైరాగ్యము కలవాడై శమదమాది సాధన సంపత్తితో వేదాన్త శ్రవణమొనర్చి నిరంతర మననము చేసికొని నిదిధ్యాసనపరుడై బ్రహ్మసాక్షాత్కారానుభవమును పొంది స్వరూపావస్థితి నుండును. ఇదియే ముక్తి అని అద్వైత సిద్ధాంతము. ఈశ్వర తత్త్వవిచారము వఱకు సాంఖ్యుల యొక్కయు యోగుల యొక్కయు మార్గమొక్కటియే. యోగసిద్ధాంతమున నిరూపించిన ఈశ్వరుడు మాయయందు ప్రతిబింబించిన

చైతన్యమనుటయు, ఏకమేవాద్వితీయం అనబడిన బ్రహ్మయు తత్త్వమస్యాది బోధజనిత ముక్తియు, అద్వైతసిద్ధాంతమున గల విశేషము ఇట్లుండగా యోగము వలనను ఈశ్వరుని ప్రణిధానము వలనను, యోగులకు సమాధి సిద్ధించుచుండగా అద్వైతులకు శ్రవణాదులవలన సమాధి సిద్ధించును.

యోగుల మతమున పురుషుడు యోగమువలన ముక్తుడగును, వేదాంతుల మతమున జ్ఞానము వలన ముక్తుడగును. యోగాభ్యాసపరులకు తత్త్వజ్ఞానముతో పనియుండవచ్చును గాని, అద్వైతులకు యోగాభ్యాసమే ముఖ్యము కాదు. ఈ కారణము చేత ఆయా శాస్త్రములందు విషయములు విభక్తములై కనబడుచున్నవి. యోగ సంప్రదాయమున శ్రవణమనన నిదిధ్యాసనముల యొక్క పరామర్శముకాని అద్వైత విమర్శమున యోగప్రస్తావముగాని చేయబడలేదు. యోగమతమున ధ్యానమునకు వేదాన్త మతమున మననమునకు, విషయభేదము కలదు. వారి సమాధికి వీరినిదిధ్యాసమునకూ పోలికలు ఉన్నను నిదిధ్యాసితవ్య విషయమున వ్యత్యాసము కలదు. ఎవరిమార్గము వారిది ఎవరి సిద్ధాన్త సంప్రదాయములు వారివి. పాతంజలయోగ సూత్రములకు భాష్యము రచించిన పురాణప్రణేతయగు వ్యాసుడు కొన్ని నెలవుల యందు సిద్ధాంతద్వయములను ప్రత్యేకముగా నిరూపించియు అందునందు ఈ రెండు మార్గములను పరస్పరానుబంధముతో బోధించెను. ఈ దత్తమాహాత్మ్యమునందు యోగమును మననాంగముగా ప్రదర్శించెను. సమాధిని యోగాంగముల నుండి వేఱుగా చూపి నిదిధ్యాస సమాధులకు సామానాధికరణ్యమున ఏకత్వమును ప్రదర్శించెను.

శమదమాదులు కలిగి యమ నియమాదులతో దేహేంద్రియ మనశ్శుద్ధులను పొంది ప్రాణాయామ ప్రత్యాహారధారణములచేత ఇంద్రియ మనోజయమును, సంపాదించి శ్రవణమున తెలిసికొనిన విషయమును నిరంతరధ్యానముతో మనన మొనర్చి నిదిధ్యాసమున సవికల్ప సమాధిని తద్వృత్తిలయమున నిర్వికల్పక సమాధిని సాధించి ముక్తుడగునని యోగజ్ఞాన మార్గమునుపదేశించెను. దత్తదేవుని చరిత్రమున యోగోపదేశములు తత్త్వోపదేశములూ కలవు. కాన సాధకులకు తన్మార్గసమన్వయము వలన అసందేహముగా లక్ష్యమును సాధించుకొనుట ఈ సమన్వయమునకు కారణము. శ్రీశాస్త్రిగారు యోగసాధనమున సిద్ధపురుషులై అద్వైత స్వరూపానుభూతి కలిగి స్వానుభవమును శాస్త్ర సంప్రదాయములను క్రోడించి ఈ అనువాదమున మూలగతములు వ్యాఖ్యాగతములగు విశేషములు

సమాహరించి తమ అనువాదమున, నాన్యతోదర్శ నీయముగా తత్త్వప్రతిపాదః మొనర్చిరి. వీరు రచించిన రామకథామృత శేషపూరణమునందు ఇట్లే యోగజ్ఞాః మార్గములను సమన్వయించిరి. వీరి యామా వికయందు కూడా ఇట్టి సమన్వయవే కలదు. వీరి కల్యాణకైవర్తమందు ఇట్టి స్థితియే వర్ణింపబడినది. వీరి వాసుదేః సారథ్యమున తాత్పర్యమిట్టిదియే. వీరి ఎఱుకకు వ్యాసుని సంవిధానము కూడ కలిసి వచ్చి ఈ రెండు మార్గములు గంగాయమునలు వలె ఏకవాహినిగ ప్రస్ఫుతములైనవి. ఇందు ప్రధానముగా రెండు ఘట్టములలో యోగోపదేశమః కలదు. దత్తదేవుడు ఒకచోట, అలర్కునకు మరొయొకచోట కార్తవీర్యార్జునునకు ఉపదేశించెను. తదుపదేశసంగ్రహములు పేర్కొనబడుచున్నవి. చతుర్థ గుచ్ఛమునందు దత్తదేవుడు అలర్కుని దుఃఖాపహార మొనర్చి జ్ఞానోపదేశమః చేయుచు, ప్రాకృత తత్త్వముల యొక్క భిన్నత్వమును తెలిపి కొనుట యోగ సాధనమున సిద్ధించుమోక్ష మని సాంఖ్యమతమును పరామర్శించి యోగసిద్ధి కానిదే మోక్షము సిద్ధింపదనియు, యోగముచేతనే ఇంద్రియ మనోజయమః సాధించుకొనవలయు ననియు బోధించెను.

అలర్క చరిత్రములోని "యోగంబమరకున్ననాదనబోదు విముక్తి" అనః పద్యమును బట్టి యోగాభ్యాసము లేకుండ శాశ్వతమైన బ్రహ్మైక్యానుభూతి సంభవింపదు. దీనికి ఇంద్రియజయము వలయును. ఈ ఇంద్రియజయమః ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణల వలన సాధింపబడును. కొలిమిః యందు కాల్చిన ధాతువుల మలము నిర్దగ్ధమైనట్లే ప్రాణాయామము సర్వ దోషములను దహించును. ధారణముల వలన పాపములన్నియు నశించును. ప్రత్యాహారమువలన ఇంద్రియ విషయముల యొక్క సంబంధము ఉత్పన్నమగును. తదనంతరము, ధ్యానయోగము ఈశ్వర భిన్నములైన గుణముల నన్నింటిని రూపు మాపును. ప్రాణాపానములను నిరోధించుటను ప్రాణాయామముగా పేర్కొనిరి. ప్రాణాయామము పూరక కుంభకరేచకాత్మకము. ఈ మూటికిని కాలనిష్పత్తి కలదు. ఎంతటి కాలప్రమాణముతో పూరకము చేయబడునో అంతకు నాలుగురెట్లు కాల ప్రమాణముతో కుంభకమును, రెండు రెట్లు కాలప్రమాణముతో రేచకమును చేయవలెను. అనగా ఏకప్రమాణకము పూరకము, చతుష్ప్రమాణకము కుంభకము, ద్విప్రమాణకము రేచకమన్న మాట. ఈ ప్రాణాయామ విధానము ప్రసిద్ధమైనను మూలము నందును అనువాదము నందును ఇచట ప్రత్యేకించి కలదు. ఇందు పూరకము యొక్క ఏక ప్రమాణ కాలము ద్వాదశ మాత్రా

పరిమితమైనచో (12 =48 = 24) ఇట్టి ప్రాణాయామము అధమమనియు, పూరక ప్రమాణకాలము ఇరువదిదాల్గు మాత్రల పరిమాణము కల్గియున్నచో (24 = 96= 48) ఇట్టి ప్రాణాయామము మధ్యమ మనియు పూరకము యొక్క ప్రమాణ కాలము ముప్పదియారు మాత్రలైనచో (36 - 144 - 72) ఇట్టి ప్రాణాయామము ఉత్తమము అనియు నిర్దేశింపబడినది. ఇట్లు ప్రాణాయామము సాధించు యోగికి అధమ ప్రాణాయామ సాధనమున స్వేదమును, మధ్యమప్రాణాయామ సాధనమున, కంపమును ఉత్తమ ప్రాణాయామ సాధనమున దుఃఖమును కల్గును. ఇవి దోషములు వీటిని యోగోపసర్గలందురు. వీటి వలన యోగము భగ్నమగును. ఇట్టి దోషములు కలుగకుండా జాగరూకతతో అభ్యాసము చేయవలయును. గమనించుడు.

సీ॥ యోగంబమరకున్ననాదవబోదువిముక్తి త్యాగంబులేకున్నయోగముఅదు

దత్తభాగవతము - 4వ గుచ్ఛము - పద్యము 115

శ్లో॥ జ్ఞానపూర్వోహియోగోఽయం జ్ఞానేనసహయోగినః

శ్లో॥ ముక్తిర్యోగాత్ తథాయోగః సంగత్యాగాన్మహీయతే

దత్తమాహాత్మ్యము - 2వ అంశ - 10వ అధ్యాయము - 2వ శ్లోకము

శ్లో॥ యథాపర్వతధాతూనాం ధ్మాతానాం దహ్యతే మలం
తథేంద్రియ కృతాదోషాదహ్యంతే ప్రాణనిగ్రహాత్

శ్లో॥ ప్రథమం సాధనం కుర్యాత్ ప్రాణాయామస్యయోగవిత్
ప్రాణాపాననిరోధస్తు ప్రాణాయామ ఉదాహృతః

దత్తమాహాత్మ్యము - 2వ అంశ - 10వ అధ్యాయము 12,13వ శ్లోకములు

శ్లో॥ లఘుర్మధ్యోహ్యుత్తరాఖ్యః ప్రాణాయామస్త్రిధోదితః
తస్యప్రమాణం వక్ష్యామి తదలర్క,శృణుష్వమే

శ్లో॥ లఘుర్ద్వాదశమాత్రస్తుద్విగుణస్సతుమధ్యమః
త్రిగుణాభిస్తుమాత్రాభిః ఉత్తరోఽయముదాహృతః

దత్తమాహాత్మ్యము

శ్లో॥ దహ్యంతేధ్మాయమానానాం ధాతూనాం హియథామలాః
ప్రాణాయామైస్తుదహ్యంతే తద్వదింద్రియజామలాః

శ్లో॥ ప్రథమేజనయేత్స్వేదం మధ్యమేనతు వేపథుం
విషాదం హిత్వృతీయేనజయేద్దోషానను క్రమాత్

దత్తమాహాత్మ్యము - 2వ అంశ - 10వ అధ్యాయము - 17వ శ్లోకము.

సింహశార్దూలాది జంతువులను వశమొనర్చుకొనువాడు వాని మనసెరిగి ఉపాయవశమునస్వాధీనము చేసికొన్నట్లుగా ప్రాణాయామమును ఉపాయముతో సాధించుకొనవలయును ప్రాణాయమ సిద్ధివలన మోక్షప్రాప్తి కలుగుటకు 4 అవస్థలు కలవు. వీనిని 1 ధ్వస్తి 2 ప్రాప్తి 3 సంవిత్ 4 ప్రసాదము, ఇష్టములు అనిష్టములుగు అగు సర్వక్రియలు శిథిలములై ఫలక్షయములు పొందును. దీనివలన మనస్సు పరిపక్వమగును. ఇట్టి స్థితికి ధ్వస్తి అనిపేరు ఐహికములు ఆముష్మికములును ఐన సర్వకామములు నిగ్రహీతములై సర్వకామ సంపన్నతా రూపమగు ఆనందము కల్గును. ఇట్టి స్థితిని ప్రాప్తియందురు. సర్వగ్రహగతులు దూరస్థ విషయములు రహస్యములు అతీతానాగతార్థములు, యోగికి జ్ఞాన గోచరములగును. ఈ స్థితికి సంవిత్తనిపేరు. పంచధాతువులు మనస్సు ఇంద్రియములు నిర్మలములై సౌఖ్యమునందుట ప్రసాదమనెడి 4వ అవస్థ. ఈ దశయందు యోగి నిర్వాత ప్రదీపము వలె నిశ్చలత్వము గాంచును.

అర్థ పద్మము పద్మము, స్వస్తికము మొదలగు అనుకూలమగు స్థిరసుఖాసనముల నధివసించి మనస్సున ప్రణవమునను సంధానించుచు యోగము నభ్యసింపవలయును. ఆసనబంధమున శరీరావస్థితి నిర్దేశింప బడినది. ఆసనము సమానముగనుండి చరణములు ముడువబడి, తొడలుసారింపబడి, మడమలు వృషణలింగములకు తగులునట్లు ప్రయత్నించి వంశపృష్ఠము నిలబడునట్లు కూర్చుండి, దంతములు ఒండొంటిని తాకకుండగా కించిదున్నమిత శిరముతో నా సాగ్రన్యస్తనయనుడై ప్రాణాయామ మొనర్చువానికి రజస్తమములు, శమించి, సత్త్వము శుద్ధమై ప్రాణేంద్రియములు నిగ్రహీతములగును.ఇచ్చట యోగాంగములైన యమనియమములు గతార్థములు కావున ప్రత్యేకముగా నిర్దేశింపబడలేదు. ఆసనము, ప్రాణాయామము చెప్పబడినది. అనంతరము ప్రత్యాహారము. ఇందుకచ్ఛపము (తాబేలు) తన అవయవములను వలె కామములను ప్రత్యాహరింపవలెను. గమనించుడు.

శ్లో॥ మృదుత్వంసేవ్యమానాస్తుసింహశార్దూలకుంజరాః
యథాయాంతితథాప్రాణోవశ్యోభవతియోగినః

దత్తమాహాత్మ్యము - 2వ అంశ - 10వ అధ్యాయము - 18వ శ్లోకము

శ్లో॥ ధ్వస్తిః ప్రాప్తిః తథాసంవిత్ ప్రసాదశ్చ మహీపతే
స్వరూపం శృణు చైతే షాం కథ్యమానమనుక్రమాత్

దత్తమాహాత్మ్యము - 2వ అంశ - 10వ అధ్యాయము - 18వ అధ్యాయము

శ్లో॥ సమః సమాసనోభూత్వా సంహృత్యచరణావుభౌ
సంవృతాస్యస్తథైవోరూసమ్యగ్విష్టభ్యచాగ్రతః

దత్తమాహాత్మ్యము - 2వ అంశ - 10వ అధ్యాయము - 30వ శ్లోకము

2శ్లో॥ పద్మమర్ధాసనంవాపితథాస్వస్తికమాసనం
ఆస్థాయయోగీ యుంజీతకృత్వాచ ప్రణవంహృది

దత్తమాహాత్మ్యము - 2వ అంశ - 10వ అధ్యాయము - శ్లోకము 29

కంఠమువఱకు అనంతరము నాభివఱకు వాయుపూరణమొనర్చి ప్రత్యాహారము చేయదగును. పండ్రెండు ప్రాణాయామములు ఒకధారణగా చెప్పబడుచున్నది అట్టి ధారణలు రెంటివలన ఆత్మ నిశ్చయరూపమగు యోగము కలుగును. అద్దాన సకల దోషములు ప్రణష్టములగును. ప్రాకృత గుణములకంటె తాను భిన్నుడుగా ఆరయుట ఈ యోగమువలన సిద్ధించును. ఆహార నియమముతో నిరంతర ప్రాణాయామముతో క్రమక్రమముగా పృధివ్యాదులగు ధారణాస్థానములను జయించుకొనుచు అనుష్ఠింపవలయును. ఏ దేశబంధముచే చిత్తము ధరింపబడునో అదిధారణ. ధారణస్థానములు పది. 1. నాభి 2. హృదయము 3.ఉరస్సు 4. కంఠము 5.ముఖము 6.నాసికాగ్రము 7.నేత్రములు 8.భ్రూమధ్యము 9.శిరస్సు 10.శిరసుకు కొంచెముపై భాగము అల సత చెందియున్నపుడు ఆకలిగొన్నపుడు భోజనానంతరము భయంకరమగు చోట వాతోష్ణముల తారతమ్యమునందు యోగాభ్యాసము చేయరాదు. అట్లు చేసినచో స్మృతి లోపము మొదలగు దోషములు కలుగును. యోగసిద్ధివలన నిరోగత పరిమళము, ప్రసన్నత, మలమూత్రక్షయము, ద్వంద్వబాధానివృత్తి సర్వభూతాత్మ భావన సిద్ధించును. ఇట్లు యోగము సిద్ధించుచుండగా యోగ ప్రతిబంధకములగు అనేక సంకల్పములు తత్ప్రయత్న వాంఛలు కలుగును, ఇట్టివే మరికొన్ని

శ్రావణము, ప్రాతిభము, దైవము, భ్రమము, ఆవర్తమనెడు యోగ విఘ్నములు కూడ కలుగును. ఆయాదశలలో కలుగు వీటినన్నిటినీయోగ ప్రతిబంధములనియే యందురు, వీని నతిక్రమించి నయోగికి పంచభూతసిద్ధియు అణిమాద్యష్ట సిద్ధులును లభించును. వీటివలన లోలత చెందకుండా ఏకాగ్రమైన మనస్సుతో సాధన చేయువానికి సర్వకామ విముక్తత్వము పర్యవసానమున అఖండ బ్రహ్మాను భూతి కలుగును. ఈవిధముగా యోగమార్గమును అలర్కునకు ఉపదేశించి దత్తాత్రేయుడు జ్ఞానసిద్ధికి యోగము మహోపకారకముగను, మనన, నిదిధ్యాసన పరీపాకమునకు యోగసాధనములను ఉపాయములుగను దత్తదేవుడు బోధించెను.

**శ్లో॥ నిగృహ్యాసమవాయేన ప్రత్యాహారముపక్రమేత్**
**యస్తుప్రత్యాహరేత్కామాన్ సదాంగానీవకచ్ఛపః**

దత్తమాహాత్మ్యము - 2వ అంశ - 10వ అధ్యాయము శ్లోకము 34, శ్లోకము 36

**శ్లో॥ ప్రాణయామా దశద్వేచ ధారణాసాభిధీయతే**
**ద్వేధారణేస్మృతేయోగేయోగిభిస్తత్వదర్శిభిః**

దేశబంధశ్చిత్తస్య ధారణా పా - యో - సూ - 3పా - 1 సూ.

**యచ్ఛేద్వాఙ్మనప్రాజ్ఞః తద్యచ్ఛేత్ జ్ఞాన ఆత్మని**
**జ్ఞాన మాత్మని మహతినియచ్ఛేచ్ఛాన్త ఆత్మని**

కఠోపనిషత్

1. **బ్రహ్మచర్యాపరిగ్రహ అహింస అస్తేయ; సత్య, మౌన, అభయ, ఆస్తిక్య, హ్రీ సంగవర్జనములు యమములు పది. శౌచా, చమనస్నాన స్వాధ్యా యేజ్యామదర్చన తపోజప సంతోష తీర్థేజ్యాః** నియమములు పది.

కార్యవీర్యార్జునునకు యోగోపదేశము చేసిన సందర్భము నందు శ్రవణ, మనన, నిది ధ్యాసముల చేత జ్ఞానము సిద్ధించును. అని బోధించి లింగషట్కముతో శ్రవణమును నిరూపించి మననమునకు అంగముగా యోగసాధనము చెప్పబడినది. ప్రాణాయామమువలన మనోజయము కలుగుననియు మనోజయము వలన కూడా ప్రాణ నిరోధము సిద్ధించుననియు చెప్పుట ఇందు విశేషము. జోడుగిత్తలలో ఒకదాని పగ్గములాగినచో రెండవది నిలిచినట్లుగా మనః ప్రాణములలో ఏ ఒక్కదానిని జయించినను రెండవది వశమగునన్న ఉపమానము మనోహరము

గనున్నది. ధారణలను కూడా వారి వారి అభ్యాసము మేఱకు ప్రాణజయముతో కొందరు, మనోజయముతో కొందరు అభ్యసింతురు. వామనాసికతో పూరకము, కుంభకము, దక్షిణనాసికతో రేచకము అనునది ఒక పద్ధతి, ఏ తద్విపరీతము అనగా కుడిముక్కుతో పూరకము, కుంభకము, వామనాసికతో రేచకము అనునది మరొక పద్ధతి. ఈ రెండు కాక మూడవది బహిః కుంభకము ఈ ప్రాణాయామము బీజాక్షర సంఖ్యా సహకృతముగను నిర్బీజముగను ఉండవచ్చును.

ఇచట ప్రాణాయామములందు సబీజత్వ నిర్బీజత్వముల ప్రదర్శించుట విశేషము. మనస్సును ఆత్మయందు నిల్పుటయే ధారణయగునని చెప్పిన నిర్వచనము వెనుకటికంటె అతిరిక్తముగ నున్నది. ఈ ధారణయు సగుణ నిర్గుణభేదములతో రెండు విధములు. ధారణము మాటిమాటికి అనుసంధాన మొనర్చుట ధ్యానమనబడును. ఈ పైన చెప్పబడిన నాల్గింటిలో పండ్రెండు ప్రాణాయామములు ఒక్క ప్రత్యాహార ప్రమాణముగను, పండ్రెండు ప్రత్యాహారములు ఒక్కధారణ ప్రమాణముగను, పండ్రెండు ధ్యానములు సాధారణ సమాధి ప్రమాణముగను ఇచట నిర్దేశించుట పూర్వముకంటె విశేషము. ఈ సమాధియు సవికల్ప నిర్వికల్పములని రెండు విధములు. ఇందు సవికల్ప సమాధియే నిదిధ్యాసనమగును. విజాతీయ ప్రత్యయ నిరాకరణముచేత ఆత్మ ప్రత్యయ ప్రవాహము నియతస్థితి నందుటయే సమాధి. ఈ సవికల్ప సమాధి యందు జ్ఞాన జ్ఞేయ జ్ఞాతృభేదముండును. ఈ భావముకూడా క్రమక్రమముగా అడగిపోయి నిర్వికల్ప సమాధి స్థితి సిద్ధించును. ఈ స్థితియే స్వస్వరూపానుభూతి యగు కైవల్యము ఈ విధముగా యోగావస్థాక్రమము ఆత్మానుభవ పర్యవసాయ కమని కార్తవీర్యార్జునునకు చేసిన యోగోపదేశమునందు కలదు.

**శ్లో॥ మననం త్వథకర్తవ్యం శ్రుతస్యపరిచింతనం యుక్తిభిర్వి విధాభిశ్చయథాగురుముఖాచ్ఛ్రుతం**
**తత్రాంగానిత్వవశ్యాని యోగ సిద్ధ్యర్థ మాదరాత్‌ముముక్షుణాం విధేయాని విదితాని తవాధునా**

దత్తమాహాత్మ్యము - 3వ అంశ - 9వ అధ్యాయము - 29వ శ్లోకము

పాతంజలయోగ దర్శనమునందు యోగాంగములలో ప్రత్యాహారాము వఱకు బహిరంగ సాధనములుగను, సంయమమనుపేరుగల తరువాతి

ధారణాధ్యానసమాధులు అంతరంగ సాధనములుగను పేర్కొనబడినవి. పై మూడింటియందు అవాంతర ఫలములు కల్గుననియు యోగసిద్ధులకు జన్మాది సిద్ధులు గోచరించుననియు, ఇవియే పరమ ప్రయోజనములు కావనియు, పరమప్రయోజనము కైవల్యమనియు, బోధింపబడినది ఆత్మస్వరూపమగు చిచ్ఛక్తి అపరిణామిని అయ్యు పరిణామినియగు బుద్ధివృత్తిని అనుసరించి తద్రూపము కలది వలె భాసించును. బుద్ధ్యారోపవశమున తదితరభేదభావముచేత ఉన్న పురుషుడు సంసారమువనుభవించును. ఈశ్వర ప్రణిధానము యోగా భ్యాసములచేత సత్త్వ పురుషతాన్యతాఖ్యాతి అనగా వివేకము దృఢమగును. ఈ వివేక జ్ఞానము సంప్రజ్ఞాత సమాధియందు ఉదయించును. ఈ వివేకమున్నప్పుడే ప్రకృతి భిన్నముగా ధ్యేయము సంప్రజ్ఞాతమగును. ఈ అంశమే మననమునందు ప్రధానముగా లక్ష్యము అగుచున్నది. యోగసూత్రములందు ఈ సంప్రజ్ఞాత సమాధి నాలుగు విధములుగా నిరూపింపబడినది. ఈనాలుగు విధములైన సంప్రజ్ఞాత సమాధి భేదములు మననమున ప్రారంభమైనిధి ధ్యాసనమున సమన్వితములగును. నిది ధ్యాసనము యొక్క అనంతర స్థితి సర్వవృత్తిలయము ఇదియే అసంప్రజ్ఞాత సమాధి.

కావుననే సవికల్పక సమాధియే నిదిధ్యాసనమునుగా దత్తభాగవతము నందు నిరూపింప బడినది. విజాతీయ ప్రత్యయనిరాకరణము చేత సజాతీయ ప్రత్యయ ప్రహహిక నిదిధ్యాసనముగా వర్ణింపబడినది. ధ్యానము అనగా చింతనము, నిధ్యానమనగా నిరంతర చింతనము దిధ్యాస యనగా నిరంతర ధ్యానేచ్ఛ అనగా ధ్యేయవిషయకమైన ధ్యాన సంకల్పము. ఈ సంకల్పము ధ్యానరూపమగును. దీని నైరంతర్యము నిది ధ్యానము అనబడుచున్నది. ఈ నిది ధ్యాసనము వలన మనోవృత్తి దృఢమై సర్వవ్యాప్త చైతన్యము తాను అనువృత్తి ప్రవాహము కలుగును. ఇదియే చిత్ర ప్రతిబింబ రూప చిత్తవృత్తి ఇందు వృత్తి రూపమగు ఉపాధిక్రమముగా నశించుట వలన చిత్తమే చిత్తయగును. ఈ స్థితికి స్వరూప ప్రతిష్ఠయని పేరు. ఇదియే కైవల్యమని పాతంజలసిద్ధాంతమునందు నిరూపింపబడినది. దీనికి ప్రయోజనము. ఈ గ్రంథమునందు నిస్సందేహముగను సవిమర్శముగను ప్రతిపాదింప బడినది.

"యోగతారావళి" యందు పేర్కొనబడిన బంధత్రయములు (ఓడ్యాణ, జాలంధరమూల బంధములు) అలర్కునికి చెప్పిన యోగవిధానమున సూచింప బడినవి. జన్మౌషధిమంత్రతపః సమాధిజాః సిద్ధయః పా - యో - సూ - 4 - 1

కేవల కుంభకరూపకమగు రాజయోగము కార్తవీర్యార్జునునకు బోధించిన సందర్భమున ప్రస్తావింపబడినది. ఇందు చెప్పబడిన అమనస్కయోగము అను, మనోన్మనీ స్థితిని నిర్వికల్ప సమాధిగా ఈ గ్రంథము నందు వర్ణింపబడినది. ఈ నిర్వికల్ప సమాధియే గగనస్థితియనియు, అజాడ్య నిద్రయనియు, యోగనిద్ర యనియు, యోగతారావళి యందు విపులముగా వర్ణింపబడినది. ఈ విధముగా పాతంజలము, యోగతారావళి మున్నగు గ్రంథముల యందు నిరూపింపబడిన, సూచింపబడిన, అనేకయోగ విద్యారహస్యములను అధికారులకు అనుగుణముగా ప్రస్తావించి ఈ గ్రంథము నందు అధ్యాత్మతత్త్వావగమనమునకు మార్గముగా నిరూపించుట జరిగినది. - ఏమార్గమున ప్రవర్తించినను పరమ ప్రయోజనము లక్ష్యము కైవల్యముగావున తత్సాధనమునకు తగిన ప్రయత్నము ఇందు వర్ణింపబడినది. ఈ గ్రంథమునందు దత్తాత్రేయ స్వామి కార్తవీర్యార్జునునకు యోగోపదేశ మొనర్చుట యేగాక ఆతనిచే అభ్యాసము చేయించి సమాధిస్థితి కలుగునట్లుగా అనుగ్రహించుట విశేషము, సమాధి స్థితి నుండి దిగివచ్చిన కార్తవీర్యార్జునుడు తాను పొందిన ఆనందానుభూతిని వర్ణించుటయు ఇందు నిదర్శనముగా కానవచ్చుచున్నది. సమాధిస్సవికల్పస్తు నిదిధ్యాసనముచ్యతే

దత్తమాహాత్మ్యము - 3వ అంశ - 9వ అధ్యాయము - 62వ శ్లోకము

" సమాధి సిద్ధిరీశ్వర ప్రణిధానాత్" అను యోగసూత్రమును బట్టి సమాధివిశేషములు యోగులు రెండు విధములేయనినారు,ప్రాణాయామ విశేషముచే గాని భావోద్రేకముచేగాని అద్భుతమగు దివ్యదర్శనముల చేతనుగాని మనస్సు నిశ్చలమైనివాతదీపమువలెనున్న సమాధికలుగును. భావసమాధుల కంటెపై స్థాయికి చెందినవే సవికల్పక నిర్వికల్పక సమాధులు. ఈ సమాధుల విషయమున ఎట్టి విప్రతిపత్తులు లేవుగాని అద్వైతదర్శనమున చూపినసమాధులు ద్వైతులైన యోగులు చూపిన వాని కంటె కొంచెము విలక్షణములు. ఇవి ఆరువిధములు. - అద్వైతులు సాయుజ్యముక్తి నొప్పెదరుద్వైతులు సాలోక్య సామీప్యసారూప్యముక్తులను మాత్రమే జెప్పెదరు. కాన ముక్తులలో కూడా భేదము కలదు. ఈ భేదము తెలియనివారు సంప్రజ్ఞాత నిర్వికల్ప నిర్బీజసమాధులు ఒక్కటేయని అసంప్రజ్ఞాత, నిర్వికల్ప నిర్బీజసమాధులుఒక్కటేయని తలంచెదరు. ఇది సరికాదు.

అద్వైతులు : - సవికల్ప సమాధి అంతరదృశ్యానువిద్ధము అంతర శబ్దానువిద్ధము అని రెండు విధములు. నిర్వికల్పసమాధి బాహ్యాదృశ్యానువిద్ధము బాహ్యశబ్దానువిద్ధము బాహ్యానిర్వికల్పసమాధి. సరస్వతీరహస్యోపనిషత్తు నందు దృగ్దృశ్యవివేకమునందు సర్వవేదాన్తసారసంగ్రహము నందు ఈవిభాగము కలదు.

కామాది వృత్తులు దృశ్యములు వీనికి నేను సాక్షిని దృశ్యమునంతయు తనయందణచుకొని తనను, తాను చూచుకొనెడి సమాధి ఆంతరదృశ్యానువిద్ధము.

దృశ్యమును తనయందణచుకొని నేను స్వప్రకాశుడను జ్ఞాన స్వరూపుడను, ద్వైతవర్జితుడను సదానందుడను అనునట్టిసన్మాత్రమగు ఆత్మను పట్టుకొనగల ఆత్మస్వరూపమును బోధించు శబ్దములతోవస్తువును హృదయమున భావనచేయుట ఆంతరశబ్దాను విద్ధము.

సచ్చిదానందలక్షణమగు వస్తువును సంతతము చింతనము చేయుటచే తన్నుతానెఱిగి దృశ్యము శబ్దము అను స్ఫురణములేక నీటిలో పడిన ఉప్పుకల్లు నీరయినట్లగుట నిర్వికల్ప సమాధియగును.

తెల్లదనము చల్లదనము ద్రవత్వము లను ఈమూడును నీటి గుణములు ఇవన్నియు కలిపి కెరటము అన్నట్లే, ఉనికియు, ఎఱుకయు, ప్రేమయు బ్రహ్మస్వరూపము దీనియందు నామరూపముల - ధ్వస్తములు, సాధకుడు వస్తువులన్నింటిని నామరూపములను బ్రహ్మమునందే విలాపన మొనరించి నేను నామరూపాధిష్ఠానమను కొనినిర్వృత్తి కమగుట బాహ్యాదృశ్యానువిద్ధము.

సచ్చిదానందలక్షణమును సంతతము చింతనము చేయుచు, ఈ ప్రపంచము నాకు అధిష్ఠానమై నదిదియే యని తెలివి బాహ్యశబ్దానువిద్ధము ఇందు జ్ఞాతృజ్ఞేయ జ్ఞానములనెడి త్రిపుటికల్గదు కావున సవికల్ప సమాధి కంటె పెద్దది నిర్వికల్ప సమాధి మనకంటె కొంచెము తక్కువది కాన సవికల్ప సమాధి భేదమన వచ్చును.

బ్రహ్మానందరసావేశము కారణముగా బాహ్యప్రపంచము ఉన్నటులేటుగక బ్రహ్మస్వరూపత్వముతోనేకత్వమును పొందుట బాహ్యానిర్వికల్పసమాధి. ఇట్లివి అద్వైతానందముతో పూర్ణములై యుండుట విశేషము. ప్రశాంతవృత్తికం చిత్తం పరమానందదీపకం అసంప్రజ్ఞాతనామాయం సమాధిర్యోగినాంప్రియః. ముక్తికోపనిషత్తు - 7 - 14

శ్లో॥ అస్తిభాతి ప్రియం రూప నామచేత్యంశ పంచకం
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపంతతోద్వయం
ఉపేక్ష్య నామరూపే ద్వే సచ్చిదానంద తత్పరః

శ్లో॥ సమాధిం సర్వదాకుర్యాత్ హృదయేవాఽథవాబహిః
సవికల్పోనిర్వికల్పః సమాధిర్ద్వివిధోహృది
దృశ్యశబ్దానుభేదేన సవికల్పః పునర్ద్విధా

శ్లో॥ కామాద్యాశ్చిత్తగాదృశ్యాస్తత్సాక్షిత్వేనచేతనంధ్యా యేద్దృశ్యానువిద్ధోయం సమాధిస్సవికల్పకః
అసంగసచ్చిదానంద సత్ప్రభోద్వైతవర్జితః అస్మీతిశబ్ద విద్ధోయం సమాధిస్సవికల్పకః
స్వానుభూతిరసావేశాత్ దృశ్యశబ్దాను పేక్షితః నిర్వికల్ప స్సమాధిస్స్యాన్నివాతస్థితదీపవత్
హృదివాబాహ్యదేశేపియస్మిన్కస్మింశ్చవస్తుని సమాధిరీదృక్సన్మాత్రో నామరూపపృధక్కృతిః
స్తబ్ధీభావోరసాస్వాదాత్తృతీయఃపూర్వవన్మతః ఏతైస్స మాధిభిష్షడ్భిః నయేత్కాలంనిరంతరం
దేహాభిమానేగళితే విజ్ఞాతే పరమాత్మని యత్రయత్ర స్వయంయాతి తత్ర తత్రపరామృతమ్

సరస్వతీరహస్యోపనిషత్తు

## 15వ అధ్యాయము

# సగుణ మూర్తి దత్తదేవుడు

సప్త కోటి మహామంత్రాలు, వేద పురాణేతిహాస, మంత్రశాస్త్ర, జప, పూజా, న్యాస, పురశ్చరణ, ఖండాది గ్రంధాలందు, ప్రతిపాదితములు. మంత్రము లన్నియు గణపతి, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది, వివిధ దేవతాద్యోతకములై అలరారినవి. రుచులవైవిధ్యమే దేవతా బాహుల్యమునకు కారణము. అందరికినీ ఒక్కదేవుడే సేవ్యుడు, గమ్యుడును అగుచున్నాడు. ఋజువుగానూ, కుటిలము గాను, మార్గములలో నెట్లు పయనించినను చేరదగిన హస్తిపురి ఒక్కటియే సమస్త నదీ, నదో,దకములకు సముద్రమే గమ్యమయనట్లు శివుడే చేరదగినవాడు అని మహిమ్నస్తోత్రమున పుష్పదన్తుడు విశదీకరించినాడు.

**రుచీనాం వైచిత్ర్యాత్ ఋజుకుటిలనానాపథజుషాం ।**
**నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవఇవ ॥**

వివిధ మంత్రోపాసనలు, తత్తదుపాస్యదేవతలు బహు విధములుగా కన్పట్టి నను ఇందు హెచ్చు తగ్గులు ఏమీ లేవు. కొన్ని మంత్రములలో, దేవతా నామములు కన్పట్టును. కొన్నింటిలో, దేవతానామము లేకుండగనే యుండుట, ఏకాక్షరి, మొదలుకొని, మాలా మంత్రముల వఱకును గోచరించును. కొన్ని మంత్రములు కేవల బీజాక్షరములతో ప్రణవాదులై యుండును. ప్రతిమంత్రము నకు, ఋషి, ఛందస్సు, దేవత, ధ్యానశ్లోకము, జప, హోమ, పురశ్చరణాదులతో సిద్ధియగు క్రమము నిర్దిష్టమై ఉన్నది. ఉపాస్యదేవత ఏదైననూ, అన్నీ సగుణ, నిర్గుణ, తత్త్వోభయాత్మకములు గానే ధ్యానము చేయదగినవిగా యున్నవి. ఇక పంచ ప్రణవములు, ఓం, ఐం, హ్రీం, శ్రీం, క్లీం అనునవి. బీజాక్షరనిఘంటువును బట్టి సగుణ, నిర్గుణ, ధ్యానా త్మకములుగానే కలవు. చదివినట్టి మంత్రమునకు అర్థము తెలిసియే ఉపాసన చేయవలెను. గాని అర్థము తెలియకపోయినచో, అది త్వరగా ఫలితమును ఈయలేదు.

**యదధీతమవిజ్ఞాతం నిగదేనైవశబ్ద్యతే ।**
**అనగ్నావివశుష్కైధః న తజ్జ్వలతి కర్హిచిత్ ॥**

అని మహాభాష్యకారుడు పతంజలి వచించియున్నాడు, అర్థసహితమగు అధ్యయనమే ప్రకాశించును, అర్థము తెలియని, కేవలాధ్యయనము పశుపక్ష్యాదు లకు సంబంధించిన అవ్యక్తవాక్కుల వంటిదేకాగలదు, ఎంత ఎండిన కట్టె అయి నను, అగ్ని లేనిచోటబడినచో, జ్వలింపదుగదా! అని పై శ్లోకమునకు అర్థము. ఏ వర్ణమును ఉచ్చరించినప్పటికిని నాద, బిందు, కలా, శక్తి, శాన్తములు అనుస్యూతము లగు చుండును. ఇవిలేకుండ ఉచ్చారణమే సంభవింపదు, ఉదాహరణమునకు, ఓంకారమున ఆకార, ఉకార, మకార, నాద, బిందు, కలా, శక్తి, శాంతములు ఏడును భాసించుచున్నవి. సాధకుడు క్రమముగా సాధనము చేయగా మనసు శక్తి శాంతములందు పర్యవసానము చెందును. చివరకు శాంతస్థితికి చేరి ధ్యాన, ధ్యేయ, ధ్యాతలనెడి త్రిపుటి నశించగా అద్వైతమున సుప్రతిష్ఠితమగును. "అదృష్టమ వ్యవహార్య మగ్రాహ్యమలక్షణమచింత్యమవ్యపదేశ్యమేకాత్మ ప్రత్యయసారం ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః॥ అని మాండూక్యోపనిషత్తు, శాంతమేతురీయము, అద్వైతము అని వర్ణించినది.

విష్ణువు బాహ్యాకారము, శివుడు, అభ్యన్తరుడు. హృదయదేశమున శివ విష్ణువులు ఒకే ఆకారము అన్తర్బహిర్దేశముల కీర్తింపబడినారు, కావుననే

**"బాహ్యాభ్యన్తర సంస్థితం పరశివం ప్రాణేశ్వరం భావయే,**
**అన్తర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః ॥**

అనునట్టి ప్రమాణములు ఇద్దరినీ ఒక ఆకృతినిగా చేసి వర్ణించినవి. ఒకే వ్యక్తికి రెండు ఆకారములు, బాహ్యాభ్యంతరములుగా నిర్వర్ణించుట సహజముగా పొసగుచున్నవి కాన హరిహరాద్వైతము సిద్ధము.

**కృతే శ్రీ దక్షిణామూర్తిః । త్రేతాయాందత్తదేశికః ॥**
**ద్వాపరేవ్యాసభగవాన్ । కలౌ శ్రీశంకరో గురుః ॥**

అనెడి పురాణోక్తిని బట్టి కృతయుగమున దక్షిణామూర్తి, త్రేతాయుగమున దత్తాత్రేయుడు, ద్వాపరయుగమున, వ్యాసభగవానుడు, కలియుగమున, శ్రీ శంకరాచార్యులు, నల్వురు గురువులు. ఇందు దక్షిణామూర్తి శంకరులు, శివావతారములు కాగా, దత్తదేవుడు, వ్యాసభగవానుడు విష్ణువు అవతారములు ప్రసిద్ధులు, అందును దత్తదేవుడు యోగాదేశమునకై అవతరించినట్టివాడు, యోగంబమరకున్న నొదవోదు విముక్తి॥ అనెడి దత్త భాగవతవచనానుసారము. జ్ఞానానికి సోపానము వంటిది యోగము కాన, ఈ అవతారమునకు అత్యంత ప్రాముఖ్యము కల్గినది. దశావతారములు స్పష్టములు. ఉపరి 11వ అవతారము, దత్తదేవుడు, 12వది జ్ఞానావతారము, వ్యాసునిది. అని మత్స్యపురాణము. ఈ పురాణము కూడా, పై విషయమును సమర్థించుచు సంవత్సరములోని 12 నెలలు 12 మూర్తుల జయన్తులను జరుపుకొని మానవులు తరింపవలెననియు, విష్ణ్వవతారమూర్తి పూజావిధానములకై పంచాంగములందు ఆయాకాలములందు చేయదగిన కృత్యము లను నిబంధించుట జరుగుచున్నది. సాధకులకు సాధనోపాయములతో బాటు జ్ఞానావస్థానుభూతిని కూడా తత్తద్భక్తులకు అనుగ్రహించినట్లు దత్తకథాంశములలో పస్తావనకలదు. నిరుపద్రవముగు యోగమును వినిర్దేశించుట కొఱకై అనసూయా త్రులు బ్రహ్మవిష్ణుమహేశ్వరులను పుత్రులనుగా వరము కోరినట్లు అచ్చటి కథాంశమున స్తుతింపబడినది. అవతారకృత్యములు అయిన తరువాత, విష్ణువు వైకుంఠమును చేరినట్లు కొన్ని అవతారములలో కన్పట్టును, అవతారకృత్యము లాచరించిన తరువాత కూడా,

చెరగిపోని ముద్రలతో కొన్ని అవతారమూర్తులు కానవగుదురు. అట్టి మూర్తులలో దత్తాత్రేయుడు ముఖ్యుడు. నేటికి కూడా వివిధ రూపాలతో వివిధ నామాలతో గురువై ఉపాస్యుడగుచున్నట్లు తద్భక్తుల భావనము. ఒకొక్కప్పుడు మంత్రదీక్ష నొసంగు మనీషి దుర్లభుడైనచో సాధకుని తీవ్రమగు శ్రద్ధ చేత ధ్యానించబడు దేవతయే స్వప్నసాక్షాత్కారమిచ్చి స్వమంత్రోపదేశము కావించినట్లు ఏతద్భాగవతరచయిత వలన ఏతద్గ్రంథ కర్తృవ్యయముగా వినుట జరిగినది. గురు దేవతల యందు వలె మంత్రమునందును శ్రద్ధ అత్య వసరము, మంత్ర గురుదేవతలందెంతెంత విశ్వాసము పెరుగునో అంతంతగా సాధకుని మనస్సు శుద్ధమగు చుండును. చిత్తశుద్ధి వలన ధ్యేయమునందు అవిచ్ఛిన్న తైలధారవలె సమానజ్ఞానసంపత్తి కల్గి ముక్తి సమీపవర్తియగును.

ఇక పేరును బట్టి సత్త్వరజస్తమోగుణములణగి, గుణవంతుల యందు దోషావిష్కారము లేకుండెడి. మనస్సు కలిగిన వానికి విష్ణువే స్వయం ప్రదత్తుడగు చుండునని దత్తనామము తెలియజేయుచున్నది. అనేక జన్మ సంసిద్ధిచేత నేముక్తి కలుగును, శ్రుతియు కేవల కర్మమే గాక, ఉపాసన, తదుపరి జ్ఞానము, జ్ఞానము చేతనే పునరావృత్తి రహితస్థితి కలుగునని వచించుచున్నది. అజ్ఞానమునకు, "త ద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్సమి త్పాణిశ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్మని, శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడు అయిన వానినే గురువుగా నెంచుకొనవలెనని, అతని వలననే ఆత్మానాత్మ వివేచనరూపమగు పరోక్షాపరోక్ష బ్రహ్మ సాధింపవలెనని శ్రుతి వాక్రుచ్చినది. వేద, వేదాంగములు సాంగోపాంగమునధ్యయనము చేయుట, తద్వేదోక్తమగు సమ్యగాచరణము, ఈ దత్తగురువునందు చక్కగా రెండును సమన్వితములగుచున్నవి. ఇట్లు యోగాదేశావతారుడై దేవతగానూ, యోగమూలకా ద్వైత, స్థితియే మానవులకు సమ్పాదింపతగినదనెడి ఉత్తమోపదేశము చేసిన గురు మూర్తిగానూ, ఈ దత్తదేవుని మంత్రము కూడా, సగుణ, నిర్గుణాత్మకముగా నందరిచే ఉపాసింపబడుటను నిర్దేశించు చుండుటను బట్టి సగుణ మూర్తులలో దత్తదేవునికి కల స్థానము అద్వితీయము, గురుమంత్రదేవతైక్యము ననుసంధా నించి పూజించుట ఈ అవతారమున సులభమగుట చేతను శీఘ్రవర ప్రదుడగుట చేతను ఇట్టి దత్తదేవ సగుణమూర్తి ధ్యానమే సదా కర్తవ్యము.

ఆ॥ **దత్తనేత్రుడవుచు దత్తద్భువనముల నరయుచుండు బవలెవరుపిలుతురో**

**యని సమాధి బాసి యూగతుండవు బ్రోవ రాత్రిబిలుచు వారి యాత్రములకు**

ముముక్షువుల తత్త్వజ్ఞానమున కలిగెడి ప్రతిబంధకములను పోగొట్టుటకై ఒత్రింబవళ్లు సమాధిని, తాను విడిచి దత్తనేత్రుడవుచూ భక్తపరిత్రాణమునకై ల్లపుడు ఎదురు చూచుచుండెడి దత్తదేవుడే ముముక్షువులకభ్యర్థనీయుడు.

# 16వ అధ్యాయము

# కలికల్పములు దత్తాత్రేయ పరశురామావతారములు-అన్యపురాణ గాథలు

విష్ణువు యొక్క అవతారములు అనేకములు. అందు పండ్రెండు వతారములు ముఖ్యములు, వీనిలో పది అవతారములు ఆబాలగోపాలమెరిగినవి. వి దుర్వాస మహర్షి శాపముచే కలిగినవి. దుర్వాసుడొకపు అంబరీషుని వద్దకు ళ్లెను. ఆరోజు హరివాసరము ద్వాదశీతిథి. ఏకాదశినాడు విధి విధానముగా ష్ణుపూజను, ఉపవాస, జాగరణములను ఆచరించుకొనెను. అంబరీషుడు ్వాదశిపారణము చేయుటకు ఉద్యుక్తుడై యుండెను. దుర్వాస మహర్షిని చూచి ారవించి ఆతిథ్యమునకు రమ్మనెను. నేనిప్పుడే నదీతీరమున అనుష్ఠానమును గార్తి చేసికొని వెంటనే రాగలనని దుర్వాసుడుచెప్పిపోయెను. అంబరీషుడు ునాటి ద్వాదశి తిథి అల్పకాలావశిష్టమై యుండుటవలన అతిథియైన దూర్వాసునికై దురు చూచెను. ద్వాదశి గడియలలో పారణము చేయకున్న హరివాసరము తిక్రమింపబడును. అతిథిని పిల్చిఆతడు రాకుండ భోజనము కావించుటయు తిక్రమణమే అగునని ఆలోచించి, మహర్షి శాపమునైనను అనుభవింపవచ్చును ని, ద్వాదశిపారణము మాత్రము విడువరానిదని నిర్ణయించుకొనెను. కొంచెము లమును, హరికి, నివేదించి నివేదితజలముతోనే పారణము చేసెను. కొంత మయమునకు దుర్వాసుడు వచ్చి జలముతో పారణము నన్ను అతిక్రమించి సితివని రాజర్షిపై కోపించి శపించెను. మీనము, కూర్మము, వరాహము, ారసింహము, వామనుడు, జ్ఞానములేని క్షత్రియుడవు, క్రూరకర్ముడగు గాహ్మణుడు రాజ్యార్హత లేని క్షత్రియుడు, పాషండుడు, బ్రాహ్మణ హింస చేసెడి గాహ్మణుడవుగాను జన్మింపుమనెను. అంబరీషుడు మహర్షిని అతిక్రమించి సితివని శ్రీహరిని శరణు పొంది విష్ణుమయుడై శరీర భానము లేకుండా శాపము

లను వినలేదు. దుర్వాసుడు అంతటితో ముగింపక మరల శపింప బూనుటన్ చూచి అంబరీషునిపై ఆవహించియున్న శ్రీహరి సుదర్శన చక్రమును తిట్టుచున్న దూర్వాసునిపై ప్రయోగించెను. దుర్వాసుడు ఆ చక్రపు మంటలకు పారిపోయి ముల్లోకములు తిరిగి రక్షకుని గానక విష్ణుని ఆజ్ఞతో అంబరీషుని శరణు పొందెను. అంతవఱకు శ్రీహరి ధ్యాననిమగ్నుడైన అంబరీషుడు, సుదర్శనుని విష్ణువును ప్రార్థింప దూర్వాసుని సుదర్శన చక్రము నుండి రక్షించెను. అప్పుడు శ్రీహరి నా భక్తుని గూర్చి చేసిన శాపములనన్నింటిని నేను అవతరించి అనుభవించెదననెను. శ్రీహరి దశావతారములకు మూలము దుర్వాసశాపమే అని స్కాందపురాణ గాథ - ఒకప్పుడు భృగుమహర్షి ఆశ్రమమున లేనపుడు విష్ణుభయార్థితులై రాక్షసులు భృగుపత్నిని శరణు పొందిరి. విష్ణువు రాక్షసులవెంటనంటి భృగ్వాశ్రమమున దాగి యున్న రాక్షసులను బైటకు పంపుమని భృగుపత్నినడిగెను. శరణాగతులను వధింపజేయుట తగిన పనికాదని శరణాగత త్రాణమునకై భృగుపత్ని రాక్షసుల జాడను చెప్పలేదు. విష్ణువు అందులకు భృగుపత్నిని చంపి రాక్షస వధ చేసెను. భృగుమహర్షి దుర్భర పత్నీ వియోగముతో బహుకాలము, నావలె దుఃఖించెదవని వివిధముగా శ్రీహరిని శపించెనని తత్కారణముగానే విష్ణువిట్టి అవతారములను ఎత్త వలసి వచ్చెనని పురాణాంతరగాథయు కలదు. ఇట్లే అవతారములు శాప మూలకములుకాగా 11వది. దత్తాత్రేయావతారము 12వది వ్యాసావతారము ఈ రెండును జ్ఞానావతారములుగా కన్పట్టుచున్నవి. అసలు అవతారము అనగా జ్ఞానావస్థ నుండి క్రిందికి దిగివచ్చుట అని అర్థము. సాధుజన సంరక్షణము, దుష్టజన శిక్షణము, ధర్మసంస్థాపనము, అను మూడు ప్రయోజనములు కలిగి యుగయుగమున సంభవించుచుండునని శ్రీకృష్ణుని భగవద్గీతా శ్లోకముల వలన తెలియుచున్నది. అవతార ప్రయోజనములయిన తరువాత మహావిష్ణువు వైకుంఠము నలరించినట్లు పురాణములలో కన్పట్టుచున్నది. ప్రస్తుత దత్త భాగవతమున దత్తాత్రేయావతారము ఆమూలాగ్రముగ వర్ణింపబడినది. ఇయ్యది యోగప్రతిబంధకము లను నివారించి తత్త్వ జ్ఞానమును భక్తులకు ఉపదేశించి తరింప జేయుటకు నైన అవతారముగా కన్పట్టుచున్నది. ఇందు దత్తదేవుడు విష్ణుని అవతారముగా ఎందు ప్రసిద్ధమైనది. అతని అవతార కృత్యము లేమేమి అని దీపకుని ప్రశ్న మొకటి కలదు. వేదధర్ముడు పై ప్రశ్నమునకు సమాధానముచెప్పుచు, ఈ దత్తావతారము

శ్రీమద్భాగవతమున 2,3,4,7,11 స్కంధములలో సంగ్రహ రూపముగా చెప్పబడినది. మత్స్య పురాణములో విభూతి ద్వాదశీ వ్రతమొకటి ప్రస్తావించబడినది. పన్నెండు నెలలు విష్ణుని అవతార మూర్తులను నెలకొక్కటి చొప్పున పూజింపవలెనని మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, దాశరథి, పరశురామ, కృష్ణ, బుద్ధ, కల్కి అను దశావతారములతో బాటు 11వది దత్తాత్రేయావతారము 12 వది ముసలాయుధ ధారివ్యాసావతారమును అర్చించవలెనని ఇదియే విభూతి ద్వాదశీవ్రతము మత్స్యపురాణోక్తి మూలగ్రంథమున దత్తమాహాత్మ్యమునందు అనువదింపబడినది. మరియు అవతార కృత్యములు ఇతర మన్వంతరములలో దత్తాత్రేయుడు సప్తర్షులలో నొకడుగా వర్ణింపబడినాడు.

శ్లో॥ భూయోభూతాత్మకోవిష్ణుః ప్రాదుర్భావోమహాత్మనః
దత్తాత్రేయ ఇతిఖ్యాతః క్షమయా పరయా యుతః

శ్లో॥ తేన నష్టేషు వేదేషు క్రియాసు చ మఖే షు చ
చాతుర్వర్ణంతు సంకీర్ణం ధర్మే శిథిలతాం గతే

దత్తమాహాత్మ్యము - 4వ అంశ - 5వ అధ్యాయము - 18, 19 శ్లోకములు.

శ్లో॥ హతయజ్ఞాః క్రియాః వేదాః ప్రత్యానీతాహితేనవై
చాతుర్వర్ణ్యమ సంకీర్ణం కృతంతేన మహాత్మనా

శ్లో॥ ఋషిత్వం తస్యదేవస్య తథాన్యస్యమహాత్మనః
దత్తోనిశ్చ్యవనః స్తంభః ప్రాణః కశ్యప ఏవచ
ఔర్వోబృహస్పతిశ్చైవ సప్తై తే ఋషయః స్మృతాః
దేవాశ్చతుషితా నామస్మృతాః స్వారోచిషేఽంతరే

దత్తమాహాత్మ్యము - 4వ అంశ - 7వ అధ్యాయము - 5,6,7 శ్లోకాలు

ఇట్లు దత్తదేవుడు, అవతారములలోనేకాక ఇతర మన్వంతరములలో సప్తర్షులలో నొకడుగా ప్రసిద్ధినొందినవాడు, అని పై శ్లోకములవలన తెలియుచున్నది. సూత విష్ణుదత్త శౌనక దీపక వేదధర్మ వేదశర్మ అలర్క, కార్తవీర్యార్జున, యదు,

---

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే

ప్రహ్లాద, సిద్ధ దేవేంద్రాదులను, చాంఢ్రుక, పింగళ నాగాది సాధుజన సంరక్షణము, హుండ, జంభాసురాది రాక్షసాదులవధలు యుద్ధము లేకుండగనే తన మహిమ చేతనే సంపాదించుటచే దుష్టశిక్షణము వేదములు తదుక్త ధర్మములు నష్ట ప్రాయములై యుండగా వేదోక్తకర్మలను చాతుర్వర్ణ్యమును ధర్మోత్తరముగా సముద్ధరించుటచే ధర్మసంస్థాపనము అను మూడు అవతార ప్రయోజనములు ఈ దత్తభాగవతమున సాకల్యముగా నిరూపింపబడినది. ఇక దత్తావతారము చాలించి స్వరూప స్థితినందుట పురాణాంతర దత్తచరిత్రలయందు, ఏతన్మూల గ్రంథము అగు దత్తమాహాత్మ్యమునందును లేకుండుటచే ఈ అవతారము పూర్వోక్తావతారములకంటె విలక్షణము. దత్తాత్రేయస్వామి భక్త సులభుడు సర్వాభీష్ట ప్రదుడనియు నిష్ప్రత్యూహమగుయోగమును ప్రతిబంధ విరహితమైన తత్త్వబోధలనొనర్చి భక్తులకు తరణోపాయముల నిర్దేశించుటవరకు గురుదేవుని అవతారముగా కన్పట్టును.

ఇక పరశురాముడు పలు పురాణములలో దశావతార ప్రసంగములు వచ్చిన చోటులందు మాత్రమే కానవచ్చుచుండును. సమగ్రముగా అవతార ప్రయోజనము, విష్ణువు పరశురాముడుగా అగుటకు తగిన కారణము ఈ గ్రంథమున కానవచ్చుచున్నది. కార్తవీర్యార్జునుడు, తనవధ విశిష్ట విక్రమవంతుని వలననే జరగవలెనని దత్తాత్రేయుని కోరినాడు. అసలు కార్తకీర్యార్జునుడు శ్రీ మహావిష్ణువు చేతిలోని సుదర్శన చక్రాయుధము. అది గర్వించిన కారణముగా విష్ణువు దానిని శపించెను. శాపవిముక్తి తనవలననే జరుగునని విష్ణువు నిర్దేశించెను, చివరి కాలమున కార్తవీర్యుని గర్వముచే మునులు సురులు బాధింపబడిరి. వారందరు కలసి విష్ణువు వద్దకు వెళ్లి తమబాధలు వివరింపగా నేనే పరశురామునిగా ఉద్భవించి కార్తవీర్యార్జును సంహరించెదనని మాట ఇచ్చెను. పిదప బదరి కాశ్రమమునకు విష్ణువు వెళ్లి భృగుమహర్షి తనకోడలి గర్భమునకై ఏర్పాటు చేసిన చెరువులో ప్రవేశించినాడు. రేణుకా జమదగ్నుల పుత్రుడై నట్లిందభి వర్ణింపబడినది. కార్తవీర్యుని వధసామాన్యమైనది కాదుగనుకనే పరశురాముడు శివుని గూర్చి ఘోరతపముగా వించి తదనుగ్రహపాత్రుడై గండ్రగొడ్డలిని ఆయుధముగా ధరించినాడు. కార్తవీర్యుని వధతో పాటు గర్వించిన దుష్టక్షత్రియ సంహార రూపమగు దుష్టశిక్షణము. అకృత ప్రణాది మునులను సంరక్షించుటయే శిష్టరక్షణము పరశురాముడు తమ తలిదండ్రుల ఆజ్ఞచే స్వర్ణమయమైన పత్నిని

గూర్చుకొని అశ్వమేధాది మహాయజ్ఞములను అనుష్ఠించెను. యజ్ఞములందు దత్తాత్రేయుడు కాశ్యపుడు ఆర్త్విజ్యము వహించిరి. తరువాత కాశ్యపునికి తాను గెల్చిన భూమినంతటిని దానముచేసెను. కావున తపోయజ్ఞవ్రతాదుల నాచరించుట అనెడి ధర్మ సంస్థాపనము కూడా ఈ అవతారమున చేయబడినది. దత్తాత్రేయుడు పరశురామునకు రేణుకా మహిమము చెప్పుట కూడా ఇందుకలదు. ఇట్టి సందర్భములనుబట్టి ఈ రెండవ తారములు ఏక కాలమునందు సంభవించినవని చెప్పనొప్పును. మరొక విశేషము ఏమనగా దత్తాత్రేయావతారము వలె పరశురామావతారము సంక్షేపింపబడి విష్ణువు వైకుంఠమునందినట్లు ఎచ్చటను వర్ణింపబడలేదు. ముగింపు లేని అవతారములు అగుట వలననే భిన్నరూపములతో భక్తులను పరీక్షించి అనుగ్రహించు నపుడు నిజస్థితితో నుండి ధర్మరాజ శంకరాచార్యాదులకు దర్శనమిచ్చినట్లు వారి వారి చరిత్రలలో కాననగును.

ప్రహ్లాదా జగర సంవాదము, అవధూత యదుసంవాదము. హంసగీత అను కథాంశములు శ్రీ మద్భాగవత కథాంశములతో సంవదించుచున్నవి. పితాపుత్ర సంవాదము కుంజకపింజల సంవాదము, వేన చరిత్రము- నహుష చరిత్రము భారత కథాంశములతో పోలియున్నవి. ఏకాదశీ వ్రతము, భద్రశీలుని చరిత్రము పద్మపురాణకథాంశములతో సామ్యములుగా నున్నవి. ఎక్కువ కథాంశములలో దత్తదేవుని బోధలు మహిమలు లీలలు చోటు చేసికొని, ప్రధానమగు అద్వైతవేదాన్తసారమ అను స్యూతముగా అంతటా పాఱి యుండుటచే అద్వైత వేదాన్తసారమగు శ్రీ మద్భాగవతముతో ఏమాత్రము సామ్యమున తీసిపోనట్టి వేదాన్తశాస్త్ర గ్రంధరాజము దత్తభాగవతమని నా విశ్వాసము. వేయేల యోగాదేశావతారమని మూలము అనువాదములలో సుస్పష్టముగ దత్తుడే ఇట్లనెను.

శా॥ యోగాదేశకరుండనై విభుడనయ్యున్ సంతతాంతర్మహా
యోగప్రాభవుడత్రిమౌనికనసూయాగర్భమందర్భక
శ్రీ గాఢంబుగదోచియోగిచయముల్సేవింపగా నాత్మ సం
త్యాగాత్తంబగుదత్తనామమున సత్యాత్ముండనై యుండెదన్

దత్తభాగవతము - ప్రథమగుచ్ఛము - 67 వ పద్యము.

ఈపద్యమున స్వామి యోగాదేశావతారమని, అంతర్యాగప్రాభవముగల్గి అత్రి అనసూయలకు స్వయం ప్రదత్తుడౌటచే దత్తుడను సార్థకనామధేయమును, ధరించి యోగులు సేవింపగా సత్యాత్ముడై యుండునని మునులకు దత్తదేవుడే స్వయముగా బోధించెను. ఈ క్రింది పద్యమున దత్తదేవుని సగుణనిర్గుణ స్వరూపము నిర్దేశింపబడినది.

ఉ॥ **కావున నాది దేవుని అఖండు జిదాత్మ నశేషరూపు స**
**ద్భావుననూను,ద్వైత రహిత ప్రకృతిన్ స్వ సుఖానుభూతి సం**
**భావితు ప్రత్యగాత్మ పరమ ప్రభు నిత్యము సంశ్రయించి నీ**
**పావన నామరూపగతవర్ణననిట్లు కృతార్థుడయ్యెదన్.**

దత్తభాగవతము - 1వ గుచ్ఛము - 117 వ పద్యము

సూతుడు ధ్యానయోగమున దత్తుని ప్రత్యక్ష మొనరించుకొని స్తుతి చేసిన సందర్భములోనిదీ పద్యము. ఈ పద్యమున ద్వైతమున ఆదిదేవునిగాను. అద్వైతస్థితి యందు అఖండ స్వసుఖానుభూతి చిత్స్వరూప ప్రత్యగాత్మగాను సూతునిచే స్తుతింపబడినాడు.

**యోగపతి యోగ సిద్ధిద యోగాత్మ పరేశయోగయుద్యోగమ సం**
**యోగ వియోగాధిక సం త్యాగలసదమూర్తమూర్తి త్ర్యధినాథనతుల్**

దత్తభాగవతము - ప్రథమ గుచ్ఛము - పద్యసంఖ్య - 109

ఇది సూతముని నిగదితము యోగ సిద్ధిని ఇచ్చువాడు యోగాదేశావతారమని యోగాత్మకుడని సంయోగవియోగములెడలించువాడని దత్తదేవుని విశిష్ట గుణములిందు వర్ణితములు.

## 17వ అధ్యాయము

## లహర్యుత్త రైదంకవీయానుభూతి

ఉ॥ **చిత్తము సుస్థమై యొకటజేరి మహర్షులొకస్థనిత్యనై**
**మిత్తిక సత్క్రియాకృతులమేకొని లోకగురుల్ స్వధర్మని**
**ర్వృత్తివిచారశీలురయి వృత్తులనొత్తెడు వృత్తినెత్తియా**
**వృత్తికి జొచ్చుచోటయి నివృత్తి నెసంగిరి నిశ్చలాత్ములై**

దత్తభాగవతము - ప్రథమగుచ్ఛము - పద్యసంఖ్య 11

క్రియా యోగమునకు సమాధికి మనన నిధిధ్యాసనములకు ఏకాగ్రతా సాధనము ద్వారా మనోవృత్తిని లయింపజేయుట పరమ ప్రయోజనము వృత్తి లయమై నిర్వికల్ప సమాధిసిద్ధించినచో నివాత దీపస్థితికల్గును. సవికల్పక సమాధి వఱకు జ్ఞాతృజ్ఞేయభావము అను భూయమానమగుచుండును. ఆత్మా, నాత్మ విచారము చేయువానికి మనోవృత్తి విచారశీలమై ముంజేషీకన్యాయము చేత అనాత్మ తత్త్వములను నిరసించుచు పరమాత్మ ప్రవణమై ప్రసరించును. రజస్తమములు అణగుటచే కేవల సత్త్వము ప్రసన్నమై జీవేశ్వరాభేదము స్పష్ట మగును. మాయావరణ నాశమున బ్రహ్మాద్వైతము సిద్ధించును. ఈ మార్గమున ప్రవర్తించుటకు యోగమొకసాధనము కాగా నిదిధ్యాసము మరొక సాధనము - వాయుజయమెంతటి ఆవశ్యకమో మనోజయము అంతటి ముఖ్యము. వాయుజయము వలన నైనను సాధింపవలసినది మనోజయమే మనస్సునిరుద్ధ భూమిని చేరునంతవఱకు జాగరూకతతో అనుసంధానించుకొనవలెను ఏకాగ్రతను నిరంతరమభ్యసించుచుండవలెను చంచలయగు మనోవృత్తి క్షణములో విక్షేపమునందును యోగసాధనచేయువానికి ఏమాత్రము విక్షేపము కల్గినను కుంభకము నిలువదు. అట్లే మనోవృత్తి యు ఆగదు ఈ శరీరమునందున్న అన్తః కరణవృత్తి యోగ సాధనముచేత ప్రత్యఙ్ముఖ ప్రవృత్తి యందు అభ్యాసము కలది అగును. ఈ అభ్యాసదశయందు మాటి మాటికి పరాఙ్ముఖమగుచుండును. మరల నంతర్ముఖముగా ననుసంధానము చేయవలెను. ఈ మనస్సును క్రమక్రమముగా ధారణాస్థానములచేర్చి స్వరూపానుభూతికై యత్నించుచుండ వలెను పదవ ధారణాస్థానము చేరిన మనస్సు స్థిరమగును. భ్రూమధ్యము వఱకు గలది గువభాగమును కులమందురు. కులమనగా సమూహము. సర్వేంద్రియములు తద్విషయములు వీనికి సంబంధించిన సమూహమే ఈ కులము భ్రూమధ్యమును దాటినచో కులాతీత స్థితి కల్గును. కులమునందున్న మనోవృత్తి కులమును దాటి పరమాత్మను చేరును. ఇది ఆగమ సంప్రదాయరహస్యము. దీని నంతను అవగాహనమొనర్చుకొన్న శ్రీ శాస్త్రిగారు సహజమైన ఊహాపోహలతో కావ్యచమ త్కారమును జోడించి బుద్ధి వృత్తిని స్త్రీతో పోల్చిరమ్యముగా వర్ణించిరి. ఈ క్రింద ఉదాహరింపబడుచున్న పద్యముల సందర్భమును శ్రీ శాస్త్రిగారి ముఖమునుండియే వినుట జరిగినది. ఆ సందర్భమేమనగా శ్రీ శాస్త్రిగారు వారి అభ్యాసము ప్రకారము

ఒకనాటి తెల్లవారు జామున ప్రాణాయామము చేయుచుండిరి. షోడశ ప్రాణాయామముల అనంతరము క్రమముగా మనోధారణమొనర్చుచు సవికల్పక ధ్యానమభ్యసించుచుండిరి. ఆనాడు కొంత ఆలస్యమై తెలతెలవారవచ్చినది. శ్రీ శాస్త్రిగారు ధ్యానమగ్నులై యుండగా ఇరుగు పొరుగు వారి అలికిడి వినవచ్చినది. నిగృహీతమైన చిత్తము క్షణములో విక్షిప్తమైనది. అప్పుడే ఈ క్రింది పద్యము స్ఫురించినదట.

**ఆ॥ మలయుచునూరివారు మాటు మడగకున్న పురుషుడున్నయింటిపొరువుపోదు**
**చీమచిటుకుమన్న చిడిముడిపడివచ్చు నెంతమానవతియో యింతిమిన్న**

దత్తభాగవతము - 12వ గుచ్ఛము- పద్యసంఖ్య 118

ఇటు నటుమసలుచున్న ఇరుగుపొరుగు వారందరు క్రమక్రమముగా మాటుమణగనిదే ఆ కాంత తన భర్తయున్న మందిరము వైపు కూడా చూడదట. నిభృత నిశ్చల నిర్వికార వివిక్త క్షణమున ఎప్పుడో నాథుని చేరబోవును. చీమచిటుకుమన్న అలికిడి ఐనను క్షణమైన నిలువక సంభ్రమముపాటుతో ఈ వలకు వచ్చును. ఈ అమ్మాయికి ఎంతటి సిగ్గో ఎంతటి అభిమానమో అనగా ఈ మనోవృత్తి ఈ ఊరియందలి అనగా శరీరమందలి ఇంద్రియములన్నియు ప్రత్యాహృతములై మాటు మణిగిననే కాని అంతర్ముఖయై ఈశ్వరుని సమీపింపదు. ఏమాత్రము ఇంద్రియ జ్ఞానమంకురించినను మనోవృత్తి పరాఙ్ముఖయై ప్రకృతిస్థయగును. ఈశ్వర జ్ఞానానందానుభూతి తడపడుటచేతనే చిడిముడిపాటు కలుగును. నిరంతరాభ్యాసముచేత మనోవృత్తి విక్షేపవశమున దేహమందు ప్రవర్తించి నను మరల వెంటనే ఈశ్వరాభిముఖముగా కదలును. దృఢాభ్యాసముగల యోగి చూచుటకు దేహాభిమానముకల వానివలె కానిపించినను క్షణములో ఆతని మనస్సు ఈశ్వరానుసంధాన ప్రవణమగును.

**కం॥ ఇటు చూచుచునటు చూచుచు నటించు నిందున్నయట్లు నర్మము చెడనీ**
**దెటు నేర్చెనొకొ యబలయిం తటి నైపుణినా హరించుతనమధ్యతతోన్**

దత్తభాగవతము - 12వ గుచ్ఛము - పద్యసంఖ్య 119.

నైపుణ్యముగల కాంతనాథుడున్న మందిరమునందు ఎవ్వరికిని తెలియకుండా ప్రవేశింపగోరినదై ఇటునటు చూచుచు ఎవరికి వారు ఏపనులయందో నిమగ్నులై యుండగా ఒక్క క్షణము ఆగదిలోనికి ప్రవేశించి నాథుని పరామర్శించి మరల నంతలోనే ఈవలకు వచ్చి ఈవలనే యున్నట్లు నటించినట్లుగా ఈశ్వరానుసంధానాభ్యాసముగల చిత్తవృత్తియు దేహేంద్రియసన్నికర్షమున ప్రవర్తించుచున్నట్లు కన్పట్టుచునే ఏవృత్తి సంధియందో లిప్తకాలము ఈశ్వరుని నావించి దిగివచ్చునని ఇందు వర్ణింపబడినది. శ్రీశాస్త్రిగారి యొక్క మానసికానుభూతికి దర్పణములనదగినవి. ఈ రెండు పద్యములు ఇట్టిదే మరొక్కటి కలదు.

వం॥ కులముద్యజించి యొక్క కురుకుల్యకులాంగన పూరుషున్ పరుం
గలిసి రసప్రసారమధికంబుగ రేపవలంచునెంచకు
జ్జ్వల మగుమూర్తి మేనుమఱువన్ జగమున్నది లేదనంగొనం
గలదె తదాప్తికిం గలసుఖాలిదొలంగి మునుల్తపింపగన్

దత్తభాగవతము - 12వ గుచ్ఛము - పద్యసంఖ్య 120

ఒక్క కులకాంతకులమర్యాద నతిక్రమించి పరపురుషుని చేరబోయిన న్న సందర్భము అసభ్యమై విరుద్ధముగా గోచరించినను ప్రకృత సందర్భమున ఈ యుద్ధము ఆధ్యాత్మిక పరమై హృదయం గమమగుచున్నది. కులము నందు నగా శరీరమందున్న బుద్ధియను కాంత ధారణాస్థానానుగతమై భ్రూమధ్యమున గిచి అకులమునుత్యజించి పరుడైన పురుషుని అనగా పరమపురుషు పొంది నందానుభూతి అనగా దివానిశాభేద మెఱుగక సమాధిస్థితితో దేహాభిమాన ఎజ్జగింపగా ఈ ప్రపంచము ఉన్ననేమి ఊడిననేమి ఎవ్వనికి కావలయును అట్టి శిక్షితయగు బుద్ధి వృత్తికొఱకే మునులందరు సర్వ సుఖములను విడిచి పించుచున్నారు. ఇట్టి అనుభూతులు అనేకములు సందర్భాను సారముగా శ్రీ స్త్రిగారి రచనలయందు అందందు కానవచ్చును. వీనివలన శ్రీశాస్త్రిగారి మభూతియు, ఆత్మీయతయు, యోగాభి నివేశము, తత్త్వావబోధమును మరాకుపై నీటి బొట్టువంటి నిర్లేపస్థితియు, సువ్యక్తములగుచున్నవి.

## 18వ అధ్యాయము

# హ్రీశ్శక్తి - ధర్మసూక్ష్మములు

హృదయమున వెలిగెడిదే హ్రీశ్శక్తి. దీనికే హృల్లేఖయని నామాంతరము, చంద్రునకు చంద్రికవలె, అగ్నికి ఔష్ణ్యము వలె, సూర్యునికి తేజస్సువలె, శ్రీ మన్నారాయణుని నుండి విడదీయరాని శక్తియై విరాజిల్లునట్టిది. నిత్యానపాయిని యగు లక్ష్మియే శ్రీరామావతారమున సీతగాను శ్రీకృష్ణావతారమున రుక్మిణి గాను, దత్తావతారమున అనఘాశక్తిగాను ప్రతీతయై యున్నది. హ్రీశ్శక్తి, లక్ష్మియు శ్రీమన్నారాయణునికి పత్నులని "హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ" అని పురుషసూక్తమున కలదు. పూర్వ ప్రకరణములలో దత్తదేవుని 1. సాధు పరిత్రాణము 2. దుష్కృతనాశము ప్రస్తావింపబడినవి. ఇందు 3 ధర్మ సంస్థాపన మనెడి మూడవ అవతారకృత్యము వివరింపబడును. దత్తదేవుడు, ఆచరించి ఆచరింప జేసిన ధర్మములు, తదుపదేశములు తడవబడును. సమ్యగ్దర్శనము కల జ్ఞానికి చేయవలసిన కృత్యములేవీ లేవు. జ్ఞాని ఆచరించిన ధర్మాధర్మములు కూడా ఆతనికెట్టి ప్రతిబంధకములు కానేరవు. "ఉభేపుణ్యె పాపే విధూయ" అనెడి శ్రుతి పుణ్యాపాపములు రెండింటిని విడిచియే జ్ఞానిముక్తుడగు ననియు ఘోషించుచున్నది. పాపములు ఇనుపగొలుసులు పుణ్యము లాతనికి బంగారపు గొలుసులు, ఏవైననూ జన్మాన్తరము ఎత్తిన గాని అనుభవింప వీలులేదు. జన్మాంతరము బంధకమే గదా యోగి జ్ఞానానుభూతిచే ఆగామి సంచితము లను పోగొట్టుకొనునని జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున అని భగవద్గీత నుడివినది, అవశ్యమను భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్॥ అను గీతావచనమును బట్టి ప్రారబ్ధకర్మను ఎంతటి యోగియైనను అనుభవించవలసినదే అని వాక్రుచ్చినది. ఇట్టి యెడకాయవ్యూహ యోగాదులతో అనుభవించవలసిన కర్మావశేషమును సకృత్తుగా అనుభవించి యోగి జనన మరణ క్లేశవిముక్తుడు కాగలడని శాస్త్ర సమ్మతమయిన బాటను సమన్వయ పూర్వకముగా చెప్పుదురు. అపరోక్షాను భూతికల్గు వఱకు కర్మానుష్ఠానము జ్ఞానులకును అవశ్యానుష్ఠేయమే "కర్మ కాండను కాదని కదలరాదు" అని దత్తభాగవతవచనము. అజ్ఞానులకు కర్మాను ష్ఠానము వలన చిత్తశుద్ధి ఏర్పడి వేదచోదితమైన భక్తి, లేక జన్మాంతరీయ

సంస్కారముచే మూఢభక్తిగాని సాధకునకు కల్గుచుండును. భక్తి కుదిరినప్పటికిని కర్మానుష్ఠానము వీడరానిది. సగుణ భక్తిచే, సగుణ బ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి, అని నిర్గుణోపాసనమునకు అర్హుడగును, నిర్గుణోపాసనము దృఢమై నను స్విచ్ తీసివేసిన ఫ్యానువలె కొంతకాలము కర్మానుష్ఠానము అనువర్తించుచునే యుండునని శాస్త్ర సిద్ధాన్తము. ఇట్లు జ్ఞానావస్థకు చేరిన వారికి కూడా కర్మానుష్ఠానము తప్పదన్నచో అజ్ఞానావస్థలోనున్న అస్మదాదులకు కర్మానుష్ఠానమెంత ప్రధానమో గుర్తించవలసియున్నది. కావుననే, దత్త భా- 12వగు - 63 పద్యమున ఈ విషయ మిట్లు చెప్పబడినది. సీ॥ వర్ణాశ్రమాచార వర్తనమ్ములమించి పుణ్యకర్మమ్ముల బ్రోవు చేసి ఎడనెడ జొప్పెడు నెఱిగిన యెఱుగని తప్పు ప్రాయశ్చిత్తతతిదొలంచి సగుణదేవధ్యానసంపత్తి దల్లోకముల మేలి విజ్ఞానమును గణించి సంగమ్మును ద్యజించిస్వస్వరూపస్థితి సంసిద్ధిద విలి విశ్వమ్ము స్వయముగ నుండుకృతకృత్యుడీ కర్మమొల్లడొల్ల డాగమంబులుపాసనా యోగగతులు గాని యందాకమన కెల్లగా వలదొక, కర్మకరణమ్ము వదలినగతులు లేవు." కర్మ అనగా, కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమనెడి గీతచే వేదోక్తమగు కర్మయే, ధర్మస్తుతద్విధిః= కర్మానుష్ఠానమే ధర్మము. ధరతి విశ్వమిత్యర్థే ధృధాతువునకు మనిన్ ప్రత్యయము చేరి ధర్మశబ్దమునిష్పన్నమైనది. అనగా విశ్వోద్ధరణ సమర్థమైనది. ఎవనికి విహిత మైన కర్మమును వాడు అనుష్ఠించిన, అదిలోకములనుద్ధరించి కాపాడగలదు. ఇట్టి ధర్మమే లేకుండినచో మానవులు పశుప్రాయులగుదురు. ఆహారనిద్రాభయమైథు నాదులు మానవులకు, సర్వ పశు పక్ష్యాదులకు సమానములే ధర్మమొక్కటియే మానవులకు అసాధారణ లక్షణము మానవతాసంరక్షకము, మనువుకు సంబంధించిన వారే మానవులు ధర్మాచరణమున స్వాతంత్ర్యముకలవారు, ప్రజలు సంఘీభవించి ఏర్పరచుకొనిన కట్టుబాట్లు నీతులనదగును. సత్యము, అహింస, మున్నగునవి. ధర్మములు, ఎడమవైపు నడవవలెను. ఆదివారము ఆఫీసులకు, విద్యాలయాలకు సెలవుండవలెనన్నట్టివి నీతులు, దేశ, కాలా, నుగుణముగా నీతులు మారవచ్చును. గాని, యుగకాలాదుల ననుసరించి మంత్ర ద్రష్టలగు మహర్షులు, శ్రుతి, స్మృతులను బట్టి ప్రవర్తింపజేసిన ధర్మములు మాత్రము ఎప్పటికిని మార్పులేనట్టివి. గాన నీతివేఱు, ధర్మమువేఱు. ధర్మోపదేశములతో ఈ దత్తభాగవతము ముగింపు కలిగి యున్నది. ధర్మోప దేశాలతో సమాప్తి కలిగియే వేదాన్త సిద్ధాన్త గ్రంథములు కలవు. ఉపనిషత్తు

సూత్రభాష్యము, భగవద్గీతలందిది సుస్పష్టము. ఈ విషయము దత్తభాగవతమున సుస్పష్టము. ఇది వేదాన్తగ్రంథము అనుటకు ఇదొక ప్రబలహేతువు. తత్త్వము తలకెక్కక పోయినను ధర్మార్థకామములైన గ్రహింపుడని కలదు.

మ॥ అనవ్యాసానుచరుండనెన్మరల నాన్యాయంబుసామాన్యమై
చను దత్త్వమ్మును మున్వచించియు మనీషంబట్టునో పట్టదో
యని ధర్మార్థమ్మునమ్మగించెదరు విద్యావంతులు గ్రంథముల్
ఘనమే మోక్షమలభ్యమాయదిత్రివర్గంబైన గొండంచొగిన్

దత్తభా - 12వగు - 103 పద్యము

ఇక యోగమూలకాద్వైతానుభూతిని కార్తవీర్యార్జునుడు. పొందియూ, ఒకపరిదత్తదేవుని ధర్మాధర్మములను గూర్చి ఇట్లు ప్రశ్నించెను. స్వామీ! నాకు పరమపురుషార్థమగు మోక్షమును యోగపూర్వకముగానుపదేశించితివి, బ్రహ్మానందానుభవసమ్ప్రాప్తియు కలిగినది. నాకిక అవ శిష్టాంశమేఒక్కటియు లేదు. కృతకృత్యుడను. ఓ అనఘుడా! సదాచారము, దురాచారము, మాబోంట్లకే ఫలితములను ఈయలేవు. జన్మాంతరమే లేదు గదా! ఈశ్వరేశ్వరుడవు. యోగాశావతారుడవు. నీ విట్లు పుణ్యమునాచరించు సామాన్య మానవునివలె నిత్యము ప్రయాగలో మాఘమాస స్నానము మున్నగు నట్టివి చేయుటకు గల కారణమేమి? వత్సా! నిజానికి జ్ఞానులకు కర్తవ్యమేయొక్కటీలేదు. కానీ లోకము యొక్క ఉన్మార్గ ప్రవృత్తి నివారించుటకైనను జ్ఞాని కర్మమార్గమును విడువరాదు. మరియు శ్రేష్ఠుడేమేమి ఆచరించిన ఆయా కర్మలనే, ఇతరులును ఆచరించుచుందురు. ఆతడు ఎద్దానిని ప్రమాణముగానెంచునో లోకము కూడా దానినే ప్రమాణముగా ఎంచును. నేనే వేదోక్త కర్మలనాచరింపకున్నచో లోకములు సత్పథము లేక నశింపగలవు. ధర్మసంకరము చేసిన వాడనగుదును. ఈ ఉప

---

గీ॥ అనఘ సదాచరణము దురాచరణము నిట్టి మాబోంట్లతే ఫలమీయదీశ్వ
రేశునకు బుణ్యమేశ్రేయమిచ్చునునాపదలకనాచారమేది సంధాయకమగు
నాకర్థ్యమైనట్టి దానిని బోధించితి వందవశిష్టమొకండున్లేదు

8వ పద్యము దత్త భా - 7వ గుచ్ఛము - 6వ పద్యము.

యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః సయత్ప్రమాణంకురుతేలోకస్తదనువర్తతే
ఉత్సీదేయురిమేలోకాః నకుర్యాం కర్మచేదహమ్ ॥గీత

దేశాక్షరములే భగవద్గీతలోను సరిగమలైనవి. దత్తదేవుడిట్లు ధర్మాధర్మములను, కార్తవీర్యార్జునకు బోధించెను. 1. సూర్యుడు మకరరాశిలో ప్రవేశించినపుడు తప్పనిసరిగా ప్రయాగ స్నాన మాచరింపవలెను. 2. మాఘస్నానముతో సమానమగు సత్కర్మమరొక్కటి లేదు. 3. కర్మ భూమిలో పుట్టి ప్రయాగలో మాఘస్నానమొక్క మారైన చేయని నరుడు పాదయుగముతో నున్న పశువు. 4. ఎముకలు, స్నాయువులు, రక్త, మాంసములు కలిగి చర్మముతో కప్పబడిన ఈ స్థూలదేహము, మలమూత్ర పంకిలము, దీని శుద్ధికి ప్రయాగ స్నానమావశ్యకము పృధివ్యప్తేజోవాయ్వాకాశములు 5. శబ్ద స్పర్శ రూపరస గంధములు 5. ప్రాణాపానవ్యానోదాన సమానములు. 5. మనోబుద్ధులు 2 కలిసి ఈ పదిహేడును సూక్ష్మశరీరమనబడును, ఈ సూక్ష్మశరీరము కూడా స్నానముచే శుద్ధమగును. 6. విష్ణు భక్తుడు గాని విప్రుడు 7. యోగులు లేని శ్రాద్ధము, 8. వేదవిహిత ప్రయోగములేని శ్రాద్ధము 9. బ్రాహ్మణుడు లేని రాజరికము 10. ఆచారము లేని వంశము 11. డంబాచారుని ధర్మము 12. గట్టి తనములేని జ్ఞానము 13. కోపముతో కూడిన తపస్సు 14. ప్రమాదముతో కూడిన శాస్త్రము 15. సాక్షిలేని భోజనము 16. గురువులేని విద్య 17. భక్తిలేని వనిత 18. స్త్రీలతో నుండెడి బ్రహ్మచారి 19. జ్వాలలేని అగ్నియందు హోమము 20. బ్రతుకు కొఱకు కన్యకగా నుండుట 21. తనకొఱకైన పాకము, 22. శూద్రుని యాచించి చేయు యజ్ఞము 23. లోభియొక్క ధనము 24. సదావిరోధించు రాజు 25 సత్యము లేని వాక్కు 26. అభ్యాసము లేని విద్య 27. ఏకాగ్రతలేనిజపము 28. బ్రతుకు తెఱువుకై తీర్థమందు నివసించుట 29. యోగ్యతలేని వానికి దానము 30 తిండికై సన్యసించుట 31. సూర్యుడు మకరస్థుడై యుండ ఉదయమున స్నానమాడని నరుని జన్మము వ్యర్థములు. 1 బ్రహ్మహత్య 2 మద్యము త్రాగుట 3 బంగారమును దొంగిలించుట 4 గురు భార్యతో రమించుట 5 ఈ పైనల్వురితో స్నేహము కావించుట ఐదు పంచమహా పాతకములు కలిగిన పాతకులు, ఉదయము మాఘస్నానము చేసినంతనే శుద్ధి నందుదురు. మహాపాతకములు, ఉపపాతకములు, ఎవ్వడేనదిలో ఉదయము స్నానము చేయునోయని తమకిక చేటు మూడినదని వణికివణికి దుఃఖించు చుండును. ఉదయమున మాఘ మాస స్నానము వలన సర్వపాప వినిర్ముక్తుడగును. మేఘ విముక్త చంద్రునివలె విపాపుడై దీపించును. తెలిసి జేసిన పాపము, తెలియక జేసినపాపము, అల్పపాపము, అధిక

పాపము, మనోవాక్కాయ కృతపాపములన్నియు స్నానమాత్రముననే నశించు చున్నవి. కుల, వర్ణ, ఆశ్రమ, భేదములు లేకుండా, విష్ణుభక్తికి అందరు ఎట్లు అర్హులో మాఘస్నానమునకందరూ అర్హులే అధికారులే, బహుసహస్ర జన్మలలో గావించిన పుణ్యగంధము చేతనే మాఘస్నానము చేయవలెనను బుద్ధి పొడమును ఐహికాధ్యాత్మిక సుఖములకుతావై నట్టిది. ఋచీకయను ఒక బాల వితంతువు 60 మాఘమాసములలో నర్మదానదీలో స్నానమాచరించి తిలోత్తమ అనెడి అప్సరసగా జన్మించినది. సుందోపసుందులను అందముతో లోభపరచి సంహరింపజేసినది. దేవతలకు ఉపకారమాచరించి బ్రహ్మపదమందినది. చివరికి విష్ణులోకమున కరిగినది. మాఘమాసంలో తీర్థ విశేషములందు స్నానమాచరించుట వలన కలిగిన ఫలమున కియత్త లేదు. ఇక, వికుండిలోపాఖ్యానమున ధర్మములు చెప్పబడినవి. మనోవాక్కాయములచే హింస చేయకుండుట ఉత్తమోత్తమ ధర్మము. దోమలు, నల్లులు, పేలు, ఈగలు, మున్నగు ప్రాణులను కూడా చంపకుండినవాడు నరకములను చూడడు. తమ పొట్టనింపుకొనుటకై, జల, స్థల, చర అచరములగు ప్రాణులను హింసించు నర పశువులు, కాల సూత్రమను నరకమును పొంది తమ మాంసమును తాము తినుచూ రక్తము, చీము లందుండి ఉక్కు ముఖములైన క్రిములు దొల్చుచుండు నట్టి దుఃఖములలో ప్రమగ్గుచుందురు. నరకవిముక్తి కల్గినను స్థిరములగు చెట్లు మున్నగు జన్మలనందుచుందురు. అంగహైన్యము కుంటి, గ్రుడ్డి, దారిద్ర్యముల ననుభవించుదురు. సమస్త ప్రాణుల కభయమొసంగి హింస చేయనివారు సమస్త తీర్థస్నాతులు పవిత్రులూ, యజ్ఞయాగాదులు చేసినట్టి వారి పుణ్య ఫలముల నందుదురు. బ్రహ్మచారి, గృహస్థుడు, సన్యాసి, వానప్రస్థుడు, స్వవర్ణాశ్రమ ధర్మములననుసరించి జితేంద్రియుడైన వాడు యమలోకమును జూడడు. భూత దయ ప్రతిప్రాణికిని ఆవశ్యకము. యజ్ఞాలు, పంచయజ్ఞాలు, దానధర్మాలు, చేసినవారు, శత్రుమధ్యమున వెనుదిరుగనివారును, శరణాగత త్రాణపరాయణులు, స్త్రీ విప్ర, గోవుల రక్షణము కొఱకై ప్రాణము విడుచువారును రోగి, బాల, పంగ్వంధ, అనాథ, దరిద్రులను రక్షించిన వారును బురదలో ఇరుక్కొని ఉన్న గోవును రక్షించు వాడు గోవు వీపుపై ఎక్కనివారు గోపోషణము, గోశుశ్రూషలొనర్చెడు వారు, పునరావృత్తి రహిత పుణ్యలోకములనందుదురు. గోవులకు నీరు త్రాగుటకు వీలగుగోతులను త్రవ్వి నీరు నింపి సేవ చేయువారు యమలోకము చూడరు.

ం, స్థలప్రాణులకన్నింటికిని నీరు త్రాగుటకు వాపీ, కూప, తటాకాదులనే రచిన వారి పుణ్యమనంతము. అనంతసౌఖ్య ప్రదము కూడా అగును. ఉదకములు ర్వప్రాణులకు జీవనాధారములు, కదా. కావున మార్గమధ్యమున చలివేంద్రలు ెన్నగునవి కల్పించుట ఇహ పర సౌఖ్యకరము. ఐదు మామిడి చెట్లు, రావి, ట్టి, వేపచెట్లు పదిచింత చెట్లు మూడేసి ఉసిరికచెట్లు మారేడు చెట్లు నాటినవారికి ర్గతి కలుగును. చెట్లను నిష్ఠతో పెంచుట, మార్గమున కిరువైపులా చెట్లు ెంచుట మిక్కిలి శ్రేష్ఠము, పణ్యాము, చెట్ల పుష్ప ఫలాలు దేవ, నర, తృదేవతలకు మిగుల తృప్తి ప్రదములు. చెట్లు నాటిపోషించి పెద్ద చేసినవాని ణ్యము కొడుకులు కూడా కూర్చలేరు. చెట్లు నాటిన వారు ఆహితాగ్నులు, తలు, సోమయాజులంతటి పుణ్యమునందుదురు. పుష్పఫలాఢ్య ములగు ్వపెద్ద చెట్లను నరుకు వారు నరకమున పడుదురు. తులసివనము పెంచువారు ముని జూడరు. తులసి సర్వకామ ప్రదము. సర్వపాపప్రణాశకము. సర్వతీర్థా సము - యమకింకరులకు తులసి ఉన్నచోట్ల కాలుపెట్టనలవికాదు. లసిదళములు, తులసీ బీజములు ఎన్ని ఉండునో అన్ని వేల ఏండ్లు వైకుంఠమున ందురు. తులసి పెంచువారి పితరులు గరుత్మంతునెక్కి వైకుంఠమున కేగుదురు. ్మదానదిని చూచుట, జాహ్నవిలోమునుగుట, తులసి పెంచుట, మూడును ఃములు, ప్రతి ద్వాదశి విప్రుని హస్తమునందు గాని సాలగ్రామమునందు గానీ లసి దళము నుంచి వాడు సంసారము నుండి తరించును. వేలకొలది నిమామిడి చెట్లును పెంచి పోషించినంతటి ఫలితము ఒక్క తులసి టినందువలననే కలుగును. విష్ణుపూజకై తులసీ దళములతో హరి ార్చనచేయువారు పెరట్లో తులసిని పెంచువారు 10 వేల యుగములు ్గము నందుదురు. ఒక్క తులసీదళమున అనేక దేవతలు సమస్త తీర్థములు ిసించియుండును. నర్మదానదీ బాణములందు, రత్నలింగములందునుందు ్వవ లింగములందును ఒక మారు గాని రెండు మార్లు గాని నమశ్శివాయ యని ్తో తులసీదళమును అర్పించు జనులు యమలోకకథను వినరు శివునితో డి సుఖింతురు. 14 దేవేంద్రులకాలము, శివలోకమున నివసింతురు. శివ ్ణవులలో భేదము నెంచువారు, ఎచ్చుతగ్గులు చూచువారు నరకములబడు ు. శివుని ఆలయమందలి ద్రవ్యము ఈగ కాలియంతైనను తీసికొనరాదు. నిర్మాల్యమంతయు గుత్త బేరముగా చండీశ్వరుని అధీనముగాన, చండీశ్వ

రాజ్ఞతో తీసికొని వర్తింపవలెను. నిర్మాల్యము త్రొక్కరాదు. దాటరాదు. పూజ చేసిన పుష్పాదుల నన్నింటిని జలమందు కలుపవలెను. శివవిష్ణువులకు పర్ణశాలలు గాని, భవనములు గాని, సౌధములు గాని కట్టించు పుణ్యాత్ములు శివునితో కైలాసమున సంచరించగలరు. ఇట్లు హరిహరాదులకే గాక బ్రాహ్మణశాలలు విశ్రాన్తిశాలలు సత్రములు, చలివేంద్రములు, పర్ణశాలలు మఠములు, పేదలకు గృహ నిర్మాణములు, జీర్ణాలయోద్ధరణములు, గొప్పసత్కర్మలు, జీర్ణాలయోద్ధరణము అనంత స్వర్గ ఫలములనిచ్చును. ధనలోభముతో యతి, దేవ, విప్ర, పీఠాధిపతుల ధనమును తీసికొనినచో నరకగాములగుదురు. మఠాదులకు సంబంధించిన పత్ర పుష్పఫలతోయాదులు అన్నాదులెవడు స్వీకరించునో వాడు ఇరవై ఒక్క నరకయా తనలననుభవించును. నరకమును పొందింపవలెనన్న మఠాధిపత్యమిచ్చిన చాలును, దానితో వాడు ఎంతటివాడైనా, నరకాల పాలగును. మఠాదుల ద్రవ్యాదులు తిన్నచో కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములు చేయనగును. మఠాధిపతిని తాకిన సచేల స్నానము చేయవలెను. ఆలయాదుల ఆవరణములలో పూలమొక్కలను నాటువారు స్వర్గమునందుదురు. ఆలయములో ఆచరించిన దేవతా తిథి విప్రుల పూజలు వ్రతాలు ఎక్కువ ఫలములనిచ్చును.

భోజనము సమయమునకు వచ్చిన వాడెట్టివాడైనను పూజించి భోజనము పెట్టవలెను. మధ్యాహ్నము ఇంటికి చేరిన ప్రతివ్యక్తియు అభ్యాగతుడుగా చెప్పబడుచున్నాడు. తిథి లేకుండా వచ్చిన వానిని అతిథి అందురు. అతిథి అభ్యాగతులను అన్నపానీయములతో తృప్తి చెందించవలెను. అతిథి అభ్యాగతులు భగ్నాశులై ఎవరి ఇంటి నుండి వెళ్లుదురో ఆ గృహస్థుని పుణ్యము పట్టుకొని వెళ్లిపోవుచున్నారని తెలియవలెను. ఒకరికిపెట్టక తనకు తానుగా తినువాడు నరకమును పొందును అతిథి, అభ్యాగతుల పూజల ప్రభావమువలననే రాజులు, మునులు బ్రహ్మలోకమునకు ఏగుచున్నారు. విచారించినచో అతిథితో సముడైన బంధువు, మిత్రుడు పవిత్రమైనవాడు ఈ లోకమున మరొక్కడులేడు అన్నదానము చేసినవాడు యముని చూడడు దివ్యవిమానము నెక్కి అమృతభోజనుడగును. స్వర్గము నుండి జారినవాడు ఉత్తరకురుదేశములలో జన్మించును. భారతవర్షమున సత్కుల ప్రసూతుడగును. ప్రాణులయొక్క ప్రాణములు అన్నియూ అన్నమునాశ్రయించియే ఉండును. కాన అన్నపానములనిచ్చువాడు ప్రాణదాతయని సిద్ధాన్తము.

యముడొకపరి స్వర్గము నుండి దిగుచున్న కేసరి ధ్వజమహారాజును గూర్చి ఇట్లు పల్కెను, రాజా! తిరిగి మరల స్వర్గము చేరవలెనని కోర్కెయున్నచొ

:ర్మ భూమి యందు అన్నదానమును చేయుము, అన్నదానముతో సమానమగు ానము లేదు. ధర్మరాజు కూడా పై చెప్పిన అన్నదాన మహిమను వర్ణించియున్నాడు. ్రీష్మఋతువులో పానీయదానమును, ఎల్లప్పుడు అన్నదానమును చేయు వాడు ారక యాతనను పొందడు. ఆరు మాసముల కొకమారు జ్ఞాతాజ్ఞాతాది పాప ప్రాయశ్చిత్తాలు చేసికొను నైష్ఠికుడు నరకము నొందడు. మనోవాక్కాయములచే ఎచ్చిన పాపములకు ప్రాయశ్చిత్తములు సదా చేసికొనవలెను. గాయత్రీ జపము ేద మంత్ర జపము చేయువాడు అక్షయ పుణ్యలోకముల నందును. పరాన్నమును, ారపాకమును ధర్మరతుడు విడువవలెను. పరాన్నమును ప్రాణములు కంఠగతము ాచున్నను స్వీకరింపగూడదు. పరాన్న స్వీకరణము వలన, పరుల పాపములు తనకు వచ్చును, గాన భోజనమన్యత్ర చేయరాదు. నిత్య స్నానము బాహ్యాభ్యంతర ముల పాపములను పోగొట్టును.

స్నానము లేకుండా భోజనమెవడు చేయునో వాడు మలభక్షకుడే మరియూ ార్వకర్మ వినిందితుడయి నరకమున పడి మరల చండాలాది జన్మములను ొందును. నదీ స్నానము చేయువాడు దుర్గతిని నీచజన్మములను పొందడు. అన్ని ్ధులందును. తిలసంయుత పాత్రములను దానము చేయువారు, దశదాన, షోడశమహాదానములను చేయువారు రౌరవాది నరకములను బడక సద్గతి ొందుదురు. సత్యవాదియు, ప్రియవాదియు, సహనము కలవాడు, నీతివాది, అసూయ, కోపములు లేనివాడు, దయాలువు, దాక్షిణ్య సంపన్నుడు. పరధనాదు ులనుకోరనివాడు. ఆహార నియమాదులు కలిగి తీర్థములందుండు వాడును నరక యాతనల పడడు. పరుషవాది పరదూషణ చేయుపాపి పాపాత్ములలో అధికుడై ప్రలయకాలము వఱకు నరకమునపడును. కృతఘ్నునికి ఎన్ని తపములోనరించి తీర్థాదులందు స్నానము చేసినను నిష్కృతి లేదు. సదానరక పతితుడగును. తీర్థాదులలో చెడ్డపనులు, జీవనము, ప్రతిగ్రహము, ధర్మవిక్రయము పనికిరావు. ఒక్కసారి గంగలో స్నానము చేసినను స్వర్గతినొందును. గంగను అన్యతీర్థాలతో బోల్చిన వాడు రౌరవాది నరకములను పొందును. నూఱామడల నుండి గంగ అను పదము నోరార ఉచ్చరించినను పాపములను కాల్చివేయును. ధర్మఫలంబు ఇచ్చుటకు ధన రూపముగా వచ్చిన ప్రకృతిపరమైన వస్తువు. విష్ణుపాదాల నుండి పుట్టినది. మహేశ్వరుని శిరము పై నుండి పాఱునట్టిది. పాపాత్ముల సముద్ధరణము ాకై వచ్చినట్టిది. ప్రతి గ్రహసమర్థులై ఎవరు ప్రతిగ్రహము చేయరో వారు

స్వర్గమున నక్షత్రములగుదురు. గోరక్షణము చేసినవాడు గోలోకమున కేగును. ప్రాణాయామ పరులు యమలోకము చూడరు. రోజుకు 16 ప్రాణాయామములు చేయువారలు నిష్పాపులు. వారికి ఏ పాపము అంటదు. వేల కొలది గోదానములు వ్రతాలు, నియమాలు, తపస్సుల వలన వచ్చు పుణ్యము ప్రాణాయామముచే సిద్ధించును. దర్భకొన నుండి జారిన నీటితో ప్రతిమాసము తాగుచు సంవత్సర కాలము చేసిన తపః ఫలము ఒక్క ప్రాణాయామము చేతనే సిద్ధించును. ప్రాణాయామము వలన భస్మము కాని పాపముండదు. పరభార్యలను తల్లివలె చూచువారలు పరధనము లందాశలేని వారలు యమయాతన పొందరు. వారు సాక్షాత్తుదేవతలే, ఆశలేని వాడు, పెద్దలమీదకోపము లేనివాడు, తల్లిదండ్రులను వార్ధక్యమున పూజించు వాడు అతిథి పూజాతత్పరుడు అతిధిపూజాతత్పరుడు. తల్లిదండ్రుల కంటె గురువును అత్యధికముగా ప్రేమించు వాడు, శీలమును సంరక్షించుకున్న వనిత యమయాతనలబడరు. శీలము చెడిన వనిత నరకమున పడును. నిషిద్ధాచరణమును చేయు శూద్రులకు స్వర్గతి లేదు. వేదాభ్యాసరతులు శాస్త్రాలోచనతత్పరులు, పురాణ ప్రవక్తలు, ధర్మ బోధకులు వేదాన్త శాస్త్రపరులగు వారు ఆయా శాస్త్రాభ్యాసాలతో నిపాపులగుదురు. శాస్త్ర పండితులచే ఈ భూమి ఉద్ధరింపబడును. విష్ణుప్రశంస విష్ణు మననము విష్ణు నామము, సదాచేయువాడు ఉత్తముడు విష్ణుభక్తుడు వర్ణబాహ్యుడైనను ఉత్తముడే. అతనిని తాకిననూ స్నేహమును చేసినను పుణ్యవంతుడగును. నరకసముద్రము దాటుటకు విష్ణుభక్తి యొక్కటి తప్ప మరొక ఉపాయము లేదు. ప్రసంగము చేత నైనను అవశముగా, తాత్పర్యము లేకుండి విష్ణునామమును ఉచ్చరించిననూ విష్ణులోకమును పొందును. దురాచారుడు, కులీనుడు, సర్వపాపరతుడైనను విష్ణునామ జాపకుడు ఉత్తముడే, అతని యొద్దకు చేరకుడు అని యముడు మాకు ఆనతిచినాడు. అష్టాక్షరీ, ద్వాదశాక్షరీ మంత్రములు నిత్యము జపించువారలు, శంఖ చక్రములు ధరించి విష్ణురూపులై వైకుంఠమును పొందుదురు. మహాపాతకములు సైతము తొలగి పోవును. విష్ణుభక్తుడు, సమస్త తీర్థ స్వరూపుడు. సాలగ్రామ శిలయందొక హృదయమందు, జలమందు, ప్రతిమయందు, నేలయందు, సూర్యునియందు గానీ గొవృష్ణమందు, విప్రుని యందు గానీ హరిని పూజించువాడు మోక్షమును పొందును. వజ్రకీటపు పురుగు చేదొలచబడిన శిల సర్వ శ్రేష్ఠమైనట్టిది. ముముక్షువులకు సదాపూజ్యము. అనేక రాజసూయ యాగఫలముల నిచ్చును.

సాలగ్రామ చక్రమందు కర్రలో అగ్ని ఉన్నట్లు విష్ణువు ఎప్పుడూ, సన్నిహితుడై ఉండును. సాలగ్రామ శిల యందు, లక్ష్మీనారాయణులు వైకుంఠము నందు కంటె ఎక్కువ రమింతురు. తులసీదళములతో సాలగ్రామ శిలార్చనము చేసిన సమస్త భూదానము నిత్యాగ్ని హోత్రి పుణ్యమును పొందును. ద్వాదశ కోటి లింగములను స్వర్ణ పద్మ సహస్రములతో 12 కల్పముల కాలము పూజచేసిన ఫలము, ఒక్కదినమున సాలగ్రామ శిలార్చనము చేసిన పుణ్యముతో సంపాదింపవచ్చును. ఎట్టి నీచుడైనను హీనుడైనను సాలగ్రామ శిలాపూజచే చక్రవర్తియగును. మరియు నరకమును పొందడు, పుణ్యలోకముల నుండి జారిపోడు గర్భవాసము దుఃఖము పశు జన్మమును పొందడు. దీక్షతో శిలయందు విష్ణుభావన చేయువాడు వైకుంఠము నొందును. సాలగ్రామ శిలాతోయముల స్నానము చేయువాడు సర్వయజ్ఞ దీక్షితుడు సర్వతీర్థ సుస్నాతుడును అగును, అన్ని తీర్థములు శిల యందు నివసించును. అర్చన చేయువానికి శాస్త్రాలతో పని యేమి సదా సాలగ్రామ నివాసి శ్రీహరి 14 లోకాలు 33 కోట్ల దేవతలు ఆ శిలయందు నివసించెదరు. సాలగ్రామ శిలాజలము పుచ్చుకొనిన వానికి పంచ గవ్యప్రాశనముతో పనియేమి. శిలోదకము త్రాగినను, మీదజల్లుకొనినను శరీరము చక్రాంకితమే అగును. యముడు తన దూతలను సాలగ్రామమున్న ఇంటికి మూడామడల దూరమున ఉండవలెనని ఆదేశించినాడు. సాలగ్రామోదకము పూర్వ పుణ్య విశేషము చేతనే సంభవించును. తీర్థము నిత్యము సేవించు వానికి మరల పుట్టుకలేదు. భక్తితో బ్రాహ్మణునికి దానమిచ్చిన, సర్వభూమండలము దానము చేసినవాడగును. సాలగ్రామమునకు వెలకట్టినవాడు, కొన్నవాడు, పరీక్షించువాడు, అనుమానించినవాడు, నరకముల పాలగును. సాల గ్రామ సంస్మరణమే సర్వపాపహరము. శివుని నిందచేసెడి విష్ణుభక్తుడైననూ విష్ణులోకము నుండి పతితుడగును. ఒక్కరోజు ఉపవసించి, ఏకాదశీ వ్రతమూ చరించిన వానికి నరకయాతన లుండవు. సర్వేంద్రియ పాపములు పటాపంచలు అగును. పలు రాజసూయాశ్వమేధయాగ ఫలములు కల్గును. గంగకంటె, గయకంటె, కాశీకంటెను ఏకాదశీ ఉపవాస ఫలితము అధికము. తల్లితరమున 10 మంది తండ్రితరమున 10 మంది తరాలవారు, ఏకాదశీ వ్రతముచే తరింతురు. ఏకాదశినాడు ఉపవాసము మేలు, అంతకంటె రాత్రి జాగరణము గొప్పది. అంతకంటె ద్వాదశి పారణము గొప్పది. యోగ్యుడైన వానికి దానము చేయక, తపస్సు చేయక, నదీ స్నానము

చేయక, ఏ ధర్మము చేయక ఉండెడి నరుని జన్మము వ్యర్థము కాన బాల్యము నుండి దానము చేయుట అభ్యసింపవలెను. వారు ఐహికాముష్మిక ఫలాల నొందుదురు, తాను చేసిన దాన ధర్మాదులు ఎప్పుడును పైకి చెప్పరాదు. ఒక మాఘస్నాన ఫలముగా స్వర్గతి కలిగినదని యమదూత వికుండిలునితో ధర్మసూక్ష్మములను చెప్పెను. తన అన్నకు నరకయాతన పోవుటకు పుణ్యమేదైనా కలదా అని అడుగ ఇంతకు పూర్వము 8వ జన్మమున మధువన నివాసి శాకలిపుత్రులు తొమ్మండుగురిలో మొదటి ఐదుగురు నిత్యాగ్నిహోత్రులు, చివర నల్వురు సన్యాసులు, నిస్సంగులు, నిస్పృహులు అయిన వారికి నీవు ఒక రాత్రి ఆతిధ్యమిచ్చితివి . ఆ ఆతిథ్యపుణ్యమును ధారపోసినచో శ్రీకుండిలుడు కూడా నీతో స్వర్గతిని పొందును అనెను అట్లు చేసి వికుండిలుడు శ్రీకుండిలుడు స్వర్గమునకేగిరి.

కార్తవీర్యార్జునుడు, స్వామీ, మేరు, మందర సకాశములగు పాపములు ఒక మాఘమాస స్నానము చేపోయినవి ఒక మాఘస్నానముచే స్వర్గము వచ్చినదంటిరి, ఇది ఎట్లు సంభవము అని అడిగెను. వత్సా! జలము పరమ పవిత్రము !!ఆపస్సదాస్వతో మేధ్యాః ॥ జలము సౌఖ్యకారణము, మల సంహారకము, ప్రాణ ప్రదము, జలమనగా నారాయణుడే సుమా, మాఘ మాసమున ఎచ్చట స్నానమాడినను స్వర్గదాయకము సర్వ పాపక్షయకారకము భక్తితోడయినచో ఆ స్నానము దేవత్వమును సంపాదించును. సూర్యుడు మకరరాశిలో ప్రవేశించినది మొదలుకొని ఒక్కరోజు కూడా వ్యర్థము కానీక స్నానము ఆచరించినచో చంద్రుని కలలు దినదినాభివృద్ధి చెందినట్లు పుణ్యమభివృద్ధి చెందును. స్నానవ్రతవిధానము చెప్పెద వినుము. నిత్యస్నానము గోవిందుని ముమ్మారు కొల్వవలెను. అగ్నియందు తిలమిశ్ర మగు నేయిని విష్ణుప్రీతికొరకై హోమము చేయవలెను. భూమియందే పరుండవలెను. దుప్పట్లు, పట్టు వస్త్రాదులను గురుగింజంత బంగారమును దానము చేయవలెను. చలికాచుకొనుటకు, ఇంధనమిచ్చుట మంచిది. ప్రతిగ్రహాలు పనికిరావు. పరవహ్ని, భోజన, పరదేవ, స్వార్థ పూజాదులు పనికిరావు. శక్తి కొలది దానము ఏకాదశి నాడు ఉపవాసము మాసాంతమున బ్రాహ్మణభోజనాదుల నిర్వర్తించుచు బంగారు విష్ణుప్రతిమను గాని వెండి ప్రతిమగాని చేయవలెను, దంపతీ పూజ చేసి వ్రత సాఫల్యము నకై హరిని ప్రార్థింపవలెను. సూర్యోదయానికి ముందే గోవింద యని లేచి స్నానమాచరించ వలెను. లేవలేనివారు వృద్ధుల

వేడినీటితో స్నానము సూర్యోదయానికి ముందే ఆచరింప వలెను. కూపస్నానము అంతకంటె వాప్యాది స్నానము అంతకంటె తటాకస్నానము అంత కంటెనదీస్నానము అంతకంటె దేవతాసరోవరము అంతకంటె మహానదీస్నానము, అంతకంటె ప్రయాగస్నానము ఉత్తమోత్తమములు, త్రివేణీ సంగమములో ఒక్కసారి స్నానము చేసిననూ సంవత్సర స్నానదానఫలముల నొందగలడు. బ్రహ్మ సమస్త పాప క్షయార్థమై పాపపు పశువుల తలలను నరుకుటకై ప్రయాగను సృష్టించెను. మునులిట నివసింతురు. ప్రయాగస్నానము చేసినవానికి పునర్జన్మము లేదు. ఇహ పరసౌఖ్యముల నొందును, మరియు పాముకుబుసమును విడచినట్లు గంగాస్నానము, కురుక్షేత్రస్నానము, కాశిలో ఉత్తరవాహిని యగు గంగాస్నానము, అంతకంటె ప్రయాగ స్నానమెక్కువ పుణ్య ఫలప్రదము ఇట్టి స్నానమును పొగడినను దర్శించినను స్పృశించినను బహు జన్మ పాపములను దహించును. సమస్త దేవతలు అట ప్రచ్ఛన్నముగా నుందురు. కాంచన మాలిని మూణ్ణాళ్ల స్నానము చేసిన పుణ్యము నిచ్చి, పాపాత్ముడైన రాక్షసునికి ఉత్తమస్థితి నొందించినది. కాంచనమాలిని స్నానము చేసిన తడిగుడ్డ నీటిబొట్టు పడి రాక్షసుడు జాతిస్మృతి కలిగి సుఖించి, ఆమె ఇచ్చిన పుణ్యఫలముతో అధమ జన్మ నుండి స్వర్గతిని చెందెను. కాంచన మాలిని, మునుపు గంధర్వకన్యక తరువాత కళింగరాజునకు భోగపు వనితయైనది. సుశీలుడను వేదవేదాంగ వేత్త ఉపదేశమును బట్టి ప్రయాగస్నానమాచరించి గొప్ప పుణ్యవతియైనది. అందరికి స్వర్గమిచ్చుటకు నేనే సమర్థను అని చేయి ఎత్తి ప్రతి నరుని ప్రయాగ పిలుచు చుండును. ఇట్లు మాఘమాసస్నాన ధర్మసూక్ష్మములను దత్తదేవుడు వివరించెను. పిదప మరొక మారు కార్తవీర్యార్జునుడు వర్ణాశ్రమాచార ధర్మములు శ్రాద్ధదత్తములు మృతులైన వారికెట్లు చెందును. చచ్చినవారు, స్వర్గమందో భూమియందో పుట్టి ఆకలిగొని ఏమి అడుగరు, తినరు, తృప్తి చెందినట్లు కన్పట్టదు. బ్రాహ్మణుల కిచ్చుట వస్త్రాదుల నిచ్చెదరు. పితృదేవతలెచ్చటనో ఉందురు. వారికివి ఎట్లు చేరగలవో వివరింపుమని దత్తస్వామిని అడిగెను.

వత్సా! ధర్మకీర్తియను రాజు, నా వలన వినిన వర్ణాశ్రమాచార ధర్మములను, శ్రాద్ధ విధానములనిట సంగ్రహించెదనని ఇట్లు చెప్పెను. ప్రియాశిష్యా! బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్రులనెడి వర్ణములు నాలుగు, అందు బ్రాహ్మణుడు అధికుడు, బ్రాహ్మణ క్షత్రియవైశ్యులు తల్లిగర్భమునుండి జనించుట ఉపనయన

సంస్కారముచే సంస్కరింపబడుట వలన వీరు ద్విజులైనారు. స్వవర్ణాశ్రమ ధర్మాచారములను విడిచిన వారు పాషండులని చెప్పుదురు. స్వగృహ్యోక్తధర్మములనే క్రమము తప్పక ఆచరించ వలెను. అట్లుకాకున్న పతితులగుదురు. యుగ ధర్మములు శ్రుతి స్మృతులకు విరుద్ధములు గానట్టి వాటినే అనుసరింపవలెను. మనోవాక్కాయములచే యథావిధి ధర్మము చేయ వలెను. లోకవిద్విష్టములగు ధర్మార్థముల విడువలెను. 1. సముద్రము మీద ప్రయాణము 2. సన్యాసమును స్వీకరించుట 3. అసవర్ణకన్యలను వివాహమాడుట 4. దేవరన్యాయముతో పుత్రోత్పత్తి 5. మధుపర్కమున వధ 6. శ్రాద్ధమున మాంసమిడుట 7. వానప్రస్థాశ్రమము 8. అక్షతయైన కన్యకను ఇతరులకు దానమిచ్చుట 9.దీర్ఘ కాలము బ్రహ్మ చర్యము 10. నరమేధము 11. అశ్వమేధము 12. గోమేధము 13. మహాప్రస్థానము కలియుగమున సంపూర్ణముగా నిషిద్ధ కర్మలు. ఇతరదేశాచారము లననుసరించుటచే పతితుడగును,బ్రాహ్మణుడు దానములు చేయవలెను. యజ్ఞాలలో స్వామిని పూజింపవలెను. జీవికకు యజనయాజనములు అధ్యయనాధ్యాపనములు, దాన ప్రతిగ్రహాలు, షట్కర్మలు, నిత్యస్నానము చేయవలెను. శస్త్రములతోజీవింపకూడదు. సర్వభూతహిత పరుడు కావలెను. పరధనమును మట్టిబెడ్డవలె చూడవలెను. సమబుద్ధియై యుండవలెను.అగ్నిని పరిగ్రహింపకూడదు. ఋతుకాలములందు మాత్రమే స్త్రీసంభోగము చేయవలెను. ఎవరికిని అహితము చెప్పకూడదు. క్షత్రియుడు బ్రాహ్మణులవలెనె దానాదులను బ్రాహ్మణులకొరకు ఇవ్వవలెను. యజ్ఞములతో దేవతలను సంతోషపెట్టవలెను. శస్త్రజీవియై భువిని ధర్మముగా ఏలవలెను. శిష్టరక్షణ దుష్టశిక్షణ తప్పక చేయవలెను. వైశ్యులు కృషి, గోరక్షా, వ్యాపార, వేదాధ్యయనములను చేయవలెను. శూద్రులు శిల్పాది విద్యలతో వచ్చిన ధనముతోజీవింపవలెను. పైమూడు వర్ణములవారిని సేవింపవలెను ద్విజులచే యజ్ఞములు చేయించుచుండుట, తమ తమ భార్యలందు ఋతుకాలాభిగమనము. ప్రియవాదిత్వము, శుభము పల్కుట, ఆయాసము లేకుండుట, ఉత్సాహము, సహనము, అనహంకారము సర్వవర్ణాలకు సాధారణమైన ధర్మాలు, ఇక ఆశ్రమోచిత ధర్మాలతో ముక్తులగుదురు, బ్రాహ్మణుడు తన ధర్మముతో జీవిక జరుగనపుడు, ఆపత్కాలమున క్షత్రియాచారమును, క్షత్రియుడు, తనధర్మముతో జీవిక జరుగనపుడు, వైశ్యవృత్తితోను ఉండవచ్చును. ఎంతటి ఆపదలోలైనను ద్విజుడు శూద్రవృత్తినాశ్రయింప కూడదు. శూద్రవృత్తి

నాశ్రయించినవాడు చండాలుడు అని చెప్పబడును. వర్ణములు ఆశ్రమములు నాలుగే, ఐదవ ఆశ్రమముగానీ వర్ణముగానీ లేదు. బ్రహ్మచర్యాశ్రమము, గృహస్థాశ్రమము, వానప్రస్థాశ్రమము, సన్యాసాశ్రమము లలో విహిత ధర్మములనే ఆచరించవలెను. కర్మయోగాసక్తుడగు ద్విజునికి విష్ణువు చాలా సంతోషించును. నిస్పృహులు, శాన్తమనస్కులు స్వకర్మనిష్ఠితులు, ఉత్తమలోకములనందుదురు. స్వాశ్రమోచిత కర్మలను విడిచి పరకర్మలనాచరించువాడు సర్వకర్మబహిష్కృతుడు. పాషండుడు. అగును. మంత్రవిధాన పూర్వకముగా స్త్రీలకు గర్భాధాన సంస్కారములు చేయవలెను. స్త్రీలకు అమంత్రకముగా, ఈ జెప్పిన విధులన్నియూ చేయ దగినవైయుండును. గర్భవతియైన స్త్రీలకు 4,6,7,8, నెలలో సీమంతము చేయించవలెను. పుత్రుడు జనించినచో తండ్రి సచేలస్నానము చేసి నాంది శ్రాద్ధము ఆచరింపవలెను. స్వస్తి వాచనములను అన్న ప్రాసాదములను ఆభ్యుదయకమైన కర్మలను తండ్రిచేయింపవలెను. అర్థహీనమైన గుర్వక్షరములను అతిక్రమించిన పేర్లను పెట్టకూడదు. విషమాక్షరముతో పేరు పురుషునికి పెట్ట రాదు.3సంవత్సరము చౌలము చేయవలెను. 5,6,7,8 సం॥లలో గృహ్య సూత్ర ప్రకారముగా బ్రహ్మణునికి ఉపనయనము చేయవలెను. దైవము వలన సకాలములో సంస్కారములు జరగని యెడల ప్రాయశ్చిత్తమాచరించవలెను. గర్భాష్టము నుండి 16 సం॥ వరకు ఉపనయన కాలము. రాజునకు (క్షత్రియునకు) ॥నుండి 22వ సం॥ వరకు ఉపనయనకాలము. వైశ్యులకు 12నుండి 24సం॥ వరకు ఉపనయన కాలము ఉపనయనమైన తరువాత గురుకులమున చేరి గురువు వద్ద వేదాధ్యయనము చేయవలెను.బ్రహ్మచారిప్రాతఃస్నాతుడై కావలసిన దర్భలు, ఫలములు, సమిధలు గురువునకు తెచ్చిపెట్టవలెను. నిత్యము అగ్ని కార్యము చేయవలెను. గృహస్థుల వద్ద భిక్షితమైన అన్నమును గుర్వనుజ్ఞతో తినవలెను.యజ్ఞోపవీతము అజినము దండము ధరింపవలెను. జీర్ణములైనచో క్రొత్తవి ధరించి పాతవాటిని విడువవలెను. భవాన్ (భవతి) భిక్షాం దదాతు. అని భిక్షాటనము చేయవలెను. తేనె, ఉప్పు, స్త్రీసంగము, మాంసము, పగటినిద్ర, దంతధావనము, తాంబూలము, ఎంగిలి, గొడుగు, పాదుకలు, గంధము, జూదము, జలక్రీడ, సంగీతము, వాద్యము, అభినయము, పరివారము, అతిప్రలాపము, దుర్జనసహవాసము, వటువులకు విడువ దగినవి. వయస్సు చేత తపస్సుచేత జ్ఞాన వృద్ధుల విషయమున వినయముతో నుండవలెను. విప్రులకు శర్మ అనియు,

క్షత్రియులకు వర్మ అనియు వైశ్యులకు గుప్త అనియు, పేర్లకు చివర కలుపుకొనవలెను. పెద్దలకు నమస్కరించునప్పుడు పైపదములు చివర కూర్చవలెను. గ్రామపురోహితుడు. వేదశాస్త్ర మర్యాదను అతిక్రమించిన వాడును దొంగ, జూదరి, కృతఘ్నుడును, అశుచి, ధూర్తుడు, పతితుడు, పాపి, క్రూరుడు, నక్షత్ర తిథివారములు చెప్పి బ్రతుకువాడు ఇట్టి వారలకు బ్రహ్మచారి నమస్కారము చేయవలెను. స్నానము, జపము, చేయునపుడును, పరుగెత్తునపుడును, సమిత్ కుశపుష్పములు చేతియందు ఉన్నపుడు నిద్రపోవునప్పుడు, భోజనము చేయునపుడు, భిక్షతీసికొనునపుడు, ఎట్టివారైనను నమస్కరింపరాదు. వివాదశీలికి దిగంబరుననికి వాంతి చేసుకొనువానికి బరవు మోయుచున్నవానికి, తలయంటుకొన్నవానికి, జలమధ్యమునున్నవానికి నమస్కరింపకూడదు. భర్తను చంపినట్టి దానిని, రజస్వలను, జారిణిని. పురిటాలిని,తీవ్రకోపవతిని, గర్భస్రావము చేసుకొన్న దానిని నమస్కరింపరాదు. సభయందు యజ్ఞములయందు దేవాలయములయందు నమస్కరింపరాదు. నమస్కారము ఎవరికో తెలియకుండా చేసిన పుణ్యము నశించును. తీర్థములయందుక్షేత్రములయందు, సత్రములయందు, అధ్యయన సమయములందు, వ్రతములందు, శివ, విష్ణు పూజలందు, యజ్ఞానుష్ఠాన దానాదులలో నమస్కరిపరాదు. అప్పుడు అదివాడు చేయునా లేక వాని నమస్కారమును ఆదరించి స్వీకరించునా! వందనమునకు ప్రత్యభివాదనము చేయనివానికి నమస్కారము తగదు. పరిశుద్ధులు మాత్రమే పరస్పరమునమస్కరించదగుదురు. బ్రహ్మచారి శూద్రునికి నమస్కరింపరాదు. పాదప్రక్షాళనము గావించి శుచియై ఆచమించి గురువుకు అభిముఖియై గురుపాదములను పట్టుకొని అధ్యయన దినములలో అధ్యయనము చేయవలెను. అనధ్యయయనములలో చదివిన కీర్తి సంపద ప్రజ్ఞ ఆయురారోగ్యములను యముడు అపహరించును. కాన అనధ్యయములలో చదువరాదు అనధ్యయములలో చదువువారిపై యముడుబ్రహ్మహత్యా పాపముమోపునుకుండులు గోలకులు, జడులు, అయినవారికి ఉపనయనార్హత కలదని కొందరు చెప్పుదురు. కొందరు అట్టివారికి పాపము వచ్చునని పలుకరింపరు. మద్యము త్రాగినవారిని గూర్చి మారుపలుకరు. గురుశుశ్రూషలేక అధ్యయనము చేసినవారు శూద్రసమానులు. నరకయాతనలను పొందుదురు. నిత్యనైమిత్తిక, కామ్య, ఆది, వైదిక కర్మలు, అధ్యయనము చేయని విప్రునికర్మ నిష్ఫలము.

శబ్దబ్రహ్మమయుడు, విష్ణువు, వేదము విష్ణుస్వరూపము, అట్టి వేదమును వినుచు నేర్పుచు ఉండెడివాడు సర్వాభీష్టములు నొందును. 12సం॥ వేదవేదాంగములుచదివి గురుదక్షిణను సమర్పించితీర్థాటనము చేయవలెను. పిదప పెండ్లిచేసికొనవలెను. ఉత్తమ వంశజాత రూపగుణశీలములు కల్గిన రోగములు లేని విశాలలోచన యగు కన్యకను వివాహమాడవలెను. అతికేశ, అకేశ, వాచాల, వామన, కాయస్థ, దీర్ఘదేహ, విరూప, హీనాధికావయవ, పిచ్చిది,(సూచిక) కొండెములు చెప్పెడిది. ఊరకనే నవ్వునట్టిది కృశించినది. స్థూలదంత, కృష్ణముఖి, కనుబొమ్మలు కలిసినట్టిది. గద్గదస్వర, స్థూలదేహ, రక్తవర్ణ, అతికృష్ణ ధూర్తులావైన గిలకలు కలిగినది. దీర్ఘమైన కళస్థలములు కలిగినవి. పురుషాకారముతో ఉండునది, గడ్డము, మీసములతో ఉండునది, పాండురోగముతో నున్నది, ఎప్పుడూ నిద్రాశీలమైనట్టి అన్యాథాభాసించునది. లోకమును ద్వేషించునది, దగ్గుకలది. పాపకార్యముల యందు ఆసక్తికలదానిని దొంగది,దీర్ఘనాసిక కలది, ద్యూతక్రీడ కలది శరీరమంత కేశములు కలది. గర్విత, దుష్ట వ్యాపార స్వభావము తెలియనిది. నిష్ఠురభాషిణి గుణప్రాగల్భ్యము లేనిది. పరానుకూలత లేనిది ఇట్టి స్త్రీలను వివాహము ఆడరాదు. తల్లి వంశమున ఐదు తరములు తండ్రి వంశమున ఏడు తరములు దాటిన తర్వాత ఉన్నట్టి కన్యను మాత్రమే వివాహమాడవలెను. 1. బ్రాహ్మము, 2. దైవతము 3. ఆర్షము. ఈ మూడు వివాహములుత్తమములు. 4. ప్రాజాపత్యము, 5. గాంధర్వము 6. ఆసురము 7. రాక్షసము 8. పైశాచము ఈ చివర ఐదు బ్రాహ్మణులకు ప్రశస్తములు కావు. ఉత్తరీయము, యజ్ఞోపవీతద్వయము సదా ధరింపవలెను. కేశ, నఖములను సమయ సందర్భాలు లేకుండగా తీసివేయరాదు. వేణుదండము, జలముతో నిండిన కమండలంముచేత ధరింపవలెను. తలపాగా, గొడుగు,పాదుకలు, పుష్పసుగంధాదులు గృహస్థుడు ధరింపవచ్చును. నిత్య స్వాధ్యాయశీలుడై ఉండవలెను. పరాన్నమును తినరాదు. పరివారమును విడువవలెను. కాలుమీద కాలువేసి తోమి కడుగరాదు. ఎంగిలి దాటరాదు. సిగ్గు కలిగి ఉండవలెను. రెండుచేతులతో తల గోకికొనరాదు. పూజ్యులను, దేవాలయమును, గోవును, రావిచెట్టును, ప్రదక్షిణము గావించి వెళ్ళవలెను. స్నాన, ఆచమన, దేవతార్చన, వ్రత,శ్రాద్ధాదులందు ఒకే వస్త్రమును ధరించుటకూడదు. (రెండువస్త్రములుండవలెను) జుట్టుముడి వేసికొనవలెను. పరభార్యలను తాకకూడదు. తన పుణ్యములను లెక్కవేసికొనరాదు. ఇతరుల

పాపములను చెప్పరాదు. అసూయ, పగటినిద్రవిడువవలెను. తన ఆయుర్దాయమును, నక్షత్రమును, ప్రమాణమును, చెప్పరాదు. మద్య, ద్యూత, గీతములందు ఆసక్తి పనికిరాదు. దుర్జన సహవాసము కూడదు. అశాస్త్రీయమును వినరాదు. కేశ, నఖ, వస్త్రములతో దుష్టమైన పాసినట్టి అన్నమును తినరాదు. పంచపునీడలను విడువవలెను. నెత్తికి పూసిన తైలమును శరీరమునకు పూయరాదు.అంటరాని వారిని అంటకూడదు. తాకిన స్నానము చేయవలెను. దీపపు నీడ, కేశ, వస్త్ర, నఖోదకము, అజములు, పిల్లులు, ఆవులు పురాకృతమైన పుణ్యములను నశింపచేయును కాన తెలిసి ప్రవర్తించవలెను. చేటగాలి, శవధూమము, శూద్రాన్నభోజనము, వృషలీపతి సంఘములకు, దూరముగా నుండవలెను. శుచిలేకుండగా గురు, దేవతా, అగ్నులను సేవించరాదు. నిద్రపోవువారిని లేపరాదు. ఎడమ చేతితో దేనినీ, తాకరాదు. గురువు నీడను, గుర్వాజ్ఞను దాటరాదు. అశుచిగా తాంబూలమును వేసికొనరాదు. కోపముతో ఆయువు పట్టులందు కొట్టరాదు. ప్రాతస్సాయములందు ఔపాసనము చేయవలెను. ఔపాసనము లేకున్నవాడు త్రాగుబోతగును. పూర్ణిమ, అమావాస్యలందు, స్థాలీపాకాదులను చేయవలెను. శుభములందు, యుగాదులందు, అష్టకాదులందు, మన్వాదులందు, మహాలయపక్షములందు, శ్రాద్ధదినమున శ్రోత్రియ హోమములు, తపములు, కృత్యములు చేయవలెను. వేదాధ్యయనము చేయుట, మిక్కిలి మంచిది. ఇవి గృహస్థధర్మములు ముందు ఊర్ధ్వపుండ్రము తరువాత త్రిపుండ్రము ధరింపవలెను. కొందరు ఊర్ధ్వపుండ్రములు తులసియు శ్రాద్ధాదులందు పనికిరావని చెప్పుదురు. ఈ ధర్మములు స్మృతులలోనివి. వృద్ధాచార సమ్మతములు. వాటిని ఆచరించువారికి విష్ణువు సంతుష్టడగును. విష్ణువు ప్రసన్నుడయిన అసాధ్యమేమియుండును బ్రాహ్మముహూర్తమున లేచి పురుషార్థము లకు అవిరుద్ధమైన వృత్తితో ఆలోచించుకొనవలెను. యజ్ఞోపవీతమును కుడిచెవికి చుట్టుకొని ఉత్తరముఖుడుగా మూత్ర, పురీషములను వదలవలెను. రాత్రికాలమున దక్షిణాభిముఖుడై వదలవలెను. నీటితోను, మట్టితోను కడిగికొనవలెను. బాహ్యా శౌచముతో భావశుద్ధి రూపమగు ఆంతరశౌచము పొందవలెను. వస్త్రములను శిరమునకు చుట్టుకొని గడ్డి నేలమీద కప్పి గోవులు, విప్రులు, స్త్రీలు, గురువులు, గుడి, కాంతారము, చెట్టునీడ, మంచి మార్గము, చెరువు, గోష్ఠము, నదీతీరము, బావి,మొదలగు ప్రదేశములను విడనాడి మౌనముతో

మలమూత్రములను విడువవలెను. శుద్ధి అయిన తరువాత ఆచమనము చేసి స్నానము చేయవలెను. పిదప సంధ్యా వందనము సూర్యోదయమునకు పూర్వమే ప్రారంభింపవలెను. గాయత్రీ మంత్రముతో భక్తి కలిగి సూర్యునికి అర్ఘ్యము నియ్యవలెను. ఉదయము నిలిచి సూర్యోదయము అగునంత వరకునూ 35 నిముషములు గాయత్రీ జపము చేయ వలెను. సాయంకాలము సూర్యుడు 1/2 గంటకు అస్తమించు సమయముననే ప్రారంభించి 40 నిముషములు నక్షత్ర దర్శనము అగు వరకూ కూర్చుండి గాయత్రీ జపము చేయవలెను. మంత్రార్థమును మనసున భావింపవలెను. మధ్యాహ్న కాలమున హంస మంత్రముతో అర్ఘ్యము నీయవలెను.సాయంకాలము వరుణోపస్థానము చెప్పవలెను. బ్రహ్మ యజ్ఞము నిత్యము చేయదగును. వేదోక్త కర్మలు చేయని యెడల ఏ గంటలోనైననూ యథాక్రమముగా చేయవచ్చును. సాంధ్య కృత్యములు మానిన బ్రాహ్మణుడు మహాపాతకి సాంధ్య కృత్యము చేయని నరులతో సంభాషించిన వారు సూర్య, చంద్ర, నక్షత్రములు ఉన్నంతవరకు ఘోరనరకములందు పడుదురు. దేవతార్చన, వైశ్వదేవము, అతిథి పూజ, మున్నగునవి శాస్త్రీయములు. అతిథి నిరాశుడై వెళ్ళిన ఆ అతిధి పాపములు అన్నియు ఆతిధ్యము ఇవ్వని వారికి చెందుచున్నవి. అజ్ఞాత గోత్ర నామములు కలిగి అన్యగ్రామము నుండి వచ్చిన వానిని విష్ణువు వలె పూజించవలెను. అతిథి లేకున్నచో తన గ్రామములోని ఒక శ్రోత్రియుడగు బ్రాహ్మణునికి భోజనాదులు పెట్టవలెను. పంచయజ్ఞములను పరిత్యజించినచో బ్రహ్మహత్యాపాతకి యగును. కాన ప్రతిరోజు 1. దేవ యజ్ఞము 2. భూత యజ్ఞము 3. పితృ యజ్ఞము 4. మనుష్య యజ్ఞము 5. బ్రహ్మ యజ్ఞము ప్రతిరోజు ఈ 5 యజ్ఞములు చేయనివారు మహా పాతకులు అగుదురు. ఈ 5 ఇంటిని చేసి పుత్ర మిత్రాదులతో భుజింపవలెను. మధుర ప్రచురమగు కొంచెము వేడికల అన్నమునే భుజింపవలెను. పండ్లు, మున్నగునవి సగము తిని మరల కొంతసేపటికి స్వీకరించుట మిక్కిలి దోషము. గోమాంసములు తిన్నంత మహాపాపి యగును. ఇట్లే ఉప్పును ఎదురుగా పెట్టుకొని తినరాదు. భోజనమున పాలు, నీరు, స్వీకరించిన తరువాత ఆచమనము చేయ వలెను. తినునపుడు, త్రాగునపుడు, శబ్దము కలుగకూడదు. అనువైన అన్నమును ఈసడింపక తిని ఆచమించి జ్ఞానమున చింతించవలెను. అతిధి రాత్రులందు వచ్చినను పూజ చేయవలెను. ఆచారము పరిత్యజించినవాడు ప్రాయశ్చిత్తము ఆచరింపవలెను. ముసలితనము వచ్చిన

తరువాత భార్యను పుత్రుల వద్ద ఉంచి వనములకు వెళ్ళవలెను. విప్రులు 3 పూటల స్నానము చేయవలెను. క్రింద పరుండి బ్రహ్మ చర్యమును పంచయజ్ఞ పరాయణుడై, ఎడమవైపున పుష్ప ఫలములను స్వీకరింపక 8 ముద్దలను పగటి కాలమున భుజింపవలెను. రాత్రి భుజింపకూడదు. వానప్రస్థుడు నారాయణుని స్మరింపవలెను. శీతోష్ణములను సుఖదుఃఖములను, ఆకలి దప్పికలను మున్నగు ద్వంద్వములను సహింపవలెను. మనస్సున వైరాగ్యము కలిగినచో సంన్యసింపవలెను. వేదాంతాభ్యాస నిరతుడు, జితేంద్రియుడు, దాంతుడు, నిరహంకారుడు, గోచిమాత్రమే ధరించి సన్యాసి యుండవలెను. శత్రు మిత్రులందు మానావమానములందు సముడై గ్రామైక రాత్రముగా తిరుగుచుండవలెను. నగరమున 3 రోజులు భిక్షాన్నములు తిని బ్రతుకవలెను. సదానారాయణ పరాయణుడగు సన్యాసి ఓంకారము జపింపవలెను. ఎవరి ఇంటి యందును యెప్పుడు కడుపు నిండా తిని సంసారలంపటుడు కాకూడదు. లంపటుడైన యతికి సన్యాసముండదు. వాని నేరములకు నిష్కృతి లేదు. ధనాశతో ఉండు యతి చండాల సముడగును. నిత్యము, తనను నారాయణుని గాను, ద్వంద్వాతీతునిగాను, శాంతుని గాను, కారణ కారణుని గాను, నిర్గుణునిగాను, జ్యోతిస్సులకు జ్యోతిగాను, సనాతనునిగాను, తలచుకొన వలయును. యెప్పుడును ఉపనిషద్వాక్యములను లేదా వేదాంతవాక్యములను, పురుష సూక్తమును ఎల్లప్పుడు ధ్యానింపవలెను. ఇట్లు ధ్యానించిన సన్యాసి పర మానందమును, పరంజ్యోతిస్సును పొందును. ఇట్లు ధ్యానపరుడైన వానికి అనంత సుఖము కల్గును. ఇట్టివి ఆశ్రమాచారములు, ధర్మములు, ఇట్లు దత్తాత్రేయుడు వివరించిన ధర్మములను దీపకునకు వేదధర్ముడు వివరించెను.

భద్రశీలుడు తన తండ్రికి దత్తదేవుని సదుత్తరములనిట్లు చెప్పెను. స్వామీ! ఏ విధముగా శ్రాద్ధములో నీయబడినవి. చచ్చినవారికెట్లు చెందును? చచ్చినట్టివారు స్వర్గాది లోకములందో, భువియందో పుట్టుదురు. అట్లయిన పితరులు ఆకలిగొని వచ్చి అడుగరు, తినరు, తృప్తిపడినట్లు కన్పింపరు? ఇచ్చట విప్రులకు పెట్టుదుము పితరులు దూరమున నుందురు. శ్రాద్ధ విధానము ఎవరు మొదలిడిరో చెప్పుడని నేనడిగిన ప్రశ్నకు స్వామి ఇట్లు చెప్పెను. వత్సా! శ్రాద్ధ దత్తము నాశముకానీయకుండా, విశ్వేదేవతలు వసురుద్రాదిత్యులు, విష్ణువు, కాపాడుదురు. పితృదేవతలు, దేవతలుగా, నరులుగా, పశువులుగా, స్థావరములుగా గాని ఎట్లున్నవారికి అట్టి విధమైన అన్నమునే కావించి తృప్తిని కల్గించు చుందురు.

కాబట్టి శ్రాద్ధతంత్రము అంతయు శాస్త్రీయమే. దీనిని నా తండ్రి అత్రి దత్తాత్రేయుడు నిమి, శ్రీమంతుడు, మున్నగు వారాచరించిరి. నిమి తన పుత్రుడు కాలగతి నొంద ఈ శ్రాద్ధమునాచరించెను. నిమి పుత్రశోకాతురుడై వేద శాస్త్రములలోనున్న శ్రాద్ధ తంత్రము ననుసరించి మొదట అనుష్ఠించిన మహానుభావుడు, శ్రాద్ధా కల్పమును విన్న నరుడు శుచి యగును. ఆతదెట్లోనరించెనో, చెప్పెదవినుము. శ్రాద్ధ కర్త పితృతిథి పూర్వదినమున స్నానము చేసి ఒక పూటభోజనము బ్రహ్మచర్యము భూశయనము మున్నగు నియమములు కలిగి ఆ రోజుననే మరునాటి భోక్తలను నియంత్రించ వలెను. నియంత్రించిన భోక్తలు కూడా మైథునముచేయరాదు. భోక్తృత్వ నియమము లేకున్న నరకమున బడుదురు. నియమము తప్పిన బ్రహ్మహత్య పాపము.

దంతధావనము తాంబూలము, తలంటు కొనుట ఔషధము, పరాన్నరతి ఇవన్నియు శ్రాద్ధకర్తమృతాహమునాడు, పూర్వపరాహ్ణములందును విసర్జించవలెను. సదాచారయుతుడు, శాంతుడు, సత్కుల ప్రసూతుడు, విష్ణుపూజకుడు శ్రోత్రియుడు, వేదార్థ విదుడు, త్రిసుపర్ణుడు కృతజ్ఞుడు. గుణవంతుడు, స్వాధ్యాయాధ్యయన పరుడు రాగద్వేషవిహీనుడు, ఉన్నతుడు అగు భోక్తలననే మంత్రింప తగును. అవయవాధి క్యన్యూనతలతోనున్న వారు, రోగులు, నియమాలు లేనివారు శవదాహకులు, అశుచులు, దుర్మార్గులు, అన్యశాస్త్రాలననుసరించువారు, పరాన్నపరులు, గ్రామపురోహితులు, వ్రాయనకాండ్రు, అమతి, నక్షత్ర పాఠశీలి, అశాంతుడు, వృషలీపతి, అగు వారిని భోక్తలుగా పిలవకూడదు. తగిన వారిని భోక్తలను చెప్పి తద్దినమున ప్రాతఃకాలమున లేచి నిత్యకృత్యములొనరించి విధిగా పితృకర్మము పగటి 8వ భాగమున శ్రాద్ధము పెట్టవలెను. అకాలములో పెట్టిన కుతపకాలమున పెట్టిన కవ్యము అసురులకు చెందును. తిథి అపరాహ్ణగత మగునది గ్రహింపవలెను. అపరాహ్ణమునకు రెండు తిథులున్న అందు పితృతిథినే గ్రహించ వెలను. విశ్వదేవతలకు పితరులకు ఒక్కొక్కరిని నియంత్రించవలెను. బ్రాహ్మణా ధిక్యము కలిని పనికి రాదు. వచ్చిన విప్రులను సేవించి పరిషత్ప్రాయశ్చిత్తము. పాద్యము, ఆసనము, ఆచమనము మున్నగు సర్వ విధులతో అర్చింపవలెను. వస్త్రాభరణాదులను, తోయదల పుష్పాదులను ఈయవలెను. దేవతలకు యవలను పితరులకు తిలలు, కుశలు ఇద్దరికిని స్వగృహ్యోక్తముగా వాడవలెను. శ్రాద్ధమున 1. అగ్నౌకరణము 2. విప్రభోజనము 3. పిండదానము ముఖ్యములు. అవిధిగా చేయరాదు. భోక్తలకు భక్ష్య, భోజ్య, లేహ్య, బహుఖాద్యములు తృప్తిగా ఆజ్యప్లుత ముగా వడ్డింపవలెను, కావలసి

యుండి అక్కరలేదన కూడదు. విష్ణుర్విష్ణుఃఅని తలచుకొనుచు ఇతరకృత్యములు మాని పురుషసూక్తము అసురఘ్న మంత్రము లను చదువవలెను. నవ్వినా, పెద్దగా, అరచినా, రాక్షసులకు శ్రాద్ధము చెందును. దూరముగా నున్న తన పితరులు గ్రహించుచున్నట్లు తలపవలెను. భోక్తలు మౌనముతో సుఖముగా భుజింపవలెను. గాని అన్యవిధము చేయకూడదు. భోక్తలు ఒకరినొకరి ముట్టుకొనిన, తదన్నము విడువక ఆరగించి 800 గ్రాయత్రి చేయవలెను. పావమాన యజుస్త్రిసుపర్ణముల త్రిమధుమధుసూక్తములను సుచరిత్ర కథనములు, చేయవలెను. భోక్తల భోజనమయిన తరువాత పిండ ప్రదాన విధి నెరవేర్చవలెను. పితృపాత్రలను చలింపచేసిన తరువాతనే స్వస్తి వాచనము కావింపవలెను, లేకున్న పితరులు ఆ వత్సరమంతయు ఎంగిలి తినువారగుదురు. సదక్షిణాక మగుతాంబూలము సుగంధ ద్రవ్యము అర్పించి ఆ రాత్రి గడపవలెను. కర్తభోక్తల నియమములు తప్పనిసరి. రోగాతురులు, బాటసారి, ఆమశ్రాద్ధమో, హేమ శ్రాద్ధమో చేయవలెను. విప్రులు దొరకనప్పుడు, ద్రవ్యము లేనప్పుడు అన్నియు పితృసూక్తములతో అగ్నియందు హోమము చేయ వలెను. తిలతర్పణములు, గోవులకు గడ్డినిచ్చుట వంటివి చేయవలెను. దరిద్రుడు ఏదికుదురనప్పుడు నాకు ద్రవ్యము లేదు అని అడవికేగి పితరుల నుద్దేశించి ఏడ్చి నన్ను కావుమన్న చాలును. శ్రాద్ధకర్తమరునాడు తర్పణములు చేయవలెను. చేయకున్న బ్రహ్మహత్య చుట్టుకొని నాశమగును, శ్రద్ధతో నాచరించు వారికి ఆయురారోగ్య సంతత్యాదులు సమకూరును, విష్ణువు సంతసించును. హరి ఒక్కడు సంతసించిన ఈ ప్రపంచమున ఎవ్వరు తుష్టి వహింపకుందురు? చరాచర ప్రపంచమంతయు నాతడే కదా వేటేమి కలదు. శ్రాద్ధమును, అందు విప్రులకు దానము, శ్రుతిస్మృతులన్నింటను విధించి కర్తయు కారయితయు ఆ హరికాన ఆతనికి పెట్టినది పితృదత్తము కాకుండుట ఎట్లు ఇచటి ధనము మని యార్డరు ద్వారా ఎచ్చటికో వెళ్ళుట లేదా అతి తెలివి వానికివిరుచింపవు గాని శ్రుతిని నమ్మి, తదుక్తము శ్రౌత స్మార్తములనాచరించువానికి అన్ని ఫలించును. ఏకాదశి, షష్ఠి, నవమి, పూర్ణిమ, చతుర్దశి, అమావాస్యలు పరవిద్ధలు గ్రాహ్యములు, షష్ఠి నాగవిద్ధ, సప్తమి శివవిద్ధ, దశమియుత ఏకాదశి ఉపవసింప కూడదు. గ్రహింప రాదు. వ్రతములలో కృష్ణ పక్షము కంటె శుక్ల పక్షము శ్రేయము, అపరాహ్ణము కంటె పూర్వాహ్ణము మంచిది, నకాల ప్రదోషము వఱకు ఉండు తిధి ముఖ్యము, ఆయాతిధులలో ఆ భూశాస్త్రములను బట్టి పెద్దలను కొనుగొని ఆచరింపవలెను. ధర్మమున రీసి చేయుటచే హరి తుష్టుడగుట హరిపదము నందుట, భవరోగ ప్రణాశముగుట

మున్నగునవి కల్గును. జ్ఞాతాజ్ఞాతాది సమస్త పాప ప్రణాశము. ప్రాయశ్చిత్తముల వలన కల్గునో అట్లే చేయదగును. 1. బ్రహ్మహత్య 2. సురాపానము 3. గురుదారాభిగమనము 4. బంగారము దొంగిలించుట 5. పెవారితో మైత్రికల్గి యుండుట పంచమహాపాపములు. ఈ మహాపాతకములతో సమానమగునవి శ్రుతి స్మృతులందు అనేకములు కలవు. వాటికి ప్రాయశ్చిత్తములు చెప్పబడి యున్నవి. ప్రాయశ్చిత్తములు చేయుచు చచ్చిన మేలగును. అవి చేసిచచ్చిన అంతకంటె మేలు, వీలైన నారాయణుని తగలని ధర్మములు ఫలమీయలేవు. రాగమును వీడి ప్రాక్కర్మమును తలంచి తపించి భూతదయ గలిగి విష్ణుస్మరణముతో భాగవతత్వమేర్పడిన వానికి చిన్న పెద్దలగు సమస్తపాపములు ధ్వంసములగును. మనచే ధ్యానింపబడిన వారికి పోగొట్ట రాని పాపమనునది లేదు. సర్వదా సర్వధాహరిని శరణు పొందుట కర్తవ్యము. హరి పూజించు వానిని చేరిన పాతకియైనను తన పాపము పోగొట్టుకొని పరమ పదము నందును. విష్ణుని ఒక్కసారి తలంచిన వాని క్లేశములన్నియు అణగిపోవును. మానవజన్మ దుర్లభము. అందు హరిభక్తి దుర్లభము. అందు పెక్కువిఘ్నములు కల్గును. వాసుదేవు భజించినవాని అజ్ఞానము వీడి మనశ్శుద్ధి కల్గును. అంత మోక్షము కరతలామలకము, సంపత్తుల వలన దర్పము కూడదు. హరిపూజకు మూలము సత్పురుష సహవాసము,. యమలోకము మిక్కిలి దగ్గఉన్నదని సంయమము పాటించి, విష్ణు సేవాభాగ్యముతో కాలయాపనము చేయవలెను. జరరోగము, ఇంద్రియపాటవము రాకమునుపే జాగ్రత్త పడవలెను. సుమతులు అశాశ్వతమైన ఈ శరీరమునందు సంపదలందు విశ్వసింపక నిత్యము మృత్యువు సన్నిహితమని ఆలోచించి హరిని సేవింతురు. యోగము అంటి వియోగము కలదు. ఆశాపాశమువీడదు. ఈ దేహము క్షణభంగురము. హరిభక్తి పాపముల పొగొట్టును. ఈశ్వర సేవాతత్పరునకన్ని వేదశాస్త్రలతపస్తీర్థా ధ్వర భజనములు సఫలములగును. ఈశ్వరుడు లేడను వానికిశ్రుతిశాస్త్రాదు లన్నియూ నిష్ఫలములే అగును. సాంగవేదాధ్యయుదులన్నియు హరిభక్తిలో పదారవపాలుకు కూడా పోలవు. వేయిమాటలేల? అన్నింటిని నిరాకరింపదగదు అభ్యాసముతో పనులకన్నింటికిని, ఫలము రాగలదు. దానివలన ఉత్తమ జన్మము సంప్రాప్తించును. విష్ణుభక్తి జ్ఞానమును ప్రసాదించును. కాన కర్మలు తప్పక ఆచరింపతగియున్నవి. అట్టి హరిభక్తికి మూలము కర్మానుష్ఠానము. కర్మలలోవైగుణ్యము కలిగిన ప్రాయశ్చిత్త మొనరింపతగును. దానిచే విష్ణుభక్తి పొడమును. విష్ణుభక్తి చే నిస్సంగుడై స్వస్వరూపాను సంధానముకలుగును. దానిచే విశ్వమంతయు తానై నిలుచును. ఇంతకుమూలము, కర్మానుష్ఠానము. కర్మ కరణము వదలిన గతులు లేవు.

ఓ ధర్మకీర్తీ పురుషకారముతో మంచి పనులు చేసిన అనంతర జన్మము నందైననూ కృతార్థుడవగుదువు. మనసున తలచిన పని, ఎన్నటికైనను సిద్ధింపగలదు. పోయినరాజ్యమును పాలింపుము, అని ఆదత్తదేవుడు నాకు సదుపదేశమును చేసెను, ఆ సదుపదేశ ఫలముగానీయింటిపుట్టితినిఅనెను - అంత భద్రశీలుని ఒడిలోనికి తీసికొని ఆతని భక్తికి సంతుష్టుడయ్యెను.

ఇవి ధర్మసూక్ష్మములు.

## 19వ అధ్యాయము

# శ్రీ విద్య

శ్రీ విద్య యనగా మోక్ష విద్య. ఈ దత్తభాగవతము శ్రీ దత్తదేవుని అవతారలీలా మహిమాతిశయములతో బాటు మోక్షవిద్యను సమగ్రముగా నిరూపించి దానికి సాధనములైన క్రియాయోగసమాధి యోగములను సాంగో పాంగముగా తెలియజేసిన ఉత్తమ గ్రంథము ఇందు జీవులకు సంసార బంధమెడలించుటకు అధికార తారతమ్యమును పురస్కరించుకొని తగిన ఉపాయములు సోదాహరణముగా ప్రతిపాదింపబడినవి. మూల గ్రంథము దత్తమాహాత్మ్యము అనువాదమున ఉన్నతముగా సంక్షేపింపబడి దత్తభాగవతమను సార్థకాభిధేయమై ప్రసన్న గంభీరముగా శ్రీశాస్త్రిగారిచే సంతరింపబడినది. అందరికిని ఉపయుక్తము గ్రాహ్యము అయినట్టి భాషలో ననువదించుటచే దత్తదేవుని ఉపదేశములను సమగ్రముగాను, నిష్పందేహముగాను తెలియజేయగల గ్రంథ పారిజాతమైనది.

ఇది దత్తాత్రేయ పరశురామావతారద్వయ నిరూపకము. దత్తాత్రేయుడు శివశక్తుల యొక్క ఐక్యరూపమని ఏతద్గ్రంథ పఠనమున తెలిసిన సత్యము. ఈ శివశక్త్యైక్యము రేణుకామహిమమును పరశురామునికి దత్తదేవుడు బోధించిన సందర్భములో కాననగును. పరశురాముడు తండ్రి సంస్కారవిధికై దత్తదేవుని యాచించెను. ఎంతకురాకుండుట చివరికి తల్లి రేణుక వచ్చినదని తెలిసి వెంటనే వచ్చి సంస్కరింపచేసి వెళ్ళెను. బ్రహ్మకు మరల వేదరాశిని అనుగ్రహింపజేయుటకై రేణుకా వపుర్దేశమునుండి వేదరాశి దత్తదేవాంకస్థితయైన లక్ష్మినోట ప్రవేశించినది. తత్కారణముగా దత్తదేవుడు వేదములను విధికి జ్ఞాపకమొనరించినాడు, రేణుక కభిషేక మొనర్చి ప్రప్రథమముగా పూజించిన మహనీయుడగుటయేగాక నిర్వృత్తిక

స్థితియే ఉత్తమ సంధ్యావందనమని తన ఆశ్రమము పంచ మాశ్రమముగా నుండినదని ఇందు నిరూపితమైనది. రేణుక నాదరూప, నాదములేని వర్ణోచ్చారణము అసంభవము. కాన అందరియందు హృద్గతముగానున్నది.

రేణుకా జమదగ్నులు శక్తి శక్తిమంతులైన పార్వతీ పరమేశ్వరులేయని ఏతన్మూల గ్రంథమైన బ్రహ్మాండ పురాణమున నిరూపింపబడినది. రేణువను రాజు తపమొనరించి వేదమాతయైన గాయత్రిని కూతురుగా పొందుటచే రేణుకయను నామమును ధరించినది. లలితాంబికయే ఆరేణుక ఆ రేణుకా సంపత్తితో గూడిన దత్తదేవుడు శివశక్త్యైక్యసమాహారరూపమని వేఱుగా చెప్పనక్కర లేదు. అందువలన కూడా అపరోక్ష బ్రహ్మవిద్యయైనది కాన దీని నొక్కచోట చూచుటకో అన్నట్లు శంకర మఠములలో గాయత్రీ దేవతాపార్శ్వమున శ్రీదత్తదేవ ప్రతిష్ఠ చేయబడుటకు ఇదియే కారణముగా నోపును. ఇక సకల జనులకు గురువులైన శౌనకాది మునులు సకల చిత్తవృత్తులను ఒత్తునట్టి వృత్తియైన సంప్రజ్ఞాత సమాధిలో మొదట నిర్గుణ పరబ్రహ్మతేజము తరువాత తత్ప్రార్థనల ననుసరించి హరిహరాద్వైత దివ్యమూర్తిగాన, పిదప అత్రి అనసూయలకు పుత్రుడు త్రిశీర్షుడు దండకమండలు పాణియైన దత్తదేవునిగాను సాక్షాత్కరించుటతో మొదలైనది. ముముక్షువులకు తత్త్వజ్ఞానమునకై సమాధి యోగమునవచ్చెడి ప్రతిబంధకము లెడలించుటకై రాత్రింబవళ్ళు దత్తనేత్రుడవుచు దత్తదేవుడెదురు చూచుచుండునన్న పద్యముతో పరిసమాప్తి కలిగియున్నది.

ఆ॥ **దత్తనేత్రుడవుచు దత్తద్భువనముల నరయుచుండు బవలెవరు పిలుతురో**
**యని సమాధి బాసియాగతుండవు బ్రోవ రాత్రిబిలుచువారి యాత్రములకు**

దత్తభాగవతము - 12వ గుచ్ఛము - 117వ పద్యము.

సూత, శౌనక, ధ్యానయోగములోని దత్తదేవవిశ్వరూపసాక్షాత్కారము వేదధర్మ దీపక సంభాషణము ప్రహ్లాదాజగర సంవాదము అవధూతయదు సంవాదము, అలర్కచరితము, కార్తవీర్యార్జున చరిత్ర, దత్తదేవుని సప్తోదాహరణములు, పితాపుత్ర సంవాదము, విష్ణు దత్తుకథాఘట్టములన్నియు అద్వైత వేదాంత తత్త్వము నందే పర్యవసితములై యుండుట వలననే ఈ గ్రంథమునపైపరిశోధనము చేయవలెనను బుద్ధి నాకు పొడమినది. తత్త్వజ్ఞానము, యోగమూలకము మరియు గురువు హస్త మస్తకసంయోగముచే దీక్షనిచ్చి శిష్యునికి మంత్రసిద్ధిని పిదప అపరోక్షానుభూతిని కలుగజేసెడి శాస్త్ర సంప్రదాయమిందు ఉపాత్తమైనది. ఉపనిషత్తులు, బ్రహ్మ

సూత్రములు భగవద్గీత మున్నగు వేదాంత గ్రంథములలో తత్త్వము ప్రధానము యోగ సంప్రదాయము సంక్షిప్తముగా యుండినది. ఇందట్లు గాక, నిరుపసర్గమైన యోగ సర్వస్వము సంతరింపబడినది. మనోజయము ప్రాణాయామాదులు లేకున్నను కలుగవచ్చును. కాని అది నిలబడని మనోజయమేయగును. అనెడి సత్యమిందు తెలియనగును. శ్రవణమనన నిది ధ్యాసలను సమాధియోగముచే సంపాదించిన గురుశ్రేష్ఠుడే బ్రహ్మనిష్ఠుడగునని తెలిసి అట్టివానినే సమీపించి తరింపవలెనని ఈగ్రంథము వలననే నేనెరిగిన సత్యము. ఇదేమి బ్రహ్మవిద్యయా అను లోకోక్తి కలదు. బ్రహ్మవిద్య ఇతరవిద్యలవలె తెలియదగినదియే. తెలిసి అనుభవమునకు తెచ్చుకొనుట అతికష్టమని పైవాక్యమున కర్థము. ముక్తినందుట, శతకోటి జన్మ సుకృత సాధ్యమను ఆచార్యోక్తి గురుగదిత సప్తోదాహరణములలో కళారాధనమే ఈశ్వరారాధనము దానివలననే క్రమముక్తి కలుగునని తెలియును. గురుశిష్య లక్షణములు గురుమంత్రరహస్యము గాని, పురాణాంతరనిగదితములుకానివి, వర్ణింపబడుట 1 విశాలాక్షి 2 విశ్వేశ్వరుడు, 3 గంగ 4 భైరవుడు 5 ఢుంఢి 6 దండపాణి ఈఆర్గురిని నిత్యము సేవించిన షడంగయోగము అబ్బునని మరొక క్రియా యోగ విధమిందు ప్రదర్శితము. దత్తదేవుగాథలు దత్తలీలలు, గురుసంహిత మున్నగువెన్నియో దత్తవిభుని గూర్చిన గ్రంథములు ప్రచారములో కలవు. వాటికంటె విశిష్టములైనవి అధికారి తారతమ్యములు ఇందే ప్రకటింపబడినవి. ఈ గ్రంథము యోగోత్తర మీమాంసాదర్శనముల తాత్పర్య సారమగుటచేతకూడా నన్నీవ్యాస సంపుటిని వ్రాయుటకు ప్రేరేచినదని దీనిని తెలిసి చదివిన వినిన వారలకు ఆ దత్తదేవుని ప్రసాదమువలన భుక్తిముక్తులు కరతలామలకములు కాగలవని నా అభిప్రాయము. ఈ గ్రంథములో ధర్మ యోగతత్త్వ మంత్ర శాస్త్ర రహస్యములెన్నియో కలవు. తండ్రి మొదలగువారు, హితము చెప్పెడివారు గురువులు. ఉపనయనముచేసి వేదవేదాంగములు చెప్పి సత్కర్మనిష్ఠనిచ్చినవారు అంతకంటే ఉత్తమ గురువులు. బ్రహ్మాత్మైక్యమును బోధించి హస్తమస్తక సంయోగముచేసి సాయుజ్య ముక్తి ప్రదులైన గురువులు ఉత్తమోత్తమ గురువులు. ఇట్టి వారిని సేవించియే మోక్ష విద్యను పడయవలెనన్నది ఇందలిసత్యము.

శవర్ణము, రేఫము, ఈకారము, బిందువుగల్గినట్టిది ॥శ్రీం॥ అనునది పంచదశికి చివరచేరినచో షోడశియనబడును. ఈ బీజము గల్గినందువలననే

శ్రీవిద్యయని పేరు కల్గినది. శ్రీ బీజాత్మకమైన విద్యగాన శ్రీవిద్యయని లొల్లలక్ష్మీధరపండితుడు వివరించినాడు. పంచదశి మొదటి కూటములో 5 వర్ణములు క, ఏ, ఈ, ల, హ్రీం, ద్వితీయకూటములో 6వ వర్ణములు, హ, స, క, హ, ల, హ్రీం తృతీయ కూటములో 4 వర్ణములు స, క, ల హ్రీం ఉపరి శ్రీంబీజము కల్పినచో షోడశి శ్రీవిద్య అని చెప్పబడునని రహస్యము. శ్రయతే జనైరితి శ్రీః అనువ్యుత్పత్తిని బట్టి పరమపురుషార్థము మోక్షమేగాన శ్రీవిద్య అనుదానికి మోక్ష విద్య అని అర్థము సంపన్నమగు చున్నది. జ్ఞానము అజ్ఞానముచే ఆవృతమైయున్నదని అందుచేతనే ప్రాణుల మోహాముచెందుచున్నారని గీతను బట్టి అనుభవపూర్వ జ్ఞానముతో అజ్ఞానము తొలగించిన గాని జ్ఞాని కాలేడు. అంతవఱకు ఈ సంసారముండును. అందువలన అజ్ఞాన ధ్వాంతదీపికయైన మాయా స్వరూపిణి భగవతి శ్రీమాతను ఆశ్రయించి ఉపాసించిన గాని ఆత్మవిదుడు కానేరడు. అట్టి ఆత్మవిదుడే శోకము తరింపగలడను శ్రుతియు దీనినే ధ్రువీకరించుచున్నది. ఇట్టి మంత్రము పాదవందనము. హస్త మస్తక సంయోగము పాదములు పట్టుకొనుటవంటి శిష్యధర్మములులేకున్నను, ఈ కలిలో మాకే గురువులు మంత్రసిద్ధులు దొరకరైరి. అనుజిజ్ఞాసతో తహతహలాడు త్రికాలములందలి వారికి మేమే గురువులమని వారియందు మేమను గ్రహము కనబరచుచున్నాము. కకారాదులు పంచదశ వర్ణములు సంప్రదాయమును బట్టి తెలియదగినవైనను షోడశకలాత్మకమగు, ఒక్క వర్ణము ప్రధానభూతమై ప్రకృతి భూతమై గురుముఖమునసే తెలియదగిన దైనను దానిని గూర్చి మేము ప్రతిపాదింపకపోయిన మా వ్యాఖ్యానము, వ్యాఖ్యానాంతర సాపేక్షమయి అనుపాదేయగునేమోయని ఆషోడశీ కలను కూడా సౌందర్యలహరి వ్యాఖ్యయందునిరూపించుచు లక్ష్మీధరుడు విస్పష్టము గావించినాడు. కాన భౌతిక శరీరముతో తాను లేకున్నను మంత్రోపాసనతో సాక్షాదీశ్వరత్వమంత ర్యామిత్వము సాధించిన మనీషిసత్తమునిగా లక్ష్మీ ధరునెన్న వలసి యున్నది. అది అట్లుండనిండు, ప్రకృత పరిశోధన గ్రంథములను పై మంత్రాక్షరములు అధ్యాయములందాదియందు చేర్చుట ఐ॥ క్లీం॥ సౌ॥ అను బాలామంత్రాక్షరములు కూడా సంపుటి చేసి మొత్తము 19వ అధ్యాయములుగా రూపొందించిన నా జన్మ చరితార్థమగునని ఎంచి ఇట్లు చేసితిని. ఆర్యులు క్షమింతురని సవినయముగా ప్రార్థించుచున్నాను.

**ఋచస్సామానియజూగ్ంషి సాహిః శ్రీరమృతాసతామ్ ॥**

ఋగ్యజుసామవేదముల సారమే శ్రీప్రణవము. కాన ఇది శ్రీవిద్య.

# ఉపయుక్త గ్రంథ సూచిక

1. బ్రహ్మసూత్ర భాష్యము
2. అష్టోత్తర శతోపనిషత్తులు
3. భగవద్గీతాభాష్యము
4. జగద్గురు బోధలు
5. వ్యాసవాణి
6. పాతంజలయోగ సూత్రములు
7. పంచదశి
8. లఘువాసుదేవమననము
9. వివేక చూడామణి
10. ఉపన్యాసవ్యాసావళి
11. వేదాన్తము
12. సర్వదర్శన సంగ్రహము
13. యోగతారావళి
14. గురుబాల ప్రబోధిక
15. కావ్యాలంకార సంగ్రహము
16. వైయాకరణ సిద్ధాన్తకౌముది
17. యోగవాశిష్ఠము
18. బ్రహ్మాండ పురాణము
19. శ్రీమద్భాగవతము
20. మహాభారతము (సంస్కృతము)
21. పద్మపురాణము
22. మత్స్యపురాణము
23. స్కాందాన్తర్గత కార్తిక పురాణము
24. లౌకిక వాఙ్మయ చరిత్ర
25. కవి కుమార చరితము
26. ఆంధ్ర మహాభారతము [illegible] - తిక్కన
27. ముక్తావళి
28. తైత్తిరీయ బ్రాహ్మణారణ్యకోపనిషత్తు
29. స్కాంద పురాణము
30. దేవీభాగవతము
31. సౌందర్యహరి
32. అగ్ని పరీక్ష
33. రఘువంశము మల్లినాథుని సంజీవనీటీక
34. సుమతి శతకము
35. వాయు పురాణము
36. శబ్దరత్నావళి
37. రసగంగాధరము
38. ధ్వన్యాలోకము
39. కావ్యప్రకాశిక
40. భరతుని నాట్యశాస్త్రము
41. అద్వైత వేదాన్తపరిభాష
42. దత్తమాహాత్మ్యము
43. దత్తాత్రేయాష్టకాత్మసుప్రభాతము
44. ఛాందోగ్యోపనిషద్భాష్యము
45. ఆముక్తమాల్యద
46. ఈశ, కేన, కఠ, ప్రశ్న ముండమాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య - బృహదారణ్యక భాష్యములు.
47. దశరూపకము
48. సాహిత్యదర్పణము
49. ఆంధ్ర శబ్దరత్నాకరము
50. భామతి
51. కువలయానందము

